## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), అర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) అర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2030020025587

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీ ర స్తు

# శ్వేతాశ్వతరోపనిషత్తు

అనుభూతిప్రకాశ, ఆత్మపురాణసహితము

కృష్ణయజుర్వేదాంతర్గతము.

శ్రీమచ్ఛంకరభగవత్పాదకృతభాష్యమువనుసరించి

శ్రీకనుపర్తి మార్కండేయశర్మగారిచేత

వ్రాయఁబడిన

ఆంధ్రటీకాతాత్పర్యములుగలది



చెన్నపురి

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారిచేఁ

ప్రకటితము.

1933

శ్రీ గురుభ్యోనమః హరిః ఓమ్.

# ఉపోద్ఘాతము.



ఇష్టప్రాప్తికిని, అనిష్టపరిహారమునకును అలౌకికములగు ఉపాయములను తెలుపునట్టి గ్రంథసముదాయము వేదమనం బడును ఈ వేదము ఋగ్యజుస్సామాథర్వనామములతో చతుర్విధముగ వ్యవహరింపఁబడుచున్నది ఈ ఋగాదివేద చతుష్టయము అధికారానుసారము కర్మజ్ఞానరూపమార్గద్వయ మును బోధించుచుండును ప్రాయికముగ వేదమునందు మంత్ర బ్రాహ్మణములు కర్మకాండను, ఉపనిషత్తులు జ్ఞానకాండను బోధించునటుట సుప్రసిద్ధముగదా !

## శ్వేతాశ్వతర వేదశాఖ.

యజుర్వేదము శుక్ల, కృష్ణ అను విభేదములతో ద్వివిధమయి వెలయుచున్నది చరణవ్యూహ, పాతంజల మహాభాష్యాది మతానుసారము యజుర్వేదము ౧౦౧ శాఖలుగ విభక్తమయియున్నది. అందు కృష్ణయజుర్వేదమునకు ౮౬ శాఖలుగలవు ఈవిషయము శౌనకకృతమగు చరణవ్యూహపరిశిష్టభాష్యమునం దిట్లు చెప్పఁబడినది:—

యజుర్వేదస్య షడశీతి భేదాభవంతి, తత్ర చరకానాం ద్వాదశ భేదాభవంతి:— చరకాః, ఆహ్వారకాః, కఠాః, ప్రాచ్యకఠాః; కపిష్ఠలకఠాః, చారాయణీయాః, వారాయణీయాః, వార్తాంతవీయాః, శ్వేతాశ్వతరాః, ఔపమన్యవాః, పాతాండనీయాః, మైత్రాయణీయాః, చ ఇతి,

పై ప్రమాణమువలన కృష్ణయజుర్వేదీయ శాఖలలో శ్వేతాశ్వతరశాఖయనునది ఒక్క శాఖయని సిద్ధించుచున్నది కాని యీ శాఖకు సంబంధించిన సంహితా బ్రాహ్మణ గ్రంథములుగాని, తచ్ఛాఖాధ్యేతలగు ద్విజులుగాని మనకిప్పుడు గనంబడుట లేదు. అష్టోత్తరశతోపనిషత్తులందుగల ఉపనిషత్తులు చాలవఱకు ఉత్పన్నములయిన వేదశాఖలకు సంబంధించినవని మనము మహావాక్యరత్నావళ్యాది గ్రంథాధారములవలన గ్రహింపవచ్చును

శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యులవారు శారీరకమీమాంసాభాష్యమునందు ఈక్షత్యధికరణమునందు "సూ శ్రుతత్వాచ్చ ౧-౧-౧౨ అను సూత్రభాష్యమునం దిట్లు వ్రాసియున్నారు:—"స్వశబ్దేనైవచ సర్వజ్ఞ ఈశ్వరో జగతః కారణమితి శ్రూయతే శ్వేతాశ్వతరాణాం మంత్రోపనిషది సర్వజ్ఞమీశ్వరం ప్రకృత్య:—"సకారణం కరణాధిపాధిపో నచాస్యకశ్చి జ్జనితా న చాధిపః" (శ్వేతా ౬-౯) ఇతి." అని శ్వేతాశ్వతరోపనిషన్మంత్రము నుదహరించిరి

శ్రీశంకరభగవత్పాదులవారి వాక్యప్రమాణానుసార మీ శ్వేతాశ్వతరోపనిషత్తు శ్వేతాశ్వతరశాఖయందలి మంత్ర భాగమునకు చెందిన ఉపనిషత్తుగా తెలియవచ్చెడిని

యాజ్ఞవల్క్యస్మృతికి విశ్వరూపాచార్యులవారొనర్చిన బాలక్రీడావ్యాఖ్యయందు (౧ అధ్యా శ్లో ౨) నిట్లు గలదు:— శ్వేతాశ్వతరశ్చ—సకృష్ణమృగోఽభవత్, సకృష్ణమృగోభూత్వా, పృథివీ మన్వవచరత్, తమను ధర్మశ్చచార, ఇత్యాది—

ఉదాహృతములయిన వాక్యములయొక్క గమనికవలన ఇది బ్రాహ్మణభాగమని తెలియవచ్చుచున్నది. దీనివలన శ్వేతాశ్వతర బ్రాహ్మణమనునది కొంతకాలము క్రిందటివఱకు ప్రచారమునందుండెనని మనము గ్రహించవచ్చును

వరంగల్లునగరమునందు ప్రకాశింపబడుచున్న 'శైవ ప్రకాశిక' యను పత్రికయొక్క సంపాదకులు తమపుస్తక భాండాగారమునందు 'శ్వేతాశ్వతర గృహ్యసూత్రము' ఉన్నదని చెప్పియుండిరి కాని వారిని ఆ గ్రంథమును చూపించవలయునని కోరగా ఇతరకార్యాతిశయమువలన చూపింపజాలరైరి నిజముగా అట్టిగ్రంథము లభించినయెడల శ్వేతాశ్వతరశాఖనుగూర్చి మఱికొన్నివిషయములను మనము గ్రహింపవచ్చును.

## శ్వేతాశ్వతరోపనిషత్తు.

వేదాంతసిద్ధాంతమును ప్రతిపాదించువిషయమునందు "దశోపనిషత్తులు" లబ్ధాస్పదము లయినప్పటికిన్నీ ఋగాది వేద చతుష్టయమునందు పరమార్థవిషయ ప్రసక్తికములుగానున్న మంత్రములనేకము లీయుపనిషత్తునందు అధికముగ నుండుట చేతను బ్రహ్మైకత్వజ్ఞానము సుస్పష్టముగ వర్ణింపఁబడుట చేతను ఈ యుపనిషత్తు దశోపనిషత్తులవలెనే గణ్యమయి యొప్పుచున్నది. ఇతరోపనిషత్తులందువలె నీయుపనిషత్తునందు ఆఖ్యాయికమున్నగునవి వర్ణింపక ఆత్మతత్త్వమే సుస్పష్టముగ వర్ణింపఁబడియున్నది ఈ యుపనిషత్తునందు గల మంత్రము లన్నియు గద్యరూపములుగా లేక ఋక్కులే (పద్యములే) అయినప్పటికిన్నీ సంస్కృతభాషయందు స్వల్పపరిచయము గలవారికి కూడ సులభముగ అర్థము తెలియఁదగినంత లలిత మయిన శైలి కలిగియున్నవి

## శ్వేతాశ్వతరోపనిషత్సారము

ఈ యుపనిషత్తునందు ౬ అధ్యాయములు గలవు ప్రథమాధ్యాయమునందు కాలము, స్వభావము మున్నగునవి ఒక్కొక్కటిగాని, లేక అన్నియు కలసిగాని జగత్కారణభూతములు కాఁజాలవనియు, పరమేశ్వరుఁడొక్కఁడే జగత్తునకు అభిన్ననిమిత్తోపాదాన కారణభూతుఁడనియు నిర్ణయించి,అంతర్యామిరూపమున స్వదేహము నధిష్ఠించియున్న ఆ

పరమేశ్వరునియొక్క ధ్యానముచేతనే మోక్షము సిద్ధించునని నిరూపింపఁబడినది ద్వితీయాధ్యాయమునందు సర్వప్రేరకుఁడగుటచేత సవితయని చెప్పఁబడుచున్న ఆ పరమేశ్వరుని యోగాభ్యాసమార్గమున ఉపాసించెడి ఉపాయము తెలుపఁబడినది. తృతీయ చతుర్థాధ్యాయములందు ఆ పరమేశ్వరునియొక్క విశేషస్వరూపము గుణకర్మలు స్తుతిప్రార్థనములు ప్రతిపాదింపఁబడినవి పంచమాధ్యాయమునందు జీవునకు సంభవించునట్టి బంధపాశముల స్వరూపమును తెలిసికొని పరతత్త్వస్వరూపరూపమగు స్వీయవాస్తవజ్ఞానమువలన సకలబంధవిముక్తి కలుగునని నిరూపింపఁబడినది షష్ఠాధ్యాయమునందు కాలాకాశాదులు జగత్కారణము కాజాలవని నిరాకరించి నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావమును ఏకమును నిర్గుణమును అయిన ఆత్మతత్త్వమే సర్వకారణమనియు, తదాత్మవిజ్ఞానముచేతనే నిఖిలబాధావిముక్తిపూర్వకముగ మోక్షప్రాప్తియనియు నిరూపింపఁబడినది

ఈ శ్వేతాశ్వతరోపనిషత్తు పంచరుద్రోపనిషత్తులలో ఒక్కటియని తెలియవచ్చుచున్నది. కైవల్య, జాబాల, శ్వేతాశ్వతర, కాలాగ్నిరుద్ర, అథర్వశిరస్సులను ఈ ఉపనిషత్తులను పంచరుద్రోపనిషత్తులని శిష్టులు వ్యవహరించుచున్నారు ఈ విషయమయి పక్షాంతరము కూడ గలదని తెలియవచ్చుచున్నది

## బ్రహ్మసూత్రములు - శ్వేతాశ్వతరోపనిషత్తు.

ఈ శ్వేతాశ్వతరోపనిషత్తు దశోపనిషత్తులలోనిది కాక పోయినను వ్యాసభగవానులవారు ఉపనిషదర్థనిర్ణయార్థము రచించిన బ్రహ్మసూత్రములందుగల అనేకాధికరణములు ఈ యుపనిషన్మంత్రములకు సంబంధించి యున్నవి శ్రీమచ్ఛంకర భగవత్పాదులవారు కూడ తమ శారీరకమీమాంసాసూత్ర భాష్యమునందు పలుతావుల నీయుపనిషన్మంత్రముల ప్రమాణార్థము గైకొనియున్నారు

బ్రహ్మసూత్రప్రథమాధ్యాయమునందుగల

౧. ఈక్షత్యధికరణమునందు —

సూ శ్రుతత్వాచ్చ (౧-౧-౧౧)

యను సూత్రమునకు 'ఈశ్వరుఁడే జగత్తునకు కారణభూతుఁడు' అని తెలుపుటకు 'స కారణం కరణాధిపాధిపః' (శ్వేతా ౬-౯) యను శ్రుతిప్రమాణము

౨ దేవతాధికరణమునందుగల —

సూ సమాననామరూపత్వాచ్చావృత్తావప్యవిరోధో దర్శనాత్స్మృతేశ్చ (౧-3-3౦)

యను సూత్రమునకు 'పరమేశ్వరానుగృహీతులయిన ఆధికారికపురుషులు సృష్ట్యాదివ్యవహారములను అతీతకల్పానుసారము జరుపుచుందురను విషయమునకు,

మం "యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై (శ్వేతా ౬-౧౮) మంత్రము ప్రమాణము

ఈ యధికరణమునందే యోగమాహాత్మ్యప్రకటనార్థము:—

బ్ర సూ భావంతుబాదరాయణోఽస్తిహి.(౧-3-33) అను సూత్రభాష్యమునందు —

మం "పృథ్వ్యాప్యతేజోఽనిలఖేసముత్థితే (శ్వేతా ౨-౧౨) అనుమంత్రము ప్రమాణార్థము గైకొనఁబడినది.

3 ఆనుమానికాధికరణమునందు:—

సూ తదధీనత్వాదర్థవత్. (౧-౪-3) అను సూత్రమునందు

మం "మాయాంతు ప్రకృతిం విద్యాన్మాయినంతు మహేశ్వరమ్ (శ్వేతా ౪-౧౦) మంత్రము

సూ మహద్వచ్చ (౧-౪-౭) అను సూత్రమునందు,

మం "వేదాహమేతం పురుషంమహాంతం (శ్వేతా 3-౮) మంత్రము.

౪ చమసాధికరణమునందు.—

సూ చమసవదవిశేషాత్ (౧-౪-౮) అను సూత్రమునందు

మం "అజామేకాం లోహితశుక్లకృష్ణాం (శ్వేతా ౪-౫) మంత్రము.

ఆయధికరణమునందే —

"సూ జ్యోతిరుపక్రమాత్తు తథాహ్యధీయతఏకే
(౧-౪-౯)అను సూత్రమునందు

మం బ్రహ్మవాదినోవదంతి కింకారణం బ్రహ్మ (శ్వేతా ౧-౧)
మం తేధ్యానయోగానుగతా అపశ్యన్ (శ్వేతా ౧-3)
,, యోయోనింయోని మధితిష్ఠత్యేకః ,, (శ్వేతా ౪-౧౧)
,, మాయాంతుప్రకృతింవిద్యా న్మాయినంతు మహేశ్వరమ్ (శ్వేతా ౪-౧౦) అను మంత్రములును ప్రమాణార్థము గైకొనఁబడినవి

ఇవిగాక ఈయధ్యాయమునందే శ్రీమచ్ఛంకరభగవత్పాదులవారు తమ శారీరకసూత్రభాష్యమునందు,

సూ అస్మిన్నస్యచ తద్యోగంశాస్తి (౧-౧-౧౯) సూత్రమునందు

మం ఏకోదేవ స్సర్వభూతేషుగూఢః (శ్వేతా ౬-౧౧) మంత్రమున్నూ,

సూ ప్రాణ స్తథాఽనుగమాత్ (౧-౧-౨౮) సూత్రమునందు

మం తమేవవిదిత్వాఽతిమృత్యుమేతి (శ్వేతా 3-౮) మంత్రమున్నూ,

సూ భూమాసంప్రసాదాదధ్యుపదేశాత్ (౧-3-౮) సూత్రమునందు

మం నాన్యఃపంథావిద్యతేఽయనాయ (శ్వేతా.౬.౧౫) మంత్రమున్నూ,

సూ ఆనుమానికమప్యేకేషామితిచేన్న శరీరరూపకవిన్యస్తగృహీతేర్దర్శయతి చ. (౧-౪-౧) సూత్రమునందు,

మం తమేవవిదిత్వాఽతి మృత్యుమేతి (శ్వేతా 3-౮) మంత్రమున్నూ ప్రమాణార్థముదహరించి యున్నారు

బ్రహ్మసూత్రద్వితీయాధ్యాయమునందలి—

ఉపసంహారదర్శనాధికరణమునందుగల

సూ ఉపసంహారదర్శనాన్నేతిచేన్నక్షీరవద్ధి(౨-౧-౨౪) అను సూత్రమునందు

మం నతస్యకార్యం కరణంచ విద్యతే (శ్వేతా ౬-౮)మంత్రము

కృత్స్నప్రసక్త్యధికరణమునందుగల

సూ. కృత్స్నప్రసక్తిర్నిరవయత్వశబ్దకోపోవా(౨-౧-౨౬) అను సూత్రమునందు

మం నిష్కలంనిష్క్రియంశాంతం (శ్వేతా.౬-౧౯) మంత్రము

అసంభవాధికరణమునందుగల

సూ అసంభవస్తు సతోఽనుపపత్తేః. (౨-3-౯) సూత్రమునందు

మం సకారణం కరణాధిపాధిపః (శ్వేతా ౬-౯) మంత్రము.

ఉత్క్రాన్త్యధికరణమునందుగల

సూ. స్వశబ్దోన్మానాభ్యాంచ (౨-3-౨౨) సూత్రము
నందు

మం అరాగ్రమాత్రో హ్యవరోఽపిదృష్టః (శ్వేతా ౫-౮)

మం. వాలాగ్రశతభాగస్య (శ్వేతా ౫-౯)

అనుమంత్రములును

సూ తద్గుణసారత్వాత్తు తద్వ్యపదేశః ప్రాజ్ఞవత్
(౨-3-౨) సూత్రమునందు

తిరిగి పై రెండుమంత్రములున్నూ

సూ యావదాత్మభావిత్వాచ్చ నదోషస్తద్దర్శనాత్.
(౨-3-3౦) సూత్రమునందు

మం వేదాహమేతం పురుషంమహాంతం (శ్వేతా.3-౮)మంత్ర
మును

అంశాధికరణమునందుగల

సూ అంశోనానావ్యపదేశా దన్యథాచాప దాశకిత
వాదిత్వమధీయతఏకే(౨-3-౪3)సూత్రమునందు

మం. త్వంస్త్రీత్వంపుమానసి (శ్వేతా ౪-3) మంత్రము

సూ. స్మరంతిచ (౨-౪-౪౭) సూత్రమునందు

మం. తయోరన్యఃపిప్పలం స్వాద్వత్తి (శ్వేతా ౪-౬) మంత్ర
మును ప్రమాణముగ గైకొనఁబడినవి.

ఇంతియగాక ఈద్వితీయాధ్యాయమునందే శ్రీమచ్ఛంకరభగవత్పాదుల వారు తమ శారీరకమీమాంసా 'సూత్ర' భాష్యమునందు నీక్రిందిసూత్రములందీ యుపనిషన్మంత్రములను ప్రమాణార్థ ముదహరించిరి:—

స్మృత్యధికరణమునందుగల

సూ స్మృత్యనవకాశదోషప్రసంగఇతిచేన్నాన్యస్మృత్యనవకాశదోషప్రసంగాత్ (౨-౧-౧) అను సూత్రమునందు

సాంఖ్యస్మృతియే ప్రమాణమను సందర్భమునందు పూర్వపక్షిచేత సాంఖ్యస్మృతికారుఁడగు కపిలుఁడు శ్రుతివర్ణితుఁడను సందర్భమునందు,

మం ఋషింప్రసూతం కపిలం య స్తమగ్రే. (శ్వేతా. ౫-౨.)
అనుమంత్ర ముదహరింపఁబడినది

సూ ఏతేనయోగః ప్రత్యుక్తః (౨-౧-3) అను సూత్రమునందు యోగము మోక్షప్రాప్తికర మను సందర్భమునందు పూర్వపక్షిచేత

మం త్రిరున్నతం స్థాప్యసమంశరీరం (శ్వేతా ౨-౮)

మం తత్కారణం సాంఖ్యయోగాభిపన్నం (శ్వేతా. ౬-౧3)
అను మంత్రములు ప్రమాణార్థ ముదహరింపఁబడినవి.
ఆసూత్రమునందే సిద్ధాంతమునందు,

మం నాన్యఃపంథా విద్యతేఽయనాయ (శ్వేతా 3-౮) మంత్రము ప్రమాణముగఁ గైకొనఁబడినది.

సూ తదనన్యత్వమారంభణశబ్దాదిభ్యః (౨-౧-౧౪) సూత్రమునందు

మం ఏకం బీజం బహుధాయః కరోతి (శ్వేతా ౬-౧౨) మంత్రము

సూ వికరణత్వాన్నేతిచేత్తదుక్తమ్ (౨-౧-3౧) సూత్రమునందు,

మం అపాణిపాదోజవనోగ్రహీతా (శ్వేతా 3-౧౯) మంత్రము ప్రమాణముగ ఉదహరింపఁబడినవి

సూ. నాత్మాఽశ్రుతేర్నిత్యత్వాచ్చతాభ్యః (సూ ౨-3-౧౭) సూత్రమునందు

మం. ఏకోదేవస్సర్వభూతేషు గూఢః (శ్వేతా. ౬-౧౧) మంత్ర ముదహరింపఁబడినది.

బ్రహ్మసూత్రతృతీయాధ్యాయమునందలి—

సంధ్యాధికరణమునందలి

సూ పరాభిధ్యానాత్తు తిరోహితం తతోహ్యస్యబంధ విపర్యయౌ (3-౨-౫) సూత్రమునకు

మం. జ్ఞాత్వాదేవం సర్వపాశాపహానిః. (శ్వేతా ౧-౧౧) మంత్రము

ఉభయలింగాధికరణమునందలి—

సూ. అపిచైవమేకే (3-౨-౧3) సూత్రమునకు

మం భోక్తాభోగ్యం ప్రేరితారంచమత్వా (శ్వేతా ౨-౧౨) మంత్రము

పరాధికరణమునందలి—

సూ తథాఽన్య ప్రతిషేధాత్.(3-౨-3౬) సూత్రమునకు

మం యస్మాత్పరంనాపరమస్తికించిత్ (శ్వేతా 3-౯) మంత్రము

అక్షరధ్యాదికరణమునందలి—

సూ ఇయదామననాత్ (3-3-3౪) సూత్రమునకు

మం. ద్వాసుపర్ణాసయుజా సఖాయా (శ్వేతా ౪-౬)

,, జుష్టం యదాపశ్యత్యన్య మీశమస్య ( ,, ౪-౭)

అను మంత్రములును ప్రమాణభూతములు.

బ్రహ్మసూత్ర చతుర్థాధ్యాయమునందలి—

ఏకాగ్రతాధికరణమునందుగల

సూ యత్రైకాగ్రతా తత్రావిశేషాత్ (౪-౧-౧౧) సూత్రమునకు

మం సమేశుచౌ శర్కరావహ్నివాలుకా వివర్జితే శబ్దజలాశ్రయాదిభిః, మనోఽనుకూలే నతుచక్షుపీడనే గుహానివాతాశ్రయణే ప్రయోజయేత్. (శ్వేతా ౨-౧౦)

అనుమంత్రము ప్రమాణము.

కార్యాధికరణమునందలి—

సూ నచకార్యే ప్రతిపత్త్యభిసంధిః. (౪-3-౧౪)
సూత్రమునందు

మం నతస్య ప్రతిమా అస్తి. (శ్వేతా ౪౧-౯)
మం నిష్కళం నిష్క్రియం శాంతం ( ,, ౬-౧౯)
మం నాన్యః పంథావిద్యతేఽయనాయ( ,, 3-౮)

ఈ మంత్రములు ఆయాశారీరక మీమాంసాసూత్ర భాష్యమునందు సందర్భానుసారము ప్రమాణముగ నుదహరింపఁబడినవి.

జ్ఞాపిక:—ప్రథమమున అధికరణములకు ముఖ్యముగ సంబంధించిన సూత్రములను తెలిపి తరువాత సందర్భానుసారముగ గ్రైకొనఁబడినవానిని తెలిపితిని ఏయేసందర్భమునందీ మంత్రములు గ్రైకొనఁబడినవో ఆ విషయము లన్నిమంత్రముల గుఱించి యిచ్చుట వ్రాయుట గ్రంథవిస్తరభీతితో వదలినాఁడను

## శ్వేతాశ్వతరోపనిషత్తు - ఇతర వేదములు - ఉపనిషత్తులు.

ఈ శ్వేతాశ్వతరోపనిషత్తునందుగల ౬ అధ్యాయములలో మొత్తము ౧౧3 మంత్రములు గలవు ఉపనిషత్తులన్నియు వేర్వేఱుశాఖలకు సంబంధించిన వగుటచేతను, అన్ని ఉపనిషత్తులందును ప్రతిపాదింపఁదలఁచిన సిద్ధాంతమొకటియే యగుటచేతను ఒక్కొక ప్రధానవిషయమును బోధించునట్టి

మంత్రములు అనేకోపనిషత్తులందు ఒకేవిధముగను, ఈషద్భేదముతోడను ఉండుటగలదు ఈ యుపనిషత్తునందుగల ఈ క్రిందిమంత్రములు బ్రహ్మ, కఠ, ముండకాద్యుపనిషత్తులందే గాక ఋగ్యజుస్సామాథర్వవేదములందుకూడ అచ్చటచ్చట గలవు.

౧ అజామేకాంలోహితశుక్లకృష్ణాం(శ్వే- ౪- ౫)
౨ స్వదేహమరణింకృత్వా (శ్వే- ౧-౧౪)
3 ఋచో అక్షరేపరమేవ్యోమన్ (శ్వే- ౪- ౮)
౪. ఏకోదేవ స్సర్వభూతేషుగూఢః (శ్వే- ౬-౧౧)
౫ ఏకోవశీ నిష్క్రియాణాం (శ్వే- ౬-౧౨)
౬ ఏషహదేవః ప్రదిశోను (శ్వే- ౨-౧౬)
౭ తిలేషుతైలందధినీవసర్పిః (శ్వే- ౧-౧౫)
౮ తదేవాగ్ని స్తదాదిత్యః (శ్వే- ౪- ౨)
౯. త్వంస్త్రీత్వంపుమానసి (శ్వే- ౪- 3)
౧౦ ద్వాసుపర్ణాసయుజా (శ్వే- ౪- ౬)
౧౧ నిత్యోనిత్యానాం (శ్వే- ౬-౧3)
౧౨. నసందృశేతిష్ఠతి (శ్వే- ౪-౨౦)
౧3 పురుషఏవేదంసర్వం (శ్వే- 3-౧౫)
౧౪ మానస్తోకేతనయే (శ్వే- ౪-౨౨)
౧౫ యాతేరుద్రశివాతనూః (శ్వే- 3- ౫)
౧౬ యామిషుంగిరిశంతహస్తే (శ్వే- 3- ౬)
౧౭ యుంజతేమనఉతయుంజతే (శ్వే- ౨- 3)

| | | |
|---|---|---|
| ౧౮ | యుంజానః ప్రథమం | (శ్వే- ౨- ౧) |
| ౧౯ | యుక్త్వాయ మనసా | (శ్వే- ౨- ౩) |
| ౨౦. | యుజేవాంబ్రహ్మపూర్వ్యం | (శ్వే- ౨- ౫) |
| ౨౧ | విశ్వతశ్చక్షురుత | (శ్వే- ౩- ౩) |
| ౨౨. | వేదాహమేతంపురుషం | (శ్వే- ౩- ౮) |
| ౨౩ | సహస్రశీర్షాపురుషః | (శ్వే- ౩-౧౪) |

## అనుభూతిప్రకాశ, ఆత్మపురాణములు.

శ్రీవిద్యారణ్యస్వాములవారు 'అనుభూతిప్రకాశము' అను గ్రంథమును, శ్రీ శంకరానందస్వాములవారు ఆత్మపురాణము అను గ్రంథమును శ్లోకములతో ఉపనిషద్వ్యాఖ్యానరూపముగ నొనర్చిరని కొంద ఱెఱింగియుందురు కాని ఆగ్రంథము లింతవఱకు ఆంధ్రాక్షరములతో మూలశ్లోకములయినను ముద్రింపఁబడి యుండలేదు కావున ఆగ్రంథములందుగల వివరణములను అధ్యాయక్రమముగ నిచట పాఠకుల యుపయోగార్థము చూపించుచున్నారము

## అనుభూతిప్రకాశము.

ఇయ్యది ౨౦ అధ్యాయములుగలగ్రంథము, ఇందు—

| | |
|---|---|
| మొదటిఅధ్యాయమునందు | ఐతరేయోపనిషద్వివరణము |
| ద్వితీయాధ్యాయమునందు | తైత్తిరీయోపనిషద్వివరణము |
| తృతీయాధ్యాయమునందు | (ఛాందోగ్య) శ్వేతకేతువిద్యావిరణము |

చతుర్థాధ్యాయమునందు (ఛాందోగ్య) సనత్కుమార విద్యావివరణము
పంచమాధ్యాయమునందు (ఛాందోగ్య) ప్రజాపతివిద్యా వివరణము
షష్ఠాధ్యాయమునందు ముండకోపనిషద్వివరణము
సప్తమాధ్యాయమునందు ప్రశ్నోపనిషద్వివరణము.
అష్టమనవమాధ్యాయములందు కౌషీతక్యుపనిషద్వివరణము.
దశమాధ్యాయమునందు మైత్రాయణ్యుపనిషద్వివరణము
ఏకాదశాధ్యాయమునందు కఠవల్లీవివరణము
ద్వాదశాధ్యాయమునందు శ్వేతాశ్వతరవివరణము
త్రయోదశాధ్యాయమునందు (బృహదారణ్యక) కణ్వవిద్యా వివరణము
చతుర్దశాధ్యాయమునందు ,, అజాతశత్రుసంవాద వివరణము
పంచదశాధ్యాయమునందు ,, మైత్రేయీవిద్యా వివరణము
షోడశాధ్యాయమునందు ,, మధువిద్యావివరణము
సప్తదశాధ్యాయమునందు ,, ఆశ్వలాయనాది మునిప్రబోధనము
అష్టాదశాధ్యాయమునందు ,, జనకవిద్యా ప్రకాశము
ఏకోనవింశత్యధ్యాయమునందు కేనోపనిషద్వివరణము.

| | |
|---|---|
| వింశత్యధ్యాయమునందు | నృసింహతాపిన్యుపనిషద్వివరణము చక్కఁగా నిరూపింపఁబడినది. |



## ఆత్మపురాణము

ఇది ౧౮ అధ్యాయములుగల గ్రంథరాజము దీనియందు.—

| | |
|---|---|
| ప్రథమాధ్యాయమునందు | ఐతరేయోపనిషద్వివరణము |
| ద్వితీయాధ్యాయమునందు | కౌషీతక్యుపనిషద్వివరణము |
| తృతీయాధ్యాయమునందు | (బృహదారణ్యక) గార్గ్యజాతశత్రుసంవాదము |
| చతుర్థాధ్యాయమునందు | ,, మధుకాండసారార్థము |
| పంచమాధ్యాయమునందు | ,, ఋషి యాజ్ఞవల్క్య సంవాదము |
| షష్ఠాధ్యాయమునందు | ,, యాజ్ఞవల్క్యజనక సంవాదము |
| సప్తమాధ్యాయమునందు | ,, యాజ్ఞవల్క్య మైత్రేయీసంవాదము |
| అష్టమాధ్యాయమునందు | శ్వేతాశ్వతరోపనిషద్వివరణము. |

| | |
|---|---|
| నవమాధ్యాయమునందు | కఠోపనిషద్వివరణము |
| దశమాధ్యాయమునందు | తైత్తిరీయోపనిషద్వివరణము. |
| ఏకాదశాధ్యాయమునందు | జాబాల, గర్భ, బ్రహ్మ, పరమహంస, హంస, ఆరుణేయ, క్షురిక, అమృత, నాద, మహాత్, ఆత్మబోధ, కైవల్యములను ౧౧ ఉపనిషత్తులయొక్క వివరణము |
| ద్వాదశాధ్యాయమునందు | (ఛాందోగ్య) ఆరుణి శ్వేతకేతు సంవాదము |
| త్రయోదశాధ్యాయమునందు | (ఛాందోగ్య) సనత్కుమార నారదసంవాదము |
| చతుర్దశాధ్యాయమునందు | (ఛాందోగ్య) ప్రజాపతీంద్ర విరోచనాఖ్యాయికావివరణము |
| పంచదశాధ్యాయమునందు | కేనోపనిషద్వివరణము |
| షోడశాధ్యాయమునందు | ముండకోపనిషద్వివరణము |
| సప్తదశాధ్యాయమునందు | ప్రశ్నోపనిషద్వివరణము. |
| అష్టాదశాధ్యాయమునందు | నృసింహ పూర్వోత్తరతాపిని, ఈశావాస్యోపనిషత్తుల వివరణము గలదు. |

స్కాందపురాణ సూతసంహితాంతర్గత, యజ్ఞవైభవ ఖండోత్తరభాగమునందుగల బ్రహ్మగీతలందున్నూ ప్రథమాది ద్వాదశాధ్యాయములందు ఐతరేయాద్యుపనిషత్సారము వర్ణితమయియున్నది అందీ శ్వేతాశ్వతరోపనిషదర్థము ౧౧-వ అధ్యాయమునందు తెలుపఁబడియున్నది

పద్మపురాణాంతర్గతమగు శివగీతలయందు ౧౨-వ అధ్యాయమునందు ఈ శ్వేతాశ్వతరోపనిషదర్థము వివరింపఁబడి యున్నది "ఏకో దేవస్సర్వభూతేషు గూఢః" మున్నగుమంత్రములు అదేవిధములుగ ఉద్ధృతములయియున్నవి.

| శ్వేతాశ్వతరోపనిషత్తు, | అనుభూతిప్రకాశము, | ఆత్మపురాణము. |
|---|---|---|
| | (౧౨-వ అధ్యాయము) | (౮-వ అధ్యాయము) |
| ప్రథమాధ్యాయము. | శ్లో ౧= ౩౬ | శ్లో. ౧ =౪౯౧ |
| ద్వితీయాధ్యాయము | ,, ౩౭= ౪౮ | ,, ౪౯౨=౫౭౫ |
| తృతీయాధ్యాయము | ,, ౪౯= ౬౧ | ,, ౫౭౫=౬౬౬ |
| చతుర్థాధ్యాయము | ,, ౬౨= ౭౯ | ,, ౬౬౬=౭౭౮ |
| పంచమాధ్యాయము | ,, ౮౦= ౯౦ | ,, ౭౭౯=౮౨౫ |
| షష్ఠాధ్యాయము. | ,, ౯౧=౧౨౦ | ,, ౮౨౬=౯౭౫ |

జ్ఞాపిక:— ఈ శ్వేతాశ్వతరోపనిషత్తుయొక్క ప్రథమాధ్యాయవివరణము ఆత్మపురాణమునం దతినిపుణముగ ప్రతిపాదింపఁబడినది. పాఠకులు దీనిని గమనించవలయును

# శ్వేతాశ్వతరోపనిషత్తు - తద్భాష్యము

ఈ శ్వేతాశ్వతరోపనిషత్తునకు శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యకృతమని ఒక భాష్యము పూనా ఆనందాశ్రమమువారిచేత ముద్రింపఁబడియున్నది శ్రీమచ్ఛంకరాచార్యులవారి ఇతరభాష్యముల శైలికిని, ఏతద్భాష్యశైలికిని చాలభేదము గనంబడుచుండుటచేత ముద్రితమయిన యీ భాష్యము శ్రీమచ్ఛంకరాచార్యకృతము కాదని కొందఱు చున్నారు ఇదియుసుంగాక ఈ యుపనిషత్తునకు

౧ శంకరానందకృతదీపికయు,

౨ నారాయణవిరచితవివరణమును,

౩ విజ్ఞానభగవత్కృతవ్యాఖ్యయు,

౪ ఉపనిషద్బ్రహ్మకృతవ్యాఖ్యయు,

ముద్రితములయి లభించుచున్నవి

శ్రీమచ్ఛంకరభాష్యమును ప్రధానముగ గైకొని ఇతరవ్యాఖ్యానములందు గల విశేషముల క్రోడీకరించి ఆంధ్రటీకాతాత్పర్యములను యథామతి లిఖించినాడను. గుణదోషవిచక్షణులగు విద్వాంసులు అజ్ఞానవశమునను ప్రమాదవశమునను సంభవించిన లోపములను తెలిపినయెడల వానిని శిరసావహించి పరిగ్రహించి కృతజ్ఞతాప్రకటనపూర్వకముగ ద్వితీయ ముద్రణమునందు చేర్చి ప్రకటించగలను ఇట్టియమూల్యగ్రంథములను సంస్కరింపించి ప్రకటించి భాషాసేవయు, మతసేవయు నొనర్పుటయే ప్రధానకృత్యముగ భావించుచున్న

వారలును, శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్ సన్స్ అను సంస్థకు యజమానులును, మా మిత్రులును అగు శ్రీయుత వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారికి సత్యస్వరూపుఁడగు పరమేశ్వరుఁడు ఇతోఽప్యధికముగ ఆయురారోగ్యైశ్వర్యాదికముల ననుగ్రహించుగాక!

| | |
|---|---|
| ౧౮-౧౦-33 | ఇట్లు, |
| శ్రీముఖ ఆశ్వయుజబహుళ అమావాస్య. (దీపావళి) | కనుపర్తి మార్కండేయశర్మ, |
| కీలుపాకు, మదరాసు. | స్వధర్మప్రకాశినీసంపాదకుఁడు |

శ్రీగురుభ్యోనమః.

# శ్వేతాశ్వతరోపనిషత్తుయొక్క

# విషయ సూచిక.

---

శ్రీ శంకరభగవత్పాదాచార్యకృత భాష్యపీఠికయొక్క

ఆంధ్ర వివరణము

పుట ౧-మొదలు ౨౧-వ పుటవఱకు

విషయము | పుట.



## ప్రథమాధ్యాయము.

(మం ౧-౧౬. పుట ౬౨- ౧౨౦)

## ద్వితీయాధ్యాయము.

(మం ౧-౧౭. పుటలు ౧౨౩-౧౫౦ వఱకు)

## తృతీయాధ్యాయము

(మం ౧-౨౧. పుట ౧౫౧-౧౭౯)

విషయము. ఫుట.



## చతుర్థాధ్యాయము.

(మం ౧-౨౨. ఫుట ౧౮౦-౨౧౯)

విషయము. | పుట.



## పంచమాధ్యాయము

(మం. ౧-౧౪. పుట ౨౨౦-౨౪౧)



## షష్ఠాధ్యాయము

(మం. ౧-౨౩ పుట ౨౪౨-౨౭౮.)

శ్రీగురుభ్యో నమః.

కృష్ణయజుర్వేదాంతర్గత మగు

# శ్వేతాశ్వతరోపనిషత్తు

ఆంధ్రటీకాతాత్పర్య వివరణ సమన్వితము



శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యకృత

## శ్వేతాశ్వతరోపనిషద్భాష్యపీఠిక.

బ్రహ్మజిజ్ఞాసగల ముముక్షువులకు అనాయాసముగ నీ శ్వేతాశ్వతరోపనిషదర్థము తెలియుటకొఱకు వివరించుచున్నారము ఆత్మ చిదానంద, అద్వితీయ, బ్రహ్మస్వరూపముగలవాఁడు. ఆత్మ (తాను) ఇట్టివాఁడయినను, స్వాశ్రయమును, స్వవిషయమును, స్వాభాసమును, స్వానుభవమాత్రగమ్యమును అగు అవిద్యచేత స్వాభావికమగు పరమపురుషార్థమును చెడఁగొట్టుకొన్నవాఁడయి సకలానర్థములను పొందినవాఁడయి అవిద్యాపరికల్పితములయినసాధనములచేతనే ఇష్టప్రాప్తిని అరిష్టపరిహారమును పొందఁదలఁచి పురుషార్థము గానిదానిని పురుషార్థముగా భావించినవాఁడయి మోక్షపురుషార్థమును పొందనివాఁడయి రాగద్వేషాదులను మొసళ్లచేత నలువైపుల ఈడ్వఁబడుచున్నాఁడు ఇట్లు బాధింపఁబడుచు కర్మానుసారము దేవమానవ

తిర్యగాది ప్రభేదములుగల నానావిధ యోనులందు జన్మించుచు దుఃఖమయమైన జీవనము గడుపుచు ఒకానొకపుణ్యకర్మ పరిపాకవశము చేత విద్యాధికారియగు బ్రాహ్మణాద్యధికారిజన్మమును పొందినవాఁడయి ఈశ్వరార్థము కర్మలనొనర్చుటచేత రాగాది మలములు నశించినవాఁడయి, నిత్యానిత్యవస్తువివేకము చేత ఇహాముత్రార్థఫలభోగ విరాగుఁడయి సదాచార్యుని ఆశ్రయించి ఆచార్యద్వారముగ నొనర్చిన ఉపనిషచ్ఛ్రవణమననాదికము చేత "అహం బ్రహ్మాస్మి" యను బ్రహ్మాత్మతత్త్వభావమునుపొంది నివర్తించిన అజ్ఞానతత్కార్యములుగలవాఁడయి శోకవిరహితుఁడగుచున్నాఁడు అవిద్యానివృత్తియే లక్షణముగాఁ గల మోక్షము విద్యాధీనమయి యుండుటవలన తదర్థము—అనఁగా విద్యానిమిత్తము ఉపనిషద్వ్యాఖ్యారంభము యుక్తమే యగుచున్నది ఈవిషయమునే ఉపనిషత్తు లిట్లు చెప్పుచున్నవి:—

## శ్రుతులు

౧. తద్విజ్ఞానా దమృతత్వం

**అర్థ. ఆ బ్రహ్మస్వరూపము నెఱుంగుటవలన మోక్షము లభించును.**

౨ తమేవం విద్వా నమృత ఇహ భవతి, నాన్యః పంథా అయనాయ విద్యతే

**అర్థ. ఆపరమాత్మను ఈవిధముగా తెలిసికొన్నవాఁ డీశరీరము ఉండగనే ముక్తుఁ డగుచున్నాఁడు. మోక్షమునకు వేఱుమార్గము లేదు.**

3. న చే దిహావేదీ న్మహతీ వినష్టిః

అర్థ. జీవించియున్నప్పుడే బ్రహ్మము తెలిసికొననియెడల గొప్ప నష్టము కలుగును.

౭ య ఏత ద్విదు రమృతాస్తే భవంతి కఠో ౬ ౨

అర్థ. ఎవ్వరీబ్రహ్మము నెఱుంగుచున్నారో వారు ముక్తులగుచున్నారు.

౫ కిమిచ్ఛన్కస్య కామాయ శరీర మనుసంజ్వరేత్

అర్థ. బ్రహ్మవేత్త ఏమికోరి దేనికొఱకు శరీరము తపింపఁజేయును. అనఁగా వానికి కోరవలసినది ఏమియులేదని భావము.

౬ తం విదిత్వా నలిప్యతే కర్మణా పాపకేన

అర్థ. ఆబ్రహ్మము నెఱింగినవాఁడు పాపకర్మలచేత విలిప్తుఁడు కాఁడు.

౭ తరతి శోక మాత్మవిత్

అర్థ. ఆత్మవిదుఁడు శోకమును - సంసారమును దాఁటుచున్నాఁడు.

౮ నిచాయ్య తం మృత్యుముఖాత్ప్రముచ్యతే

అర్థ. ఆపరమాత్మ నెఱింగి మృత్యుముఖమునుండి విడువఁబడుచున్నాఁడు.

౯ ఏత ద్యో వేద నిహితం గుహాయాం సో ఽవిద్యా
గ్రంథిం వికిరతీహ సౌమ్య

అర్థ ఓ సాధూ! హృదయకమలమునందుఁ గల బుద్ధిగుహయందున్న వానిని ఎవ్వఁ డెఱుంగునో వాఁడు అవిద్యాబంధనములను దూరముగా చిమ్మివేయును.

౧౦ భిద్యతే హృదయగ్రంథిః ఛిద్యంతే సర్వసంశయాః,
క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే
ముండక. ౨. ౨. ౯.

అర్థ. ఆపరబ్రహ్మ మిట్టిదని తెలియఁబడుచుండఁగనే హృదయము నందుఁగల అజ్ఞానగ్రంథి - దేహాత్మభ్రమ నశించుచున్నది. సర్వసంశయములు తొలఁగిపోవుచున్నవి. పుణ్యపాపకర్మలన్నియు సమూలముగ నశించుచున్నవి.

౧౧ యథా నద్య స్స్యందమానా స్సముద్రే
ఽస్తం గచ్ఛంతి నామరూపే విహాయ,
తథా విద్వాన్నామరూపా ద్విముక్తః
పరాత్పరం పురుష ముపైతి దివ్యమ్.

ముండక 3 ౨ ౮

అర్థ. ప్రవహించుచున్న నదులన్నియు సముద్రమునుపొంది తమతమ నామరూపములనువదలి సముద్రమునం దెటుల లయించిపోవుచున్నవో అదే విధముగా విద్వాంసుఁ డగువాఁడు నామరూపములనుండి విముక్తుఁడయి స్వయంప్రకాశుఁడును, పరాత్పరుఁడును అగు పురుషుని పొందుచున్నాఁడు.

౧౨ స యో హ వై తత్పరమంబ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి

అర్థ. ఎవ్వఁ డీపరబ్రహ్మమును తెలిసికొనుచున్నాఁడో వాఁడు బ్రహ్మమే అగుచున్నాఁడు.

౧3 స యో హవై తదచ్ఛాయ మశరీర మలోహితం
శుభ్ర మక్షరం వేదయతే య స్తు సోమ్య, స సర్వ
మవైతి ప్రశ్న. ౪ ౧౦.

అర్థ. ఎవ్వఁడు తమోవిరహితమును నామరూపాదిసర్వోపాధివిరహితమును శుద్ధమును అగు బ్రహ్మమును తెలిసికొనుచున్నాఁడో వాఁడు సర్వము నెఱింగినవాఁ డగుచున్నాఁడు.

౧౪ తం వేద్యం పురుషం వేద యథా మావో మృత్యుః
పరివ్యథాః ప్రశ్నోపనిషత్ ౬. ౬.

అర్థ. ఎవ్వఁడు బ్రహ్మము నెఱుంగునో అట్టివానిని మృత్యువు ఇతరులను పీడించునటుల పీడింపఁజాలదు.

౧౫ తత్ర కో మోహః కశ్శోక ఏకత్వ మనుపశ్యతః.

అర్థ. అద్వితీయమగు బ్రహ్మమును చూచువానికి అచ్చట శోకమోహము లేవియు గనంబడవు.

౧౬. విద్యయా ఽమృత మశ్నుతే

అర్థ. జ్ఞానము వలన మోక్షమును పొందుచున్నాఁడు.

౧౭ సర్వాణి రూపాణి విచింత్య ధీరాః ప్రేత్యాస్మా ల్లోకా దమృతా భవంతి

అర్థ. జ్ఞానులు సర్వరూపములను పరిశీలించినవారలయి యీలోకము నుండి మరణించి ముక్తులగుచున్నారు.

౧౮ అపహత్య పాప్మాన మనంతే స్వర్గే లోకే ప్రతితిష్ఠతి.

అర్థ. పాపములను పోఁగొట్టుకొని అనంతమయిన స్వర్గలోకమునందు ప్రతిష్ఠితుఁ డగుచున్నాఁడు.

౧౯ తెన్మయా అమృతా వై బభూవుః.

అర్థ. ఆ యాత్మజ్ఞానముగలవారలు ముక్తులగుచున్నారు.

౨౦ తదాత్మతత్త్వం ప్రసమీక్ష్య దేహీ ఏకః కృతార్థో భవతి వీతశోకః

అర్థ. ఆత్మతత్త్వమును గాంచినవాఁడు శోకరహితుఁడయి కృతార్థుఁ డగును.

౨౧ ఈశం తం జ్ఞాత్వా అమృతాభవంతి.

అర్థ. ఆయాత్మ నెఱింగినవారలు ముక్తులగుదురు.

౨౨. తదేవోపయంతి.

అర్థ. ఆత్మ నెఱింగినవా రాయాత్మనే పొందుచున్నారు.

౨3 నిచాయ్యేమాం శాంతి మత్యంత మేతి

అర్థ. ఆత్మతత్త్వము నెఱింగినవాఁడు మిక్కుటమయిన శాంతిని పొందుచున్నాఁడు.

౨౪ తమేవం జ్ఞాత్వా మృత్యుపాశాఀ భినత్తి

అర్థ. బ్రహ్మము నెఱింగినవాఁడు మృత్యుపాశములను భేదించుచున్నాఁడు.

౨౫ యే పూర్వం దేవా ఋషయ శ్చ తం విదుః తేషాం
శాంతి శ్శాశ్వతీ నేతరేషామ్

అర్థ. దేవతలుగాని మహర్షులుగాని ఎవ్వరా బ్రహ్మమును గాంచుచున్నారో, వారికే శాశ్వతమయినశాంతి. ఇతరులకు శాశ్వతమయిన శాంతి లేదు.

## స్మృతిప్రమాణములు

౧ శ్లో బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే
భగ ౨-౫౦.

అర్థ. సమత్వ బుద్ధిగలవానిని పుణ్యపాపములు రెండున్నూ అంటఁజాలవు.

౨ కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః,
జన్మబంధవినిర్ముక్తాః పదం గచ్ఛంత్యనామయమ్
భ ౨-౫౧

అర్థ. సమత్వబుద్ధితోఁ గూడినపండితులు కర్మవలన పుట్టినఫలమును వదలి జన్మబంధనమునకు లోఁబడనివారలయి సర్వోపద్రవరహిత మగు మోక్షమును పొందుదురు.

3 సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి
భగ ౪-3౬

అర్థ. నీవొనర్చిన పాపము నంతయు జ్ఞానమను తెప్పచేతనే దాటఁగలవు.

౪ జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా
భగ ౪-3౭.

అర్థ. జ్ఞానము కలుగుటకుముందు చేయఁబడినట్టియు, తరువాత చేయఁబడినట్టియు సకలపాపములను జ్ఞానమను అగ్ని దహించును.

౫ ఏతద్బుద్ధ్వా బుద్ధిమాంస్స్యాత్కృతకృత్యశ్చభారత.
భగ ౧౫-౨౦

అర్థ. ఈవిషయము నెఱింగినవాఁడు బుద్ధిమంతుఁడును కృతకృత్యుఁడును అగును.

౬ తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరమ్
భగ. ౧౮-౫౫

అర్థ. నన్ను యథార్థముగా నెఱింగినవాఁడు నన్నే చేరును.

౭ సర్వేషా మపి చైతేషా మాత్మజ్ఞానం పరం స్మృతమ్

అర్థ. ఈ అన్నింటిలో ఆత్మజ్ఞానమే శ్రేష్ఠమయినదని చెప్పఁబడుచున్నది.

౮. తద్ధ్యగ్ర్యం సర్వవిద్యానాం ప్రాప్యతే హ్యమృతంయతః

అర్థ. అన్నివిద్యలలో బ్రహ్మజ్ఞానము శ్రేష్ఠమయినది. దానివలన ముక్తిని పొందును.

౯ ప్రాప్యైతత్కృతకృత్యో హి ద్విజో భవతి నాన్యథా.

అర్థ. ద్విజుఁడీయాత్మతత్త్వమును పొందుటచేతనే కృతకృత్యుఁడగును. వేఱువిధముగా కృతకృత్యుఁడు కాఁజాలఁడు.

౧౦. ఏవం య స్సర్వభూతేషు పశ్యత్యాత్మాన మాత్మనా,
స సర్వసమతా మేత్య బ్రహ్మాభ్యేతి సనాతనమ్

అర్థ. ఎవ్వఁడీవిధముగా సర్వప్రాణులందు ఆత్మస్వరూపమును మనస్సుతోఁ గాంచునో వాఁడు సర్వసముఁడయి సనాతనమయిన బ్రహ్మము పొందుచున్నాఁడు.

౧౧ సమ్యగ్దర్శన సంపన్నః కర్మభి ర్న నిబధ్యతే,
దర్శనేన విహీనస్తు సంసారం ప్రతిపద్యతే

అర్థ. నేను బ్రహ్మస్వరూపుఁడ నను సమ్యక్ జ్ఞానముగలవాఁడు కర్మలచేబద్ధుఁడు కాఁజాలఁడు. అట్టి సమ్యక్ జ్ఞానము లేనివాఁడు జననమరణాది షడ్వికారములు గలసంసారమును పొందుచున్నాఁడు.

౧౨ కర్మణా బధ్యతే జంతు ర్విద్యయా చ విముచ్యతే,
తస్మా త్కర్మ న కుర్వంతి యతయః పారదర్శినః

అర్థ. ప్రాణులు కర్మాచరణము చేత బద్ధులగుచున్నారు. జ్ఞానము చేత విముక్తులగుచున్నారు కావున సంసారసారము నెఱింగిన విద్వాంసులు కర్మల నొనర్పరు.

౧౩ జ్ఞానం నిశ్శ్రేయసం ప్రాహు ర్వృద్ధా నిశ్చయదర్శినః,
తస్మాత్ జ్ఞానేన శుద్ధేన ముచ్యతే సర్వపాతకైః

అర్థ. బ్రహ్మస్వరూపము నెఱింగిన పెద్దలు బ్రహ్మజ్ఞానమునే నిశ్శ్రేయసమని చెప్పుచున్నారు. కావున పరిశుద్ధమగు జ్ఞానము చేత సర్వపాపముల నుండి విముక్తుఁ డగుచున్నాఁడు.

౧౪ ఏవం మృత్యుం జాయమానం విదిత్వా
జ్ఞానేన విద్వాన్ తేజ అభ్యేతి నిత్యమ్,
న విద్యతే హ్యన్యథా తస్య పంథా
స్తం మత్వా కవి రాస్తే ప్రసన్నః

అర్థ. విద్వాంసులు బ్రహ్మజ్ఞానముచేత మృత్యువు జయింపఁబడునను విషయము నెఱింగినవారలయి నిత్యమయిన తేజస్సును పొందుచున్నారు. విద్వాంసునకు మఱొకమార్గము లేదు. అట్టి తేజస్స్వరూపుఁడగు పరమాత్మను ధ్యానించువాఁడు ప్రసన్నుఁడయి యుండును

౧౫ క్షేత్రజ్ఞస్యేశ్వరజ్ఞానాత్ విశుద్ధిః పరమా మతా.

అర్థ. జీవుఁడు తా నీశ్వరుఁడనని యెఱుంగుటయే శ్రేష్ఠమయిన పరిశుద్ధి.

౧౬ అయంతు పరమో ధర్మో యద్యోగే నాత్మదర్శనమ్

అర్థ. జ్ఞానముచేత ఆత్మను సందర్శించుటయే శ్రేష్ఠమయినయోగము.

౧౭ ఆత్మజ్ఞ శ్శోకసంతీర్ణో న బిభేతి కుతశ్చన,
మృత్యో స్సకాశా న్మరణా దథవాఽన్యకృతాద్భయాత్.

అర్థ. ఆత్మ నెఱింగినవాఁడు శోకము నతిక్రమించినవాఁడై మృత్యువునకుఁగాని మరణమునకుఁగాని మఱొకదానికిఁగాని భయంపడఁడు.

౧౮ న జాయతే న మ్రియతే న వధ్యో న చ ఘాతకః,
న బధ్యో బంధకారీచ న ముక్తో న చ మోక్షదః

అర్థ. ఆత్మ పుట్టఁడు, మరణించఁడు, చంపఁబడఁడు, ఒకనినిచంపఁడు, ఒక్కని బంధింపఁడు, బంధింపఁబడఁడు, ముక్తుఁడుకాఁడు, ఒక్కనికి మోక్షమొసంగఁడు అని ఎఱుంగవలయును.

౧౯ పురుషః పరమాత్మా తు యదతోఽన్య దసచ్చతత్

అర్థ. పురుషుఁడే పరమాత్మ. ఇతఁడే సత్స్వరూపుఁడు. ఈపురుషుని కంటె వేఱయినదంతయు అసత్తు.

ఇటుల శ్రుతిస్మృతిపురాణేతిహాసములందు జ్ఞానమే మోక్షమునకు సాధనము అని చెప్పఁబడియుండుటచేత ఉపనిషత్ప్రారంభము యుక్తమే యగుచున్నది. ఉపనిషత్తను పేరుచేతనే జ్ఞానమే పరమపురుషార్థసాధనమని తెలియ వచ్చుచున్నది. ఎలయనఁగా:—

## ఉపనిషచ్ఛబ్దనిర్వచనము.

"౧ షద్‌ ౣ, విశరణ గత్యవసాదనేషు" అను ధాతువునకు 'ఉప ని' అను ఉపసర్గలు చేరగా 'క్విప్' ప్రత్యయాంతమైనప్పుడు 'ఉపనిషత్' అనుపద మేర్పడును. ఉపనిషత్పదముచేత వ్యాఖ్యానము చేయఁదలఁచిన గ్రంథమునందు చెప్పఁబడినట్టి విద్య చెప్పఁబడును. తాదర్థ్యమగుటచేత అట్టి విద్యగల గ్రంథమున్నూ ఉపనిషత్తని చెప్పఁబడును. మోక్షేచ్ఛ గలవారలు ఇహపరలోకసుఖానుభవమునందు వైరాగ్యము గలవారలయి ఉపనిషచ్ఛబ్దిత మయిన విద్యను తదేకనిష్ఠులయి పరిశీలించినయెడల అట్టి పరిశీలనము గలవారియొక్క సంసార బీజమగు అవిద్యను సమూలముగ నశింపఁజేయుటచేతను, వారిని పరబ్రహ్మమును పొందింపఁజేయుటచేతను, వారియొక్క జన్మజరామరణాద్యనర్థసమూహమును సమూలముగ అంతము నందింపఁజేయుటచేతను, ఉపనిషత్తనునామము యుక్తమే యగుచున్నది. ('షద్‌ ౣ' అను ధాతువునకు, ౧ విశరణము= సడలింపఁజేయుట, ౨ గతి=పొందుట, 3 అవసాదనము =

నశింపఁజేయుట అను 3 అర్థములుగలవు ఇచ్చట పై మూఁడర్థములు సరిపోవుచున్నవి)

## పూర్వపక్షము.

జ్ఞానముచేతనే మోక్షము లభించుట, తదితరసాధనములచేత మోక్షము లభించదనుట అను విషయమే నిశ్చయమయినయెడల ఉపనిషదారంభము యుక్తము కావచ్చును కాని అట్టినిర్ణయ మేమియు లేదు. కర్మలుకూడ మోక్షమునకు సాధనభూతము లేయని శ్రుతియం దనేకస్థలములందు గలదు

౧ శ్రు అపామ సోమ మమృతా అభూమ

అర్థ సోమపానమును చేసితిమి. అమృతులము—మరణరహితులము అయితిమి

౨ శ్రు అక్షయ్యగ్ం హ వై చాతుర్మాస్యయాజిన స్సుకృతం భవతి

అర్థ. చాతుర్మాస్యయాగము నొనర్చినవానికి అక్షయ్యము—నశించని సుకృతము అగుచున్నది.

పై శ్రుతిప్రమాణమువలన కర్మలవలనకూడ మోక్షము లభించును కనుక ఉపనిషదారంభము అనావశ్యకము

## పూర్వపక్షనిరాకరణము.

నీవు చెప్పినవిషయము—అనఁగా కర్మలచేతకూడ మోక్షము లభించునని చెప్పుట శ్రుతిస్మృతివిరోధ మగుటవల

నను యుక్తివిరోధమగుటవలనను ప్రమాణము గాదు. శ్రుతి విరోధ మెట్లనఁగా,

౧ శ్రు తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే ఏవమేవా
ముత్ర పుణ్యచితః లోకః క్షీయతే

అర్థ. ఇహలోకమునందు కర్మచితమగు లోకమెటులనశించుచున్నదో అట్లే పరలోకమునందు పుణ్యచితమగులోకముకూడ నశించుచున్నది.

౨. తమేవం విద్వా నమృత ఇహ భవతి, నాన్యః పంథా
విద్యతే ఽయనాయ

అర్థ. ఆబ్రహ్మమును ఈప్రకారముగా జీవించియుండఁగా నెఱింగినవాఁడే అమృతుఁడు - ముక్తుఁడగుచున్నాఁడు. మోక్షమునకు వేఱుమార్గము లేదు.

3 న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకే అమృ
తత్వ మానశుః.

అర్థ. మోక్షము కర్మచేతఁగాని సంతానముచేతఁగాని ధనము చేతఁగాని లభింపదు. సన్న్యాసముచేతనే ముక్తిని పొందిరి.

౪ ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞరూపా
అష్టాదశోక్త మవరం యేషు కర్మ,
ఏత చ్ఛ్రేయో యే ఽభినందంతి మూఢాః
జరామృత్యుం తే పున రేవాపియంతి.

ముండక ౧ ౨. ౭

అర్థ. ఋత్విక్కులు మున్నగు ౧౮ రి చేతకలసి చేయఁబడుచున్న యజ్ఞాదిరూపము లగుకర్మలు అల్పఫలప్రదములు. దృఢముగాని తెప్పలవంటివి. ఈ యజ్ఞయాగాదులు శ్రేష్ఠములనిభావించుచు వీనినే ఆచరించుచు నుండెడి మూఢులు మాటిమాటికి జరామరణములను పొందుచుందురు.

౫ పరీక్ష్య లోకాన్కర్మచితాన్బ్రాహ్మణో నిర్వేదమాయాన్నాస్త్యకృతః కృతేన

అర్థ. కర్మానుష్ఠానము చేత లభించునట్టి స్వర్గాదిలోకములు కర్మఫలానుభవానంతరము నశించుచున్నవనువిషయమును విద్వాంసుఁడగువాఁడెఱింగినవాఁడయి కర్మచేత మోక్షప్రాప్తి కలుగదని తెలిసికొనవలయును.

## స్మృతిప్రమాణములు

౧. శ్లో. కర్మణా బధ్యతే జన్తు ర్విద్యయాచ విముచ్యతే,
తస్మాత్కర్మ న కుర్వంతి యతయః పారదర్శినః

అర్థ. కర్మానుష్ఠానము చేత ప్రాణులు బంధింపఁబడుదురు. జ్ఞానము చేత విముక్తులగుదురు. కనుక సంసారసారము నెఱింగకోరువిద్వాంసులు కర్మల నాచరింపరు.

౨. అజ్ఞానమలపూర్ణత్వాత్పురాణో మలిన స్స్మృతః,
తత్క్షయాద్ధి భవేన్ముక్తిః నాన్యథా కర్మకోటిభిః

అర్థ. అజ్ఞాన మనుమలము అంతట నిండియున్నది. ఈఅజ్ఞానమలము అతిప్రాచీనము. ఈ అజ్ఞానమలము క్షయించిననే ముక్తికలుగును కాని అజ్ఞానము క్షయించనియెడల కోటికర్మలచేతకూడ ముక్తి లభింపదు.

3 ప్రజయా కర్మణా ముక్తి ర్ధనేన చ సతాం నహి,
త్యాగేనైకేన ముక్తిస్స్యాత్తదభావే భ్రమంత్యహో.

అర్థ. సంతానముచేతను, కర్మచేతను, ధనముచేతను, సత్పురుషులకు ముక్తి లభింపదు. త్యాగముచేతనే మోక్షము లభించును. త్యాగములేనివారలు జననమరణరూపసంసారమునందు తిరుగుచుందురు.

౪ కర్మోదయే కర్మఫలానురాగా
స్తథాఽనుయంతి న తరంతి మృత్యుమ్,

జ్ఞానేన విద్వాన్ తేజ అభ్యేతి నిత్యం
న విద్యతే హ్యన్యథా తస్యపంథాః.

అర్థ. కర్మఫలమునందనురాగముగలవారలు ఆకర్మానుసారము సంసారమును పొందుచున్నారు కాని మృత్యువు నతిక్రమింపరు. విద్వాంసుఁడు జ్ఞానముచేత నిత్యమయిన తేజస్సును పొందుచున్నాఁడు. జ్ఞానము వినాగా మఱొక మోక్షమార్గము లేదు.

౫ ఏవం త్రయీధర్మ మనుప్రపన్నా
గతాగతాః కామకామా లభంతే. భగ ౯-౨౧.

అర్థ. ఈవిధముగా వేదప్రతిపాదితమగు కర్మమార్గమును పొందువారు జననమరణరూపసంసారమును పొందుచున్నారు.

౬ శ్రమార్థ మాశ్రమాశ్చాపి వర్ణానాం పరమార్థతః,
ఆశ్రమైర్నచ వేదైశ్చయజ్ఞై స్సాంఖ్యైః వ్రతై_స్తథా
ఉగ్రై_స్తపోభి ర్వివిధైః దానై ర్నానావిధై రపి,
న లభంతే త మాత్మానం లభంతే జ్ఞానిన స్స్వయమ్.

తా. బ్రాహ్మణాదివర్ణములవారికి విధింపఁబడిన బ్రహ్మచర్యాద్యాశ్రమములు పరమార్థముగాఁ జూచిన శ్రమకరములేగాని వానివలన ప్రయోజనము లేదు. ఆశ్రమములచేతను, వేదములచేతను, యజ్ఞములచేతను, సాంఖ్యజ్ఞానముచేతను, వ్రతములచేతను, నియమపూర్వకములయిన వివిధతపస్సులచేతను, నానావిధములయిన దానములచేతను, ఆయాత్మస్వరూపమును పొందఁజాలరు. జ్ఞానులుమాత్రమే స్వయముగా ఆత్మనుపొందుదురు.

౭. శ్లో. త్రయీధర్మ మధర్మార్థం కిం పాకఫలసంనిభమ్,
నాస్తి తాత సుఖం కించి దత్ర దుఃఖశతాకులే,
తస్మాన్మోక్షాయ యతతా కథం సేవ్యామయాత్రయీ,
అజ్ఞానపాశబద్ధత్వా దముక్తః పురుషస్స్మృతః

జ్ఞానాత్తస్య నివృత్తిస్స్యా త్ప్రకాశాత్తమసో యథా,
తస్మాత్ జ్ఞానేన ముక్తిస్స్యా దజ్ఞానస్య పరిక్షయాత్.

అర్థ. మోక్షము నభిలషించువానికి వేదప్రతిపాదితమగు కర్మమార్గము ముష్టిపండువంటిది. కర్మమార్గలభ్య మగుసంసారము అనేకవిధదుఃఖసమన్వితము. ఇందు సుఖములేశమయినను లేదు. కనుక నేను వేదప్రతిపాదితమగు కర్మమార్గము నాశ్రయింపఁజాలను. అజ్ఞానపాశబద్ధుఁడగు పురుషుఁడు బద్ధుఁడేగాని ముక్తుఁడు కాఁజాలఁడు ఆ యజ్ఞానపాశనివృత్తి ప్రకాశమువలన చీఁకటి నశించునటుల జ్ఞానముచేతనే నశించును. కనుక జ్ఞానముచేత అజ్ఞానము నశింపఁగానే ముక్తి కలుగును.

౮ వ్రతాని దానాని తపాంసి యజ్ఞాః
సత్యం చ తీర్థాశ్రమ కర్మయోగాః,
స్వర్గార్థ మేవాశుభ మధ్రువంచ
జ్ఞానం ధ్రువం శాంతికరం మహార్థమ్

అర్థ. వ్రతములు, దానములు, తపస్సులు, యజ్ఞములు, సత్యము, పుణ్యతీర్థములు, ఆశ్రమములు, కర్మానుష్ఠానములు. ఇవన్నియు స్వర్గాదిపుణ్యలోకప్రదములు ఇవి అశుభములు, అధ్రువములు, జ్ఞానమొక్కటియే శాశ్వతమయినది, మోక్షప్రదము.

౯ యజ్ఞై ర్దేవత్వ మాప్నోతి తపోభి ర్బ్రహ్మణః పదమ్,
దానేనవివిధాన్భోగాన్ జ్ఞానాన్మోక్షమవాప్నుయాత్.

అర్థ. యజ్ఞానుష్ఠానముచేత దేవత్వమును పొందును. తపోఽనుష్ఠానముచేత బ్రహ్మలోకమును పొందును. సత్పాత్రదానముచేత వివిధభోగములను పొందును. జ్ఞానముచేత మోక్షమును పొందును.

౧౦. ధర్మరజ్జ్వా వ్రజేదూర్ధ్వం పాపరజ్జ్వా వ్రజే దధః,
ద్వయం జ్ఞానాసినా భిత్వా విదేహ శ్శాంతి మృచ్ఛతి.

అర్థ. ధర్మపాశముచేత స్వర్గాద్యూర్ధ్వలోకములు లభించును పాప పాశముచేత నరకాద్యధోలోకప్రాప్తి కలుగును. ఈపుణ్యపాపములురెంటిని జ్ఞానమను ఖడ్గముచేత ఛేదించినవాఁడు జన్మమరణరహితుఁడయి శాంతిని-మోక్షమును పొందును.

౧౧ త్యజ ధర్మ మధర్మం చ ఉభే సత్యానృతే త్యజ,
ఉభే సత్యానృతే త్యక్త్వా యేన త్యజసి తత్త్యజ

తా. ధర్మాధర్మములను, సత్యానృతములను వదలుము. ధర్మాధర్మములను సత్యానృతములను వదలిన పిదప దేనిచేత వానిని వదలుచున్నాఁడవో దానిని వదలుము.

ఇట్లు శ్రుతిస్మృతివిరోధ మగుటచేత మోక్షము కర్మచేత సిద్ధించుననుట ప్రామాణికము కాదు

యుక్తివిరోధ మెట్లనఁగా — మోక్షము కర్మముచేత కర్మసాధ్యమగు నెడల చతుర్విధక్రియాంతర్భూతమయి "యత్కృతకంతదనిత్యం = ఏది చేయఁబడుచున్నదో అది అనిత్యము" అను న్యాయముననుసరించి కర్మసాధ్యమయినది అనిత్యమని లోకసిద్ధమయియుండుటచేత కర్మసాధ్యమయిన మోక్షముకూడ అనిత్యమగును. మోక్షము నిత్యమనువిషయమును సర్వవాదు లంగీకరించుటచేత కర్మసాధ్యమెన్నటికిని కాఁజాలదు. ఇదియునుగాక ఆ చాతుర్మాస్యప్రకరణమునందు—

శ్రు ప్రజా మను ప్రజాయసే తదు తేమర్త్యామృతమ్
తై బ్రా ౧ ౫ ౫.

అర్థ. ప్రజల ననుసరించి పుట్టుచున్నాఁడవు. అదియే నీకు అమృతము.

'అక్షయ్యం హవై చాతుర్మాస్యయాజిన స్సుకృతం భవతి'

అను శ్రుతియందు చెప్పఁబడిన 'సుకృత' శబ్దమునకు కర్మయని అర్థముకాని మోక్షమని యర్థముగాదు.

ప్రశ్న:—అట్లయితే కర్మలవలన స్వర్గాదిపుణ్యలోక ప్రాప్తియు, దేవత్వాదికమును కలుగును కావున కర్మ బంధన మునకే గదా హేతువు

సమా:—సత్యము, కర్మ స్వయముగా బంధన హేతు వే, శ్రుతిస్మృతులున్నూ ఇట్లే చెప్పుచున్నవి:—

౧ శ్రు కర్మణా పితృలోకః

అర్థ. కర్మానుష్ఠానముచేత పితృలోకము కలుగును.

౨. శ్రు సర్వ ఏ తే పుణ్యలోకా భవంతి

అర్థ. వీరందఱు పుణ్యలోకముగలవారు అగుచున్నారు.

3 శ్రు ఇష్టాపూర్తం మన్యమానా వరిష్ఠం నాన్యచ్ఛ్రే యో వేదయంతే ప్రమూఢాః, నాకస్య పృష్ఠే తే సుకృతే ఽనుభూత్వేమం లోకం హీనతరం వా వి శంతి

అర్థ. ఇష్టాపూర్తములే శ్రేష్ఠములనితలంచి వానిని ఆచరించుచుండు నట్టిమూఢులు అంతకంటె వేఱగు శ్రేయోమార్గము నెఱుంగఁజాలరు. వారు స్వర్గాదిపుణ్యలోకములందు తత్తత్కర్మానుసారము లభించునట్టిఫలము ననుభ వించితత్తత్కర్మఫలభోగావసానకాలమందు మఱల యీమానవజన్మమునో, ఇంతకంటె నీచమయినజన్మమునో పొందుదురు.

## స్మృతులు

౧. ఏవం కర్మసు నిస్నేహా యేకేచి త్పారదర్శినః,
విద్యామయోఽయం పురుషో నతు కర్మమయః స్మృతః.

అర్థ. ఎవ్వరు సంసారపారము నెఱుంగుదురో వారు కర్మాచరణమునందు ప్రీతినివహింపరు. పరమాత్మ విద్యామయుఁడుగాని కర్మమయుఁడుగాఁడు.

౨ ఏవం త్రయీధర్మ మనుప్రపన్నా గతాగతం కామ
కామా లభంతే భగ ౯-౨౧

అర్థ. వేదవిహితమగు కర్మమార్గమును పొందినవారు గమనాగమన రూపమగు సంసారమార్గమును పొందుచున్నారు.

కాని యీకర్మనే ఫలాభిలాషబుద్ధి లేక నిష్కామబుద్ధితో నీశ్వరార్పణముగా నొనర్చినయెడల అంతఃకరణశుద్ధి యగును. అంతఃకరణశుద్ధివలన జ్ఞానమేర్పడును జ్ఞానమువలన మోక్షము సిద్ధించును ఇటుల పరంపరగా మోక్షమునకు కర్మసాధనమగునుగాని సాక్షాత్తుగ కర్మయెన్నటికిన్ని మోక్షమునకు సాధనము కాఁజాలదు

భగవద్గీతయందున్నూ ఇట్లే చెప్పఁబడియున్నది:—

శ్లో॥ బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతియః,
లిప్యతే న స పాపేన పద్మపత్రమివాంభసా
భగ. ౫-౧౦.

కాయేన మనసా బుద్ధ్యా కేవలైరింద్రియైరపి,
యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాఽఽత్మశుద్ధయే.
భగ ౫-౧౧

అర్థ. ఎవ్వఁడు కర్మలను బ్రహ్మార్పణమొనర్చి ఆసక్తినివిడిచి వానినను ష్ఠించుచుండునో అట్టివాఁడు తామరాకును నీళ్లు అంటనటుల పాపములచేత స్పృశింపఁబడఁడు. ౧౦. కర్మయోగులగువారలు చిత్తశుద్ధికొఱకు ఫలాసక్తి విరహితులయి శరీరముచేతను బుద్ధిచేతను మనస్సుచేతను మమత్వశూన్యములయిన యింద్రియములచేతను కర్మల నొనర్చుచున్నారు.

శ్లో॥ యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్,
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్.
భగ ౯-౨౭.

శుభాశుభఫలైరేవం మోక్ష్యసే కర్మబంధనైః,
సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మాముపైష్యసి
భగ. ౯-౨౮.

అర్థ. ఓయిఅర్జునా! నీ వేపనినిచేయుచున్నాఁడవో, దేనినిభుజించు చున్నావో, దేనిని హోమముచేయుచున్నావో, దేనిని ఇచ్చుచున్నావో, ఏతపముసల్పుచున్నావో దానినంతయు నాకు సమర్పణముచేయుము. ౨౭. నీవీరీతిగనాసర్చినయెడల కర్మసంబంధములగు శుభాశుభఫలములు కంటి నుండి వదలఁబడుచున్నాఁడవు. ఇటుల సన్న్యాసయోగముతో కూడుకొన్న చిత్తముగలవాఁడవయి ముక్తుఁడవయి నన్ను చేరెదవు.

పాపములు నశించినగాని మోక్షము లభించదనియు, కర్మాచరణముచేత పాపములు నశించుననియు, పాపములు నశించినపిదప జ్ఞానోత్పత్తియై మోక్షము లభించుననియు విష్ణుధర్మోత్తరము నందిట్లు క్రమము తెలుపఁబడియున్నది:—

శ్లో. అనూచాన స్తతో యజ్వా కర్మన్యాసీ తతః పరమ్,
తతో జ్ఞానిత్వ మభ్యేతి యోగీ ముక్తిం క్రమాల్లభేత్.
అనేకజన్మసంసారచితే పాపసముచ్చయే,
నాక్షీణే జాయతే పుంసాం గోవిందాభిముఖీ మతిః
జన్మాంతరసహస్రేషు తపోజ్ఞానసమాధిభిః,
నరాణాం క్షీణపాపానాం కృష్ణేభక్తిః ప్రజాయతే.
పాపకర్మాశయో హ్యత్ర మహాముక్తివిరోధకృత్,
తస్యైవ శమనే యత్నః కార్య స్సంసారభీరుణా,

సువర్ణాదిమహాదాన పుణ్యతీర్థావగాహనైః
శారీరైశ్చమహాక్లేశైః శాస్త్రోక్తైస్తచ్ఛమో భవేత్,
దేవతాస్తుతిసచ్ఛాస్త్రశ్రవణైః పుణ్యదర్శనైః
గురుశుశ్రూషణైశ్చైవ పాపబంధః ప్రశామ్యతి.

అర్థ. జనుఁడు సాంగముగ వేదమును చదివి తరువాత యజ్ఞయాగాది కర్మల నాచరింపవలయును. తరువాత కర్మసన్న్యాస మొనర్చి జ్ఞానికావల యును. జ్ఞానియయినపిదప యోగియై క్రమముగా ముక్తినిపొందవల యును. అనేకజన్మలుగల సంసారమునందు సంపాదించి కూడఁబెట్టియున్న పాపరాశి నశించినఁగాని మానవులకు భగవంతునియం దభిరుచి యేర్పడదు. వేలకొలఁదిగా గతించిన జన్మాంతరములందొనర్చిన తపోజ్ఞానసమాధులచేత నశించిన పాపసముదాయముగలవారలకే శ్రీకృష్ణునియందు భక్తియేర్ప డును. పాపకర్మలుకలిగియుండుట ముక్తికి విరోధము సంసారమునుగాంచి భయంపడువాఁడు కర్మనాశనమునందే ప్రయత్నించవలయును. గోభూ హిరణ్యాదిమహాదానములచేతను, గంగాది మహాపుణ్యనదీస్నానములచేతను, శాస్త్రోక్తములగు కృచ్ఛ్రచాంద్రాయణాదివ్రతానుష్ఠానమువలన కలిగెడి శరీరక్లేశముచేతను, దేవతాస్తుతులచేతను, సచ్ఛాస్త్రశ్రవణములచేతను, పుణ్యా త్ముల సందర్శనముచేతను, గురుశుశ్రూషచేసను, అనేకజన్మార్జితమగు పాప సముదాయము నశించును.

యాజ్ఞవల్క్యస్మృతి 3-వ అధ్యాయము యతిప్రకర ణమునందున్నూ, చిత్తశుద్ధి, తత్సాధనము లిట్లు చెప్పఁబడి యున్నవి:—

శ్లో॥ కర్తవ్యాఽఽశయశుద్ధిస్తు భిక్షుకేణ విశేషతః,
జ్ఞానోత్పత్తి నిమిత్తత్వాత్ స్వాతంత్ర్యకరణాయచ ౬౧
మలినో హి యథాఽఽదర్శో రూపాలోకస్య న క్షమః,

తథాఽవిపక్వకరణ ఆత్మజ్ఞానస్య న క్షమః. ౧౮౦
ఆచార్యోపాసనం వేదశాస్త్రార్థస్య వివేకితా,
తత్కర్మణా మనుష్ఠానం సంగస్సద్భిర్గిర శ్శుభాః ౧౪౪
స్త్ర్యాలోకాలంభవిగమః సర్వభూతాత్మదర్శనమ్,
త్యాగః పరిగ్రహాణాంచ జీర్ణకాషాయధారణమ్ ౧౪౫
విషయేంద్రియసంరోధః తంద్రాఽఽలస్యవివర్జనమ్,
శరీరపరిసంఖ్యానం ప్రవృత్తిష్వధమేక్షణమ్ ౧౪౬
నీరజస్తమతా సత్వశుద్ధిర్నిస్పృహతా శమః,
ఏతైరుపాయై స్సంశుద్ధః సత్వయోగ్యమృతీభవేత్
యతో వేదాః పురాణాని విద్యోపనిషదస్తథా,
శ్లోకాస్సూత్రాణిభాష్యాణియచ్చాన్యద్వాఙ్మయంక్వచిత్.
వేదానువచనం యజ్ఞో బ్రహ్మచర్యం తపోదమః,
శ్రద్ధోపవాసః స్వాతంత్ర్య మాత్మనో జ్ఞానహేతవః.

అర్థ. జ్ఞానోత్పత్తికి కారణమగుటచేత అంతఃకరణమును స్వాధీనము చేసికొనుటకు భిక్షుకుడగువాఁడు విశేషముగా ప్రయత్నించవలయును. మలినముగల అద్దము రూపమునుచూచుటకు ఎటుల అనర్హమగుచున్నదో అదేవిధముగా పరిపక్వాంతఃకరణరహితుఁడు ఆత్మజ్ఞానమునకు అనర్హుఁడగుచున్నాఁడు. ఆచార్యసేవ, వేదశాస్త్రార్థపరిజ్ఞానము, సత్కర్మానుష్ఠానము, సత్పురుషసహవాసము, శుభవాక్కులను పలుకుట, స్త్రీలయొక్క దర్శన స్పర్శనాదులులేక యుండుట, సర్వభూతములందు ఆత్మను సందర్శించుట, పరిగ్రహత్యాగము, జీర్ణకాషాయవస్త్రమునుధరించుట, విషయేంద్రియనిరోధనము, తొందరపాటు, ఆలస్యములేకయుండుట, శరీరతత్వపరిగణనము, కర్మలయం దధమదృష్టి, రజస్తమోగుణములను వదలుట, సత్వశుద్ధి, నిస్పృ

హాత్వము, శమము - ఈవిధములగు ఉపాయములచేత పరిశుద్ధుఁడయిన జనుఁడు సత్వగుణాధిక్యమునుపొంది విముక్తుఁడగును. వేదములు, పురాణములు, ఉపనిషత్తులు, శ్లోకములు, సూత్రములు, భాష్యములు మున్నగువాఙ్మయమంతయున్నూ; వేదాధ్యయనము, యజ్ఞాచరణము, బ్రహ్మచర్యము, దమము, తపస్సు, శ్రద్ధ - అనఁగా ఆస్తిక్యబుద్ధి, ఉపవాసము-అనఁగా గురూపాస్తి, స్వాతంత్ర్యము-అనఁగా జితేంద్రియత్వము మొదలగునవి అన్నియు ఆత్మజ్ఞానమునకు కారణభూతములు.

ఆథర్వణమునందున్నూ పాపక్షయానంతరమే జ్ఞానోత్పత్తియని యిట్లు చెప్పఁబడినది:—

౧ శ్రు. జన్మాంతర సహస్రేషు యదా క్షీణాస్తు కిల్బిషాః,
తదా పశ్యంతి యోగేన సంసారోచ్ఛేదనం మహత్.

అర్థ. వేలకొలఁది జన్మలనెత్తినతర్వాత కర్మానుభవపాపపరిహారాద్యుపాయములచేత పాపము లెప్పుడు నశించునో అప్పుడే సంసారోచ్ఛేదరూపమగు జ్ఞానమును ఉపాయముచేత నెఱుంగును.

౨ శ్రు. యస్మిన్విశుద్ధే విరజేచచిత్తే య ఆత్మవత్పశ్యంతి యతయః క్షీణదోషాః.

అర్థ. మనస్సు పాపవిరహితమయి విశుద్ధమయినదగుచుండఁగా నశించిన పాపముగలవారలయి ఆత్మను గాంచుచున్నారు.

బృహదారణ్యకోపనిషత్తునందు యజ్ఞాదికర్మలు వివిదిషాహేతుభూతములని యిట్లు చెప్పఁబడియున్నది:—

శ్రు. తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి
యజ్ఞేన దానేన తపసాఽనాశకేన

అర్థ. ఆపరమాత్మను యజ్ఞముచేతను దానముచేతను నశించనితపస్సు చేతను బ్రాహ్మణులగువారలు తెలిసికొనుటకు ప్రయత్నించుచున్నారు.

## పూర్వపక్షము.

౧ శ్రు విద్యాంచావిద్యాంచ యస్తద్వేదోభయంసహ,

అర్థ. విద్యను, అవిద్యను - యీరెంటిని ఎవ్వఁడెఱుఁగునో వాఁడు ముక్తుఁడగును.

౨ శ్రు తపోవిద్యాచ విప్రస్య నైశ్శ్రేయసకరం పరమ్

అర్థ. తపస్సు, విద్య-యీ రెండున్ను బ్రాహ్మణునకు మోక్షార్థములగు పరమసాధనములు.

అను మొదలగు శ్రుతులు కర్మలవలనకూడ అమృతత్వము—మోక్షము లభించుచున్నదని చెప్పుచున్నవిగదా.

## పూర్వపక్షనిరాకరణము

జ్ఞానమునకు కావలసిన చిత్తగతదోషములను తొలఁగించుట మూలముగా జ్ఞానమునకు సాధనము అగుటచేత కర్మ పరంపరగా మోక్షసాధనముగాని సాక్షాత్తుగా కర్మ మోక్షసాధనము కాఁజాలదు

'విద్యాంచా విద్యాంచ; తపోవిద్యాచ విప్రస్య' అను మంత్రములయొక్క అభిప్రాయము జ్ఞానప్రతిబంధకచిత్తగత దోషనిరాకరణద్వారా పరంపరగా మోక్షసాధనమనియేగాని సాక్షాత్తుగా మోక్షసాధనమనిగాదు ఏలయనఁగా; ఆమంత్రమునందే వాక్యశేషమునం దీయర్థమిట్లే ప్రతిపాదింపఁబడియున్నది

శ్లో॥ తపసా కిల్బిషం హంతి విద్యయాఽమృతమశ్నుతే,
అవిద్యయామృత్యుం తీర్త్వా విద్యయాఽమృతమశ్నుతే.

అనఁగా వాక్యశేషమునందు కర్మానుష్ఠానము కల్మషక్షయ హేతువనియు, విద్యయనఁగాజ్ఞానము అమృతత్వమునకు—మోక్షమునకు హేతువనియు తెలుపఁబడినది కొన్నిమంత్రములందు కర్మాచరణమువలన చిత్తశుద్ధికలుగునని చెప్పఁబడక పోయినను శాఖాంతరోపసంహారన్యాయముచేత సర్వత్ర అట్టి యర్థమునే పరిగ్రహించవలయును

## పూర్వపక్షము.

శ్రు॥ 'కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛతగ్ం సమాః' అనుశ్రుతి యావజ్జీవము కర్మననుష్ఠించవలయునని విధించుచుండఁగా కర్మాభావరూపమగు విద్య మోక్షమునకు కారణమెట్లు కాఁగలదు?

## పూర్వపక్షనిరాకరణము

ఈనియమము కర్మాధికారి యగువానికిఁగాని, కర్మకు అనధికారియు అనియోజ్యుఁడును అగు బ్రహ్మవేత్తను నిర్బంధింపఁజాలదు విద్వాంసునకు కర్మాచరణనిర్బంధము లేదను విషయమును శ్రుతు లిట్లు దెలుపుచున్నవి:—

౧ శ్రు॥ నైతద్విద్వాన్నృషిణా విధేయో న రుధ్యతే విధినా శబ్దచారః

అర్థ. బ్రహ్మజ్ఞానియగు వానివిషయమై వేదము 'ఈపనినిచేయుము' అని విధింపఁజాలదు.—వేదముయొక్క విధి అతనిని నిరోధింపఁజాలదు.

౨ శ్రు ఏతద్ధస్మ వైతత్పూర్వే విద్వాంసో అగ్నిహోత్రం నజుహావాంచక్రిరే

అర్థ. పూర్వులయిన బ్రహ్మవేత్తలు అగ్నిహోత్రమును చేయక పోయిరి.

3 శ్రు ఏతం వైత మాత్మానం విదిత్వా బ్రాహ్మణాః పుత్రేషణాయాశ్చ విత్తేషణాయాశ్చ లోకేషణాయాశ్చ వ్యుత్థాయాథ భిక్షాచర్యంచరంతి

అర్థ. బ్రహ్మవేత్తలగు వారలీ యాత్మ నెఱింగినవారలయి దారేషణ, ధనేషణ, పుత్రేషణలను వదలి గృహమునువదలి భిక్షాచర్యమును ఆచరించుచున్నారు. అనగా సన్న్యాసాశ్రమమును స్వీకరించుచున్నారు.

౪ శ్రు ఏత ద్ధస్మ వైత ద్విద్వాంస ఆహు ఋషయః కావషేయాః కిమర్థా వయమధ్యేష్యామో కిమర్థా వయం యక్ష్యామహే సబ్రాహ్మణః కేన స్యాద్యేనస్యాత్తేనే దృశ ఏవేతి

అర్థ. ప్రసిద్ధమగు నియాత్మతత్త్వము నెఱింగిన కావషేయులను మహర్షులిట్లనిరి-'మన మెందులకు వేదాధ్యయనమును చేయుచున్నారము? మన మెందులకు యాగాదుల నొనర్చుచున్నారము?'

## స్మృతి

౧ యస్త్వాత్మరతి రేవస్యాదాత్మతృప్తశ్చ మానవః,
ఆత్మన్యేవచ సంతుష్ట స్తస్యకార్యం నవిద్యతే
భగ. 3-౧౭.

నైవ తస్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన,
నచాస్యసర్వభూతేషుకశ్చిదర్థవ్యపాశ్రయః భగ. 3-౧౮.

అర్థ. ఎవ్వఁడు ఆత్మచేతనే సంతోషించువాఁడును, ఆత్మచేతనే తృప్తుఁడయి యుండువాఁడును అగునో వానికి చేయఁదగిన కార్యమేమియు లేదు. ౧౭. అట్టి ఆత్మజ్ఞానికి ఎట్టికర్మనొనర్చినను ఫలములేదు. చేయనియెడల సంభవించెడి హానియున్నూ లేదు. మఱియు వానికి సర్వభూతములయందున్నూ ఎట్టి ప్రయోజనముగాని లేదు.

జ్ఞానికి కర్మాచరణావశ్యకత్వము లేదను విషయమును లింగపురాణము కాలకూటోపాఖ్యానమునందు పరమేశ్వరుఁడిట్లు చెప్పుచున్నాఁడు:—

శ్లో॥ జ్ఞానేనై తేన విప్రస్య త్యక్తసంగస్య దేహినః,
కర్తవ్యం నాస్తి విప్రేంద్రాః అస్తిచేత్తత్త్వవి న్నచ
ఇహలోకే పరేచైవ కర్తవ్యం తస్యనాస్తివై,
జీవన్ముక్తో యతస్తుస్మా బ్రహ్మవిత్పరమార్థతః
జ్ఞానాభ్యాసరతో నిత్యం విరక్తో బ్రహ్మవిత్స్వయమ్,
కర్తవ్యాభావముత్సృజ్య జ్ఞానమేవాధిగచ్ఛతి
వర్ణాశ్రమాభిమానీయః త్యక్త్వా జ్ఞానం ద్విజోత్తమాః,
అన్యత్రరమతేమూఢః సో ఽజ్ఞానీ నాత్రసంశయః
క్రోధోభయంతథాలోభో మోహోభేదోమదస్తమః,
ధర్మాధర్మౌచ తేషాంహి తద్వశాచ్ఛతనుగ్రహః
శరీరేసతివై క్లేశః సోఽవిద్యాం సంత్యజేత్తతః,
అవిద్యాం విద్యయా హిత్వాస్థితస్యైవేహ యోగినః.
క్రోధాద్యానాశమాయాంతి ధర్మాధర్మౌచ నశ్యతః,
తత్క్షయాచ్ఛరీరేణ న పునః సంప్రయుజ్యతే
స ఏవముక్త స్సంసారా ద్దుఃఖత్రయవివర్జితః

అర్థ. ఓబ్రాహ్మణోత్తములారా! విడువఁబడినసంగముగల విద్వాంసుఁడగు బ్రాహ్మణునకు చేయఁదగినది ఏమియులేదు. కర్తవ్యమే యున్నయెడల వాఁడు బ్రహ్మవేత్త కాఁజాలఁడు. బ్రహ్మవేత్తయగువాఁడు వాస్తవముగా జీవన్ముక్తుఁడు కావున వానికి ఇహపరలోకములందు కర్తవ్యమేమియునులేదు. ఎవ్వఁడు సర్వదా జ్ఞానాభ్యాససహితుఁడో వాఁడు స్వయముగా సర్వతత్త్వార్థవేత్తయై కర్మభావమునువిడిచి జ్ఞానమునుపొందుచున్నాఁడు. ఏబ్రాహ్మణుఁడు జ్ఞానమునువదలి వర్ణాశ్రమాభిమానిమాత్రమే అగుచున్నాఁడో అట్టివాఁడు బ్రహ్మస్వరూపమునకు భిన్నమయినదానియందురమించును. వాఁడు మూఢుఁడు. వాఁడు అజ్ఞాని నిస్సంశయముగా క్రోధము, భయము, లోభము, మోహము, భేదదృష్టి, మదము, అజ్ఞానము, ధర్మాధర్మములు-వీనిసంబంధమువలన దేహప్రాప్తి, దేహప్రాప్త్యనంతరము సుఖదుఃఖములు కలుగుచుండును కావున జన్మజరాద్యనర్థములకు కారణమగు అవిద్యను వదలవలయును. జ్ఞానాభ్యాసముచేత అవిద్యను పోఁగొట్టుకొన్నయోగికే క్రోధాదులున్నూ ధర్మాధర్మములున్నూ నశించును. ధర్మాధర్మములు నశించుటచేత మఱల జన్మప్రాప్తి సంభవింపదు. అటుల జన్మరాహిత్యమును పొందినవాఁడే ముక్తుఁడు. వానికి ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికతాపత్రయము నశించును.

జ్ఞానికి కర్మాచరణావశ్యకత లేదని శివధర్మోత్తరమునందు ఇట్లు చెప్పబడియున్నది:—

శ్లో॥ జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః,
నైవాస్తి కించిత్కర్తవ్య మస్తిచేన్న సతత్త్వవిత్
లోకద్వయేఽపకర్తవ్యం కించిదస్య నవిద్యతే,
ఇహైవ స విముక్తస్స్యాత్సంపూర్ణస్సమదర్శనః.

అర్థ. బ్రహ్మజ్ఞానామృతాస్వాదనమువలన సంతృప్తుఁడయి యుండుటచేత కృతకృత్యుఁడయిన విద్వాంసునకు చేయవలసినపని కొంచెమైననులేదు.

అటులగాక వాఁడు చేయఁదగినది అవశేషించియున్న యెడల వాఁడు తత్త్వ వేత్తయే కాఁజాలఁడు. ఇట్టి బ్రహ్మవేత్తకు ఇహపరలోకములు రెంటియందున్నూ కర్తవ్యమేమియు లేదు. అతఁడీలోకమునందే ముక్తుఁడగును. అతఁడు సమదర్శనుఁడును సంపూర్ణుఁడును అగుచున్నాఁడు.

విద్వాంసునకు కర్మాచరణావశ్యకత్వము లేదు కావున 'కుర్వన్నే వేహకర్మాణి' మున్నగు శ్రుతివాక్యములు విద్యావంతుఁడు కాని వానికేయని సిద్ధాంతము మఱియు 'కుర్వన్నే వేహకర్మాణి' మున్నగు శ్రుతివాక్యములు మఱియొక విశేషమునుకూడ బోధించుచున్నవి అది ఏమనఁగా; విద్యావంతుఁడగువాఁడు అతని యభిప్రాయానుసారము వర్ణాశ్రమోచిత కర్మల నొనర్చుచున్నను అతనికి తత్కర్మలేపము అంటఁజాలదని విద్యామాహాత్మ్యము ప్రశంసింపఁబడినది ఎట్లనఁగా; ఆదియందు 'ఈశావాస్యమిదగ్ంసర్వం' (ఈజగమంతయు ఈశ్వరునిచేత వ్యాప్తమయినది) అని ప్రారంభించి 'తేనత్యక్తేన భుంజీథాః' అని ప్రసిద్ధమగు సన్న్యాసముచేత ఆత్మసందర్శనము చేసికొనవలయునని చెప్పఁబడినది. వేదముకూడ బ్రహ్మవేత్తను కర్మను త్యాగముచేయుమనిగాని ఆచరింపుమనిగాని విధించుటకు భయంపడినదై కర్మలనుచేయుమనిగాని చేయవద్దనిగాని ఏమియు చెప్పలేదు. "కుర్వన్నే వేహకర్మాణి జిజీవిషేచ్ఛతగ్ంసమాః" అను శ్రుతియొక్క తాత్పర్యమిట్లని గ్రహించుఁడు:— ఇహలోకమునందాచరించవలసిన కర్మజాతమును విద్వాంసుఁడగువాఁడున్నూ యావజ్జీవమొనర్చవచ్చును అట్టికర్మాచరణమువలన స్వర్గఫలజన్మాదిబంధనములు కలుగునని కర్మాచరణమునుమాని ఊరక కూర్చుండి

యుండ నక్కఱలేదు బ్రహ్మవేత్తయగువాఁడు ఉచితకర్మల నొనర్చుచున్నను వానికి సంసారప్రాప్తిగాని, స్వరూపప్రచ్యుతి గాని పుణ్యాదినిమిత్తకమగు స్వర్గఫలప్రాప్తిగాని కలుగఁజాలదు. లేక కర్మానుష్ఠానానంతరకాలమునందు సంభవించునట్టి జన్మాది ప్రాప్తిగాని కలుగఁజాలదు ఏలయనఁగా; బ్రహ్మవేత్తకు ఫలాసంగబుద్ధి లేదు కావున వానిని యీకర్మాచరణము అంటఁజాలదు. ఈవిషయమునే ప్రతిపాదించు మఱికొన్ని శ్రుతిస్మృతుల నిట నుదహరించుచున్నారము:—

౧. శ్రు. నలిప్యతే కర్మణా పాపకేన

అర్థ. (పుణ్య) పాపాత్మకమగు కర్మచేత బ్రహ్మవేత్త తాఁకఁబడఁడు.

౨ శ్రు. ఏవం విది పాపం కర్మ న శ్లిష్యతే

అర్థ. బ్రహ్మస్వరూపము నెఱింగినవానియందు పాపకర్మము చేరఁజాలదు.

3 శ్రు. నైనం కృతాకృతే తపతః

అర్థ. బ్రహ్మవేత్తను కర్మాకర్మలు బాధింపఁజాలవు.

౪ శ్రు. ఏవంహాస్య సర్వే పాప్మానః ప్రదూయంతే

అర్థ. ఇట్లు బ్రహ్మవేత్తయొక్క పాపములన్నియు పరితాపమును పొందుచున్నవి.

లింగపురాణమునందు:—

శ్లో. జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసా త్కురుతే తథా,
జ్ఞానిన స్సర్వకర్మాణి జీర్యంతే నాత్రసంశయః
క్రీడ న్నపి నలిప్యేత పాపైర్నానావిధై రపి

అర్థ. జ్ఞానాగ్ని సకలకర్మలను భస్మీభూతము నొనర్చుచున్నది. జ్ఞాని యొక్క సకలకర్మలు జీర్ణించి పోవుచున్నవి. ఈవిషయమై సందేహమక్కర లేదు. బ్రహ్మవేత్త నానావిధపాపకర్మలతో క్రీడించుచున్నను ఆపాపకర్మల చేత తాఁకఁబడఁడు.

ఈవిషయము శివధర్మోత్తరమునందున్నూ చెప్పఁబడినది:—

శ్లో॥ తస్మాత్ జ్ఞానాసినా తూర్ణ మశేషం కర్మబంధనమ్,
కామాకామకృతం ఛిత్వా శుద్ధశ్చాత్మని తిష్ఠతి
యథావహ్నిర్మహాదీప్తః శుష్క మార్ద్రంచనిర్దహేత్,
తథా శుభాశుభం కర్మ జ్ఞానాగ్నిర్దహతే క్షణాత్
పద్మపత్రం యథాతోయైః స్వస్థై రపి నలిప్యతే,
శబ్దాదివిషయాంభోభిః తద్వత్ జ్ఞానీ న లిప్యతే.
యద్వన్మంత్రబలోపేతః క్రీడన్ సర్పైర్నదృశ్యతే,
క్రీడన్నపి నలిప్యేత తద్వదింద్రియపన్నగైః
మంత్రౌషధిబలైర్యద్వ జ్జీర్యతే భక్షితం విషమ్,
తద్వత్సర్వాణి పాపాని జీర్యంతే జ్ఞానినఃక్షణాత్.

అర్థ. విద్వాంసుఁడగువాఁడు కామాకామకృతమగు సకల కర్మబంధ మును జ్ఞానాగ్నిచేత ఛేదించినవాఁడయి పరిశుద్ధుఁడయి ఆత్మయందుంటు న్నాఁడు. బాగుగా మండుచున్నఅగ్ని ఎండినట్టి కట్టెలను,పచ్చికట్టెలను ఎట్లు దహించుచున్నదో అదేవిధముగా జ్ఞానాగ్ని శుభాశుభరూపకర్మజాతమును క్షణములో దహించివేయును. సరోవరమునందుండు తామరాకు తానున్న సరో వరమునందున్న ఉదకములచేతనుకూడా ఎట్లు తాఁకఁబడఁదో అట్లే జ్ఞాని యున్నూ శబ్దాదివిషయములను నీటిచేత తాఁకబడఁడు. సర్వవిషయకమంత్ర

శాస్త్రము నెఱింగినవిషవైద్యుఁడు మహాసర్పములతోఁ డనాడుచున్నను తన్మం త్రబలముచేత ఆసర్పములచేత ఎట్లు కరువఁబడఁడో అదేవిధముగా జ్ఞానియగు వాఁడు ఇంద్రియములను పాములతోఁడఆడుచున్నను ఆయింద్రియములకు లోనుఁగాఁజాలఁడు. మంత్రౌషధిబలముచేత భక్షితమగు విష మెట్లు జీర్ణించునో అట్లే జ్ఞానియొనర్చిన పుణ్యపాపకర్మలన్నియు క్షణకాలములో నశించిపోవును.

బ్రహ్మసూత్రములందును ఈయభిప్రాయమే ప్రతిపాదింపఁబడినది:—

సూ॥ పురుషార్థోఽతశ్శబ్దాదితి బాదరాయణః

బ్రహ్మసూత్రం 3-४-౧

అనుసూత్రమునందు జ్ఞానమే పరమపురుషార్థమునకు హేతుభూతమని నిర్ణయింపఁబడినది

సూ. శేషత్వా త్పురుషార్థవాదో యథాఽన్యేష్వితి

బ్రహ్మసూత్రం. 3-४-౨.

మున్నగు ౬ సూత్రములచేత విద్యకర్మశేషమని చెప్పునట్టి పూర్వమీమాంసకుల యభిప్రాయమును అనువదించి—

సూ॥ అధికోపదేశాత్తు బాదరాయణస్యైవం తద్దర్శనాత్.

బ్రహ్మసూత్రం 3-४-౮.

మున్నగు ౧౦ సూత్రములచేత జ్ఞానము కర్మశేషము గాదనియు. స్వతంత్రమనియు, బ్రహ్మచర్యమునుండియే విద్యాగ్రహణము చేయవచ్చుననియు, ఋణత్రయమును తీర్చనివారలున్నూ, తీర్చినవారలున్నూ, అను వివక్ష లేదనియు నిర్ణయింపఁబడినది. క్రియాకారకఫలలక్షణమగు కర్మాధికారము అవి

ద్యావద్విషయమనియు, స్వరూపదర్శనము క్రియాకారకఫల లక్షణమగు ప్రపంచమునకు ఉపమర్దకరమనియు, కావున రెండు న్నూ భిన్నప్రకరణములనియు, భిన్నకార్యములనియు వీనికి పరస్పరవికల్పముగాని సముచ్చయముగాని లేవనియు నిర్ణయిం పఁబడినది

సూ అతఏవచాగ్నీంధనాద్యపేక్షా బ్ర 3-౪-౨౫

అను సూత్రమునందు విద్యయే పరమపురుషార్థమని నిర్ణయిం చుచు అధికరణార్థ ముపసంహరింపఁబడినది అట్లయినయెడల ఆశ్రమోచితకర్మాచరణము అనావశ్యకమే యని సిద్ధించుచుం డఁగా జ్ఞానోత్పత్తియయినపిదప ఆశ్రమోచితకర్మము జ్ఞాన మునకు అనావశ్యకమనియు, జ్ఞానోత్పత్తికి మాత్రము ఆవ శ్యకమనియు—

సూ సర్వాపేక్షాచయజ్ఞాదిశ్రుతేరశ్వవత్ బ్ర 3-౪-౨౬

అను సూత్రముచేత సిద్ధాంతీకరింపఁబడినది 'తమేతం వేదా నువచనేన బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేనదానేన తపసాఽనాశ కేన' అనుశ్రుతియే పైనిర్ణయమున కాధారము ఇదేవిధ ముగా—

సూ నావిశేషాత్. బ్ర 3-౪-౧3.

,, స్తుతయేఽనుమతిర్వా బ్ర 3-౪-౧౪.

అను సూత్రద్వయము నుదహరించుచు ఆసూత్రములందు 'కుర్వన్నేవేహకర్మాణి' అను శ్రుతిని విద్వద్విషయముగ విద్యా స్తుతిపరముగ నంగీకరించిరి. అనఁగా విద్వాంసుఁడగువాఁడు యావజ్జీవము కర్మను ఆచరించుచున్నను, శ్రు. నకర్మలిప్యతే

నరే (ఈశా ౨) అను మంత్ర ప్రమాణానుసారము విద్వాం సునకు కర్మ లేపము లేదని విద్యాస్తుతిపరముగ పై విషయమును నిర్ణయించిరి

పైనఁజెప్పినవిధముగ శ్రుతిస్మృతిపురాణ బ్రహ్మసూత్రాది సకల ప్రమాణగ్రంధసముదాయము జ్ఞానమే మోక్షసాధనమని అంగీకరించు చుండుటచేత ఉపనిషదారంభము అత్యావశ్యకమే యగుచున్నది

## పూ ర్వ ప క్ష ము.

జీవునకు బంధమునకు మిథ్యాభూతము ఈబంధము జ్ఞానముతో నివర్తింపఁబడు జ్ఞానమువలన అమృతత్వము రావచ్చును ఇది ఇట్లులేదు అనఁగా బంధమునకు మిథ్యాత్వము లేకపోవుట ఏలయనఁగా బంధముగనంబడుచుండుటవల్లనున్నూ, బంధమునకు బాధ లేకపోవుటవల్లనున్నూ, ఆత్మకు యుష్మదాది స్వరూపములకు భేదము అనుటయందు సాదృశ్యాదులు లేకపోవుటవల్లనున్నూ, అధ్యాస అసంభవము అగుటవల్లనున్నూ మిథ్యాత్వములేదు

## స మా ధా న ము.

ప్రాప్తియనునది ఉన్నంతమాత్రముచేత బంధమునకు సత్యత్వము చెప్పుటకు వీలులేదు ప్రాప్తి యనునది సత్యత్వమిథ్యాత్వములు రెంటికిన్నీ సమానమే, బాధలేనంతమాత్రముచేత సత్యమని చెప్పుట యుక్తముకాదు విధిముఖమువల్లనున్నూ కారణముఖమువల్లనున్నూ దానికి బాధకలుగు

చున్నది కావున సత్యత్వము లేదు శ్రుతి ప్రపంచము మిథ్య యనియు మాయయే కారణముగాఁగలదనియు ఇట్లు చెప్పు చున్నది:—

## శ్రుతులు.

౧ న తు తద్ద్వితీయ మస్తి

అర్థ. ఆబ్రహ్మమునందు ద్వితీయము లేదు.

౨ ఏకత్వమ్.

అర్థ. ఒక్కటియే.

3. నాస్తి ద్వైతం

అర్థ. ద్వైతములేదు.

౪ కుతోఽవిదితే వేద్యం నాస్తి

అర్థ. బ్రహ్మస్వరూపము తెలియఁబడినతరువాత తెలిసికొనవలసినది లేదు.

౫ ఏకమేవాద్వితీయం.

అర్థ. ఒక్కటియే అద్వితీయము.

౬ వాచారంభణం వికారో నామధేయమ్

అర్థ. వికారము నామధేయము వాగ్వ్యాపారము మాత్రమే.

౭ ఏకమేవసత్.

అర్థ. ఒక్కటియే సద్రూపము.

౮ నేహ నానాఽస్తి కించన

అర్థ. కొంచెమైనను నానాత్వ మీయాత్మయందు లేదు.

౯ ఏకధైవానుద్రష్టవ్యమ్

అర్థ. ఒక్కవిధముగనే చూడవలయును.

౧౦ మాయాం తు ప్రకృతిం విద్యాత్.

అర్థ. మాయ యనఁగా ప్రకృతియని యెఱుఁగవలయును.

౧౧ మాయీ సృజతే విశ్వమేతత్

అర్థ. పరమేశ్వరుఁడు మాయతోఁగూడి ప్రపంచమును సృజించుచున్నాఁడు.

౧౨ ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే.

అర్థ. పరమేశ్వరుఁడు మాయచేత అనేకరూపములుగలవానివలె గనంబడుచున్నాఁడు.

## స్మృతులు.

శ్లో॥ అజోఽపి సన్నవ్యయాత్మా భూతానామీశ్వరోఽపిసన్,
ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా
భగ ౪-౬

అర్థ. నేను పుట్టుకలేనివాఁడను, అవికారుఁడను, అవ్యయుఁడను అయినను భూతములకు నియామకుఁడనయినను నా ప్రకృతిని అవలంబించినవాఁడనయి నామాయవలననే పుట్టుచున్నాఁడను.

శ్లో॥ అవిభక్తంచ భూతేషు విభక్తమివచస్థితమ్ భగ. ౧౩-౧౭.

అర్థ. ఆ బ్రహ్మము అపరిచ్ఛిన్నమయ్యును ప్రాణికోట్లయందు పరిచ్ఛిన్నమయిన దానివలె నున్నది.

బ్రహ్మపురాణమునందు:—

శ్లో॥ ధర్మాధర్మౌ జన్మమృత్యూ సుఖదుఃఖేషు కల్పనా,

వర్ణాశ్రమా_స్తథా వాసః స్వర్గోనరక ఏవచ
పురుషస్య నసంత్యేతే పరమార్థస్యకుత్రచిత్,
దృశ్యతే చ జగద్రూప మసత్యం సత్యవన్మృషా
తోయవ న్మృగతృష్ణాతు యథా మరుమరీచికా.
రౌప్యవచ్ఛుక్తికసంభూతం కీసకం శుక్తి గేవచ
సర్పవద్రజ్జుఖండశ్చ నిశాయాం వేశ్మమధ్యగః,
ఏకఏవేందు ర్ద్వావ్యోమ్ని తిమిరాహతచక్షుషః.
ఆకాశస్య ఘనీభావో నీలత్వం స్నిగ్ధతాతథా,
ఏకశ్చసూర్యో బహుధా జలాధారేషు దృశ్యతే
ఆభాతిపరమాత్మాఽపి సర్వోపాధిషుసంస్థితః,
ద్వైతభ్రాంతి రవిద్యాఖ్యా వికల్పోనచతత్తథా
పరస్యబంధాగారస్య త్తేషామాత్మాభిమానినాం,
ఆత్మభావనయా భ్రాంత్యా దేహం భావయత స్సదా
అప్రజ్ఞై రాదిమధ్యాంతై ర్భూమభూతై స్త్రిభి స్సదా,
జాగ్రత్స్వప్నసుషుప్తైస్తు ఛాదితం విశ్వతైజసం
స్వమాయయాస్వమాత్మానం మోహయేద్ద్వైతరూపయా,
గుహాగతం స్వమాత్మానం లభతే చ స్వయం హరిమ్.
వ్యోమ్నివజ్రానలజ్వాలా కలాపో వివిధాకృతిః,
ఆభాతి విష్ణో స్సృష్టిశ్చ స్వభావోద్వైతవిస్తరః
శాంతే మనసి శాంతశ్చ ఘోరే మూఢేచ తాదృశః,
ఈశ్వరో దృశ్యతే నిత్యం సర్వత్ర నతు తత్త్వతః
లోహమృత్పిండహేమ్నాం చ వికారోనచ విద్యతే,

చరాచరాణాం భూతానాం ద్వైతతా నచ సత్యతః
సర్వగేతు నిరాధారే చైతన్యాత్మని సంస్థితా,
అవిద్యాద్విగుణాం సృష్టిం కరోత్యాత్మావలంబనాత్.
సర్పస్య రజ్జుతా నాస్తి నాస్తి రజ్జౌ భుజంగతా,
ఉత్పత్తినాశయోర్నాస్తి కారణం జగతోఽపిచ
లోకానాం వ్యవహారార్థ మవిద్యేయం వినిర్మితా,
ఏషా విమోహినీత్యుక్తా ద్వైతాద్వైతస్వరూపిణీ
అద్వైతం భావయేద్బుద్ధ్యా సకళం నిష్కళం సదా,
ఆత్మజ్ఞశ్శోకసంకీర్ణో నబిభేతి కుతశ్చన
మృత్యోస్సకాశాన్మరణా దథవాఽన్యకృతాద్భయాత్,
నజాయతే నమ్రియతే నచబధ్యోనచ ఘాతుకః
నబద్ధోబంధకారివా నముక్తో నచమోచకః.
పురుషః పరమాత్మాతు యదతోఽన్యదసచ్చతత్
ఏవం బుద్ధ్వాజగద్రూపం విద్ధో హ్మాయామయం మృషా,
భోగానుగాద్భవేన్ముక్త స్త్యక్త్వా సర్వవికల్పనామ్
త్యక్తసర్వవికల్పశ్చ స్వాత్మస్థం నిశ్చలం మనః,
కృత్వా శాంతో భవేద్యోగీ దగ్ధేంధన ఇవానలః
ఏషాచతుర్వింశతిభేదభిన్నా
మాయా పరాప్రకృతి స్తత్సముత్థా,
కామక్రోధా లోభమోహౌ భయంచ
విషాదశోకౌ చ వికల్పజాలమ్
ధర్మాధర్మౌ సుఖదుఃఖేచసృష్టి
ర్వినాశపాకౌ నరకేగతిశ్చ,

వాస స్స్వర్గో జాతయ శ్చాశ్రమాశ్చ
రాగద్వేషా వివిధా వ్యాధయశ్చ
కౌమారతారుణ్యజరావియోగ
సంయోగభోగానశనవ్రతాని;
ఇతీద మీదృగ్హృదయం నిధాయ
తూష్ణీమాసీన స్సుమతిశ్చ విద్వాన్

అర్థ. పరమార్థస్వరూపుఁడగు పురుషునకు ధర్మాధర్మములుగాని జనన మరణములుగాని, సుఖదుఃఖకల్పనముగాని, వర్ణాశ్రమాచారధర్మములుగాని, స్వర్గనరకలోక నివాసముగాని ఇవి ఏమియులేదు. మట్టమధ్యాహ్నకాలమునందు నిర్జలప్రదేశమగు మరుభూమి యందు యెండమావులు పామరులకు మృగాదులకు జలభ్రాంతిని కలుగఁజేసినట్టుల అసత్యమగు జగత్స్వరూపము సత్యమైనదానివలెనే చూడఁబడు చున్నది. ఏముకయును ముత్తెపుచిప్పయును వెండిగా గనంబడునట్లున్ను, రాత్రియందు గృహమధ్యభాగమునందున్న త్రాఁడు యొక్క తునక సర్పముగాఁ గనంబడినట్లున్ను, నేత్రరోగముచేత మసకలు కమ్మిన కన్నులుగలవానికి ఆకాశమునందొక్క చంద్రుఁడేయున్నను అనేకులగు చంద్రులున్నట్లు గనంబడుచున్నట్లున్ను, ఆకాశము మిట్టపల్లములు కలిగి దట్టముగాను పలచగాను ఉన్నట్లు గనంబడుచున్నట్లున్ను, ఒకేసూర్యుఁడు అనేకములగు జలాధారములందు వేఱువేఱుసూర్యులుగా తెలియఁబడుచున్నట్లున్ను, పరమాత్మయు ఒక్కఁడయినను అనేకోపాధులయందుండుటచేత అనేకవిధుఁడుగఁ జూడఁబడుచున్నాఁడు.

విష్ణుధర్మముయొక్క షడధ్యాయియందు—

శ్లో॥ అనాదిసంబంధవత్యా క్షేత్రజ్ఞోఽయ మవిద్యయా,
యుక్తః పశ్యతి భేదేన బ్రహ్మతత్త్వాత్మని స్థితమ్

పశ్యత్యాత్మానమన్యచ్చ యావద్వై పరమాత్మనః,
తావత్సంభ్రామ్యతే జంతు ర్మోహితో నిజకర్మణా.
సంక్షీణాశేషకర్మాతు పరంబ్రహ్మ ప్రపశ్యతి,
అభేదేనాత్మనశ్శుద్ధం శుద్ధత్వా దక్షయో భవేత్
అవిద్యాచ క్రియాస్సర్వా విద్యా జ్ఞానం ప్రచక్షతే,
కర్మణా జాయతే జంతు ర్విద్యయాచ విముచ్యతే
అద్వైతం పరమార్థో హి ద్వైతం తద్భిన్న ఉచ్యతే,
పశుతిర్యఙ్మనుష్యాఖ్యం ప్రథైవ నృపనారకమ్
చతుర్విధోఽప్యభేదోఽయం మిథ్యాజ్ఞాననిబంధనః,
అహమన్యోఽపరశ్చాయ మమీచాత్ర తథాఽపరే
అజ్ఞానమేతద్ద్వైతాఖ్య మద్వైతం శ్రూయతాం పరమ్,
మమేత్యహమితి ప్రజ్ఞా విముక్త మవికల్పవత్
అవికార్య మనాఖ్యేయ మద్వైత మనుభూయతే,
మనోవృత్తిమయం ద్వైత మద్వైతం పరమార్థతః
మనసో వృత్తయ స్తస్మా ద్ధర్మాధర్మనిమిత్తజాః,
నిరోద్ధవ్యా స్తన్నిరోధే ద్వైతం నైవోపపద్యతే
మనోదృష్టమిదం సర్వం యత్కించి త్సచరాచరమ్,
మనసో హ్యమనీభావే ఽద్వైతభావం తదాప్నుయాత్
కర్మణాం భావనా యేయం సా బ్రహ్మపరిపంథినీ,
కర్మభావనయా తుల్యం విజ్ఞాన ముపజాయతే
తాదృగ్భవతి విజ్ఞప్తి ర్యాదృశీ ఖలు భావనా,
క్షయే తస్యాః పరం బ్రహ్మ స్వయమేవ ప్రకాశతే.
పరాత్మనో మనుష్యేంద్ర విభాగోఽజ్ఞానకల్పితః,

క్షయేత సాత్త్వపరయో రవిభాగోఽత ఏవహి
ఆత్మా క్షేత్రజ్ఞసంజ్ఞోఽపి సంయుక్తః ప్రాకృతైర్గుణైః,
తైరేవవిగతశ్శుద్ధః పరమాత్మా నిగద్యతే

అర్థ. ఈక్షేత్రజ్ఞుఁడు అనాదిసంబంధముగల మాయతో గూడినవాఁడయి తత్త్వాత్మయగు బ్రహ్మమునందున్నదానిని భేదముతోఁ గాంచుచున్నాఁడు. ప్రాణిజాతము తనను పరమాత్మకంటె వేఱయినదానినిగా ఎంతవఱకు దలంచుచుండునో అంతవఱకు అవిద్యాశిష్టమగు కర్మచేత విమోహితమయి సంసారచక్రమునందే పరిభ్రమించుచుండును. జన్మాంతరార్జితసుకృత దుష్కృతకర్మజాతమంతయు ఎప్పుడు నశించునో అప్పుడు అభేదముగ పరిశుద్ధముగ ఆత్మతత్త్వమును గాంచును. పరిశుద్ధుఁడగుటవలన అక్షయుఁడగును. సకలకర్మలు అవిద్యాస్వరూపములు, జ్ఞానము విద్యయని చెప్పఁబడును. జీవుఁడు కర్మచేత జన్మించును. విద్యచేత—అనఁగా జ్ఞానము చేత విముక్తుఁడు—మోక్షమును పొందెడివాఁడు అగును అద్వైతమే-అనఁగా జీవబ్రహ్మైక్యభావమే పరమార్థము. ద్వైతము-పశుపక్ష్యాదిమనుష్యాది విభేదములుగలద్వైతము నారకము-అనఁగా నరకసంబంధమయినది. నేను, అన్యుఁడు, ఇతరుఁడు, వీఁడు ఇటుల చతుర్విధమగు విభేదము మిథ్యాజ్ఞాన విజృంభితము. ద్వైతమనునదియంతయు అజ్ఞానము. నేను నాది యనునట్టి ప్రజ్ఞారహితమును, సంకల్పరహితమును వికారశూన్యమయినదియును చెప్పనలవికానిదియును అద్వైతమని చెప్పఁబడుచున్నది. ఈ అద్వైతము స్వానుభవమాత్రగమ్యమగును. మనోవృత్తి మయమయినది ద్వైతము, మనోవికల్పరహితము అద్వైతము. మనస్సుయొక్క వృత్తులు ధర్మాధర్మములే నిమిత్తముగాఁగలవియయి పుట్టుచున్నవి. అట్టిమనోవృత్తులను నిరోధించినయెడల ద్వైతము పుట్టఁజాలదు. స్థావరజంగమాత్మకమగు నీప్రపంచమంతయు మనోదృష్టమగుచున్నది. మనస్సుయొక్క సంకల్పవికల్పములను నిరోధించినయెడల

అద్వైతభావమును పొందును. కర్మభావన బ్రహ్మస్వరూపమునకు శత్రు
భూతము. సర్వదా కర్మను భావన చేయుటచేత దానికి సరియయినవిజ్ఞానమే
కలుగును. ఎట్టి భావన యుండునో అట్టివిజ్ఞానమే కలుగుట సహజమయి
యున్నది. కర్మభావనముయొక్క విజ్ఞప్తి నశించినయెడల బ్రహ్మము స్వయ
ముగా నే ప్రకాశించును. జీవాత్మ పరమాత్మలు వేఱువేఱుట అజ్ఞానకల్పితము.
అజ్ఞానము నశించినయెడల జీవాత్మపరమాత్మలకు భేదమే లేదు. ఆత్మ ప్రకృతి
సంబంధములయిన గుణములతోఁ గూడుకొనియుండినవాఁడయి క్షేత్రజ్ఞుఁడు-
జీవుఁడు అనంబడుచున్నాఁడు. ప్రాకృతిక గుణవిరహితుఁడయినయెడల పరిశు
ద్ధుఁడగు పరమాత్మ యని చెప్పఁబడును.

విష్ణుపురాణమునందుఁ గూడ యిట్లే చెప్పఁబడియున్నది:—

శ్లో॥ పరమార్థస్త్వమేకో నాన్యోఽస్తి జగతః పరః,
తవైష మహిమా యేన వ్యాప్తమేతచ్చరాచరమ్
యదేతద్దృశ్యతే మూర్త మేతత్ జ్ఞానాత్మనస్తవ,
భ్రాంతిజ్ఞానేన పశ్యంతి జగద్రూప మయోగినః
జ్ఞానస్వరూపమఖిలం జగదేతదబుద్ధయః,
అర్థస్వరూపం పశ్యంతో భ్రామ్యంతే మోహసంప్లవే
యేతు జ్ఞానవిదః శుద్ధచేతసస్తేఽఖిలం జగత్,
జ్ఞానాత్మకం ప్రపశ్యంతి త్వద్రూపం పారమేశ్వరమ్
అహం హరిః సర్వమిదం జనార్దనో
నాన్యత్తతః కారణకార్యజాతమ్,
ఈదృఙ్మనో యస్య న తస్య భూయో
భవోద్భవా ద్వంద్వగదా భవంతి
జ్ఞానస్వరూప మత్యంతం నిర్మలం పరమార్థతః,
తదేవార్థస్వరూపేణ భ్రాంతిదర్శనతః స్థితమ్ విష్ణు ౨-౧౨.

జ్ఞానస్వరూపో భగవాన్ యతో౽సా
 వశేషమూర్తిర్న తువస్తుభూతః,
తతో హి శైలాబ్ధి ధరాదిభేదాన్
 జానీహి విజ్ఞానవిజృంభితాని  విష్ణు ౨-౧౨-౩౯

వస్త్వస్తి కిం కుత్రచిదాదిమధ్య
 పర్యంతహీనం సతతైకరూపమ్,
యచ్చాన్యథాత్వం ద్విజ యాతిభూయో
 న తత్తథా తత్ర కుతో హి తత్త్వమ్ విష్ణు ౨-౧౨-౪౧.

మహీ ఘటత్వం ఘటతః కపాలికా
 కపాలికా చూర్ణరజస్తతో౽ణుః,
జనైః స్వకర్మస్తిమితాత్మనిశ్చయై
 రాలక్ష్యతే బ్రూహి కిమత్ర వస్తు. విష్ణు ౨-౧౨-౪౨.

తస్మాన్న విజ్ఞానమృతే౽స్తి కించి
 త్క్వచిత్కదాచిద్ద్విజ వస్తుజాతమ్,
విజ్ఞానమేకం నిజకర్మభేద
 విభిన్నచిత్తైర్బహుధా౽భ్యుపేతమ్ విష్ణు ౨-౧౨-౪౩.

జ్ఞానం విశుద్ధం విమలం విశోక
 మశేషలోభాది నిరస్తసంగమ్,
ఏకం సదైకం పరమః పరేశః
 సవాసుదేవో నయతో౽న్యదస్తి విష్ణు ౨-౧౨-౪౪.

సద్భావ ఏవం భవతో మయోక్తో
 జ్ఞానంతథా సత్యమసత్యమన్యత్,
ఏతత్తు యత్సంవ్యవహారభూతం
 తత్రాపిచోక్తం భువనాశ్రితం తే. విష్ణు ౨-౧౨-౪౫.

అవిద్యాసంచితం కర్మ తచ్చాశేషేషు జంతుషు
విష్ణు. ౨-౨-౭౦.

ఆత్మా శుద్ధోఽక్షరశ్శాంతః నిర్గుణః ప్రకృతేః పరః,
ప్రవృద్ధ్యపచయౌనాస్త్యేకస్యాఖిలజంతుషు విష్ణు ౨-౨-౭౧

యత్తు కాలాంతరేణాపి నాన్యసంజ్ఞాముపైతివై,
పరిణామాదిసంభూతాం తద్వస్తు నృప తచ్చ కిమ్
విష్ణు ౨-౨-౧౦౦

యద్యన్యోఽస్తి పరః కోఽపి మత్తః పార్థివసత్తమ,
తదేషోఽహ మయంచాన్య ఇతి వక్తుమేవమపీష్యతే

యదా సమస్తదేహేషు పుమానేకో వ్యవస్థితః,
తదాహి కో భవాన్సోఽహ మిత్యేతద్విప్రలంభనమ్
విష్ణు ౨-౨-౯౧.

త్వం రాజా శిబికా చేయం వయంవాహాః పురస్సరాః,
అయం చ భవతో లోకో న సదేతత్త్వయోచ్యతే
విష్ణు ౨-౨-౯౨

వస్తు రాజేతి యల్లోకే యచ్చ రాజభటాత్మకం,
తథాఽన్యచ్చనృపత్వంచ తత్తత్సంకల్పనామయమ్
విష్ణు ౨-౨-౯౯

అనాశీపరమార్థశ్చ ప్రాజ్ఞై రభ్యుపగమ్యతే
పరమార్థస్తు భూపాల సంక్షేపా చ్ఛ్రూయతాం మమ
విష్ణు ౨-౨౪-౨౮.

ఏకో వ్యాపీసమశ్శుద్ధో నిర్గుణః ప్రకృతేఃపరః,
జన్మబుద్ధ్యాదిరహిత ఆత్మా సర్వగతోఽవ్యయః
విష్ణు ౨-౧౪-౨౯.

పరో జ్ఞానమయ స్సద్భిః నామజాత్యాదిభిఃప్రభుః,
నయోగవా న్నయుక్తోఽభూ న్నైవపార్థివయోక్ష్యతి
విష్ణు ౨-౧౪-౩౦.

తస్యాఽఽత్మపరదేహేషు సంయోగో హ్యేకఏవయత్,
విజ్ఞానం పరమార్థోఽసౌ ద్వైతినోఽతథ్యదర్శినః.
విష్ణు ౨-౧౪-౩౧.

ఏవ మేక మిదం విద్వా న్నభేది సకలం జగత్,
వాసుదేవాభిధేయస్య స్వరూపం పరమాత్మనః
విష్ణు ౨-౧౫-౩౫

నిదాఘోఽప్యుపదేశేన తేనాద్వైతపరోఽభవత్
విష్ణు. ౨-౧౬-౧౯

సర్వభూతాన్యభేదేన సదదర్శ తదాఽఽత్మనః,
తథాబ్రహ్మతతోముక్తి మవాప పరమాం ద్విజః
సిత నీలాదిభేదేన యథైకం దృశ్యతే నభః,
భ్రాంతి దృష్టిభి రాత్మాఽపి తథైకస్సన్పృథక్పృథక్
విష్ణు ౨-౧౬-౨౨

ఏక స్సమస్తం యదిహాస్తి కించి
త్తదచ్యుతే నాస్తి పరంతతోఽన్యత్,
సోఽహం సచత్వం సచసర్వమేత
దాత్మస్వరూపం త్యజభేదమోహమ్ విష్ణు ౨-౧౬-౨౩.

ఇతీరిత స్తేన సరాజవర్య స్తత్యాజభేదం పరమార్థదృష్టిః,
సచాపిజాతి స్మరణార్థబోధ స్తత్రైవ జన్మన్యపవర్గమాహ
విష్ణు ౨-౧౬-౨౪.

అర్థ. నీమహిమయే స్థావరజంగమాత్మకమగు ప్రపంచమునంతయు వ్యాపించియుండుటచేత నీవే పరమాత్మవు. జ్ఞానరూపుఁడవగు నీకంటె శ్రేష్ఠుఁడగు వాఁడెవ్వఁడున్నూ లేదు. జ్ఞానాత్మకుఁడవగు నీయొక్క స్వరూపమును మూఢాత్మకులయినవారలు చూచి భ్రాంతిజ్ఞానముచేత జగద్రూపమునుగాఁ జూచుచున్నారు. అజ్ఞానులు జ్ఞానస్వరూపమగు నీప్రపంచమును భ్రాంతిచేత భిన్నపదార్థ సమన్విమగుదానివలె గాంచుచున్నవారలయి అజ్ఞానసంకటమునఁబడి యల్లాడుచున్నారు. నిర్మలహృదయులగు జ్ఞానులు స్థావరజంగమాత్మకమగు నీప్రపంచమును జ్ఞానాత్మకముగాఁ గాంచుచున్నవారలయి దీనిని జ్ఞానస్వరూపుఁడగు పరమాత్మనుగానె గాంచుచున్నారు. నేను విష్ణువును, ఈ కనంబడునట్టి జగత్తంతయు విష్ణుస్వరూపము. కనుక ఈ కార్యకారణజాతమంతయు విష్ణుస్వరూపముకంటె అన్యమయినదికాదు. ఇట్టి చిత్తమెవ్వనికి కలుగునో వాఁడు జననమరణములను మఱల పొందఁడు, సుఖదుఃఖరూపద్వంద్వములుకూడ వానికి కలుగఁజాలవు. పరమార్థముగా జ్ఞానస్వరూపము నిర్మలమయినది. అట్టి జ్ఞానస్వరూపమయినదానినె మూఢులు భ్రాంతిదృష్టితో పదార్థస్వరూపముగ—జగత్తుగఁ జూచుచున్నారు. అశేషభూతుఁడయిన పరమేశ్వరుఁడు జ్ఞానస్వరూపుఁడేగాని వస్తుభూతుఁడు గానేరఁడు. అందువలన ద్వీపములు సముద్రములు భూమిమొదలగు భేదములను విజ్ఞానవిజృంభితములనుగా నెఱుంగవలయును. ఈ ప్రపంచమునందు ఆది మధ్యాంతవిహీనమును, సర్వదా ఏకరూపమును అగు వస్తువేలేదు. ఏపదార్థము అన్యథాత్వమును—అనఁగా మారురూపమును పొందుచున్నదో అట్టిది తత్త్వమని యెప్పటికు పలనుపడదు. భూమి ఘటత్వమునుపొందును. ఘటము కపాలత్వమును పొందును. కపాలములు పగిలి చూర్ణమయి రజమగును. ఆరజము అణువులగును. ఆత్మనిశ్చయజ్ఞానము లేనివారలచేత తమకర్మ యీవిధముగాఁ జూడఁబడును. ఇందు వస్తుభూతమేమియున్నది? కావున విజ్ఞానముకంటె

వేఱయినది వస్తుభూతమయినది లేనేలేదు. ఒకేవిజ్ఞానమును తమతమ కర్మ ఫల భేదానుసారముగ భిన్నభిన్నమయిన చిత్తవృత్తులుగలవారిచేత అనేకవిధములుగాఁ జూడఁబడుచున్నది. జ్ఞానముమాత్రము విశుద్ధము,నిర్మలము, శోకరహితము, సకలవిధ లోభాది వివర్జితము, అసంగము, అద్వైతస్వరూపము, ఈజ్ఞానమే పరమేశ్వరుఁడయిన వాసుదేవుఁడు. అతనికంటె భిన్నమయినది లేదు. నేను నీకు సద్భావము నిట్లు తెలుపుచున్నాఁడను. జ్ఞానమొక్కటియే సత్యము. తద్భిన్నమయినది అంతయు అసత్యమే. ఇదియే సమస్తలోకవ్యవహారములకు ఆశ్రయభూతమయి యున్నది. సర్వప్రాణులయందు కర్మ అవిద్యచేత సంచితమయియున్నది. ఆత్మ శుద్ధుఁడు, అక్షరుఁడు, శాంతుఁడు, గుణరహితుఁడు,ప్రకృతికంటె విభిన్నుఁడు. ఏయ్యది సకలప్రాణులం దనుస్యూతమై కాలాంతరమునందైనను వృద్ధిక్షయములను పొందదో, సంజ్ఞాంతరమును పొందదో అదియేవస్తువు. ఆవస్తువు ఏయ్యది? ఓరాజోత్తమా! నాకంటెవేఱుగా మఱొకపురుషుఁ డున్నయెడల నేను వీఁడు వాఁడు అని భేదకల్పనమును చేయుట యుక్తముగా నుండును. సకలశరీరములందు పురుషుఁడొక్కఁడే యున్నప్పుడు నీవు నేను వాఁడు అనుట అసంగతము. నీవు రాజవు, మేము పల్లకిని మోయుచు ముందునడుచునట్టి బోయీలము, ఈప్రదేశము నీ రాజ్యము అనుమాట సర్వకాలము నీచేత చెప్పఁబడునది కాఁజాలదు. ఈ లోకమునందు రాజు, రాజభటులు, రాజత్వము అనునదిఅంతయు కల్పనామయమేగాని పారమార్థికముకాదు. ఇది నశించుటయే స్వభావముగాఁ గలది. నాశరహితమగుదానిని చెప్పుచున్నాఁడను ఆలకింపుము. ఏకస్వరూపము, సర్వవ్యాపి, సమస్వరూపము, పరిశుద్ధము, నిర్గుణము, ప్రకృతికంటె పరము, జన్మవృద్ధి క్షయరహితము, నాశరహితము ఏయ్యదియో అదియే ఆత్మ. ఆయాత్మయే శ్రేష్ఠమయినది. జ్ఞానమయము, నామరూప జాతివిరహితము, ప్రభువు,ఆయాత్మ ఒకదానితో ఇవివఱకు చేరియున్నది కాదు. ఒక్క-

దానితో ఇప్పుడు చేరునది కాదు. ఒక్కదానితో చేరఁబోవునదియుఁ గాదు. ఆవిజ్ఞానము ఆత్మపరదేహములందుకూడ ఒక్కవిధముగానే ఉండును. ద్వైత దృష్టిగలవాఁడీ ఏకత్వమును గాంచి ఇదియే పరమార్థమని ఎఱుంగఁగలఁడు. వాసుదేవుఁడను పేరుగల పరమాత్మయొక్క స్వరూపము నీవిధముగా నిదాఘుఁడుపదేశింపఁబడినవాఁడయి జగత్తంతయు ఏకవిధమయినది. అద్వైతము అని యెఱింగి బ్రహ్మస్వరూపుఁడయ్యెను. అనఁగా ముక్తినందెను. ఒక్కటియుఁ నిర్వికారమును అగు ఆకాశము సితనీలాది విచిత్రభేదములు గలదానివలె ఎట్లు చూడఁబడుచున్నదో అదేవిధముగా ఒక్కఁడే అయిన ఆత్మ యున్నూ భ్రాంతిదృష్టిగల వారిచేత వేఱువేఱుగాఁ జూడఁబడుచున్నాఁడు. ఈ గనంబడునది అంతయు అద్వితీయుఁడగు పరమాత్మయేగాని తద్భిన్నమయినది లేనేలేదు. అంతకంటె శ్రేష్ఠమయినదియు లేదు. ఆ భగవానుఁడే నీవు, అతఁడే నేను, అతఁడే యీగనంబడుచున్న సమస్తము, భేదబుద్ధిని వదలుము. ఇటుల ఆరాజు ఉపదేశింపఁబడినవాఁడయి పరమార్థదృష్టిగలవాఁడయి భేదభావమును ఎదలెను. అతఁడున్నూ జాతిస్మరణముగలవాఁడయి ఆజన్మయందే ముక్తినిపొందెను.

లింగపురాణమునందున్నూ ఇట్లు చెప్పఁబడియున్నది:—

శ్లో॥ తస్మాదజ్ఞానమూలోహి సంసారస్సర్వదేహినామ్,
పరతంత్రే స్వతంత్రేచ భిదాభావావిచారతః.
ఏకత్వమపినాస్త్యేవద్వైతం కుత్ర కుతోఽస్త్యహో,
ఏకం నాస్త్యథమర్త్యంచ కుతోఽమృతసముద్భవః.
నాంతః ప్రజ్ఞోనబహిష్ప్రజ్ఞో నచోభయత ఏవచ,
నప్రజ్ఞానఘనస్త్వేవం న ప్రజ్ఞోఽప్రజ్ఞ ఏవసః
విదితేనాస్తివేద్యంచ నిర్వాణం పరమార్థతః,
అజ్ఞానతిమిరాత్సర్వం నాత్ర కార్యావిచారణా.

జ్ఞానంచ బంధనంచైవ మోక్షో వాఽప్యాత్మనో ద్విజాః,
నహ్యేషా ప్రకృతి ర్జీవో వికృతిశ్చ వికారతః
వికారోనైవమాయైషా సదసద్వ్యక్తివర్జితా,

అర్థ. స్వతంత్రమా? పరతంత్రమా? యని విచారించుటవలన రాఁబోవు లాభమేమియు లేదు గావున జీవులందఱకున్నూ సంసారము అజ్ఞానమూలకమే యని నిశ్చయించుట యుక్తము. ఏకత్వము లేనియెడల ద్వైతమెచ్చటనుండి సంభవించును? ఏకత్వములేనియెడల మరణధర్మముగల సంసారమెట్లు? అమృతత్వ మెక్కడిది? ఆత్మస్వరూపము అంతఃప్రజ్ఞ కలదికాదు బహిఃప్రజ్ఞ కలదికాదు. ఉభయప్రజ్ఞ గలదికాదు. ప్రజ్ఞాన ఘనమయినది కాదు. ప్రజ్ఞ గలదికాదు. అది తెలియఁబడినయెడల తెలిసికొనవలసినది మఱొకటి యుండదు. మోక్షమే పరమార్థస్వరూపము. ఇదంతయు అజ్ఞానాంధకారమువలన కలుగుచున్నది. ఓ బ్రాహ్మణులారా! వాస్తవముగాఁ జూచిన ఆత్మకు జ్ఞానమనిగాని బంధనమనిగాని మోక్షమనిగాని ఏమియు లేదు. జీవుఁడు ప్రకృతికాఁజాలఁడు. వికారమువలన కలిగిన వికారస్వరూపుఁడున్నూ కాదు. సదసద్రూపవిరహితమగు న మాయామాత్రమేగాని వికారము కానేరఁదు.

భగవానులగు పరాశరులవారు:—

శ్లో॥ అస్మాద్ధి జాయతే విశ్వ మత్రైవ ప్రవిలీయతే,
సమాయీమాయయాబద్ధః కరోతివివిధా స్తనూః
నచాత్మైవం సంసరతి నచ సంసారయేత్పరమ్,
నకర్తా నైవభోక్తాచ న చ ప్రకృతిపూరుషౌ
నమాయానైవచప్రాణ శ్చైతన్యం పరమార్థతః,
తస్మాదజ్ఞానమూలోహి సంసారస్సర్వదేహినామ్.
నిత్యస్సర్వగతోహ్యాత్మా కూటస్థో దోషవర్జితః,

ఏక స్స భిద్యతే శక్త్యా మాయయా న స్వభావతః.
తస్మా దద్వైతమేవాహు ర్మునయః పరమార్థతః,
జ్ఞానస్వరూపమేవాహు ర్జగదేత ద్విచక్షణాః.
అర్థస్వరూప మజ్ఞానా త్పశ్యంత్యన్యే కుదృష్టయః,
కూటస్థో నిర్గుణో వ్యాపీ చైతన్యాత్మా స్వభావతః
దృశ్యతే హ్యర్థరూపేణ పురుషైః భ్రాంతదృష్టిభిః,
యదా పశ్యతి చాత్మానం కేవలం పరమార్థతః
మాయామాత్రమిదం ద్వైతం తదా భవతి నిర్వృతః,
తస్మా ద్విజ్ఞానమేవాస్తి న ప్రపంచో న సంసృతిః.

అర్థ. ఓ మైత్రేయా! ఈ యాత్మస్వరూపమునుండియే ప్రపంచము పుట్టుచున్నది. ఈయాత్మయందే లీనమగుచున్నది. ఈయాత్మమాయాపాశ బద్ధుఁడయి అనేకవిధములగు శరీరములను సృజించుచున్నాఁడు.ఇతఁడీశరీరము లందు తాను స్వయముగా చేరుటలేదు.ఇతరులను చేర్చుటయులేదు. కర్తగాని భోక్తగాని ప్రకృతిగాని పురుషుఁడుగాని లేరు. యథార్థముగాఁ జూచిన మాయగాని ప్రాణముగానిలేదు.సర్వము చైతన్యముమాత్రమే. సకలప్రాణులకు న్నాగల అజ్ఞానమే ఈసంసారమునకు మూలకారణముగాని వేఱయినకార ణము లేదు. సర్వగతుఁడగు ఆత్మ నిత్యస్వభావుఁడు, కూటస్థుఁడు, దోషవిరహి తుఁడు. అద్వితీయుఁడగు ఆకూటస్థుఁడు మాయచేత భేదముగలవానివలె గనం బడుచున్నాఁడేకాని స్వభావముగా భేదముగలవాఁడుకాఁడు. స్వభావముగా ఆతనికి భేదములేదు. కనుక మహర్షులు అద్వైతమునే పరమార్థమని పలుకు చున్నారు. సదసద్విచారణ నొనర్చిన విద్వాంసులు ప్రపంచమును జ్ఞాన స్వరూపముగనే పలుకుచున్నారు. కుత్సితదృష్టి గలమూఢులు ప్రపంచము విషయభేదస్వరూపము గలదియని అజ్ఞానవశమున తలంచుచున్నారు. కూటస్థ స్వభావముగల ఆత్మ స్వభావముగా నిర్గుణుఁడు, సర్వవ్యాపి, చైతన్యస్వరూ

పుఁడు నగుచున్నాఁడు. భ్రాంతిదృష్టిగలవారిచేతనే ఆత్మ పదార్థరూపముగాఁ జూడఁబడుచున్నాఁడు. ఎప్పుడు ఆత్మను పరమార్థముగా అద్వితీయస్వరూపునిగాఁ గాంచుచున్నారో అప్పు డీ ప్రపంచమంతయు మాయామాత్రస్వభావము గలదనువిషయము స్ఫురించును. అప్పుడే విముక్తుఁ డగును. కనుక ఉన్నది ఒకవిజ్ఞానమేగాని భ్రాంతి దృష్టిలోఁగనంబడు ప్రపంచముగాని సంసారముగాని పరమార్థముగా లేనేలేదు.

ఇటుల శ్రుతిస్మృత్యాదికములు ఆదికారణము అద్వితీయాత్మయే యని నిర్ణయించుచున్నవి కావునను, స్వరూపముచేత బాధింపఁబడుటచేతను ప్రపంచము మిథ్యయని నిశ్చయమగుచున్నది. బ్రహ్మము 'అస్థూలము, అనణువు' మున్నగు విశేషణములచేత విశేషింపఁబడి యుండుటచేత అస్థూలాదికము కంటె విభిన్నమగు స్థూలాద్యాకారము ఒక్కఁడేయగుచంద్రునకు నేత్రదోషముచేతఁ గనంబడిన ద్వితీయచంద్రునివలె మిథ్యయే యగుచున్నది కాని పరమార్థము కాఁజాలదు

సూ. న స్థానతోఽపి పరస్యోభయలింగ స్సర్వత్ర హి

బ్రహ్మసూ 3-౨-౧౧.

అను బ్రహ్మసూత్రప్రమాణముచేత పరబ్రహ్మము ఉభయరూపములు గలదియనుట అసంగతము కావున నిర్విశేషస్వరూపమనియే చెప్పఁబడినది.

సూ. న భేదా దితిచే న్న ప్రత్యేక మతద్వచనాత్

బ్రహ్మసూ 3-౨-౧౨.

అను బ్రహ్మసూత్రముచేత బ్రహ్మముభేదముగలదని గనంబడుచున్న శ్రుతులుకూడ అనేకములు గనంబడుచున్నవి

గదా. అప్పుడు వానిని ఆశ్రయించి ఉపాధిమత్త్వము నేల అంగీకరింపకూడదు అని ఆశంకించి ఉపాధిభేదమును శ్రుతియే అనేకస్థలములందు దృఢముగ నిషేధించుచున్నది కావున సవిశేషశ్రుతుల ననుసరించి బ్రహ్మము సవిశేషమని నిర్ణయింప వీలు లేదని నిర్విశేషమనియే సిద్ధాంతీకరింపఁబడినది

సూ అపిచైవ మేకే. బ్రహ్మ. 3-౨-౧౨.

అనుసూత్రము చేత కొన్ని శ్రుతులు భేదమును నిందించుచు అభేదమునే ప్రతిపాదించుచున్నవి కావున భేదశ్రుతుల ననుసరించుట అసంగతము

ఈ విషయమునే శ్రుతు లిట్లు ప్రతిపాదించుచున్నవి:—

శ్రు మనసై వేద మాప్తవ్యం నేహ నానాఽస్తి కించన,
మృత్యోస్స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ
పశ్యతి. కఠ. ౪-౧౧.

అర్థ. మనస్సుచేతనే బ్రహ్మము పొందఁదగినది. ఈ బ్రహ్మమునందు నానాత్వము కొంచెమైనను లేదు. ఎవఁడు బ్రహ్మమునందు నానాత్వమును గాంచునో వాఁడు మృత్యువువలన మృత్యువును పొందును.

శ్రు ఏకధైవాను ద్రష్టవ్యం. బృహ. ౪-౪-౨౦.

అర్థ. బ్రహ్మ మొకేవిధముగ చూడఁదగినది.

శ్రు భోక్తా భోగ్యంప్రేరితారంచమత్వా
సర్వం ప్రోక్తం త్రివిధం బ్రహ్మమేతదితి. శ్వేతా-౧.౧౨.

అర్థ. భోక్త, భోగ్యము. ప్రేరకుఁడు అను నీమూఁడును బ్రహ్మమని యెఱుంగవలయును.

ఇటుల భోక్తృ, భోగ్య, నియంతృలక్షణములు గల ప్రపంచము బ్రహ్మస్వరూపమని నిర్ణయింపఁబడినది.

బ్రహ్మము నిర్విశేషముగనే నిర్ణయింపఁబడుచున్నదను విషయ మీ బ్రహ్మసూత్రముచేత సిద్ధాంతీకరింపఁబడినది:—

సూ అరూపదేవహి తత్ప్రధానత్వాత్ బ్రహ్మ 3-2-14.

## బ్రహ్మముయొక్క నిర్విశేషతను తెల్పెడిశ్రుతులు.

శ్రు అస్థూల మనణ్వహ్రస్వ మదీర్ఘ మశబ్ద మస్పర్శ మరూప మవ్యయమ్ బృహ. 3-3-8

అర్థ. బ్రహ్మము స్థూలముకాదు. అణువుకాదు. దీర్ఘముకాదు. శబ్దముకాదు. స్పర్శముకాదు. రూపముకాదు. నాశరహితమయినది.

శ్రు. ఆకాశోహవై నామ నామరూపయోర్నిర్వహితా తేయ దంతరా తద్బ్రహ్మ. ఛాందోగ్య. 8-14-1

అర్థ. ఆకాశము అను పేరుగలది. నామరూపవిరహితము. ఆ నామములు ఏది అంతరముగాగలదియో అదియే బ్రహ్మము.

శ్రు తదేతద్బ్రహ్మ పూర్వ మనపర మనంతర మబాహ్యమ్

అర్థ. ఆ ఈ బ్రహ్మము అపూర్వము. అనపరము. అనంతరము. అబాహ్యము.

శ్రు. అయమాత్మా బ్రహ్మసర్వానుభూతిః - ఏతదనుశాసనమ్.

అర్థ. ఈ ఆత్మయే బ్రహ్మము. ఇదియే అందఱకు అనుభవమయినది. ఇదియే శ్రుతియొక్క ఆజ్ఞ. మున్నగుశ్రుతులు నిష్ప్రపంచ బ్రహ్మాత్మతత్త్వ ప్రతిపాదనపరములు. ఇతరములగు వచనములు కారణబ్రహ్మాత్మతత్త్వపరము

లయినవి. కాని అయ్యవి తత్ప్రధానపరములు కావు. అతత్ప్రధానములకంటె తత్ప్రధానములు బలీయములని విద్వాంసులందురు. కావున తత్ప్రధానములగు శ్రుతులందు ప్రతిపాదింపఁబడినరీతిగా బ్రహ్మమును నిర్విశేషముగనే గ్రహించవలయునుకాని సవిశేషముగా గ్రహింపఁదగదు.

అట్లయినయెడల బ్రహ్మమును సవిశేషపరముగా నిర్ణయించుచున్న శ్రుతివచనములుకూడ కొన్ని యచ్చటచ్చట గనంబడుచున్నవిగదా అందుల కేమిసమాధానము చెప్పెదరు?

'ప్రకాశవచ్చావైయర్థ్యాత్' బ్ర సూ 3-2-15. అను సూత్రానుసారము చంద్రుఁడు సూర్యుఁడు మున్నగువానికి ఘటాద్యుపాధులందు ఉపాధికృతములగు నానాత్వము లెట్లు గనంబడుచున్నవో అట్లే బ్రహ్మమునకున్నూ ఉపాధికృతమయిన నానావిధరూపములు కలిగియుండుట సహజమే కావున ఉపాధికృతములగు ఆకారవిశేషములను పరబ్రహ్మమునకు వర్ణించుట ఉపాసనాంగమని యెఱుంగవలయును. ఈవిధముగా నానావిధముగ బ్రహ్మస్వరూపమును వర్ణించు వాక్యములకు సార్థకత్వము సమర్థింపఁబడినది ఇటుల నానావిధముగా బ్రహ్మమును ప్రతిపాదించుచున్న భేదశ్రుతివాక్యములు సోపాధికబ్రహ్మపరములు కావున ఆవాక్యములున్నూ సార్థకములే యని సంస్థాపించి మఱల నిర్విశేషమే పరబ్రహ్మమనువిషయమును దృఢీకరించుటకుఁగాను బ్రహ్మసూత్రమునం దిట్లు చెప్పఁబడినది:—

సూ ఆహచ తన్మాత్రమ్ బ్ర. సూ. 3-2-16.

శ్రు. సయథాసైంధవఘనోఽనన్తరోఽబాహ్యః కృత్స్నో రసఘన ఏవ, ఏవం వా అరేఽయ మాత్మాఽనంతరోఽ

బాహ్యః కృత్స్నః ప్రజ్ఞానఘనఏవేతి బృహ.౪-౫-౧౩.

ఇందువలన విజ్ఞానవ్యతిరిక్తమగు రూపాంతరమే బ్రహ్మమునకు లేదని తెలుపఁబడినది.

సూ. దర్శయతి చాథో అపిస్మర్యత ఇతి. బ్ర సూ ౩-౨-౧౭.

శ్రు అథాత ఆదేశో నేతినేతి. బృహ ౨-౩-౬.

„ అన్యదేవ తద్విదితా దథో అవిదితా దధి. కేనో ౧-౩.

„ యతోవాచో నివర్తంతే అప్రాప్యమనసాసహ

తై. ౨-౪-౧

స్మృతి. శ్లో ప్రత్యస్తమితభేదం యత్సత్తామాత్ర మగోచరమ్,
వచసామాత్మసంవేద్యంతద్జ్ఞానంబ్రహ్మసంజ్ఞితమ్
భగ ౧౩-౧౨.

„ విశ్వస్వరూపవైరూప్యం లక్షణం పరమాత్మనః

మున్నగు శ్రుతిస్మృతులవలన బ్రహ్మము నానావిధరూపవిరహితమనియే గ్రహించఁదగియున్నది ఇందులకు సూర్యాది ప్రతిబింబదృష్టాంతమును గ్రహించవలయును బ్రహ్మము చైతన్యమాత్రస్వరూప మగుటచేత విదితావిదితములకంటె అన్యమును, 'ఇదిగాదు, ఇదిగాదు'అని చెప్పఁదగినదియును, వాక్కులకు గోచరముకానిదియు, ప్రపంచస్వరూపమునకు విలక్షణమయిన రూపముగలదియు అగుచున్నది అట్టి బ్రహ్మమే అవిద్యోపాధిసహితమయినప్పుడు భేదముగలది యగుచున్నది. మోక్షశాస్త్రగ్రంథములందు బ్రహ్మమునకు అపారమార్థికమగు ఇట్టి ఉపాధినిమిత్తకభేదమును జలగతసూర్యచంద్రబింబాద్యుపమానముతో అంగీకరించియున్నారు.

శ్లో. ఆకాశమేకం హి యథా ఘటాదిషు పృథక్పృథక్,
తథాఽఽత్మైకోహ్యనేకశ్చ జలాధారేష్వివాంశుమాణ్
ఏకఏవతు భూతాత్మా భూతేభూతే వ్యవస్థితః,
ఏకధా బహుధా చైవ దృశ్యతే జలచంద్రవత్
బ్రహ్మ బిం. ౧౨.

యథాహ్యయం జ్యోతి రాత్మా వివస్వా
నపో భిన్నా బహుధైకోఽను గచ్ఛన్,
ఉపాధినా క్రియతే భేదరూపో
దేవః క్షేత్రేష్వేవమజోఽయమాత్మా.

అర్థ. సర్వభూతాత్మకుఁడగు ఒక్కఆత్మయే ప్రతిభూతమునందున్నూ ఉన్నవాఁడయి జలమునందున్న చంద్రునివలె ఒక్కవిధముగను అనేకవిధములుగను జూడఁబడుచున్నాఁడు. తేజోరూపుఁడగు సూర్యుఁడొక్కఁడే యైనను వేయివేయిజలములందు ప్రతిబింబితుఁడయి వేయివేయిగా ప్రతిబింబించుచున్నటుల స్వయంప్రకాశుఁడును, అజుఁడును అగు ఆత్మయు దేహోపాధులందు భేదరూపునివలె చూడఁబడుచున్నాఁడు.

ఇటుల పైదృష్టాంతములచేతకూడ బ్రహ్మము నిర్విశేషమనియే సిద్ధాంతీకరింపఁబడినది.

## పూర్వపక్షము.

కాని మఱల నీసిద్ధాంతముమీఁద ఒకపూర్వపక్ష మీవిధముగా చేయఁబడినది.

సూ అంబువదగ్రహణాత్తు న తథాత్వమ్ 3-౨-౧౯.

అనఁగా జలసూర్యకాది దృష్టాంతము ఆత్మవిషయమై చెప్పుట తగదు. ఏలయనఁగా సూర్యచంద్రాదులగు మూర్తవస్తువుల

కంటె జలము మున్నగునవి వేఱయినవియును దూరముగ నున్నవియును అగుచున్నవి కావున సూర్యాదిప్రతిబింబము కలుగుటయు యుక్తమే ఆవిధముగా దార్ష్టాంతికమగు ఆత్మ మూర్తమును, వేఱయినదియును కాదు; అట్లే ఉపాధులు తద్భిన్నములును, దూరస్థములును కావు; ఏలయనఁగా ఆత్మ సర్వగతమును, సర్వానంతర్యమును అనుట సుప్రసిద్ధముగదా.

## ఇందులకు సమాధానము

సూ. వృద్ధిహ్రాసభాక్త్వ మన్తర్భావా దుభయసామంజస్యాదేవమ్ బ్రహ్మ 3-౨-౨౦.

అర్థ. మేము చూపించిన దృష్టాంతము యుక్తమే. ఏలయనఁగా దృష్టాంతదార్ష్టాంతికములకు వివక్షితాంశమునందే సారూప్యమును చూపించుటకుశక్యమగునుకాని సర్వాంశములందు సారూప్యమును చూపించుట కెవ్వరికిన్ని శక్యముకాదు. అన్నివిషయములందు సారూప్యమున్నయెడల దృష్టాంతదార్ష్టాంతికభావమునకే నాశమేర్పడును. ఇచ్చట—అనఁగా ఈదృష్టాంతదార్ష్టాంతికభావమునందు వృద్ధిహ్రాసముల నందుటయే దృష్టాంతాంశముగా గ్రహింపఁబడినది. జలగతమగు సూర్యప్రతిబింబము జలమధికముగానున్నపుడు వృద్ధినిపొందుచున్నది. జలము తగ్గియున్నప్పుడు తగ్గుచున్నది. జలము కదలగాకదలుచున్నది. జలము భేదింపఁగా భేదించుచున్నది. ఇటుల జలధర్మము ననుసరించి వేఱువేఱువిధములుగా తోఁచుచున్నదే గాని వాస్తవముగా చూచినయెడల ఆధర్మములన్నియుం సూర్యునియొక్క పారమార్థికరూపము కాఁజాలవుగదా. అట్లే సద్రూపమగు బ్రహ్మము పరమార్థముగా అవికారమై ఏకరూపమయినను దేహాద్యుపాధులయందంతర్భావము కలిగియుండుటవలన

ఉపాధిగతములగు అంతర్భావములను పొందుచున్నదను అంశముమాత్రమే ఇట వివక్షితమను విషయమును గ్రహించవలయును.

శ్రు పురశ్చక్రే ద్విపదః పురశ్చక్రే చతుష్పదః,
పురస్సపక్షీభూత్వా పురఃపురుషఆవిశత్ బృహ. ౨-౫-౧౮

అర్థ. పరమాత్మ రెండుపాదములును నాలుగుపాదములును గల దేహములను సృజించెను. తాను పక్షిస్వరూపుఁడయి ఆదేహమునందు ప్రవేశించెను.

శ్రు. ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే
బృహ. ౨-౫-౧౯.

అర్థ. పరమేశ్వరుఁడు మాయారూపముచేత బహురూపములు గలవాఁడగుచున్నాఁడు.

శ్రు మాయాం తు ప్రకృతింవిద్యాన్మాయినంతు మహేశ్వరమ్. శ్వేతాశ్వ. ౪-౧౦

అర్థ. మాయయనఁగా ప్రకృతి, మహేశ్వరుఁడు మాయాశక్తి గలవాఁడు.

శ్రు మాయియా సృజతే విశ్వమేతత్. శ్వేతాశ్వ ౪-౯.

అర్థ. పరమేశ్వరుఁడు మాయాశక్తిసహితుఁడయి ప్రపంచమును సృజించుచున్నాఁడు.

శ్రు. ఏకస్తథా సర్వభూతాంతరాత్మా. కఠోపనిషత్. ౫-౧౧.

అర్థ. పరమాత్మయొక్కఁడే సర్వభూతములందును అంతరాత్మగానున్నాఁడు.

శ్రు రూపం రూపం ప్రతిరూపో బభూవ కఠ. ౨-౨-౧౦.

అర్థ. ఆ పరమాత్మ ప్రతిరూపమునుగూర్చి సమానరూపముగలవాఁడయి యుండెను.

శ్రు. ఏకో దేవ స్సర్వభూతేషు గూఢః. శ్వేతా. ౬-౧౧.

అర్థ. ఒక్కపరమాత్మయే సర్వభూతములందుగూఢముగా నున్నాఁడు.

శ్రు. ఏతమేవ సీమానం విదార్యైతయా ద్వారా ప్రాపద్యత.

అర్థ. పరమాత్మబ్రహ్మరంధ్రమును చీల్చుకొని తద్ద్వారముగా దేహము నందు ప్రవేశించెను.

శ్రు. స ఏష ఇహప్రవిష్ట ఆనఖాగ్రేభ్యః బృహ ౧-౪-౭.

అర్థ. ఆపరమాత్మ నఖశిఖాగ్రపర్యంత మీదేహమునందు ప్రవేశించి యున్నాఁడు.

శ్రు. తత్సృష్ట్వా తదేవాను ప్రావిశత్ తై-ఉ. ౨-౬-౧.

అర్థ. దానిని సృజించి దానియందే ప్రవేశించెను.

మున్నగు శ్రుతిప్రమాణముల ననుసరించి పరబ్రహ్మమే ఉపాధులందు ప్రవేశించెననియు, బ్రహ్మము మాత్రము పరమార్థముగా నిర్విశేషమనియు, సూర్యునకు జలసూర్యకాది ప్రతిబింబములందు కలిగిన నానాత్వమువలెనే బ్రహ్మమునకు ఉపాధిసంబంధముచేత కలిగిన నానాత్వముకూడ మాయిక మనియు ఎఱుంగవలయును. ఈవిషయమునే బ్రహ్మసూత్రములందు తృతీయాధ్యాయ ద్వితీయపాదమునందు ఉభయలింగాధికరణమునందు వ్యాసభగవానులవారు—సూ. "న భేదా దితిచేన్న ప్రత్యేకమతద్వచనాత్. సూ 3-౨-౧౨ మొదలుకొని—సూ దర్శనాచ్చ సూ 3-౨-౨౧ వఱకుఁ గల ౧౦ సూత్రములందు స్పష్టముగా నిరూపించి ఆత్మనిర్విశేషమనియు, అచ్చటచ్చట శ్రుతులందుఁ గనంబడుచున్న సవిశేషరూపము లోకప్రసిద్ధ ఉపాధిగతరూపభ్రాంత్యనువాదము మాత్రమేయనియు ఉపసంహరించియున్నారు

బ్రహ్మవేత్తలగువారియొక్క అనుభవముకూడ ప్రపంచపారమార్థికత్వమునకు విరుద్ధముగా నున్నది. బ్రహ్మవేత్తలకు నిష్ప్రపంచాత్మదర్శనమే అనుభవమునందున్నది

శ్రు యస్మిన్సర్వాణి భూతాని ఆత్మైవాభూ ద్విజానతః,
తత్ర కో మోహః కశ్శోక ఏకత్వ మనుపశ్యతః. ఈశా. ౭.

అర్థ. ఎవనియందు ఏకాలమునందు సకలభూతములున్నూ ఆత్మగా చూడఁబడుచున్నవో అట్టియాత్మయందు ఏకత్వమును చూచువారికి మోహమెక్కడ? శోకమెక్కడ?

శ్రు. విదితే వేద్యం నాస్తి

అర్థ. బ్రహ్మస్వరూపము నెఱింగినయెడల ఇఁక తెలిసికొనఁదగినదియే లేదు.

శ్రు ఏవం నిర్వాణ మనుశాసనమ్ ఆరుణేయ్యుపనిషత్. ౫.

అర్థ. ఈవిధముగా ముక్తినికూర్చి ఆజ్ఞ.

శ్రు యత్ర వాఽన్యదివస్యాత్ తత్రాన్యోఽన్యత్పశ్యేత్,
యత్రత్వస్య సర్వమాత్మైవాభూత్తత్కేన కంపశ్యేత్.
బృహ. ౪-౫-౧౫.

అర్థ. ఎచ్చట అన్యము ఉన్నదానివలె తోఁచునో అచ్చట అన్యుఁడు అన్యమును చూచును. ఎచ్చట బ్రహ్మవేత్తయగువానికి సర్వము ఆత్మస్వరూపముగా నగునో అచ్చట దేనిని ఎవఁడు చూచును.

స్మృతిః-శ్లో. యదేతద్దృశ్యతే మూర్తం మేతద్ జ్ఞానాత్మనస్తవ
భ్రాంతిజ్ఞానేన పశ్యంతి జగద్రూప మయోగినః,
,, యే తు జ్ఞానవిద శ్శుద్ధచేతస స్తేఽఖిలం జగత్,
జ్ఞానాత్మకం ప్రపశ్యంతి తద్రూపం పరమేశ్వరమ్.

స్మృతిః- శ్లో॥ నిదాఘోఽప్యుపదేశేన తేనాద్వైతపరోఽభవత్,
సర్వభూతాన్యశేషేణ దదర్శచ తదాత్మనః.
,, తథా బ్రహ్మ తతో ముక్తి మవాప పరమాం ద్విజ,
అత్రాఽఽత్మవ్యతిరేకేణ ద్వితీయం యో న పశ్యతి,
బ్రహ్మీభూత స్స ఏవేహ వేదశాస్త్ర ఉదాహృతః.

అర్థ. జ్ఞానస్వరూపుఁడవగునీచేత చూడఁబడుచున్న యీ మూర్తస్వరూపమును అజ్ఞానులు జగత్స్వరూపమునుగా భ్రాంతితోఁ జూచుచున్నారు. శుద్ధాంతఃకరణులగు జ్ఞానులుమాత్రము ఈసకలప్రపంచమును పరమేశ్వరునిగాఁ జూచుచున్నారు. నిదాఘుఁడుకూడ ఆత్మోపదేశముచేత ఇట్టే గ్రహించెను. అతఁడు సకలభూతములను ఆత్మస్వరూపముగానే భావించెను. అట్లే బ్రహ్మము నెఱింగి ముక్తినందెను. ఆత్మవ్యతిరేకముగా రెండవవస్తువు అనునది లేనేలేదను దృఢజ్ఞాన మెవ్వనికికలుగునో వాఁడీజన్మమునందే బ్రహ్మస్వరూపుఁ డగుచున్నాఁడని వేదశాస్త్రసిద్ధాంతము.

ఇటుల శ్రుతిస్మృతుల ననుసరించియు, యుక్తి ననుసరించియు, బ్రహ్మవేత్తలయొక్క అనుభవము ననుసరించియు ప్రపంచ పారమార్థికత్వము బాధింపఁబడుటవల్లను, అత్యంత విలక్షణములును అసమానరూపములును అగు మధురతిక్త రసములకును, శ్వేతపీతాదివర్ణములకును పరస్పరము అధ్యాస గనంబడుచుండుటవల్లను, మూర్తద్రవ్యముకాని ఆకాశము నందు సైతము తలమలినత్వాదికమును ఆరోపించుచుండుట లోకమునందు గనంబడుచుండుటవల్లను, అట్లే అత్యంత విలక్షణులును, మూర్తామూర్తులును అగు ఆత్మానాత్మలకు కూడా 'నేను చిక్కియున్నాను, నేను బలసియున్నాను,' అని

తలంచు చుండుట లోకమునం దనుభవగోచర మగుటవల్లను. ఇట్టియధ్యాసము

శ్రు హంతాచే న్మన్యతే హంతుం హతశ్చేన్మన్యతేహతమ్,
ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే.
కఠోపనిషత్ ౨-౧౯

అర్థ. చంపెడివాఁడు చంపుదునని తలంచినను, చంపఁబడినవాఁడు చంపఁబడుచున్నాఁడని తలంచినను వారిద్దఱు ఆత్మస్వరూపము నెఱుంగని వారలే. ఈయాత్మ చంపదు. చంపఁబడదు.

స్మృతి య ఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతమ్, ఉభౌ తౌ న విజానీతః నాయం హంతి న హన్యతే. భగవద్గీత. ౨-౧౯.

అర్థ. పైమంత్రార్థముతో సమానము.

స్మృతి ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః,
అహంకారవిమూఢాత్మా కర్తాఽహ మితి మన్యతే
భగ. 3-౨౭.

అర్థ. అహంకారవిమూఢుఁ డయినవాఁడు ప్రకృతియొక్కగుణకర్మల చేత సలుపఁబడుచున్నకర్మలకు తానే కర్తయని తలంచును.

మున్నగు శ్రుతిస్మృతిప్రమాణములవలన అశాస్త్రీయమును అనర్థావహమును అని తెలియవచ్చుటచేత ఇట్టి యధ్యాసము నశించుటకున్నూ ఆత్మైకత్వప్రాప్తికొఱకున్నూ ఈ శ్వేతాశ్వతరోపనిషత్తుయొక్క వ్యాఖ్యానమును ప్రారంభించుచున్నారము



శ్రీగురుభ్యో నమః.

కృష్ణయజుర్వేదాంతర్గత మగు

# శ్వేతాశ్వతరోపనిషత్తు

## ఆంధ్రటీకాతాత్పర్య వివరణ సమన్వితము

---

### పూర్వశాంతిపాఠమంత్రము

ఓమ్ సహనా వవతు, సహ నౌ భునక్తు, సహ వీర్యం కరవావహై, తేజస్వి నా వధీత మస్తు, మావిద్విషావహై. ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

**పద. సహ నౌ అవతు, సహ నౌ భునక్తు, సహ వీర్యం కరవావహై, తేజస్వి నౌ అధీతం అస్తు, మా విద్విషావహై, ఓం శాంతిః శాంతిః శాంతిః.**

టీక. నౌ=శిష్యాచార్యులము అగు మమ్ముల నిద్దఱను, సహ=కూడ, అవతు=(బ్రహ్మము) సంరక్షించుఁగాక. నౌ సహ=మమ్ములను ఇద్దఱనుకూడ, భునక్తు=(బ్రహ్మము) పరిపాలించుఁగాక. వీర్యం=విద్యానిమిత్తమగు సామర్థ్యమును, సహ కరవావహై=శిష్యాచార్యులము అగు మేమిద్దఱమును చేసెదముగాక. నౌ=మాయొక్క, అధీతం = అధ్యయనము చేయఁబడిన బ్రహ్మవిద్య, తేజస్వి=తేజోవంతమయినది, అస్తు=అగుఁగాక. మా విద్విషావహై=(ప్రమాదకృతాపరాధాదికమువలన మా యిద్దఱకు) ద్వేషము కలుగక యుండుఁగాక. ఓం=ప్రణవప్రతిపాద్యమగు బ్రహ్మము, శాంతిః శా-

శాంతిః=ఆధ్యాత్మిక, అధిభౌతిక, అధిదైవికములను మూడు తాపములను శాంతింపఁజేయుగాక.

తా. ఈ తాత్పర్యవివరణములను కఠోపనిషత్ప్రారంభమునందు వివరించియుండుటచేత ఇట ఉపేక్షించితిమి.

---

ప్రథమాధ్యాయము, ౧-వ మంత్రము.

మూ ఓం బ్రహ్మవాదినో వదంతి
కిం కారణం బ్రహ్మ? కుతస్స్మ జాతా?
జీవామ కేన క్వచ సంప్రతిష్ఠితాః?
అధిష్ఠితాః కేన సుఖేతరేషు
వర్తామహే? బ్రహ్మవిదో వ్యవస్థామ్. ౧

పద. బ్రహ్మవాదినః వదంతి కిం కారణం బ్రహ్మ కుతః స్మ జాతాః జీవామ కేన క్వ చ సంప్రతిష్ఠితాః, అధిష్ఠితాః, కేన సుఖేతరేషు వర్తామహే బ్రహ్మవిదః వ్యవస్థామ్. ౧

టీక. (జగతః=ఈ ప్రపంచమునకు) కారణం=కారణము, బ్రహ్మకిం= పరబ్రహ్మమా? (లేక కాలము మున్నగునవియా?) కుతః స్మ=దేనివల్లనుండి, జాతాః=మనము పుట్టితిమి? కేన=ఎవని(సహాయము)చేత, జీవామ=మనము బ్రతుకుచున్నాము? (ప్రళయకాలమునందు) క్వచ = ఎచ్చట, సంప్రతిష్ఠితాః=మనము ఉంటున్నాము? బ్రహ్మవిదః=బ్రహ్మవేత్తలారా! సుఖేతరేషు= సుఖదుఃఖములందు, వ్యవస్థాం = విభాగమును, కేన=ఎవ్వనిచేతను, అధిష్ఠితాః=అధిష్ఠితులమై, వర్తామహే = అనుభవించుచున్నారము? (అని) బ్రహ్మవాదినః = బ్రహ్మస్వరూపనిర్ణయమునందు సమర్థులగు బ్రహ్మవేత్తలు, వదంతి = పైవిధముగా పరస్పరము చర్చించుకొనుచున్నారు.

తా. 'బ్రహ్మవాదినో వదంతి' అనుమంత్రము మొదలుకొని "యస్య దేవే పరాభక్తి ర్యథాదేవే తథాగురౌ, తస్యైతే కథితాః హ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః" ౬-౨౩. అను మంత్రమువఱకు గలది శ్వేతాశ్వతరీయ మంత్రోపనిషత్తు. ఇది షడధ్యాయాత్మకము. ఈశ్వేతాశ్వతమంత్రోపనిషత్తును అతిసంగ్రహముగనే వ్యాఖ్యానమొనర్చుచున్నారము — బ్రహ్మవాదులనఁగా బ్రహ్మస్వరూపనిర్ణయమును ప్రకటించుటయే స్వభావముగాఁ గలవారలు. అట్టివారలందఱేకముగా ఒక్కచోటఁజేరి యీవిధముగా చర్చించుచున్నారు.

౧. బ్రహ్మముయొక్క స్వరూపమేమి? లేక యీప్రపంచమునకు కారణము బ్రహ్మమా? లేక కాలమా? పైమంత్రమునందు 'కాలస్స్వభావోనియతిర్యదృచ్ఛా' మున్నగునవి చెప్పఁబడబోవుచున్నవి. లేక బ్రహ్మము ప్రపంచమునకు సిద్ధరూపమయిన ఉపాదానకారణమా? లేక బ్రహ్మశబ్దమునకు 'బృంహతి బృంహయతి తస్మాదుచ్యతే పరంబ్రహ్మేతి' అని శ్రుతియే నిర్వచనమును చెప్పుచున్నది కావున నిమిత్తోపాదానకారణములు రెండునున్నా బ్రహ్మమేనా? లేక యీప్రపంచము కారణవిరహితమేనా? ఈప్రశ్నమునందింతయర్థము యిమిడియున్నదని గ్రహించవలయును —

౨. కార్యకారణస్వరూపభూతులమగు మనము దేనివలన జన్మించితిమి? పరమార్థముగా చూచినయెడల జీవులకు ఉత్పత్తివినాశములుండుటకు న్యాయములేదుగదా. శ్రుతిస్మృతు లిట్లనే చెప్పుచున్నవి:—

౧. నజాయతే మ్రియతేవా విపశ్చిత్;

౨. జీవాపేతం వావ కిలేదం మ్రియతే, న జీవో మ్రియతే;

3. జరామృత్యూ శరీరస్య;

౪. అవినాశీవా అరే అయమాత్మా అనుచ్ఛిత్తిధర్మా;

౫. స్మృతి —అజ శ్శరీరగ్రహణా త్సజాత ఇతి కీర్త్యతే.

3. సృజింపఁబడిన వ   నము దేనిచేత జీవించుచున్నాము? ఇది స్థితి విషయకప్రశ్నము.

౪. ప్రళయకాలమునం   ు మన మెచ్చట నున్నారము?

౫. మన మనుభవించు  చున్న సుఖదుఃఖము లెవ్వనియొక్క అధికారమునకు లోబడి మనము  అనుభవించుచున్నాము.

ఈ ప్రశ్నములయొక  ్క సార మేమనఁగా సృష్టిస్థితినియమములకు కారణభూతుఁ డెవ్వఁడని భ  ావము.

ప్రథమ  ాధ్యాయము, ౨-వ మంత్రము.

మూ. కాల స్స్వ  భావో నియతి ర్యదృచ్ఛా
భూతా,  యోనిః పురుష ఇతి చింత్యమ్,
సంయో  గ ఏషాం నత్వాత్మభావా
దాత్మా-  -ఽప్యనీశః సుఖదుఃఖహేతోః  ౨

పద. కా  లః స్వభావః నియతిః యదృచ్ఛా భూతాని యోనిః పురుషః ఇతి చింత్యమ్, సం  యోగః ఏషాం న తు ఆత్మభావాత్ ఆత్మా అపి అనీశః సుఖ దుఃఖహేతోః.  ౨

టీ. కాలః=(స  ర్వభూతముల పరిణామమునకు హేతుభూతమగు), కాలము, (=ఈజగత్తునకు క  ారణము అగునని కొందఱుచెప్పిరి) స్వభావః = స్వభావము (అనఁగా అగ్నికి ఉ  ష్ణత్వమువలె ప్రతిపదార్థమునకు నియతమ  ుగా నుండుశక్తి (ఈజగత్తునకు క  ారణమని కొందఱుతలంచిరి.)నియతిః=పుణ్యపాపలక్షణమయిన కర్మ (జగత్కా  ... ొందఱు తలంచిరి.) యదృచ్ఛా=ఆకస్మికముగా సిద్ధించెడి ప్రాప్తియను  ... కొందఱు ... తలంచిరి.) భూతాని = ఆకాశాది పంచమ  ... ముఅని కొందఱు భావించిరి.) యోనిః=ప్రకృతి ... కారణ భూతమని కొందఱు ... శ్వేతా.

తలంచిరి.) పురుషః ఇతి = విజ్ఞానాత్ముఁడగు పురుషుఁడు (జగత్కారణమని కొందఱు భావించిరి.) చింత్యమ్ = (ఈవిషయమునుగూర్చి) విమర్శింపవలయును. ఆత్మభావాత్ = ఆత్మభావముకలదగుటవలన, ఏషాం సంయోగః = వెనుకచెప్పిన ఆ ౭ డు వస్తువులయొక్క సమూహముకూడ, జగత్కారణము కాఁజాలదు. ఆత్మా అపి = జీవుఁడున్నూ, సుఖదుఃఖహేతోః = సుఖదుఃఖములకు హేతుభూతమగు జగత్తునకు, అనీశః = కారణభూతుఁడు కాఁజాలఁడు.

తా. ౧. ఈజగత్తునకు కారణము కాలమని కాలవేత్తలు చెప్పుచున్నారు.

౨. అగ్నికి ఉష్ణత్వమువలెను, జలమునకు నిమ్నప్రసారణమువలెను ప్రతిపదార్థమునకు నియతముగానుండెడి స్వభావము జగత్కారణమని లోకాయతికులు చెప్పుచున్నారు.

3. పుణ్యాపాపనియత మగు కర్మ జగత్కారణమని, మీమాంసకులు తలంచుచున్నారు.

౪. ఆయా కల్పాదియందున్న తత్తత్ప్రాణికర్మసాపేక్షముగ ఈశ్వరునిచేత జగత్తు సృజింపఁబడలేదనియు, యదృచ్ఛచేతనే ప్రపంచము సృష్టింపఁబడుచున్నదనియు నిరీశ్వరవాదులు తలంచుచున్నారు.

౫. పంచమహాభూతములవలన జగత్తు సృజింపఁబడుచున్నదని జగన్నిత్యత్వవాదులు తలంచుచున్నారు.

౬. యోని అనఁగా ప్రకృతి జగత్కార[illegible] ష్టులు తలంచుచున్నారు.

౭. పురుషుఁడు అన[illegible] స్థుఁడు జగత్కా[illegible] రణభూతుఁడని యోగులు తల[illegible]

ర. ఈకాలాదులకు ప్రత్యేకప్రత్యేకముగ జగత్కారణత్వము లేకపోయినను ఈకాలాదులయొక్క సంయోగము జగత్కారణము గానచ్చునని కొందఱు తలంచుచున్నారు.

గ. కాలాదులు భోగ్యవస్తువులు, పరతంత్రములు, భోక్త యగు ఆత్మ వేఱుగానున్నాఁడు కావున ఆత్మ జగత్కారణుఁడుగా నుండవచ్చునని కొందఱు తలంచవచ్చునుగాని అది యుపపన్నము కాఁజాలదు. ఆయాత్మ కూడా సృష్ట్యాదికమునకు హేతుభూతుఁడు కాఁజాలఁడు. ఏలయనఁగా పుణ్యపాపలక్షణమయిన సుఖదుఃఖములకు హేతుభూతమయిన కర్మయొకటి యుండుటయు, తత్కర్మకుఁలోఁబడి జగత్సృష్ట్యాదికము జరుగుచుండుటయు శాస్త్రయుక్త్యనుభవసిద్ధముగా నున్నది. కావున సుఖదుఃఖాదికమునకు హేతుభూతమయిన ఆధ్యాత్మికాది భేదభిన్నమయిన జగత్తునకు జీవుఁడు కారణము కాఁజాలఁడు.

వివరణము —ఈ మంత్రద్వయముయొక్క భావమును వేదాంతముక్తావళియొక్క ఉత్తరార్ధమునందు శ్రీ బెల్లంకొండ రామారాయకవీంద్రుఁ డిట్లు సంగ్రహించెను —

శ్లో. కిం బ్రహ్మాస్య నిమిత్తకారణ? ముతోపాదాన? ముంగోభయం?
కిం వైకం? కిమువా సహాయకలితం? కిం కారణం నైవవా?
కిం కాలః? ప్రకృతిర్ను? కిన్ను నియతిః? కిం వా యదృచ్ఛానుకిం?
కిం క్షోణీజలముఖ్య భూతవితతిః? కిం వా పుమాం శ్చేతనః?. ౭౯౨
కిం కాలర్తు ముఖార్థసంయుజి? రథో సంసృష్టకాలాదయః?
కస్మా దావిరభూమ? కేనతు వయం జీవామ ఏవం భువి?
క్వాస్మాకం ప్రలయే స్థితిః? నియమితా వర్తామహే కేన శ్చే
దుఃఖే వేతి? విచార మారచితవా ౯్ విజ్ఞో జనః. ౭౯౩

ప్రథమాధ్యాయము, 3-వ మంత్రము.

మూ॥ తే ధ్యానయోగానుగతా అపశ్యన్
దేవాత్మశక్తిం స్వగుణై ర్నిగూఢామ్,
యః కారణాని నిఖిలాని తాని
కాలాత్మయుక్తా న్యధితిష్ఠ త్యేకః 3

పద. తే ధ్యానయోగానుగతాః అపశ్యన్ దేవాత్మశక్తిం స్వగుణైః నిగూఢామ్, యః కారణాని నిఖిలాని తాని కాలాత్మయుక్తాని అధితిష్ఠతి ఏకః. 3

టీక. తే=ఆబ్రహ్మవేత్తలు, ధ్యానయోగాను గతాః=ధ్యానయోగము ననుసరించిన వారలయి, యః=ఏ, ఏకః=అద్వితీయుండగు పరమాత్మ, కాలాత్మయుక్తాని=కాలము మొదలుకొని పురుషునివఱకుఁ గల, తాని=ఆ, నిఖిలాని కారణాని=కారణముల నన్నింటిని, అధితిష్ఠతి=నియమించుచున్నాఁడో, అట్టి పరమాత్మయొక్క, స్వగుణైః=స్వగుణములగు సత్త్వరజస్తమోగుణముల చేత, నిగూఢాం=గూఢమయియున్న, దేవాత్మశక్తిం = మాయాశక్తిని, (జగత్కారణభూతమయిన దానినిగా) అపశ్యన్=చూచిరి-గ్రహించిరి.

తా. వెనుకటిమంత్రమునందు కాలాది పురుషాంతములగు ౭-ని వేఱువేఱుగను, తత్సమూహమును మొత్తము ౭-ని జగత్కారణభూతము లయినవానినిగా మొదట ప్రతిపాదించి తరువాత అవిషయము అసంగతమని నిరాకరింపఁబడినది. జగత్కారణభూత మగుపదార్థము ప్రత్యక్షాది ప్రమాణాంతములకు అగోచరమగుటచేత మఱొకవిధానము నెఱుంగని వారలయి ధ్యానయోగానుష్ఠానముచేత జగత్తునకు పరమమూలకారణమయిన వస్తువును స్వయముగా నెఱింగిరి. ధ్యానమనఁగా చిత్తైకాగ్రత. 'యుజ్యతే అనేనేతి

యోగః' అనువ్యుత్పత్తిచేత ధ్యానింపఁదగినదానినిపొందుటకుతగినఉపాయము యోగమనంబడును. ఇట్టి ధ్యానయోగము ననుష్ఠించుటచేత సమాహితచిత్తులై మొదటిమంత్రములందు ప్రశ్నింపఁబడిన సంశయజాతమునకు పరిహారరూపమ యినదానిని చక్కఁగా నెఱింగిరి. వెనుక సంశయింపఁబడిన ప్రశ్న సంగ్రహ మేమనఁగా — ఈప్రపంచమునకు కారణము బ్రహ్మమా? లేక కాలాదికమా? అట్లే బ్రహ్మము జగత్కారణమా? లేక కార్యకారణవిలక్షణమా? లేక కారణమున్ను అకారణమున్ను అగుచున్నదా? కారణమునందుకూడ నిమిత్తకారణమా? లేక ఉపాదానకారణమా? లేక నిమిత్తోపాదానోభయ కారణమా? లేక బ్రహ్మము అకారణమా? లేక యెట్టి లక్షణముగలది అని

తత్సంశయ నిరాకరణము:— బ్రహ్మము జగత్తునకు కారణముకాదు. కారణము కాకపోలేదు. ఉభయము కాకపోలేదు. ఉభయమును కాదు. నిమిత్తకారణము కాదు. ఉపాదానకారణము కాదు. నిమిత్తోపాదాన కారణమును కాదు; అనఁగా బ్రహ్మము అద్వితీయమగుటచేత స్వయముగా ప్రపంచమునకు ఉపాదానకారణముకాని, నిమిత్తకారణముగాని, నిమిత్తోపాదానకారణముగాని కాఁజాలదు. ఈజగత్కారణము యదుపాధికమో ఆకారణ మిప్పుడు తెలుపఁబడుచున్నది. దేవాత్మశక్తిని జగత్కారణముగా బ్రహ్మవేత్త లెఱింగిరి. దేవాత్మశక్తి యనఁగా "దేవస్య=ద్యోతనాది యుక్తస్య మాయినః పరమేశ్వరస్య పరమాత్మనః, ఆత్మభూతాం=అస్వతంత్రాం న సాంఖ్యపరికల్పితప్రధానాదివత్ పృథగ్భూతాం స్వతంత్రాం శక్తిం" అని భాష్యమునందు వివరింపఁబడియున్నది కావున దేవుఁడనఁగా ద్యోతనాది (ప్రకాశించుట మున్నగు) గుణములు గలిగినట్టియు, మాయావిశిష్టుఁడు నట్టియు, పరమేశ్వరునియొక్క - పరమాత్మయొక్క ఆత్మభూతమయినస్వతంత్రముకానిది, సాంఖ్యసిద్ధాంతపరికల్పితమగు ప్రధానమువలె పురుషునికంటె వేఱయినదియు స్వతంత్రమయినదియు కానట్టి శక్తియని భావము. ఈవిషయ మీ యుపనిషత్తునందే యుందు-

మం. మాయాంతు ప్రకృతిం వింద్యా న్మాయినంతు మహేశ్వరమ్,
అస్యావయవభూతైస్తు వ్యాప్తం సర్వమిదం జగత్.
శ్వేతాశ్వతర. ౪-౧౦.

అని చెప్పఁబడుచున్నది. బ్రహ్మపురాణమునందుకూడ ఇట్లే చెప్పఁబడినది —

శ్లో. ఏషా చతుర్వింశతి భేదభిన్నా మాయా పరాప్రకృతి స్తత్సముత్థా.
,, మయాఽధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరమ్. భగ. ౯-౧౦.

ఆ దేవాత్మశక్తి యెట్టిదనఁగా 'స్వగుణైః నిగూఢాం' అని విశేషింపఁబడినది. స్వగుణములనఁగా ప్రకృతి కార్యభూతములయిన పృధివ్యాదికము చేత ఆవరింపఁబడినది. అనఁగా కార్యాకారము చేత కారణాకారము కప్పివేయఁబడుచున్నది కావున కార్యముకంటె వేఱుగా స్వరూపము చేత గ్రహించుటకు వీలుకానిదనుట. గుణములు ప్రకృతికార్యము లనువిషయమును శ్రీకృష్ణభగవానుఁ డిట్లు నిరూపించెను:—

శ్లో. సత్త్వం రజ స్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః. భగ. ౧౪-౫.

ప్రపంచమును నిర్మించునంతటి శక్తిగలదేవుఁ డొకఁడున్నాఁడని చెప్పుచున్నావుగదా ఆదేవుఁడెవ్వఁడు? చెప్పుచున్నాము వినుఁడు. ఎవ్వఁడు పూర్వమంత్రమునందు చెప్పిన కాల, స్వభావ, నియతి, యదృచ్ఛా, భూత, ప్రధాన, పురుషులనెడి కారణసప్తకమును అధిష్ఠించి నియమించుచు అద్వితీయుండయి వెలయుచున్నాఁడో అట్టి పరమాత్మయొక్క మాయావిశిష్ట శక్తియే జగత్కారణమని యెఱింగిరి.

'దేవాత్మశక్తిం స్వగుణైర్నిగూఢాం' అనువాక్యము మఱియు ౪ విధములఁగా వ్యాఖ్యాన మొనర్పఁబడియున్నది —

## ౧-వ అర్థాంతరము

౧. స్వగుణైః = ఈశ్వరగుణములగు సర్వజ్ఞత్వాదిగుణముల చేతను సత్త్వరజస్తమోగుణముల చేతను, నిగూఢాం=కప్పఁబడియున్న, దేవాత్మ

శక్తిం=ఈశ్వరరూపముగా నున్న మాయాశక్తిని (జగత్కారణముగా నెఱిం గిరి.) అని గ్రహించవలయును.

ఈయర్థమునందు 'దేవాత్మశక్తి' యను పదమునకు వివరణము — దేవాత్మనా=ఈశ్వరరూపేణ అవస్థితాం అని వ్యుత్పత్తి. ఈవిషయమే గ్రంథాంతరమునం దిట్లు చెప్పఁబడినది:—

శ్లో. సర్వభూతేషు సర్వాత్మ న్యా శక్తి రపరా తవ,
గుణాశ్రయా నమ స్తస్యై శాశ్వతాయై పరేశ్వర.

శ్లో. యా ఽతీతా ఽగోచరా వాచాం మనసాం చావిశేషణా,
జ్ఞానధ్యానపరిచ్ఛేద్యా తాం వందే దేవతాం పరామ్.

ఈ యుపనిషత్తునందే ముస్ముందు కాలస్వభావాదులు జగత్తునకు కారణభూతములు కాఁజాలవనియు, అజ్ఞానమే జగత్కారణమనియుం ఇట్లు చెప్పఁబడినది —

౧. య ఏకోహి రుద్రో న ద్వితీయాయ తస్థు ర్యఇమాన్ లోకా నీశత ఈశనీభిః, ప్రత్యఙ్ జనా స్తిష్ఠతి సంచుకోచా న్తకాలే సంసృజ్య విశ్వా భువనాని గోపాః.    శ్వేతాశ్వ. ౩-౨.

౨. య ఏకోవర్ణో బహుధాశక్తియోగా ద్వర్ణా ననేకా న్నిహితార్థో దధాతి, విచైతిచాంతే విశ్వమాదౌ స దేవః స నోబుద్ధ్యాశుభయాసంయునక్తు.    శ్వేతాశ్వ. ౪-౧.

౩. ఛందాంసి యజ్ఞాః క్రతవో వ్రతాని భూతం భవ్యం యచ్చ వేదావదంతి, అస్మా న్మాయీ సృజతే విశ్వమేతత్ తస్మిం శ్చాన్యో మాయ యా సంనిరుద్ధః,    శ్వేతాశ్వ. ౪-౯.

౪. స్వభావమేకే కవయో వదంతి కాలం తథాఽన్యే పరిముహ్య మానాః, దేవస్యైష మహిమాతు లోకే యేనేదం భ్రామ్యతే బ్రహ్మచక్రమ్    శ్వేతాశ్వ. ౬-

ఈయర్థమునందు, 'స్వగుణైః నిగూఢాం' అను వాక్యమునకు స్వగుణములగు సర్వజ్ఞత్వాదిగుణములచేత పొంద శక్యమయినది కాని కార్యకారణ వినిర్ముక్తమయినట్టియు, పూర్ణానంద అద్వితీయ బ్రహ్మాత్మస్వరూపముగా పొందుటకు వీలుకానిది అని గ్రహించవలయును.

## ౨-వ అర్థాంతరము

స్వగుణైః = సత్వరజస్తమోగుణరూపములచేత, నిగూఢాం=ఆవృతమయియున్న, దేవాత్మభూతాం, దేవ = పరమేశ్వరునియొక్క, ఆత్మభూతాం = జగదుత్పత్తిస్థితిలయములకు హేతుభూతమయినట్టియు, బ్రహ్మవిష్ణు శివాత్మికమయినట్టియు, శక్తిని జగత్కారణభూతముగా నెఱింగిరి.

దేవాత్మశబ్దనిర్వచనము — దేవస్య = పరమేశ్వరస్య ఆత్మభూతాం జగదుదయస్థితిలయహేతుభూతాం బ్రహ్మ విష్ణు శివాత్మికాం. అనఁగా జగదుత్పత్తిస్థితినాశములకు కారణభూతమయినట్టియు బ్రహ్మ విష్ణు శివాత్మికమయినట్టి పరమేశ్వరుని శక్తి. ఇందులకు ప్రమాణములు —

౧. శక్తయో యస్య దేవస్య బ్రహ్మ విష్ణు శివాత్మికాః.
౨. బ్రహ్మ విష్ణు శివా బ్రహ్మన్ప్రధానా బ్రహ్మశక్తయః.

స్వగుణైఃనిగూఢాం = అనఁగా సత్వముచేత విష్ణువు, రజస్సుచేత బ్రహ్మ, తమస్సుచేత: మహేశ్వరుఁడు, ఇటుల సత్వాద్యుపాధిసంబంధస్వరూపముచేత గనంబడుచున్నదే గాని నిరుపాధిక పూర్ణానంద అద్వితీయ బ్రహ్మాత్మస్వరూపముచేత గనంబడజాలనిదనుట. సృష్ట్యాదికార్యముల నొనర్చునప్పుడు కలుగుచున్న అవస్థాభేదము నాశ్రయించియే బ్రహ్మ విష్ణు శివాది విభేదముగాని పరమార్థముగా భేదములేదని శాస్త్రమిట్లుబోధించుచున్నది —

శ్లో. సర్గస్థిత్యంతకారిణీం బ్రహ్మ విష్ణు శివాత్మికామ్,
స సంజ్ఞాం యాతి భగవానేక ఏవ జనార్దనః.

ప్రథమమున ఈశ్వరాత్మగా మాయారూపుఁడయి ఈశ్వరుఁడుండును. అతఁడు తరువాత మూర్తిరూపముతో బ్రహ్మ విష్ణు శివాత్మకుఁ డయి యుండును. ఆరూపములతో క్రమముగ సృష్టిస్థితిసంహారరూపములగు కృత్యముల నొనర్చుచుండును. పరమాత్మ శక్తిద్వారముగా నియమనాది కార్యముల నొనర్చుచుండు నను విషయ మీ యుపనిషత్తునందే ముం దిట్లు చూపింపఁబడియున్నది —

మం. .. .. .. య ఇమాఀ ల్లోకా నీశత ఈశనీభిః, ప్రత్యఙ్ జనా స్తిష్ఠతి సంచుకోచా న్తకాలే సంసృజ్య విశ్వా భువనానిగోపాః.

శ్వేతాశ్వ. 3-౨.

ఈశనీభిః అనఁగా "జననీభిః పరమశక్తిభిః" అని విశేషణము చెప్పఁబడినది.

'బ్రహ్మ విష్ణు శివా బ్రహ్మన్ ప్రధానా బ్రహ్మశక్తయః' అని స్మృతి.

3-వ అర్థాంతరము.

స్వగుణైః=బ్రహ్మ పరతంత్రములయినట్టియు, ప్రకృత్యాది విశేషణములు కలిగినట్టియు, ఉపాధులచేత, నిగూఢాం = గూఢమయియున్న, దేవాత్మశక్తిం = ప్రకృతిపురుష ఈశ్వరులను స్వరూపభూతముగా నున్న పరాశక్తిని, (జగత్కారణముగా నెఱింగిరి.) దేవాత్మశక్తి శబ్దనిర్వచనము — దేవాశ్చ ఆత్మాచ శక్తిశ్చ యస్య పరబ్రహ్మణః అవస్థాభేదాః తాం ప్రకృతి పురుషేశ్వరాణాం స్వరూపభూతాం బ్రహ్మరూపేణ అవస్థితాం పరాత్పరతరాం శక్తిం కారణ మపశ్యన్. ఈయుపనిషత్తునందే ముందు ముందీ ప్రకృతి పురుష ఈశ్వరులయొక్కస్వరూప మిట్లు ప్రకటింపఁబడియున్నది -

మం. ఏతత్ జ్ఞేయం నిత్యమేవాత్మసంస్థం నాతఃపరం వేదితవ్యం హి కించిత్,
భోక్తాభోగ్యం ప్రేరితారంచమత్వా సర్వంప్రోక్తంత్రివిధం బ్రహ్మమేతత్.
శ్వేతాశ్వ. ౧-౧౨.

జ్ఞాజ్ఞౌ ద్వా వజా వీశానీశా వజాహ్యేకా భోక్తృభోగ్యార్థయుక్తా,
అనంతశ్చాత్మా విశ్వరూపోహ్యకర్తా త్రయం యదా విందతే బ్రహ్మ
మేతత్. శ్వేతాశ్వ. ౧-౯.

'స్వగుణైః నిగూఢాం' అనువాక్య మిట్లు వివరింపఁబడినది —
స్వగుణైః=బ్రహ్మపరతంత్రైః ప్రకృత్యాది విశేషణైః ఉపాధిభిః నిగూఢాం
అని. అనఁగా బ్రహ్మపరతంత్రములగు ప్రకృతి మున్నగు విశేషణములుగల
ఉపాధులచేత ఆచ్ఛాదితమయియుండునది యని నిగ్రహించవలయును.

శ్రు. ౧. ఏకో దేవ స్సర్వభూతేషుగూఢః. శ్వేతాశ్వ. ౬-౧౧.
„ ౨. తందుర్దర్శం గూఢమనుప్రవిష్టమ్. కఠ. ౨౧౨.
„ 3. యో వేద నిహితం గుహాయామ్. తై. ఉ. ౨-౧.
„ ౪. ఇహైవ సంతం న విజానంతిదేవాః.
మున్నగు శ్రుతు లీ యర్థమునే ప్రతిపాదించుచున్నవి.

## ౪-వ అర్థాంతరము

స్వగుణైః=సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వాదిగుణములచేత, నిగూఢాం =
నిగూఢమయినట్టియు, దేవాత్మశక్తిం = ప్రకాశస్వరూపుఁడగు పరమాత్మ
యొక్క జగదుత్పత్తిస్థితిలయనియమనశక్తిని, జగత్కారణమునుగా నెఱిం
గిరి.

దేవాత్మ శక్తివివరణము — "దేవాత్మనః ద్యోతనాత్మనః ప్రకాశ
స్వరూపస్య జ్యోతిషాం జ్యోతీరూపస్య ప్రజ్ఞానఘనస్వరూపస్య పరమాత్మనః
'దుదయస్థితిలయ నియమనవిషయాంశక్తిం సామర్థ్యం అపశ్యన్" అనియు,

స్వగుణైః=స్వవ్యాప్తిభూతైః సర్వజ్ఞత్వ సర్వేశిత్వత్వాదిభిః నిగూఢాం = తత్తద్విశేషరూపేణ అవస్థితత్వాత్ స్వరూపేణ శక్తిమాత్రరూపేణ అనుపలభ్యమానామ్.

ఈ పరమేశ్వరశక్తిని వేఱువిధముగా నెఱుంగవలయునేగాని స్వరూపముతో నెఱుంగుటకు శక్యము కాదనువిషయ మీయుపనిషత్తునందే ముందిట్లు చెప్పఁబడినది —

మం. నతస్యకార్యం కరణంచ విద్యతే నతత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే,

పరాఽస్యశక్తి ర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియాచ.

శ్వేతాశ్వ. ౬-౮.

మొట్టమొదట 'కిం కారణం' అను ప్రశ్నమునందున్నూ, 'దేవాత్మశక్తిం' అను ప్రశ్నసమాధానమునందున్నూ యేయేపక్షభేదములు గ్రహింపఁబడినవో అవియన్నియు నీ మంత్రవ్యాఖ్యానమునందు మూలానుసారము సంగ్రహింపఁబడినవి. ఈవిషయములన్నియు నీయుపనిషత్తునందు ముందు ముందు చక్కఁగా వివరింపఁబడియున్నవి. ప్రస్తుతము కాబట్టియే అవి యీయుపనిషత్తునందు వివరింపఁబడినవని యెఱుంగవలయును. ప్రశ్నోత్తరములు కూడ గనంబడుచున్నవి గనుక సంగ్రహముగ మొదట సూచించి తరువాత ఆవిషయమునే మఱల విస్తరించిచెప్పుట పూర్వాచార్యసంప్రదాయమని "ఇష్టం హి విదుషాం లోకే సమాసవ్యాసధారణం" అను సంప్రదాయవచనమువలన తెలియవచ్చుచున్నది. (కనుకనే 'అపశ్యంగోపాం' అను శ్రుతిస్థమగు గోపాశబ్దమునకు శ్రుతియే స్వయముగా నిట్లు వ్యాఖ్యానము నొనర్చినది — 'అపశ్యం గోపామిత్యాహ, ప్రాణావా గోపా ఇతి, అపశ్యం గోపామిత్యాహ, అసౌవా ఆదిత్యోగోపా ఇతి.'    తై. అర. ౪-౭-౧.

ఇదేవిధముగా బ్రహ్మశబ్దమునుగూర్చియు శ్రుతి ఈవిధముగా నిర్వచించుచున్నది —'అథ కస్మాదుచ్యతే బ్రహ్మ' అని ప్రారంభించి బృంహతి, బృంహయతి తస్మా దుచ్యతే పరం బ్రహ్మేతి.

అనఁగా సకృచ్ఛ్రుతమయిన బ్రహ్మపదమునకు నిమిత్తోపాదాన రూపములతో అర్థభేదమును శ్రుతియే స్వయముగా బోధించినది.

ప్రథమాధ్యాయము, ౪-వ మంత్రము.

అవ. జగత్కారణమగు బ్రహ్మము బండిచక్రముగా రూపించి యీ మంత్రమునందు వర్ణింపఁబడుచున్నది —

మూ॥ త మేకనేమిం త్రివృతం షోడశాంతం
శతార్థారం వింశతిప్రత్యరాభిః,
అష్టకై షడ్భి ర్విశ్వరూపైకపాశం
త్రిమార్గభేదం ద్వినిమిత్తైకమోహమ్ ౪

పద. తం ఏకనేమిం త్రివృతం షోడశాంతం శతార్థారం వింశతిప్రత్యరాభిః, అష్టకైః షడ్భిః విశ్వరూపైకపాశం త్రిమార్గభేదం ద్వినిమిత్తైకమోహమ్. ౪

టీ. తం = (పూర్వోక్తమగు రెండవమంత్రమునందు జగత్కారణముగా వివిధవాదులు తలంచిన కాలాది సర్వజగత్కారణములకు అధికరణభూతుఁ డయియున్న) ఆపరమాత్మను, ఏకనేమిం=కారణావస్థయను ఒకే నేమిగాఁ గలవానిగను, నేమియనఁగా బండియొక్క చక్రమునకు చుట్టు బిగింపఁబడియుండు యినుపపట్ట) త్రివృతం=సత్వరజస్తమస్సులను ప్రకృతి సంబంధమయిన గుణత్రయముచేత ఆవరింపఁబడినవానిగను, షోడశాంతం= పదునారు అంతముగాఁ గలవానిగను, శతార్థారం=ఏబదిఅరములు గలవానిగను, (అరములనఁగా బండిఆకులు) వింశతిప్రత్యరాభిః = ఇరువదిప్రత్యరములు గలవానిగను, (ప్రత్యరములనఁగా బండిఆకులయొక్క బిగువునకు వేయఁబడిన కీలకములు) షడ్భిః=ఆఱైన, అష్టకైః=అష్టకములతో గూడియు

న్నవానిగను, విశ్వరూపైకపాశం = నానావిధరూపములు గలకామమనెడి పాశముగలవానిగను, త్రిమార్గభేదం=ధర్మ,అధర్మ, జ్ఞానములను మూడుభేద ములు గలమార్గములు గలవానిగను, ద్వినిమిత్తైకమోహం=పుణ్యాపుణ్యము లను నిమిత్తద్వయమునందు ముఖ్యమయిన మోహముగలవానిగను, (అప శ్యన్=ఎఱిఁగిరి.)

తా. పూర్వమంత్రమునందు మాయావిశిష్టుఁ డగుపరమాత్మయొక్క శక్తియే జగత్కారణమనియు, జగత్తునకు అతఁడే అభిన్ననిమిత్తోపాదాన కారణుఁడనియు,అతఁడు మాయాసహితుఁ డగుటచేత ఈశ్వరత్వ, సర్వజ్ఞత్వ, దేవత్వాది గుణవిశిష్టుఁడనియు, అమాయిత్వముచేత సత్యజ్ఞానానందరూపత్వ ము కలిగియున్నాఁడనియు సంగ్రహముగ నిరూపింపఁబడినది. కార్యకార ణము లనన్యములని ప్రతిపాదించుచు ఆయాత్మనే సర్వాత్మస్వరూపునిగ నీ మంత్రమునందు తెలుపుచున్నారు —

'వాచారంభణం వికారో నామధేయం, మృత్తికేత్యేవసత్యం' అను న్యాయము ననుసరించియు, 'అద్వితీయమును, అనపరమును, అపూర్వమును, నేతినేతి అనియు, అవాఙ్మానసగోచరమును, అశనాయాద్యసంస్పృష్టమును, ప్రత్యస్తమితభేదమును, చిత్సదానందమును అగు బ్రహ్మాత్మత్వమును నిరూ పింపఁదలఁచి ప్రకృతివశముచేత ప్రపంచమనెడి భ్రాంత్యవస్థనుపొందిన పరబ్రహ్మమును సర్వజ్ఞత్వ, అపహతపాప్మత్వాదిరూపముచేత ఈశ్వరా త్మునిగను, బ్రహ్మాదిరూపముచేత దేవతాత్మునిగను, వైశ్వానరాదిరూపము చేత కార్యాత్మునిగను, మోక్షమునకు కావలసిన చిత్తశుద్ధినిమిత్తము న్నూ, లేక తత్తల్లోకప్రాప్తి నభిలషించిన తదర్థమున్నూ తత్తద్దేవతా సాయుజ్యాదిప్రాప్త్యర్థమున్నూ ఉపాసనార్థముగా లోకశాస్త్రప్రసిద్ధమ యిన మాహాత్మ్యము తెలుపఁబడుచున్నది. ఆ పరమేశ్వరుఁడు కార్యకారణ రూపముగను, పారమార్థికముచేత సచ్చిదానందాద్వితీయ బ్రహ్మాత్మస్వరూపు నిగను లేనియెడల భోగ్య, భోక్తృ, నియంతలు లేకపోవుటచేత సంసార

మోక్షములు లేకపోవలసివచ్చును. పరమేశ్వరుఁడు సంసారాదికమునకు హేతుభూతుఁ డనువిషయమును "సంసారమోక్షస్థితిబంధహేతుః" అనుశ్రుతి ప్రతిపాదించుచున్నది. ఆప్రపంచస్థితినిమిత్తము ప్రపంచాద్యవస్థానమును శ్రుతిస్మృతు లిట్లు విధించుచున్నవి —

౧. ఏకం పాదం నోత్క్షిపతి సలిలా ద్ధంస ఉచ్చరన్,
సచే దవింద దానందం న సత్యం నానృతం భవేత్.

అథర్వ. ౧౧-౪-౨౧.

౨. పాదోఽస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతందివి.

తై. ఆ. 3-౧౨-౨.

స్మృతి:—ఏకం పాదం నోత్క్షిపతి. సనత్సుజాతీయము. ౬-౧౧.

ఈమంత్రమునందు చక్రాత్మకముగ బ్రహ్మమును నిరూపించుచున్నాఁడు. పైమంత్రమునందు నదిరూపముగ నిరూపింపఁబడును —ఎవఁడు కాలాది సకల కారణములను నిరసించి తానే ముఖ్యకారణభూతుఁడుగా జగత్తునకు వెలయుచున్నాఁడో అతఁడు ఏకనేమి యనంబడుచున్నాఁడు.(యోని, కారణము, అవిద్య, అవ్యాకృతము, ఆకాశము, పరమవ్యోమ, మాయా, ప్రకృతి, శక్తి, తమస్సు, ఛాయా, అజ్ఞానము, అనృతము మున్నగుశబ్దములచేత చెప్పఁబడు కారణావస్థయే ఇచట నేమియని చెప్పఁబడినది) సత్వ, రజ, స్తమస్సులను ప్రకృతియొక్క గుణత్రయముచేత ఆవరింపఁబడియున్నవానిగను, భూతపంచకము, జ్ఞానేంద్రియపంచకము, కర్మేంద్రియపంచకము, మనస్సు అను ౧౬టియొక్క అంతమునందున్నవానిగను, (లేక ప్రశ్నోపనిషత్తునందు 'సప్రాణ మసృజత' అను మంత్రమునందు చెప్పఁబడిన షోడశకలలకు అంతభూతుఁడును, లేక(ఏకనేమి యనునప్పుడు కారణభూతమయిన అవ్యాకృతావస్థ చెప్పఁబడినది.) తత్కార్యమయిన సమష్టిభూతవిరాట్సూత్రాత్మలు రెండున్నూ తద్వ్యష్టిభూతమయిన భూరాది ౧౪ భువనములంగలసి ౧౬ అగును.

ఇవి అవసానమునందు గలవాఁడును, ప్రపంచాత్మగా నుండువానికి పైన చెప్పిన ౧౬ అవసానములు కలుగుట సహజము. శతార్ధారునిగను, శతార్ధ మనఁగా ౫౦ ఏబది అరములుగాఁ గలవాఁడు. అరములు అనఁగా చక్రము నందున్న ఆకులు. విపర్యయ, అశక్తి, తుష్టి, సిద్ధులను ౫౦ ప్రత్యయములు. ఇచ్చట అరములుగా నిరూపింపఁబడినవి. వీనిఁగా

| | | |
|---|---|---|
| విపర్యయము | ౫ | భేదములు. |
| అశక్తి | ౨౮ | ,, |
| తుష్టి | ౯ | ,, |
| సిద్ధి | ౮ | ,, |
| మొత్తము | ౫౦ | ,, |

దశేంద్రియములును, తద్విషయములును ప్రత్యరములుగా గల వాఁడును, ౬ అష్టకములతో కూడుకొనియున్నవాఁడున్నూ, నానావిధ స్వర్గ పుత్రాదివిషయమగుటచేత విశ్వరూపమగు కామమను పాశముగలవానిగను, ధర్మ, అధర్మ, జ్ఞానములను వేఱువేఱయిన మార్గత్రయముగలవానిగను, పుణ్యపాపములే నిమిత్తముగాఁగల దేహేంద్రియ మనోబుద్ధ్యాదులగు అనాత్మలయందు ఆత్మాభిమానముగలవానిగను తెలిసికొనిరి. అని వెనుకటిమంత్రము నందుగల 'అపశ్యన్' అను క్రియను ఇచటికి గ్రహించవలయును. లేదా రాఁబోవుమంత్రమునందుగల 'అధీమః' అను క్రియను గ్రహించి ధ్యానించి రని యైనను చెప్పవచ్చును.

## వ్యాఖ్యానమునందు సూచింపఁబడిన విపర్య యాదికముయొక్క వివరము.

౧. విపర్యయము ౫ విధములు.—౧ తమస్సు, ౨. మోహము. ౩. మహామోహము, ౪. తామిస్రము, ౫. అంధతామిస్రము.

౧. తమస్సు ౮ విధములు:— అనాత్మలగు అష్టప్రకృతులందు ఆత్మబుద్ధినుంచుట. అను విషయభేదముచేత అష్టవిధమని గ్రహించునది.

౨. మోహము ౮ విధములు:— అణిమాద్యష్ట శక్తులందు గల ప్రీతి అష్టవిధము.

3. మహామోహము ౧౦ విధములు:— దృష్టానుశ్రావికభేదములతో శబ్దాదివిషయపంచకమునందు గలఅభినివేశము. ఒక్కొకదానికి దృష్టము, (చూచినది) అనుశ్రావికము, (విన్నది) అని రెండేసిభేదములతో ౫ న్నూ ౧౦ అగుచున్నవి.

౪. తామిస్రము ౧౮ విధములు —దృష్టానుశ్రావికములగు శబ్దాది దశవిధేంద్రియ విషయములందు అష్టవిధ అణిమాద్యైశ్వర్యములతో ప్రయత్నించుచున్నప్పుడు అవి తనకు ప్రాప్తించనప్పుడు కలిగెడిక్రోధము తామిస్రము.

౫. అంధతామిస్రము ౧౮ విధములు — అష్టవిధైశ్వర్యములు, దశవిధేంద్రియవిషయములు భోగ్యముగా లభించినప్పుడు సగము అనుభవించుచుండఁగా మరణకాలము సమీపించినయెడల అయ్యో ఇంతకష్టపడి వీనిని సంపాదించుకొంటినే, సమగ్రముగా వీనిని అనుభవింపకయే చచ్చిపోవుచున్నాఁడనే అని శోకించుచుండుట అంధతామిస్రము.

ఇది విపర్యయవివరణము.

---

౨. అశక్తి ౨౮ విధములు — మూకత్వ, బధిరత్వ, అంధత్వాదికములగు ఏకాదశేంద్రియములయొక్క అశక్తులు. ౧౧

అంతఃకరణమునకు పురుషార్థయోగ్యతాతుష్టి లేక పోవుట. } ౯

అష్టవిధసిద్ధులు పొందుటకు అశక్తి. ౮

౨౮.

---

3. తుష్టి ౯ విధములు — ప్రకృతి, ఉపాదాన, కాల, భాగ్యము లని ౪ విధములున్నూ, విషయోపరమతుష్టి — ఆర్జన, రక్షణ, విషయ, సంగ, హింసలను దోషదర్శనముచేత ౫ విధములు లేకయుండుటయు కలసి మొత్తము ౯ విధములు.

౧. ప్రకృతితుష్టి — ఒకఁడు ప్రకృతిపరిజ్ఞానముచేత కృతార్థుఁడ నైతినని తలంచును.

౨. ఉపాదానతుష్టి — మఱొకఁడు యత్యాశ్రమము స్వీకరించి అంతమాత్రముచేతనే కృతార్థుఁడనైతినని తలంచును.

3. కాలతుష్టి — ప్రకృతిపరిజ్ఞానమువలన మనకేమి లభింపఁగలదు? యత్యాశ్రమము స్వీకరించినంతమాత్రమున మనకు రాఁబోవునది యేమి? మోక్షము మనకు రావలసిఉంటే ఆకాలమునకు అదియే వచ్చితీరునని తలంచుచు ఉపేక్షగానుండుట.

౪. భాగ్యతుష్టి - ఏమిచేసియు ఏమిప్రయోజనము లేదు. మోక్షము లభింపవలసిన భాగ్యము మనకుఉంటే అది వచ్చియే తీరునని తలంచుట.

౫ ఆర్జనతుష్టి — విషయోపభోగములను సంపాదించుట కష్టము కనుక తత్ప్రయత్నము వలదని ఉపరమించుట.

౬. రక్షణతుష్టి — సంపాదించుటయే కష్టము, అథవా సంపాదించి తిమిపో, ఆ సంపాదించినదానిని పోకుండా నిలుపుకొనుట మఱింత కష్టమని తలంచి తత్ప్రయత్నమునుండి విరమించుట.

౭. విషయతుష్టి — మనము కష్టపడి సంపాదించినదానికంటె అతి శయముగ మఱికొన్నియుండి అవి లభింపలేదే అని దుఃఖము కలుగుట సహజమని తత్ప్రయత్నమునుండి విరమించుట.

౮. సంగతుష్టి. — విషయము లనుభవించినకొలఁది వానియందు అభి లాష వృద్ధిచెందునే గాని తృప్తి కలుఁగఁజాలదు. 'న జాతు కామః కామానాం

ఉపభోగేన శామ్యతి, హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే' అని చెప్పఁబడియున్నది కావున అనుభవించినకొలఁది సంతోషము లభింపక అత్యాశను కలుగఁజేయు విషయోపభోగము నాకసలేవలదని తలంచుట.

౯. హింసాతుష్టి —ఒకరిని కష్టపెట్టక భోగము లభింపదు. ఇతరుల పీడించుట అధర్మము. అధర్మమువలన నరకము. ఇటుల హింసాదోషములు విషయాభిలాషయందు గనంబడుచున్నవి కావున నాకవి అక్కఱలేదని తలంచుట.

ఇవి నవవిధతుష్టులు.

౪. అష్టవిధసిద్ధులు—౧ ఊహ. ౨ శబ్దము. 3 అధ్యయనము. అని మూఁడున్నూ,
౪. ఆధ్యాత్మిక. ౫ ఆధిభౌతిక. ౬ ఆధిదైవిక దుఃఖ నివారణము. అని మూఁడున్నూ,
౭. సుహృత్ప్రాప్తి. ౮ దానసిద్ధులు అని ౨—మొత్తము—౮.

౧. ఊహాసిద్ధి —పారమార్థికార్థమును తెలిసికొననిచ్ఛకలిగి తత్ప్రయత్నము చేయుచుండఁగా జన్మాంతరకృత సంస్కారబలమువలన ఆచార్యాద్యుపదేశము లేకయే యథార్థజ్ఞానము కలుగుట.

౨. శబ్దసిద్ధి —నిరంతరాభ్యాసములేక సకృచ్ఛ్రవణమాత్రముచేతనే జ్ఞానమును పొందుట.

3. అధ్యయనసిద్ధి —శాస్త్రాధ్యయనమువలన లభించెడి జ్ఞానము.

౪. ఆధ్యాత్మికసిద్ధి
౫. ఆధిభౌతికసిద్ధి
౬. ఆధిదైవికసిద్ధి
} ఈ త్రివిధదుఃఖములందు ఉదాసీనుఁ డయియుండుటవలన శీతోష్ణాదిద్వంద్వములందు హర్షశోకములను పొందకపోవుటవలన కలిగెడి త్రివిధమయిన జ్ఞానము.

౭. సుహృత్సిద్ధి —మిత్రునిమూలకముగా జ్ఞానమును పొందుట.

౮. దానసిద్ధి — ఆచార్యాభిమతమగు వస్తువునొసంగి తన్మూలమున విద్యాప్రాప్తి.

ఇటుల విపర్యయ, అశక్తి, తుష్టి, సిద్ధిభేదములతోఁగల పంచాశత్ప్రత్యయములవివరణము బ్రహ్మపురాణమునందు ౬౦-వ అధ్యాయమునందు చక్కఁగా నిరూపింపఁబడియున్నది.

౨౦ ప్రత్యరములు —

| | | |
|---|---|---|
| జ్ఞాన, కర్మేంద్రియములు | ౧౦ | కలసి మొత్తము ౨౦ ప్రత్యరములు. |
| తద్విషయములు | ౧౦ | |

శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ, వచన, ఆదాన, విహరణ, ఉత్సర్గ, ఆనందములను ౧౦ ఇంద్రియవిషయములు.

అష్టకములు ౬:—౧. ప్రకృత్యష్టకము. ౨ ధాత్ర్వష్టకము. 3 ఐశ్వర్యాష్టకము. ౪ భావాష్టకము. ౫ దేవాష్టకము. ౬ ఆత్మగుణాష్టకము. అని అష్టకములు ౬.

౧. ప్రకృత్యష్టకము —

శ్లో. భూమి రాపో ఽనలో వాయుః ఖం మనో బుద్ధి రేవచ,
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా.

భగవద్గీత. ౭. ౪.

పంచభూతములు, మనస్సు, బుద్ధి, అహంకారము అను ౮-ది ప్రకృత్యష్టకము.

౨. ధాత్వష్టకము —

త్వక్కు, చర్మము, మాంసము, రుధిరము, మేదస్సు, అస్థి, మజ్జా, శుక్లములు అను ౮-ది ధాత్వష్టకము.

3. ఐశ్వర్యాష్టకము —

శ్లో. [1]అణిమా [2]మహిమాచైవ [3]గరిమా [4]లఘిమా తథా,
[5]ప్రాప్తిః [6]ప్రాకామ్య [7]మీశిత్వం [8]వశిత్వం చాష్టభూతయః.

అను శ్లోకోక్తములగు ౮ విభూతులు ఐశ్వర్యాష్టకము.

౪. భావాష్టకము—

[1]ధర్మ, [2]జ్ఞాన, [3]వైరాగ్య, [4]ఐశ్వర్య, [5]అధర్మ, [6]అజ్ఞాన, [7]అవైరాగ్య [8]అనైశ్వర్యములను ౮-ది భావాష్టకము.

౫. దేవాష్టకము.—

శ్లో. [1]బ్రహ్మ [2]ప్రజాపతి [3]ర్దేవా [4]గంధర్వాః [5]యక్ష [6]రాక్షసాః,
[7]పితరశ్చ [8]పిశాచాశ్చ దేవాష్టక ముదాహృతమ్.

అని పైశ్లోకోక్తములగు ౮-ది దేవాష్టక మనంబడును.

౬. ఆత్మగుణాష్టకము.—

దయా, క్షాంతి, అనసూయ, శౌచము, అనాయాసము, మంగలము, అకార్పణ్యము, అస్పృహ. అను ౮-ది ఆత్మగుణాష్టకము.

ప్రథమాధ్యాయము, ౫-వ మంత్రము.

అవ. గతమంత్రమునందు చక్రరూపముగ నిరూపింపఁబడిన పరమాత్మతత్త్వ మీమంత్రమునందు నదీరూపముగ నిరూపింపఁబడుచున్నది —

మూ పంచస్రోతోఽమ్బుం పంచయోన్యుగ్రవక్రాం
పంచప్రాణోర్మిం పంచబుద్ధ్యాదిమూలామ్,
పంచావర్తాం పంచదుఃఖౌఘవేగాం
పంచాశద్భేదాం పంచపర్వా మధీమః ౫

పద. పంచస్రోతోఽంబుం పంచయోన్యుగ్రవక్త్రాం పంచప్రాణోర్మిం పంచబుద్ధ్యాదిమూలామ్, పంచావర్తాం పంచదుఃఖౌఘవేగాం పంచాశద్భేదాం పంచపర్వాం అధీమః. ౫

టీక. తం=ఆపరమాత్మను, పంచస్రోతోఽంబుం = (త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములను) పంచేంద్రియములే ప్రవాహజలముగాగలదానిగను, పంచయోన్యుగ్రవక్త్రాం = కారణభూతములగు పంచమహాభూతములచేత మిక్కిలి కుటిలమైనదానిగను, పంచప్రాణోర్మిం = (వాక్పాణిపాదపాయూపస్థములను) పంచేంద్రియములు అలలుగాగలదానిగను, పంచబుద్ధ్యాదిమూలాం=జ్ఞానేంద్రియములవలన పుట్టిన పంచవిధజ్ఞానములకు కారణభూతమయినమనస్సే కారణముగాఁగలదానిగను, పంచావర్తాం=అయిదైన శబ్దాది విషయములే సుళ్లుగాగలదానిగను, పంచదుఃఖౌఘవేగాం=(గర్భదుఃఖ,జన్మదుఃఖ, వ్యాధిదుఃఖ, జరాదుఃఖ, మరణదుఃఖములను) పంచవిధదుఃఖములను ప్రవాహవేగముగాఁగలదానిగను, పంచాశద్భేదాం = తమో, మోహ, మహామోహాది) ౫౦ భేదములుగలదానిగను, పంచపర్వాం = (అవిద్య, అస్మిత, రాగ, ద్వేష, అభినివేశములను) పంచవిధక్లేశములుఁగలదానిగను, అధీమః=ధ్యానించుచున్నారము.

తా. త్వక్కు, చక్షుస్సు, శ్రోత్రము, జిహ్వ, ఘ్రాణము, అను ౫ దు జ్ఞానేంద్రియములను జలప్రవాహము కలిగినట్టియు, కారణభూతములయిన పంచమహాభూతములచే తీక్ష్ణమయినదియును కుటిలమైనట్టియు, పంచప్రాణములులేక వాక్పాణిపాదపాయూపస్థములను కర్మేంద్రియపంచకము అలలుగాకలిగినట్టియు, చక్షురాదిపంచవిధ జ్ఞానేంద్రియములవలన దర్శనాది జ్ఞానపంచకమునకు కారణభూతమయిన మనస్సే మూలకారణముగా కలిగినట్టియు, జ్ఞానేంద్రియపంచకముయొక్క దర్శనాది జ్ఞానసముదాయము మనోవృత్తిరూపమేకదా, సంసారమనునదికి మనస్సేకారణమను విషయము

సుప్రసిద్ధమేకదా. మనస్సే సర్వమునకు హేతుభూతమనువిషయ మిట్లు చెప్పఁబడినది —

శ్లో. మనోవిజృంభితం సర్వం యత్కించి త్సచరాచరమ్,
మనసోహ్యామనీభావే ద్వైతం నైవోపలభ్యతే.

అర్థ. చరాచరరూపమగు ప్రపంచమంతయు మనస్సుయొక్క విజృంభితముగాని తద్భిన్నముగ నేమియులేదు. మనస్సు అమనీభావము కలిగినప్పుడు ద్వైతము కనంబడఁజాలదు.

శబ్దాదివిషయపంచకము ఆవర్తము—సుడిగుండమువంటిది. ప్రాణులీసుడిగుండములందుపడి మునిఁగిపోవుచుందురు. ఈశబ్దాదివిషయపంచకమే సుడిగుండములుగా కలిగినట్టియు, ఇట్లే గర్భదుఃఖ, జన్మదుఃఖ, వ్యాధిదుఃఖ, జరాదుఃఖ, మరణదుఃఖములను ప్రవాహవేగపంచకము కలిగినట్టియు, పూర్వమంత్రోక్తములగు ౫౦ భేదములుకలిగినట్టియు, అవిద్య, అస్మిత, అసక్తి, రాగము, అభినివేశము అను ౫ దు పర్వములు (మెట్లుగా) కలిగినట్టియు నదీస్వరూపముగ పరబ్రహ్మమును ధ్యానించుచున్నారము.

వివరణము —నారాయణదీపికయందు పంచబుద్ధులనగా—బుద్ధి, మనస్సు, చిత్తము, అహంకారము, విషయవాసనయని చెప్పఁబడినది. 'పంచాశద్భేదాం' అనుదానియొక్క వివరణ మిట్లు తెలుపఁబడినది —

ఆధ్యాత్మవివేకమగు గ్రంథమునందు చిత్తము మూలాధారాదిచక్రములందుగల పంచాశద్దలములందు సంచరించుచుండఁగా ౫౦ విధములయిన బుద్ధులుకలుగునని యిట్లు తెలుపఁబడినది:—

శ్లో. గుదలింగాంతరే చక్రమాధారంతు చతుర్దళమ్ (౪),
పరమ స్సహజ స్తద్వ దానన్దో వీరపూర్వకః.

యోగానన్దశ్చతస్యస్యా దీశానాది దళేఫలమ్,
స్వాధిష్ఠానే లింగమూలే షట్పత్రం (౬) చక్రమస్యతు,
పూర్వాదిషు దళేష్వాహుః ఫలాన్యేతాన్యనుక్రమాత్,
ప్రశ్రయః క్రూరతా గర్వనాశో మూర్ఛా తతఃపరమ్,
అవజ్ఞా స్యా దవిశ్వాసో జీవస్యచరతోధ్రువమ్,
నాభౌ దశదలం (౧౦) చక్రం మణిపూరకసంజ్ఞకమ్,
సుషుప్తి రత్ర తృష్ణాస్యా దీర్ష్యా పిశునతా తథా,
లజ్జా భయం ఘృణా మోహః కుథియోఽథవిషాదతా,
హృదయేఽనాహతంచక్రం దళైర్ద్వాదశభి (౧౨) ర్యుతమ్,
లౌల్యంప్రణాశః కపట వితర్కోఽప్యనుతాపితా,
ఆశా ప్రకాశశ్చింతాచ సమీహా సమతా తతః,
క్రమేణ దంభో వైకల్యం వివేకోఽహంకృతి స్తథా,
ఫలాన్యేతానిపూర్వాది దళస్థస్యాత్మనో విదుః,
కంఠేస్తి భారతీస్థానం విశుద్ధిః షోడశచ్ఛదమ్,
తత్ర ప్రణవఉద్గీథౌ హుంఫట్ వషడథస్వధా,
స్వాహానమోఽమృతం సప్త స్వరాష్షడ్జాదయో మతాః,
ఇతిపూర్వాదిపత్రస్థం ఫలాన్యాత్మని షోడశ.

అర్థ. గుదలింగాంతరస్థానమునందు మూలాధారచక్రముండును, ఇది నాల్గుదళములు గలది. ఈశానాదిదళచతుష్టయమునందు జీవుఁడు చరించుచుండఁగా ౧ పరమానందము, ౨ సహజానందము, 3 వీరానందము, ౪ యోగానందము కలుగును లింగమూలమునందు షడ్దళాత్మకమగు స్వాధిష్ఠానచక్రముండును. పూర్వాదిదళషట్కమునందు జీవుఁడు చరించుచుండగ క్రమముగ వినయము, క్రూరత్వము,గర్వనాశము, మూర్ఛ, అవజ్ఞ,

అవిశ్వాసము కలుగును. నాభియందు దశదళాత్మకమగు మణిపూరక చక్రముగలదు. జీవుఁడు పూర్వాదిక్రమముగ ఆమణి పూరకచక్రదళము లందు సంచరించుచున్నప్పుడు, పుష్టి, ఆశ, ఈర్ష్య, లోభిత్వము, లజ్జ, భయము, నింద, మోహము, దుర్బుద్ధులు, దుఃఖము అను ౧౦ గుణము లేర్పడును. హృదయమునందు ౧౨ దళములుగల అనాహత చక్రము గలదు. ఆచక్రదళములందు జీవుఁడు సంచరించుచున్నప్పుడు, లోలత్వనాశనము, కపటము, సంశయము, అనుతాపము, ఆశాప్రకాశము, చింత, సమీహ, సమత్వము, దంభము, వైకల్యము, వివేకము, అహంకారము కలుగును, కంఠమునందు షోడశదళములుగల విశుద్ధిచక్రముగలదు. ఆవిశుద్ధిచక్ర షోడశదళములందు జీవుఁడు సంచరించుచున్నప్పుడు ప్రణవము, ఉద్గీథము, హుం, ఫట్, వషట్, స్వధా, స్వాహా, నమః, అమృతము, షడ్జ, పంచమ, గాంధార, నిషాద, ఋషభ, ధైవత, మధ్యమములను సప్తస్వరము లేర్పడును. షోడశదళచక్రవిషయమయి మఱొకచోట ప్రకారాంతరము చెప్పఁబడినది. కృప, క్షమ, ఆర్జవము, ధైర్యము, వైరాగ్యము, ధృతి, సమత్వము, హాస్యము, రోమాంచము, ధ్యానము, సుస్థిరత్వము, గాంభీర్యము, ఉద్యమము, సత్వము, ఔదార్యము, ఏకాగ్రత్వము అని ౧౬ గుణములని చెప్పఁబడినది. దళద్వయముగల ఆజ్ఞాచక్రమునందు తత్త్వంపదార్థావభాస మని యెఱుంగవలయును. ఇటుల మొత్తము ౫౦ భేదములని యెఱుంగ వలయును. లేక ఓంకారమునకు ౫౦ కళలు, ఆ ౫౦ కళలనుండి ౫౦ వర్ణములు, ఆ ఏబదివర్ణములనుండి వర్ణాత్మకమగు వేదము, వేదమునుండి తదనుసారము సృజింపఁబడిన జగత్తు. ఇట్లు బుద్ధి జగద్విషయమైనదియై తత్కారణ భూతములగు ౫౦ వర్ణములను అనుసరించుచున్నది.

అవిద్యాదిపంచకవివరణము —

౧. అవిద్య = అవిద్య, అశుచి, అనిత్యస్వరూపుఁడగు జీవునియందు విపరీతజ్ఞానము-అనగా నిత్యుఁడు పవిత్రుఁడు, జ్ఞానస్వరూపుఁడని తలంచుట.

౨. అస్మిత = విభిన్నులగు బుద్ధ్యాత్మలను ఒక్కరేయని తలంచుట.

3. ఆసక్తి = సుఖమునందే ఆసక్తికలిగియుండుట.

౪. రాగము = దుఃఖమునందు ప్రీతిలేకయుండుట.

౫. అభినివేశము = తన కిదివఱకు అనుభవగోచరముకాని మరణాదికమునందు భయంపడుట. ఈ ౫ న్నూ బుద్ధియొక్క వృత్తివిశేషములు.

ఈ మంత్రత్రయముచేత కింకారణం బ్రహ్మ, అను ప్రశ్నకు ఉత్తరము చెప్పఁబడినది.

ప్రథమాధ్యాయము, ౬-వ మంత్రము.

అవ. కార్యకారణాత్మకమగు బ్రహ్మము బ్రహ్మచక్రరూపముగను నదీరూపముగను వెనుకటిమంత్రములందు నిరూపింపఁబడినది. ఈ చెప్పఁబోవు మంత్రమునందు ఇట్టి బ్రహ్మచక్రమునందు జీవుఁడు దేనిచేత భ్రమించుచున్నాఁడు? దేనిచేత విముక్తినిపొందఁగలఁడు? అనువిషయము—అనఁగా సంసారమోక్షములయొక్కస్థితి ప్రతిపాదింపఁబడుచున్నది —

మూ॥ సర్వాజీవే సర్వసంస్థే బృహంతే
అస్మిన్ హంసో భ్రామ్యతే బ్రహ్మచక్రే,
పృథ గాత్మానం ప్రేరితారం చ మత్వా
జుష్ట స్తత స్తేనామృతత్వ మేతి.  ౬

పద. సర్వాజీవే సర్వసంస్థే బృహంతే అస్మిన్ హంసః భ్రామ్యతే బ్రహ్మచక్రే, పృథక్ ఆత్మానం ప్రేరితారం చ మత్వా జుష్టః తతః తేన అమృతత్వం ఏతి.  ౬

టీక. హంసః = జీవుఁడు, సర్వాజీవే = అందఱకు జీవనరూపమైన ట్టియు, సర్వసంస్థే = అందఱకు ప్రళయరూపమైనట్టియు, బృహంతే = గొప్పదియునగు, అస్మిన్ =ఈ బ్రహ్మచక్రమునందు, ఆత్మానం = జీవాత్మఁ డగుతనను, ప్రేరితారంచ = ప్రేరకుఁడగు ఈశ్వరునిని, పృథక్ = వేరుగా, మత్వా = తలంచినవాఁడయి, భ్రామ్యతే = (సురనరతిర్యగాదియోనులందు పుట్టుచుగిట్టుచు) తిరుగుచున్నాఁడు. తతః = తర్వాత, జుష్టః = (చిత్సదానందాద్వితీయబ్రహ్మాత్మస్వరూపుఁడను నేనేనని మనస్సమాధానమును)పొందిన వాఁడయి, తేన = అట్టి యీశ్వరానుసంధానముచేత, అమృతత్వం=అమృతత్వమును—మోక్షమును, ఏతి=పొందుచున్నాఁడు.

తా. అందఱకు జీవనరూపమయినట్టియు, అందఱకు ప్రళయరూపమయినట్టియు, అన్నిటికంటె గొప్పదయినట్టియు కార్యకారణాత్మకమయిన యీ బ్రహ్మచక్రమునందు జీవుఁడు ఆత్మకానట్టి దేహాదిసంఘాతమును ఆత్మనుగా తలంచుచున్నవాఁడయి దేవమానవపశ్వాది బహువిధశరీరములందు పుట్టుచుగిట్టుచు తిరుగుచున్నాఁడు. ఇటుల నానావిధయోనులందు పుట్టుచుగిట్టుచుండుటకు మూలకారణమేమనఁగా జీవాత్మభూతుఁడనగు నేను వేఱు, ప్రేరకుఁడగు ఈశ్వరుఁడు వేఱు అని జీవేశ్వరులకు విభేదమును తలంచుటయే యని యెఱుంగవలయును. ఇట్టి సంసారమునుండి విముక్తినందుటకు సాధనము చెప్పఁబడుచున్నది — నేను ఈశ్వరునికంటె విభిన్నుఁడనుకాను, చిదానంద, అద్వితీయ, బ్రహ్మాత్మస్వరూపభూతుఁడనేనేను, అని దృఢముగా నెఱింగినవాఁడయి దృఢానుసంధానము నెప్పుడొనర్చునో అప్పుడు విముక్తుఁడగును. ఎవ్వఁడు జీవుని పూర్ణానందస్వరూపుఁడగు బ్రహ్మభూతునిగా నెఱుంగునో వాఁడు విముక్తినందును. ఎవ్వఁడు తాను పరమాత్మకంటె వేఱయినవానినిగా భావించుచుండుకొనునో వాఁడు బద్ధుఁడగును.

బృహదారణ్యకోపనిషత్తునందు భేదదృష్టియే సంసారమునకు మూల కారణమని ఇట్లు చెప్పఁబడినది:—

యఏవం వేదాహం బ్రహ్మాస్మీతి స ఇదం సర్వంభవతీతి, తస్యహ న దేవాశ్చ నాభూత్యా ఈశతే, ఆత్మాహ్యేషాం సభవతి, అథయో ऽన్యాం దేవతా ముపాస్తే ऽసావన్యో ऽహమస్మీతి న స వేద యథాపశురేవం స దేవానామితి.

బృహదారణ్యకోపనిషత్. ౧-౪-౧౦.

అర్థ. 'నేనే బ్రహ్మము అయియున్నాను' అని ఎవ్వఁడు తలంచునో వాఁడు బ్రహ్మముగను సమస్తముగను అగును. వాఁడు దేవతలకంటెను శ్రేష్ఠుఁడు. ఈ దేవతలయొక్కయు ఆత్మయునగును. ఎవఁడు తనఆత్మ కంటె వేఱేదేవతయున్నదనియును, అది వేఱు నేను వేఱు అని తలంచి అన్యదేవతోపాసన చేయుచున్నాఁడో వాఁడు అవివేకి, మూఢుఁడు, పశు తుల్యుఁడు. దేవతలకు వాఁడు పశువైయున్నాఁడు.

విష్ణుధర్మమునందుకూడ ఇట్లే చెప్పఁబడియున్నది —

శ్లో. పశ్యత్యాత్మాన మన్యంతు యావద్వైపరమాత్మనః
తావత్సంభ్రామ్యతేజంతు ర్మోహితో నిజకర్మణా.
సంక్షీణాశేషకర్మాతు పరంబ్రహ్మ ప్రపశ్యతి
అభేదేనాత్మన శ్శుద్ధం శుద్ధత్వా దక్షయో భవేత్.

వివరణము —మూలద్వితీయపాదమునందు "అస్మిన్" అనుస్థానము నందు ఒక్క శంకరభాష్యమునందుతప్ప తక్కినవ్యాఖ్యానము లన్నిటి యందు 'తస్మిన్' అని చెప్పఁబడియున్నది.

ప్రేరితయనఁగా ప్రేరకుఁడగు ఈశ్వరుఁడని భగవద్గీత యిట్లు చెప్పుచున్నది:—

శ్లో. ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా.

అధ్యా. ౧౮-౬౧.

ఈయుపనిషత్తునందే ఈశ్వరునిగూర్చి యిట్లే చెప్పఁబడినది.

భోక్తా భోగ్యం ప్రేరితారంచ మత్వా సర్వంప్రోక్తం త్రివిధం బ్రహ్మ మేతత్.

శ్వేతాశ్వతర. ౧-౧౨.

భేదదృష్టివలన సంసారచక్రపరిభ్రమణము కలుగుచుండునని శ్రుతులి ట్లుపదేశించుచున్నవి:—

౧. మృత్యోస్సమృత్యుమాప్నోతి యఇహ నానేవపశ్యతి.

కఠ. ౪-౧౦.

అర్థ. బ్రహ్మము భిన్నస్వరూపముగలదని ఎవ్వఁడు తలంచుచున్నాఁడో వాఁడు క్రమముగా జననమరణములనందును.

౨. ఉదరమంతరం కురుతే. తై. ఉ. ౨-౭-౧.

అర్థ. ఆత్మవేఱని భేదబుద్ధిగలవానికి భయముగలదు.

ప్రథమమునందు 'కింకారణంబ్రహ్మ, కుతస్స్మజాతాః?' అని ప్రశ్నింపఁబడినది. 'కింకారణంబ్రహ్మ' అను ప్రశ్నమునకు సమాధానము ౨-౫ మంత్రములందు చెప్పఁబడినది. 'కుతస్స్మజాతాః' అను ప్రశ్నసముదాయమునకు సమాధాన మీమంత్రము మొదలు సవిస్తరముగ ప్రతిపాదింపఁబడుచున్నది.

## ప్రథమాధ్యాయము, ౭-వ మంత్రము.

అవ. 'తమేకనేమిం త్రివృతం షోడశాంతం. శ్వేతా. ౧-౪ అను మంత్రమునందు బ్రహ్మము చక్రముగా ప్రతిపాదింపఁబడి యున్నది.

కనుక 'అహం బ్రహ్మాస్మి'యని బ్రహ్మాత్మత్వ ప్రతిపత్తియందున్నూ ప్రపంచసహితుఁడగు బ్రహ్మమునే ఆత్మగా నెఱుంగును కావున 'తం యథా యథో పాసతే తదేవభవతి' అను ప్రమాణము ననుసరించి సప్రపంచబ్రహ్మ ప్రాప్తియే కలుగునుగదా. అప్పుడు ప్రపంచమును పరిత్యజింపకపోవును కావున మోక్షము సిద్ధింపఁజాలదు. అందువలన 'జుష్టస్తతస్తేనామృతత్వమేతి' శ్వేతా. ౧-౬ అను మంత్రమునందు చెప్పినప్రకారము మోక్షము సిద్ధించుననుట అసంభవము గదా యని సందేహించి తత్సమాధానము చెప్పఁబడుచున్నది:—

మూ॥ ఉద్గీత మేత త్పరమం తు బ్రహ్మ
తస్మిం స్త్రయం సుప్రతిష్ఠాఽక్షరంచ,
అత్రాంతరం బ్రహ్మ విదో విదిత్వా
లీనా బ్రహ్మణి తత్పరా యోనిముక్తాః. ౭

పద. ఉద్గీతం ఏతత్ పరమం తు బ్రహ్మ తస్మిన్ త్రయం సుప్రతిష్ఠా అక్షరం చ, అత్ర అంతరం బ్రహ్మవిదః విదిత్వా లీనాః బ్రహ్మణి తత్పరాః యోనిముక్తాః. ౭

టీక. ఏతత్=ఈనిర్విశేషమగు, బ్రహ్మ=బ్రహ్మము, పరమం = శ్రేష్ఠమని, ఉద్గీతం = చెప్పఁబడినది. తస్మిన్ = అపరబ్రహ్మమునందు, త్రయం= భోక్త, భోగ్యము, ప్రేరకుఁడు అను మూఁడున్నూ, సుప్రతిష్ఠా = బాగుగా ప్రతిష్ఠితములయియున్నవి. అక్షరంచ= నాశరహితమున్నూ అయియున్నది. అత్ర=అన్నమయాద్యానందమయాంతమయినయీదేహమునందు, లేక విరాడాద్యవ్యాకృతాంతమగు ప్రపంచమునందు, అంతరం=అంతరుఁడుగానుండు పరబ్రహ్మమును,బ్రహ్మవిదః=బ్రహ్మవేత్తలు, విదిత్వా=తెలిసికొని,బ్రహ్మణి=పర

బ్రహ్మమునందు, లీనాః=విశ్వాద్యుపసంహారముఖముగా లయమును పొందిన వారలయి, తత్పరాః=ఆబ్రహ్మమునందే సమాధిగలవారలయి, యోనిముక్తాః= జన్మజరామరణ రూపసంసారమునుండి విముక్తులగుచున్నారు.

తా. బ్రహ్మము ప్రపంచముతో కూడుకొన్నదియగునెడల అమృతత్వము కాజాలదు. ఏలయనఁగా కార్యకారణలక్షణాత్మకమగు ప్రపంచముకంటె మోక్షము వేఱయినదని ఉపనిషత్తులందు ప్రతిపాదింపఁబడియే యున్నది:-

౧. అన్యదేవతద్విదితా దథో అవిదితాదధి. కేన. ౧-౪.

అర్థ. ఎయ్యది విదితమయినదానికంటెను, అవిదితమయినదాని కంటెను వేఱయినదో అదియే బ్రహ్మము.

౨. తదేవబ్రహ్మత్వంవిద్ధి నేదం యదిదముపాసతే. కేన. ౧-౫-౯.

అర్థ. దానినే బ్రహ్మమని నీవెఱుంగుము. ఉపాసింపఁబడునది బ్రహ్మము కాజాలదు.

3. అస్థూలమశబ్ద మస్పర్శం. కఠ. 3-౧౫.

౪. స ఏష నేతినేతీతి. బృహ. 3-౯-౨౬.

౫. తతో యదుత్తరతరం.

౬. అన్యత్ర ధర్మాత్ అన్యత్రాధర్మాత్. కఠ. ౨-౧౪.

౭. నస స్నచాస చ్ఛివ ఏవకేవలః. శ్వేతాశ్వ. ౪-౧౮.

౮. తమసః పరః.

౯. యతోవాచో నివర్తన్తే. తై. ఉ. ౨-౪-౧.

౧౦. యత్రనాన్యత్పశ్యతి నాన్యద్విజానాతి సభూమా. ఛాందో. ౭-౨౪-౧.

౧౧. యోఽశనాయాపిపాసే శోకంమోహం భయంజరామత్యేతి. బృహ. 3-౫-౧.

౧౨. అప్రాణోహ్యమనా శ్శుభ్రోహ్యక్షరాత్పరతః పరః.

ముండ. ౧-౨-౧౨.

౧౩. ఏకమేవాద్వితీయం. ఛాందో. ౬-౨-౧.

౧౪. వాచారంభణం, వికారో నామధేయం. ఛాందో. ౪-౬-౪.

౧౫. నేహనానాఽస్తి కించన. బృహ. ౪-౪-౧౯.

౧౬. ఏకధైవానుద్రష్టవ్యమ్. బృహ. ౪-౪-౨౦.

పైమంత్రములన్నియు బ్రహ్మము ప్రపంచసంబంధవిరహితమని చెప్పుచున్నవి. బ్రహ్మము ప్రపంచధర్మవిరహితమగుటచేతనే పరబ్రహ్మమని చెప్పఁబడుచున్నది. సంసారధర్మసంబంధవిరహితమగుటచేత పరమమనఁగా శ్రేష్ఠమని గ్రహించవలయును. 'తం యథాయథోపాసతే తథైవభవతి' అను న్యాయము చేత శ్రేష్ఠమయినబ్రహ్మమునే ఉపాసించినయెడల శ్రేష్ఠమయిన మోక్షఫలమునే పొందును.

నీవుచెప్పినప్రకారము బ్రహ్మము ప్రపంచసంబంధవిరహితమయిన యెడల ప్రపంచముకూడ బ్రహ్మసంబంధములేనిదని సిద్ధించునుగదా. అప్పుడు సాంఖ్యవాదమువలెనే ప్రపంచముకూడ వేఱుగా సిద్ధించును. అద్వైతులు "వాచారంభణం వికారో నామధేయం" అను శ్రుత్యనుసారము ప్రపంచము పారతంత్ర్యమగుటచేత మిథ్యయనిచెప్పుట పొసగదుగదా యని సంశయించి అందులకు సమాధానము చెప్పఁబడుచున్నది. బ్రహ్మము ప్రపంచసంబంధ విరహితమును స్వతంత్రమును అగుచున్నది కాని ప్రపంచముమాత్రము స్వతంత్రము కాఁజాలదు. ఇఁకనేమనఁగా ఆబ్రహ్మమునందే మూడున్నూ— అనఁగా భోక్త, భోగ్యము, ప్రేరితుఁడు అను మూడున్నూ చేరియున్నవి. ఇచట ప్రేరితయనఁగా భోక్తృభోగ్య నియింతృత్వలక్షణుఁడని విషయము ముందుచెప్పఁబడును. 'అజాహ్యేకాభోక్తృభోగ్యార్థయుక్తా' అని ముందు చెప్పఁబోవు భోక్తృభోగ్యార్థరూపమున్నూ శ్రుతిసిద్ధమయి విరాట్ సూత్రా

త్మలచేత చేయఁబడిన నామరూపకర్మ విశ్వతైజసప్రాజ్ఞ జాగ్రత్స్వప్నసుషుప్తి రూపస్వరూపముగలదిగా రజ్జువునందు సర్పమువలె ప్రతిష్ఠితమయియున్నది. కావుననే భోక్తృ, భోగ్య, ప్రేరితాత్మకమగు ప్రపంచమునకు బ్రహ్మమే సుప్రతిష్ఠ. బ్రహ్మముకంటె భిన్నమయినది చలనమగుటచేత అంతయు చల ప్రతిష్ఠయగుచున్నది. బ్రహ్మము అచలముఅగుటచేత అచలప్రతిష్ఠ యగు చున్నది.

అట్లయినయెడల బ్రహ్మము వికారసహితమగు ప్రపంచమును ఆశ్ర యించియుండుటచేత దధ్యాదికమువలె పరిణామియగును కనుక అనిత్య మగును గదా యని సంశయించి అనిత్యము కాదు అక్షరము. నాశరహితము నిత్యమని ప్రతిపాదింపఁబడినది. వికారము ప్రపంచాశ్రయ మయినప్పటికిన్నీ 'నక్షరతీత్యక్షరం' అను వ్యుత్పత్తిననుసరించి బ్రహ్మము అక్షరమే నాశరహి తమే. వికారము మాయాశ్రయమగుటచేత వాస్తవముగా అవినాశిత్వ మును బాధింపఁజాలదు. బ్రహ్మము ప్రపంచాశ్రయభూతమయినను కూటస్థ బ్రహ్మము అవినాశియేయని భావము. బ్రహ్మము మాయాత్మకమను విషయ మిదివఱకే ప్రతిపాదింపఁబడినది. కావున బ్రహ్మము సర్వాత్మకత్వమైనను ప్రపంచము మిథ్యాత్మకమగుటచేత బ్రహ్మమునకు సంపర్కముకలుగఁజాలదు. పూర్ణానంద బ్రహ్మాత్మస్వరూపమును గాంచువానికి మోక్షమను పరమపురు షార్థము తప్పక సిద్ధించును. ఏవిధముగా బ్రహ్మతత్త్వమును గాంచువానికి మోక్షముకలుగును? అనువిషయము చెప్పఁబడుచున్నది — ఇచట అనఁగా అన్నమయాది ఆనందమయాంతముగల యీదేహమునందు లేక విరాట్టు అవ్యాకృతాద్యంతముగల ప్రపంచమునందు పూర్వపూర్వోపాధి ప్రవిల యముచేత ఉత్తరోత్తరమయినదియును, అశనాయాపిపాసాదులను తాఁక నదియును, వాక్కులకు గోచరముకానిదియును అగు ఎయ్యది గలదో అట్టి బ్రహ్మమును బ్రహ్మవేత్తలగువారలు తెలిసికొన్నవారలయి విశ్వాద్యుపసంహార

ముఖము చేతఆ బ్రహ్మమునందులయించినవారలయిఅనఁగా 'అహం బ్రహ్మాస్మి' యను ప్రకారము బ్రహ్మస్వరూపులయిన వారలయి తత్పరులయినవారలు—అనఁగా సమాధియందుండువారు గర్భ జన్మ జరా మరణ రూపసంసారభయమునుండి విముక్తులగుచున్నారని భావము.

యోగియాజ్ఞవల్క్యుఁడు బ్రహ్మాత్మత్వావస్థితి నే సమాధియని యిట్లు చెప్పుచున్నాఁడు —

శ్లో. యదర్థ మిదమద్వైతం భారూపం సర్వకారణమ్,
ఆనంద మమృతం నిత్యం సర్వభూతేష్వవస్థితమ్.
తదేవానన్యధీః ప్రాప్య పరమాత్మాన మాత్మనా,
తస్మిన్ప్రలీయతే త్వాత్మా సమాధి స్స ఉదాహృతః.
ఇంద్రియాణి వశీకృత్య యమాదిగుణసంయుతః,
ఆత్మమధ్యే మనః కుర్యా దాత్మానం పరమాత్మని.
పరమాత్మా స్వయంభూత్వా నకించిచ్చింతయేత్తతః,
తదాతు లీయతే త్వాత్మా ప్రత్యగాత్మన్యఖండితే.
ప్రత్యగాత్మా సఏవస్యా దిత్యుక్తం బ్రహ్మవాదిభిః.

వివరణము —భాష్యమునందు 'సుప్రతిష్ఠా' యనియు, నారాయణగీపికయందు 'సప్రతిష్ఠా' యనియు, శంకరానంద, విజ్ఞానభిక్షు, ఉపనిషద్బ్రహ్మయోగులయొక్క వ్యాఖ్యానమునందు 'స్వప్రతిష్ఠా' అనియు, వ్యాఖ్యాన మొనర్పఁబడియున్నది.

ఔపాధికభేదమునే భగవానుఁడగు యాజ్ఞవల్క్యుఁడునూ (మూ. అధ్యా-3. శ్లో-౧౪3) ఇట్లు చెప్పుచున్నాఁడు —

శ్లో. ఆకాశమేకం హి యథా ఘటాదిషు పృథగ్భవేత్,
తథాఽఽత్మైకో హ్యనేకశ్చ జలాధారేష్వివాంశుమాన్.

విష్ణుధర్మమునందున్నూ ఇట్లేగలదు —

శ్లో. పరాత్మనో ర్మనుష్యేంద్ర విభాగో ఽజ్ఞానకల్పితః,
క్షయే తస్యాత్మపరయో ర్విభాగాభావ ఏవహి.
ఆత్మా క్షేత్రజ్ఞసంజ్ఞో ఽయం సంయుక్తః ప్రాకృతై ర్గుణైః,
తైరేవ విగత శ్శుద్ధః పరమాత్మా నిగద్యతే.
అనాదిసంబంధవత్యా క్షేత్రజ్ఞో ఽయ మవిద్యయా,
యుక్తః పశ్యతి భేదేన బ్రహ్మత్వాత్మని సంస్థితమ్.

విష్ణుపురాణమునం దిట్లుచెప్పఁబడినది:—

శ్లో. విభేదజనకే ఽజ్ఞానే నాశ మాత్యంతికం గతే,
ఆత్మనో బ్రహ్మణో భేద మసన్తం కః కరిష్యతి.

యోగవాసిష్ఠరామాయణమునందుకూడ ప్రశ్నపూర్వకముగ నీవిష యమే ఇట్లు ప్రదర్శితమైనది —

ప్రశ్న —

శ్లో. యద్యాత్మా నిర్గుణ శ్శుద్ధః సదానందో ఽజరో ఽమరః,
సంసృతిః కస్య తాత స్యా న్మోక్షో వా విద్యయా విభో,
క్షేత్రనాశః కథం తస్య జ్ఞాయతే భగవాన్ యతః,
యథావ త్సర్వమేతన్మే వక్తు మర్హాసి సాంప్రతమ్.

వసిష్ఠః—

తస్యైవ నిత్యశుద్ధస్య సదానందమయాత్మనః,
అవిచ్ఛిన్నస్య జీవస్య సంసృతిః కీర్త్యతే బుధైః,
ఏకఏవహి భూతాత్మా భూతేభూతే వ్యవస్థితః,
ఏకధా బహుధా చైవం దృశ్యతే జలచంద్రవత్,
భ్రాంత్యారూఢ స్సఏవాత్మా జీవసంజ్ఞః సదా భవేత్.

ఇట్లే బ్రహ్మపురాణమునందున్నూ పరబ్రహ్మమునకే **ఉపాధిభేదము** ననుసరించి జీవాదిభేదసంజ్ఞ కలుగుచున్నదనియు, **ఔపాధికభేదముచేతనే** బంధమోక్షవ్యవస్థయున్నూ సంభవించుచున్నదనియు దృష్టాంతపూర్వకముగా ఇట్లు తెలుపఁబడినది —

శ్లో. ఏకస్తు సూర్యో బహుధా జలాధారేషు దృశ్యతే,
ఆభాతి పరమాత్మాచ సర్వోపాధిషు సంస్థితః,
బ్రహ్మ సర్వశరీరేషు బాహ్యే చాభ్యంతరే స్థితమ్,
ఆకాశమివ భూతేషు బుద్ధా వాత్మా నచాన్యథా,
ఏవంసతి యథా బుద్ధ్యా దేహోఽహ మితి మన్యతే,
అనాత్మన్యాత్మతాభ్రాంత్యా సా స్యా త్సంసారబంధినీ,
సర్వైర్వికల్పైర్హీనస్తు శుద్ధో బుద్ధో ఽజరో ఽమరః,
ప్రశాన్తో వ్యోమవద్వ్యాపీ చైతన్యాత్మా ఽసకృత్ప్రభః.
ధూమాభ్రధూలిభి ర్వ్యోమ యథా న మలినీయతే,
ప్రాకృతై రపరామృష్టో వికారైః పురుష స్తథా.
యథైకస్మిన్ ఘటాకాశే జలధూమాదిభి ర్యుతే,
నాన్యే మలినతాం యాంతి దూరస్థాః కుత్రచిత్క్వచిత్.

మాండూక్యోపనిషత్కారికలయందు (చూ. 3-౫) శుకాచార్యుల శిష్యులగు గౌడపాదాచార్యులవారున్నూ ఇట్లే చెప్పినారు —

శ్లో. యథైకస్మిన్ ఘటాకాశే రజోధూమాదిభిర్యుతే,
న సర్వే సంప్రయుజ్యంతే తద్వజ్జీవా స్సుఖాదిభిః.

కనుక అద్వితీయుఁడగు పరమాత్మయందు ఉపాధివశముచేత జీవేశ్వరులకున్నూ జీవులకున్నూ భేదవ్యవస్థ సిద్ధించియేయున్నది కావున అవి శుద్ధోపాధి విశిష్టుఁడగు జీవునియందుగల సుఖ, దుఃఖ, మోహ, అజ్ఞానాదులు విశుద్ధసత్త్వోపాధిగల యీశ్వరునకు సంబంధించవు.

భగవానుఁడగు పరాశరుఁ డీవిషయమునే ఇట్లు చెప్పెను.—

శ్లో. జ్ఞానాత్మకస్యామల తత్త్వరాశే
రపేతదోషస్య సదా స్ఫుటస్య,
కింవా జగత్యస్తి సమస్తపుంసాం
అజ్ఞాతమస్యాస్తి హృది స్థితస్య.

ఒకానొకజీవునకు సంబంధించిన సుఖదుఃఖమోహాదికములచేత బద్ధుఁడుగాని ముక్తుఁడుగాని అయిన మఱొక జీవునకు సంబంధములేదు. ఆ యుపాధికే సుఖదుఃఖములసంబంధముగాని యితరులకులేదు. కనుక ఒకఁడు ముక్తుఁడయిన అందఱు ముక్తులు కావలయునుగదా ? యని నీవడిగిన ప్రశ్నకు అవకాశమే లేదు.

## ప్రథమాధ్యాయము, ౮-వ మంత్రము.

అవ. అద్వితీయుఁడగు పరమాత్మయందు జీవేశ్వరులు ఐక్యమగుచుండుటచేత విభాగమే లేదు. అప్పుడు 'లీనాః బ్రహ్మణి' అని వెనుకటిమంత్రమునందు జీవులు బ్రహ్మైకత్వస్థితిని పొందుచున్నారనుట అసంగతముగదా యని సంశయించి జీవేశ్వరులకు ఉపాధిననుసరించి విభాగముగలదనియు, అట్టివిషయము నెఱుంగుటచేత అమృతత్వమును పొందుచున్నాఁడను విషయమీ మంత్రమునందు చెప్పఁబడుచున్నది —

మూ. సంయుక్తమేతత్ క్షర మక్షరంచ
వ్యక్తావ్యక్తం భరతే విశ్వ మీశః,
అనీశశ్చాత్మా బధ్యతే భోక్తృభావాత్
జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః ౮

పద. సంయుక్తం ఏతత్ క్షరం అక్షరం చ వ్యక్తావ్యక్తం భరతే

విశ్వం ఈశః, అనీశః చ ఆత్మా బధ్యతే భోక్తృభావాత్ జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః. ౮

టీ. వ్యక్తావ్యక్తం = వ్యక్తావ్యక్తములురెండున్నూ, (వ్యక్తమనఁగా నామరూపాత్మక వికారజాతమగు కార్యము - ప్రపంచము, అవ్యక్తమనఁగా యీ ప్రపంచమునకు కారణభూతమయినట్టిది) క్షరంఅక్షరంచ=క్షరమనియు అక్షరమనియు చెప్పఁబడును. (అనఁగా కార్యము క్షరము నశించునది. కారణము అక్షరము నాశనములేనిది) ఈశః = ఈశ్వరుఁడు, సంయుక్తం= పరస్పరము కూడుకొనియున్న, ఏతత్ =ఈ, విశ్వం=కార్యకారణాత్మకమగు ప్రపంచమును, భరతే = భరించుచున్నాఁడు. అనీశః ఆత్మా=ఈశ్వరభిన్నుఁడగు జీవుఁడు, భోక్తృభావాత్ = భోక్తృభావమువలన, బధ్యతే = (అవిద్యాతత్కార్యభూతములయిన దేహేంద్రియాదులచేత) బద్ధుఁడగుచున్నాఁడు. దేవం = నిరుపాధికుఁడగు పరమేశ్వరుని, జ్ఞాత్వా = ఎఱింగి, సర్వపాశైః = సర్వపాశములచేత, ముచ్యతే = వదలబడుచున్నాఁడు.

తా. వ్యక్తమనఁగా నామరూపాత్మకమగు కార్యభూత ప్రపంచము. అవ్యక్తమనఁగా కారణభూతమయినది. ఈ రెండున్నూ క్రమముగా క్షరమనియు, అక్షరమనియు చెప్పఁబడును. అనఁగా వ్యక్తము క్షరము నశించునది, అవ్యక్తము అక్షరము నశించనిది, అవ్యక్తావ్యక్తములురెండున్నూ పరస్పరము సంయుక్తమయి కార్యకారణాత్మకమగు ప్రపంచమనంబడుచున్నది. ఇట్టివిశ్వమును ఈశ్వరుఁడు భరించుచున్నాఁడు. శ్రీకృష్ణభగవానుఁడున్నూ ఇట్లే భగవద్గీతయందు చెప్పినాఁడు —

శ్లో. క్షర స్సర్వాణి భూతాని కూటస్థో ఽక్షర ఉచ్యతే, ౧౬
ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః,
యో లోకత్రయమావిశ్య బిభ ర్త్యవ్యయ ఈశ్వరః. ౧౭

భగవద్గీత, ౧౫-అధ్యా.

ప్రథమాధ్యాయము, ౯-వ మంత్రము.

అవ. నిష్ప్రతియోగిక బ్రహ్మమొక్కటియే వస్తుభూతము. అట్టి బ్రహ్మమునందు మాయ, జీవ,ఈశ,తత్కార్యములను వికల్పము లెటుల ఏర్పడునని తలంచి స్వాజ్ఞానమువలననే ఇది అంతయు సంభవించుచున్నదని ప్రతిపాదింపఁబడుచున్నది.

మూ॥ జ్ఞాజ్ఞౌ ద్వా వజా వీశనీశా వజా
హ్యేకాభో క్తృభోగ్యార్థయుక్తా,
అనంతశ్చాత్మా విశ్వరూపో హ్యకర్తా
త్రయం యదా విందతే బ్రహ్మ మేతత్ ౯

పద. జ్ఞాజ్ఞౌ ద్వౌ అజౌ ఈశనీశౌ అజా హి ఏకా భోక్తృభోగ్యార్థయుక్తా, అనంతః చ ఆత్మా విశ్వరూపః హి అకర్తా త్రయం యదా విందతే బ్రహ్మం ఏతత్. ౯

టీక. ద్వౌ = ఇద్దఱగు, జ్ఞాజ్ఞౌ = ఈశ్వరజీవులు ఉభయులున్నూ, అజౌ = (జాయతే, వర్థతే మున్నగు షడ్భావవికారములు లేనివారలు) పుట్టుకలేనివారలు అగుచున్నారు. (ఈ ఈశ్వరజీవులు ఉభయులున్నూ) ఈశనీశౌ=సర్వశక్తిగల పరమేశ్వరుఁడనియు, సామర్థ్యరహితుఁడగు జీవుఁడనియు (ఎఱుంగవలయును), అజా = పుట్టుకలేనట్టిమాయ, ఏకా=ఒక్కటియే, భోక్తృభోగ్యార్థయుక్తా = భోక్తృ, భోగ్యాదిధర్మసంబంధముతో కూడుకొన్నదియగుచున్నది. యదా = ఎప్పుడు, ఏతత్ త్రయం=భోక్తృ, భోగ్య, భోగాత్మకమగుమూటిని, బ్రహ్మం=బ్రహ్మమని, విందతే= తెలిసికొనుచున్నాఁడో, (తదా = అప్పుడు) ఆత్మా=ఆత్మ-అనఁగా జీవుఁడు, అనంతః= (దేశకాలవస్తువులచేత) పరిచ్ఛేదములేనివాఁడును, విశ్వరూపః = ప్రపంచ

స్వరూపుఁడును, అకర్తా = కర్తృత్వాదిసంసార ధర్మవిరహితుఁడును (అగుచున్నాఁడు.)

తా. జ్ఞుఁడనఁగా సర్వము తెలిసినవాఁడు, అజ్ఞుఁడనఁగా ఏమియు తెలియనివాఁడు. ఇచట ప్రకరణముననుసరించి జ్ఞుఁడనఁగా సర్వజ్ఞుఁడయిన ఈశ్వరుఁడనియు, అజ్ఞుఁడనఁగా అల్పజ్ఞుఁడగు జీవుఁడనియు గ్రహింపవలయును. ఈ జీవేశ్వరులిద్దఱును అజులు—అనఁగా జన్మాదివికారములు లేనివారలు, బ్రహ్మమే మాయావశముచేత వికారములేకయే జీవేశ్వరస్వరూపముతో గనంబడుచున్నదనిభావము. ఈవిషయమునే ఈ క్రిందిశ్రుతు లిట్లు ప్రతిపాదించుచున్నవి —

౧. శ్రు పురశ్చక్రే ద్విపదః పురశ్చక్రే చతుష్పదః,
పుర స్స పక్షీ భూత్వా పురః పురుష ఆవిశత్. బృహ. ౨-౫-౧౮.

౨. శ్రు.ఏక స్తథా సర్వభూతాంతరాత్మా
రూపంరూపం ప్రతిరూపోబభూవ. కఠ. ౫-౯.

పూర్వపక్షము —అద్వైతవాదులు భోక్తృభోగ్యలక్షణమగు ప్రపంచమును అంగీకరించునెడల

| ఈశ్వరుఁడు | సర్వసమర్థుఁడు | జీవుఁడు | అసమర్థుఁడు |
|---|---|---|---|
| ,, | సర్వజ్ఞుఁడు | ,, | అల్పజ్ఞుఁడు |
| ,, | సర్వకర్త | ,, | అసర్వకర్త |
| ,, | సర్వభృత్తు | ,, | దేహాదిభృత్తు |
| ,, | సర్వాత్మ | ,, | అసర్వాత్మ |
| ,, | ఆప్తకాముఁడు | ,, | అనాప్తకాముఁడు |
| ,, | సర్వైశ్వర్యుఁడు | ,, | అల్పైశ్వర్యుఁడు |
| ,, | సర్వతఃపాణిపాదుఁడు | ,, | తద్విలక్షణుఁడు |

| ఈశ్వరుఁడు | సహస్రశీర్షుఁడు | జీవుఁడు | ఏకశీర్షుఁడు |
| --- | --- | --- | --- |
| ,, | నిత్యుఁడు | ,, | అనిత్యుఁడు |

ఇటుల జీవేశ్వరులయొక్క వ్యవహారమంతయు భేదముగనే గనంబడుచున్నది. అద్వైతసిద్ధాంతమునను సరించి చూచినయెడల భోక్తృభోగ్యాది విభేదముగల ప్రపంచము పరమార్థముగా లేనేలేదు. కూటస్థుఁడును అపరిణామియు, అద్వితీయుఁడును అగుపరమాత్మ భోక్త్రాదిరూపముగలవాఁడనుట అసంభవముగదా. బ్రహ్మముకంటె విభిన్నమయినట్టియు భోక్త్రాదిప్రపంచమునకు హేతుభూతమయినట్టియు మఱొకవస్తువు లేనేలేదు. అట్లు వస్త్వంతరమే ఉన్నయెడల అద్వైతమునకే హానికలుగునుగదా యను సంశయమును నిరాకరించుటకయి యీ క్రిందివిషయము చెప్పఁబడుచున్నది —

జన్మాదిరహితమయిన ఒక్కమాయయే భోక్తృభోగ్యార్థయుక్తమయి వెలయుచున్నది. ఈవిషయమును ఈ క్రింది శ్రుతిస్మృతు లిట్లు ప్రతిపాదించుచున్నవి.—

శ్రుతులు—౧. అజామేకాం లోహితశుక్లకృష్ణాం. శ్వేతా. ౪-౫.

౨. మాయాంతుప్రకృతింవిద్యాత్. శ్వే. ౪-౧౦.

3. ఇంద్రోమాయాభిః పురురూప ఈయతే. బృహ. ౨-౫-౧౯.

౪. మాయాపరాప్రకృతిః.

స్మృతి— సంభవామ్యాత్మమాయయా. భగవద్గీత. ౪-౬.

ప్రపంచనిర్మాత్రియు, దేవాత్మశక్తిస్వరూపిణియు, స్వవికారభూత భోక్తృభోగ్యార్థాది విభేదముగలదియు, నగు మాయాశక్తియే పరమేశ్వర నికటవర్తినియై సర్వదా పరమేశ్వరునిఛాయవలె అనుసరించుచుచుయున్నది. అట్టి మాయాశక్తియొక్క సన్నిధానమువలన పరమేశ్వరుఁడున్నూ మాయావివలె మాయాకార్యభూతమగు దేహాదికముచేత ఈశ్వరాదిరూపముగలవానివలె

స్ఫురించుచుండును. పరమాత్మయందొకింత మాయాసంబంధముచేత స్ఫురించెడి యీయల్పాంశమును (అవకాశముగా) గైకొనియే జీవేశ్వరాది సర్వలౌకిక వైదిక సర్వభేదవ్యవహారము సిద్ధించుచున్నది. జీవేశ్వరులను వస్తుద్వయము సిద్ధించుచున్నప్పుడు అద్వైతమునకు హానికలుగుటలేదాయని సంశయింపఁబనిలేదు. మాయయనఁగా ఇట్టిదని వివరించిచెప్పుటకు వీలుకానిదని భావము. గనినే అనిర్వచనియమని యందురు. అట్టి అనిర్వచనీయమయినది వస్తువని చెప్పుటకు వీలుగాదు. కనుక అద్వైతమునకు హానియేలేదు ఈవిషయమునందిట్లు చెప్పఁబడినది.

శ్లో. ఏషా హి భగవన్మాయా సదసద్వ్యక్తివర్జితా.

మాయాశక్తిచేత సిద్ధమయిన భోక్తృ, భోగ, భోగ్యరూపమయిన ప్రపంచము మాయాత్మకముగావున ఈ భోక్త్రాదిత్రయమునకు అధిష్ఠానభూతమయిన బ్రహ్మముకంటె విభిన్నముగ నేమియులేదు, అంతయు బ్రహ్మస్వరూపమే యని యెప్పుడు ఎఱుంగుచున్నాఁడో అప్పుడు అనన్తుఁడును విశ్వరూపుఁడును అకర్తయు అగుచున్నాఁడు.

౧. అనన్తనిర్వచనము — అస్య అన్తః=పరిచ్ఛేదః దేశతః కాలతః వస్తుతో వా నవిద్యత ఇతి అనన్తః.

అర్థ. దేశముచేతగాని, కాలముచేతగాని, వస్తువుచేతగాని పరిచ్ఛేదము ఇతనికి లేదు కనుక అనన్తుఁడనంబడుచున్నాఁడు.

౨. విశ్వరూపశబ్దనిర్వచనము—విశ్వ మస్యైవ రూపమితి విశ్వరూపః, పరస్య అవిశ్వరూపత్వాత్.

అర్థ. విశ్వము ఇతనియొక్క రూపమే యగుటవలన ఈశ్వరుఁడు విశ్వరూపుఁడనంబడును. జీవుఁడు విశ్వరూపుఁడు కాఁజాలఁడు కావున విశ్వరూపుఁడనఁగా ఈశ్వరునే గ్రహించవలయును. ఇచట ప్రపంచస్వరూపము

గలవాఁడని చెప్పుటవలన పరమేశ్వరునకు అనన్తత్వము సిద్ధించదని ఒక సంశయము రాఁగా 'వాచారంభణం వికారో నామధేయం' అను శ్రుతి ప్రమాణము ననుసరించి అధిష్ఠాన వ్యతిరేకముగ ప్రతిబింబమునకు స్థితి లేనిరీతిగా రూపియగు పరమాత్మకంటె రూపమగు ప్రపంచము వేఱుగా వాస్తవముగా లేక పోవుటచేత అనన్తత్వమునకు ఏమియుఁ విరోధము లేదని భావము.

3. అకర్తృశబ్దనిర్వచనము·—అకర్తా=కర్తృత్వాది సంసారధర్మరహితః.
అర్థ. కర్తృత్వాది సంసారధర్మరహితుఁడని భావము.

అనఁగా—జీవుఁడు భోక్తృ,భోగ్య,భోగ్యాత్మకమగు త్రయమునూ బ్రహ్మస్వరూపమేయని ఎప్పుడు భావించునో అప్పుడు సకలవికల్ప విరహితుఁడయి పరిపూర్ణ' ఆనంద, అద్వితీయ బ్రహ్మత్మభావమును పొందినవాఁడయి, కర్తృత్వాది సకలసంసారధర్మ వివర్జితుఁడయి, శోకరహితుఁడయి కృతకృత్యుఁడయి వెలయును.

'త్రయం యదా విందతే బ్రహ్మమేతత్' అనుచోట త్రయమనఁగా భోక్తృ, భోగ,భోగ్యత్రయమని ఇదివఱకు వ్యాఖ్యానమొనర్చితిమి. ఇచట జీవ, ఈశ్వర, ప్రకృతులు మూఁడు అని అయినను అర్థమును గ్రహించవచ్చును.

వివరణము —'ఈశానీశౌ' అనుటకు, 'ఈశనీశౌ'అని చెప్పుట ఛాందసప్రయోగము. అట్లే, 'బ్రహ్మం'అని అకారాంతముగా చెప్పుటయుఁ ఛాందసమే. వేదమునందు కొన్ని తావుల 'బ్రహ్మ మేతు మాం; 'బ్రహ్మ మేవ మధు మేతు మాం' అని అకారాంతరముగా ప్రయోగింపఁబడి యున్నది.

ప్రథమాధ్యాయము, ౧౦-వ మంత్రము.

అవ. ఇదివఱకు జీవేశ్వరులకు విభాగమును తెలిపి తద్విజ్ఞానమువలన అమృతత్వము చెప్పఁబడినది. ఈమంత్రమునందు ప్రధానేశ్వరులయొక్క

వైలక్షణ్యమును చూపించి దానివలన అమృతత్వము లభించునని చెప్పఁబడు చున్నది

మూ. క్షరం ప్రధాన మమృతాక్షరం హరః
క్షరాత్మానా వీశతే దేవ ఏకః,
తస్యాభిధ్యానా ద్యోజనా త్తత్త్వభావా
ద్భూయశ్చాంతే విశ్వమాయా నివృత్తిః ౧౦

పద. క్షరం ప్రధానం అమృతాక్షరం హరః క్షరాత్మానా ఈశతే దేవః ఏకః, తస్య అభిధ్యానాత్ యోజనాత్ తత్త్వభావాత్ భూయః చ అంతే విశ్వమాయానివృత్తిః. ౧౦

టీక. ప్రధానం = ప్రధానము, క్షరం=క్షరమనియు, హరః=ఈశ్వరుఁడు, అమృతాక్షరం = అమృతస్వరూపుఁడయిన అక్షరుఁడే, ఏకః=అద్వితీయుఁడగు, దేవః=స్వయంప్రకాశుఁడగుపరమాత్మ, క్షరాత్మానా=ప్రధాన జీవులను, ఈశతే = నియమించుచున్నాఁడు. తస్య=అట్టిపరమాత్మయొక్క, అభిధ్యానాత్ = అభిధ్యానమువల్లనున్నూ, యోజనాత్ = జీవపరమాత్మ సంయోజనమువల్లనున్నూ, భూయః=మాటిమాటికి,తత్త్వభావాత్ =('అహం బ్రహ్మాస్మి'యనెడి) యథార్థభావనమువల్లనున్నూ, విశ్వమాయానివృత్తిః=సుఖదుఃఖమోహాత్మకమగు అశేషప్రపంచమాయానివృత్తియు కలుగుచున్నది.

తా. క్షరమనఁగా నశించునది. ప్రధానము క్షరమని చెప్పఁబడు చున్నది. ప్రధానమనఁగా మాయ; హరుఁడనఁగా పరమేశ్వరుఁడు. అవిద్యాదికమును హరించుటచేత పరమేశ్వరునియందు హరశబ్దము సార్థకమగు చున్నది. ఆపరమేశ్వరుఁడు అమృతుఁడున్నూ అక్షరుఁడున్నూ అగు చున్నాఁడు. స్వయంప్రకాశుఁడును, సదానందుఁడును, అద్వితీయుఁడును అగు ఆపరమాత్మప్రధానుఁడగుటవల్లనున్నూ, జీవపరమాత్మసంయోగమువల్లను,

సర్వదా 'అహంబ్రహ్మాస్మి' యని సర్వదా మననము చేయుటవల్లనున్ను ప్రారబ్ధ కర్మావసానకాలమునందు సుఖదుఃఖమోహాత్మకమగు అశేషప్రపంచరూప మాయానివృత్తి యేర్పడును. లేక ఆత్మజ్ఞాన నిష్పత్తియయినపిదప అనఁగా ఆత్మజ్ఞానము కలిగినదగుచుండఁగా ప్రపంచరూపమాయ నివర్తించును.

వివరణము —'అంతే విశ్వమాయానివృత్తిః' అని చెప్పుటచేత జీవన్ముక్తునకుకూడ సంసారశేషభూతమగు అవిద్యావ్యాపారము దేహయాత్రాద్యర్థము నిలిచియుండుననియు, అయ్యది వేదశాస్త్ర సమ్మతమేయనియు పైవాక్యము సూచించుచున్నది.

ప్రథమాధ్యాయము, ౧౧-వ మంత్రము.

అవ. జ్ఞానధ్యానముల ఫలభేదము తెలుపఁబడుచున్నది:—

మూ॥ జ్ఞాత్వా దేవం సర్వపాశాపహానిః
క్షీణైః క్లేశై ర్జన్మమృత్యుప్రహాణిః,
తస్యాభిధ్యానా త్తృతీయం దేహభేదే
విశ్వైశ్వర్యం కేవల ఆప్తకామః ౧౧

పద. జ్ఞాత్వా దేవం సర్వపాశాపహానిః క్షీణైః క్లేశైః జన్మమృత్యుప్రహాణిః, తస్య అభిధ్యానాత్ తృతీయం దేహభేదే విశ్వైశ్వర్యం కేవలః ఆప్తకామః. ౧౧

టీక. దేవం=పరమేశ్వరుని, జ్ఞాత్వా = (తెలిసికొన్నయెడల), సర్వపాశాపహానిః= పాశరూపమగు అవిద్యయంతయు నశించును. క్లేశైః=అవిద్య, అస్మిత, రాగ, ద్వేష, అభినివేశములను ౫ దు క్లేశములు, క్షీణే = క్షీణించుటచేత, జన్మమృత్యుప్రహాణిః=జన్మమృత్యువులు నశించుచున్నవి. తస్య= ఆపరమేశ్వరునియొక్క, అభిధ్యానాత్ =ధ్యానమువలన, దేహభేదే=దేహభే

దమునందు, (అనఁగా ప్రారబ్ధకర్మమునకు ఫలరూపమయిన యీదేహమునశిం చిన తరువాత), తృతీయం=మూడవదియగు,విశ్వైశ్వర్యం=విశ్వైశ్వర్యమును (పొందినవాఁడై), కేవలః=కేవలమయిన స్వరూపముగలవాఁడయి, ఆప్త కామః = ఆప్తకాముఁడు (అగుచున్నాఁడు).

తా. 'అయం అహమస్మి' ఇతఁడు నేనయితినని తెలిసికొనుటచేత అవిద్యమున్నగు సకలబంధములు నశించుచున్నవి. అవిద్యాబంధము నశించిన తరువాత అట్టి యవిద్యకు మూలభూతమగు జన్మజరామరణరూపమగు దుఃఖ మునశించుచున్నది. అనఁగా జ్ఞానమునకు ఫలము దుఃఖవినాశనమని తెలియ వచ్చుచున్నది. కేవలజ్ఞానముకంటె ధ్యానమువలన క్రమముక్తిరూపమగు విశేషముకూడ లభించునను విషయము చెప్పఁబడుచున్నది —ఆపరమేశ్వ రునియొక్క అభిధ్యానమువలన దేహభేదమునందు - అనఁగా ఈశరీరము పడిపోయినతరువాత క్రమముగా దేవయానమార్గముచేత పరమేశ్వరసా యుజ్యమును పొందినవానికి మూడవదియగు విశ్వైశ్వర్యము-అనఁగా విరా డ్రూపాపేక్షతో అవ్యాకృతపరమవ్యోమకారణమగు ఈశ్వరావస్థ యను ఫలము కలుగుచున్నది. అతఁడట్టిఫలము ననుభవించినవాఁడయి అచ్చటనే నిర్విశేషుఁడగుఆత్మను తెలిసికొని కేవలుఁడయి-అనఁగా సకలైశ్వర్యములను తదుపాధిసిద్ధులను వదలినవాఁడయి అవ్యాకృతపరమవ్యోమకారణమును ఈశ్వరాత్మకమును అగు తృతీయావస్థను విశ్వైశ్వర్యరూపమయినదానిని వదలి ఆప్తకాముఁడయి—అనఁగా కేవలముగ ఆత్మనేకోరుచున్నవాఁడై పూర్ణానంద అద్వితీయ బ్రహ్మాత్మస్వరూపుఁడుగా నుంటున్నాఁడు. దీని తాత్పర్యమేమనఁగా—సమ్యగ్దర్శనమనునది వస్తువుయొక్క యథార్థస్వరూ పము నెఱుంగుటయగును. ఇచట సమ్యగ్దర్శనమనునది నిర్విషయపూర్ణానంద అద్వితీయ బ్రహ్మస్వరూపమునకు సంబంధించియున్నది. ఇట్టి బ్రహ్మస్వరూప జ్ఞానమువలన అవిద్యాతత్కార్యములు నశించుచున్నవి. కావున పూర్ణానందా

ద్వితీయబ్రహ్మస్వరూపుఁడయి యుండును. ధ్యానమెప్పుడున్నూ ఆకార విరహితమయిన దానియందు సులభముగ ప్రవేశింపఁజాలదు కావున సవిశేష బ్రహ్మమే ధ్యానమునకు విషయముగా గ్రహింపఁబడుచున్నది. 'తంయథా యథోపాసతే తథైవభవతి' అను న్యాయముననుసరించి సవిశేషవిశ్వైశ్వర్య లక్షణమగు బ్రహ్మప్రాప్తి నభిలషించి ఉపాసించినయెడల అట్టి బ్రహ్మప్రాప్తి తప్పకలభించును. అట్టి విశ్వైశ్వర్యము ననుభవించినపిదప నిర్విశేషపూర్ణానందబ్రహ్మాత్మనెఱింగినవాఁడయి కేవలాత్మకాముఁడయి పొందఁబడిన సకల పురుషార్థములుగలవాఁడయి ముక్తుఁడగుచున్నాఁడు.

జ్ఞానధ్యానములకుఁ గలఫలవిభేదము శివధర్మోత్తరమునం దిట్లు చెప్పఁబడియున్నది —

శ్లో. ధ్యానాదైశ్వర్యమతుల మైశ్వర్యాత్సుఖముత్తమమ్,
జ్ఞానేన తత్పరిత్యజ్య విదేహో ముక్తి మాప్నుయాత్.

ఇదియునుంగాక దహరాది సవిశేష సగుణోపాసకులకు విశ్వైశ్వర్య లక్షణమగుఫలముకలుగునని శ్రుతి యిట్లు అనుగ్రహించుచున్నది —

శ్రు. స యది పితృలోకకామోభవతి సంకల్పాదేవాస్య పితరః సముత్తిష్ఠంతి.
ఛాందోగ్య. ౮-౨-౧.

ప్రశ్నోపనిషత్తునందు "యఃపునరేతం త్రిమాత్రేణోమిత్యేతేనైవాక్షరేణ పరం పురుష మభిధ్యాయీత స తేజసి సూర్యే సంపన్నః" ౫-౫. మున్నగు మంత్రప్రమాణము ననుసరించి పరమపురుషుని ధ్యానించువాఁడు అర్చిరాదిమార్గము ననుసరించి బ్రహ్మలోకమును పొందుననియు, "స తేజసి సూర్యేసంపన్నః." ప్రశ్న. ౫-౫. ఇత్యాదిప్రమాణము ననుసరించి అర్చిరాదిమార్గమున 'సఏతస్మా జ్జీవఘనాత్పరాత్పరం పురిశయం పురుషమీక్షతే' ప్రశ్న. ౫-౭. మున్నగు ప్రమాణముననుసరించి బ్రహ్మలోకమును పొందు

ననియు, తరువాత అతఁడు బ్రహ్మలోకమునందు సమ్యగ్దర్శనలాభమును పొంది 'తమోంకారేణాయతనేనాన్వేతి విద్వాన్ యత్తచ్ఛాంత మజరమమృతమభయం పరంచేతి' ప్రశ్న. ౫-౭. అను ప్రమాణమునను సరించి సమ్యగ్దర్శనపూర్వకముగ విముక్తుఁ డగుననియు తెలుపఁబడినది. ఇది అవిద్వద్విషయము. కాని విద్వాంసునకుమాత్రము అర్చిరాది మార్గాపేక్షలేకయే ఇచటనే ముక్తి కలుగుచున్నదని శ్రుతియే ప్రకటించు చున్నది — అథాకామయమానో యోఽకామో నిష్కామ ఆప్తకామ ఆత్మకామో నతస్యప్రాణా ఉత్క్రామంతి బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి. ౬. బృహ. ౪-౪-౬.

ఉత్క్రాంతిలేకయే బ్రహ్మమునందు లీనుఁ డగుచున్నాఁడని శ్రుత్యంతరమునందున్నూ ఇట్లే చెప్పఁబడినది —

శ్రు. 'ఉదస్మాత్ప్రాణాః క్రామంత్యహో నేతినేతిహోవాచ యాజ్ఞవల్క్యః' అనుచోటకూడ ప్రశ్నపూర్వకముగ ఉత్క్రాంత్యభావమే తెలుపఁబడినది. బ్రహ్మపురాణమునందు జీవన్ముక్తియు గత్యభావము ఇట్లు ప్రతిపాదింపఁబడియున్నవి:—

శ్లో. యస్మిన్కాలే స్వమాత్మానం యోగీ జానాతికేవలమ్,
తస్మాత్కాలా త్సమారభ్య జీవన్ముక్తో భవేదసౌ,
మోక్షస్య నైవ కించిత్స్యా దన్యత్ర గమనం క్వచిత్,
స్థానం పరార్థ్యమపరం యత్రగచ్ఛంతి యోగినః,
అజ్ఞానబంధభేదస్తు మోక్షో బ్రహ్మలయస్త్వితి.

లింగపురాణమునందు విద్వాంసునకు జీవన్ముక్తి ఇట్లు చెప్పఁబడినది -

శ్లో. ఇహలోకేపరేచైవ కర్తవ్యం నాస్తితస్యవై,
జీవన్ముక్తో యత స్తస్మా ద్బ్రహ్మవి త్పరమార్థతః.

శివధర్మోత్తరమునం దిట్లు చెప్పఁబడినది —

శ్లో. వాంఛాత్యయేఽపి కర్తవ్యం కించిదస్య న విద్యతే,
ఇహైవ స విముక్తస్స్యా త్సంపూర్ణ స్సమదర్శనః.

పై ప్రమాణములవలన సిద్ధించుచున్న సిద్ధాంతమేమనఁగా—సగుణోపాసకుఁడు ప్రాణోత్క్రమణసమయమునందు అర్చిరాదిక్రమముగ దేవయానమార్గముచేత విశిష్టైశ్వర్యలక్షణుఁడగు బ్రహ్మను - హిరణ్యగర్భునిపొంది అచ్చట బ్రహ్మలోకమునందు విశిష్టైశ్వర్యలక్షణమగు ఐశ్వర్యమును అనుభవించి అచ్చటనే భేదరహితమగు పూర్ణానందాద్వితీయబ్రహ్మతత్త్వము నెఱింగినవాఁడయి కేవలాత్మకాముఁడయి విముక్తుఁడగును. విద్వాంసుఁడగు వానికి నిర్విశేష, పూర్ణానందాద్వితీయబ్రహ్మవిజ్ఞానమువలన గంతృ, గంతవ్య, గమనాదివిభేదములన్నియు నశించుటచేత ప్రాణోత్క్రమణముగాని అర్చిరాదిమార్గగమనముగాని లేదు. బ్రహ్మజ్ఞానమేర్పడినవెంటనే జీవన్ముక్తుఁడయి బ్రహ్మానందమున ననుభవించి ఆత్మరతియు ఆత్మతృప్తియుగలవాఁడయి ఆత్మసుఖుఁడును, అంతరారాముఁడును, అంతర్జ్యోతియు, ఆత్మక్రీడుఁడును, ఆత్మమిథునుఁడును ఆత్మానందుఁడునుఅయి ఇచటనే భూమశబ్దవాచ్యమును స్వారాజ్యమునుఅగు స్వమహిమయందు అమృతుఁడయి యుంటున్నాఁడు. ఇట్టి యుత్తమస్థితికలుగుటకుముందు వాఙ్మనఃకాయములను కరణత్రయము చేత చేయఁదగిన శ్రౌతస్మార్తలక్షణమగు కర్మనొనర్చి విశుద్ధచిత్తుఁడయి బాహ్యవిషయములనువదలి శమదమాదిసాధనసంపత్తిగలవాఁడు కావలయును.

ఈవిషయమే భగవద్గీతయందు ౬-వ అధ్యాయమునం దిట్లు చెప్పఁబడినది —

శ్లో. యోగీ యుంజీత సతత మాత్మానం రహసి స్థితః,
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః. ౧౦

,, యుంజన్నేవం సదాఽఽత్మానం యోగీవిగతకల్మషః,
సుఖేన బ్రహ్మ సంపర్శ్య మత్యంతం సుఖమశ్నుతే. ౨౮

శ్లో. సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః. ౨౯

,, సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్,
న హినస్త్యాత్మనా ఽఽత్మానం తతో యాతి పరాం గతిమ్.౧౩-౨౮

వివరణము — బ్ర. సూ. ౩-౨-౫ నందు ఈశ్వరస్వరూపాపరిజ్ఞానము బంధమనియు, తత్స్వరూపపరిజ్ఞానము మోక్షమనియు తెలుపుటకు శంకరభాష్యమునం దీమంత్రము ప్రమాణముగా నొసంగఁబడినది.

ప్రథమాధ్యాయము. ౧౨-వ మంత్రము.

అవ. దేని నెఱుంగుటవలన విద్వాంసుఁడు కృతకృత్యుఁడగునో, దేని నెఱుంగుటవలన తెలిసికొనవలసినది శేషించియుండదో అట్టి విషయము చెప్పఁబడుచున్నది —

మూ॥ ఏతద్ జ్ఞేయం నిత్య మేవాత్మసంస్థం
నాతః పరం వేదితవ్యం హి కించిత్,
భోక్తా భోగ్యం ప్రేరితారం చ మత్వా
సర్వం ప్రోక్తం త్రివిధం బ్రహ్మ మేతత్. ౧౨

పద. ఏతత్ జ్ఞేయం నిత్యం ఏవ ఆత్మసంస్థం న అతఃపరం వేదితవ్యం హి కించిత్, భోక్తా భోగ్యం ప్రేరితారం చ మత్వా సర్వం ప్రోక్తం త్రివిధం బ్రహ్మం ఏతత్. ౧౨

టీక. ఏతత్=ఈబ్రహ్మము, ఆత్మసంస్థం=స్వాత్మయందున్నదనియును, నిత్యంఏవ=నిత్యమయినదనియును, జ్ఞేయం=తెలిసికొనవలయును, అతఃపరం=ఇంతకంటె, వేదితవ్యం=తెలిసికొనఁదగినది, కించిత్ హి=కొంచెమైనను, న=

లేదు, భోక్తా భోగ్యం ప్రేరితారం చ = భోక్తయగుజీవుఁడు, భోగ్యమగు ప్రపంచము, ప్రేరకుఁడగు అంతర్యామియు, అని, ప్రోక్తం=చెప్పఁబడిన, త్రివిధం = త్రివిధమయిన, ఏతత్ సర్వం = ఇదియంతయు, బ్రహ్మం=బ్రహ్మ మని, మత్వా=తలంచి, (నిర్విశేషబ్రహ్మము నెఱుంగవలయును.)

తా. జ్ఞానప్రాదుర్భావానంతరము పరమపురుషార్థసిద్ధి కలుగుచున్నది. కావున ప్రకృతమయిన బ్రహ్మస్వరూపము వివరింపఁబడుచున్నది. ఈ బ్రహ్మము స్వాత్మయందు దున్నదేగాని ఎచ్చటనో బయటలేదనియు నిత్య మనియు నెఱుంగవలయును. శ్రుతిస్మృతులందిట్లే చెప్పఁబడియున్నది.—

శ్రు. త మాత్మస్థం యే ఽనుపశ్యంతి ధీరా స్తేషాం శాంతి శ్శాశ్వతీ నేతరేషామ్. కఠ. ౫-౧౨.

స్మృతి. శివధర్మోత్తరమునందు యోగులయొక్క ఆత్మస్థితి ఇట్లు వర్ణింపఁబడినది.—

శ్లో. శివ మాత్మని పశ్యంతి ప్రతిమాసు న యోగినః,
ఆత్మస్థం యః పరిత్యజ్య బహిఃస్థం యజతే శివమ్.
హ స్తస్థం పిండముత్సృజ్య లిహ్యా త్కూర్పర మాత్మనః,
సర్వత్రావస్థితం శాంతం న పశ్యంతీహ శంకరం.
జ్ఞానచక్షుర్విహీనత్వా దన్ధ స్సూర్యం యథోదితమ్,
యః పశ్యే త్సర్వగం శాంతం తస్యాధ్యాత్మస్థితి శ్శివః.
ఆత్మస్థం యే న పశ్యంతి తీర్థే మార్గంతి తే శివమ్,
ఆత్మస్థం తీర్థ ముత్సృజ్య బహి స్తీర్థాది యో వ్రజేత్.
కరస్థం స మహారత్నం త్యక్త్వా కాచం విమార్గతి.

అర్థ. యోగులు పరమేశ్వరుని తమదేహమునందే చూచుదురుకాని ప్రతిమలందు చూడరు. తనయందున్న ఈశ్వరుని వదలి వెలుపలనున్న

ఈశ్వరుని పూజించువారలు చేతియందున్న భోజ్యపదార్థమును పారవేసి మోచేతిని నాకుటకు ప్రయత్నించువారితో తుల్యులు. సూర్యుఁడు సర్వప్రసిద్ధుఁడయి ప్రకాశించుచున్నను గ్రుడ్డివాఁడుమాత్రము ఎట్లు సూర్యుని చూచుటకు సమర్థుఁడుకాఁడో అట్లే జ్ఞాననేత్రవిరహితుఁడగువాఁడు సర్వత్ర ప్రకాశించుచున్న పరమేశ్వరుని చూడఁజాలఁడు. ఎవ్వఁడు పరమాత్మను అంతటఁ గాంచునో వానికి తనయందే పరమేశ్వరుఁడు గోచరించును. తనయందు ఆత్మను గాంచుటకు అసమర్థులయినవారలే ఇతరమయిన పుణ్యతీర్థాదికమునందు ఆత్మను గాంచుటకు ప్రయత్నింతురు. తనయందున్న ఆత్మ నెఱుంగుటకు ప్రయత్నింపక వెలుపలనున్న పుణ్యతీర్థాదికమునందు ఆత్మను గాంచుటకు ప్రయత్నించువాఁడు తన చేతియందున్న అమూల్యమయిన రత్నమును పారవేసి గాజుపెంకును వెతకుటకు ప్రయత్నించునట్టి వానివలె పరిహాసనీయుఁడగును.

లేక ఎయ్యది అపరోక్షమయిన ప్రత్యగాత్మతత్త్వముగలదో అది నిత్యమనియు, వినాశరహితమనియు, స్వమహిమయందే ఉన్నదనియు, బ్రహ్మమనియు నెఱుంగవలయును. ఏలయనఁగా తెలిసికొనవలసినది ఇంతకంటె వేఱుగా నేమియు లేదు. కావున బృహదారణ్యకశ్రుతియు యిట్లే చెప్పుచున్నది —

శ్రు. తదేతత్పదనీయ మస్యసర్వస్య యదయమాత్మేతి.

అట్టిబ్రహ్మము నెట్లెఱుంగవలయు ననువిషయము చెప్పఁబడుచున్నది —

భోక్తయనఁగా జీవుఁడు, భోగ్యమనఁగా జీవభిన్నమగు ప్రపంచమంతయు, ప్రేరితయనఁగా అంతర్యామియగు పరమేశ్వరుఁడు. ఈ మూఁడున్నూ బ్రహ్మమే యని చెప్పఁబడుచున్నది. భోక్తృ భోగ్య ప్రేరిత్రాది ప్రవిలాపనముచేత నిర్విశేషమగు బ్రహ్మాత్మను తెలిసికొనవలయును. ఈవిషయమే కావషేయగీతయం దిట్లు చెప్పఁబడినది —

శ్లో. త్యక్త్వా సర్వవికల్పాంశ్చ స్వాత్మస్థం నిశ్చలం మనః,
కృత్వా శాంతో భవే ద్యోగీ దగ్ధేంధన ఇవానలః.

విష్ణుపురాణమునందును ఇట్లే చెప్పఁబడినది:—

శ్లో. తస్యైవ కల్పనాహీనస్వరూపగ్రహణం చయత్,
మనసా ధ్యాననిష్పాద్యం సమాధి స్సో ఽభిధీయతే.

వివరణము — బ్ర. సూ. 3-2-13 నందు భోక్తృ, భోగ్య, నియంతృలను త్రివిధ మొక్కటియే యనుట కీమంత్రము ప్రమాణముగా శంకరభాష్యమునందు గైకొనఁబడినది.

ప్రథమాధ్యాయము, ౧3-వ మంత్రము.

అవ. పూర్వోక్తమంత్రప్రకారము త్రివిధముగా ప్రతిపాదింపఁబడిన బ్రహ్మము ప్రణవోపానముచేత గ్రహించవచ్చుననువిషయము ప్రతిపాదింపఁబడుచున్నది —

మూ. వహ్నే ర్యథా యోనిగతస్య మూర్తిః
న దృశ్యతే నైవ చ లింగనాశః,
స భూయ ఏవేంధనయోనిగృహ్య
స్తద్వోభయం వై ప్రణవేన దేహే ౧3

పద. వహ్నేః యథా యోనిగతస్య మూర్తిః న దృశ్యతే న ఏవ చ లింగనాశః, సః భూయః ఏవ ఇంధనయోనిగృహ్యః తత్ వా ఉభయం వై ప్రణవేన దేహే. ౧3

టీక. యోనిగతస్య= (స్వకారణభూతమగు) అరణిని పొందియున్న, వహ్నేః = అగ్నియొక్క, మూర్తిః=స్వరూపము, యథా = ఏవిధముగా, నదృశ్యతే = (మథించుటకుపూర్వము) కనంబడఁజాలదో, లింగనాశః చ=

లింగనాశమున్నూ, నఏవచ=లేదో, సః=(అరణినిపొందియున్న) ఆయగ్నియే, భూయః=మఱల, ఇంధనయోనిగృహ్యః = కట్టెయనెడి కారణమును మధించుటవలన గ్రహింపఁబడుచున్నాఁడో, తత్ ఉభయంవై = ఆరెంటివలెనే, దేహే = ఈశరీరమునందు, (ఆత్మ=అత్మాస్వరూపము) ప్రణవేన = ఓంకారోపాసనము చేత, (గృహ్యః=గ్రహింపఁదగినది.)

తా. ౧. ఓమిత్యేతేనైవాక్షరేణ పరంపురుష మభిధ్యాయీత.

ప్రశ్న. ౫-౫.

౨. ఓమిత్యాత్మానంయుంజీత. మహానారాయణ. ౨౪-౧.

3. ఓమిత్యాత్మానం ధ్యాయీత.

నున్నగు శ్రుతిప్రమాణములవలన పరబ్రహ్మోపాసనమునకు ప్రణవము ధ్యానాంగముగ ప్రతిపాదింపఁబడుచున్నది. అరణియందున్న అగ్నికణము మధించుటకు ముందుకూడ ఉండియున్నను ఆయగ్నియొక్క స్వరూప మెటుల గనంబడుట లేదో, బయిటికి గనంబడకపోయినను మధించుటకు పూర్వమందు ఆయరణియందున్న అగ్నియొక్క సూక్ష్మాంశము యెట్లు నశించుటలేదో, ఆయరణియందు మనకుఁ గనంబడక సూక్ష్మముగ నున్నయగ్నియే మధించిన పిదప యెటుల స్ఫుటముగ బయట గనంబడుచున్నదో అదేవిధముగ ఆరెంటివలెనే వహ్నిస్థానీయుఁ డగుఆత్మయు ప్రణవమను ఉత్తరారణిస్థానీయమగు మననమువలన అధరారణి స్థానీయమగు దేహమునందు సాధకులగువారికి లభ్యుఁడగును.

వివరణము:—ఆత్మాన మరణింకృత్వా ప్రణవంచోత్తరారణిమ్, జ్ఞాన నిర్మథనాభ్యాసా త్పాపందహతి పండితః అను౧-౧౧. కైవల్యోపనిషద్వాక్య మిట అనుగృహీతము. బ్రహ్మోపనిషత్తునందుగూడ పైమంత్రము గలదు.

ప్రథమాధ్యాయము, ౧౪-వ మంత్రము.

అవ. ఆప్రణవోపాసనమే వివరింపఁబడుచున్నది.

మూ. స్వదేహమరణింకృత్వా ప్రణవంచో త్త రారణిం,
ధ్యాననిర్మథనాభ్యాసాత్ దేవం పశ్యేన్నిగూఢవత్.

పద. స్వదేహం అరణిం కృత్వా ప్రణవం చ ఉత్తరారణిమ్, ధ్యాన నిర్మథనాభ్యాసాత్ దేవం పశ్యేత్ నిగూఢవత్. ౧౪

టీక. (సాధకుఁ డగుపురుషుఁడు) స్వదేహం=తనశరీరమును, అరణిం= అధరారణిగా, కృత్వా=చేసి, ప్రణవం=ప్రణవమును, ఉత్తరారణిం చ = ఉత్తరారణిగను, కృత్వా=చేసి, ధ్యాననిర్మథనాభ్యాసాత్=ధ్యాన=చిత్తైకాగ్ర్యమనియెడి, నిర్మథన=మథించుటయను, అభ్యాసాత్=అభ్యాసమువలన, నిగూఢవత్ = గూఢముగానున్న, దేవం=జ్యోతిస్స్వరూపుఁడగు పరమేశ్వరుని, పశ్యేత్=చూడవలయును.

తా. సాధకుఁ డగుపురుషుఁడు తనశరీరమును, అధరారణిగను, ప్రణవమును ఉత్తరారణిగను భావించి ధ్యానమనెడి మథనము నొనర్చుటచేత ఆయరణియందు గూఢముగానున్న జ్యోతిస్స్వరూపుఁ డగు ఆత్మను చూచుచున్నాఁడు.

వివరణము — ఈ మంత్రము బ్రహ్మోపనిషత్తునందును, కైవల్యోపనిషత్తునందునుగూడ గలదు. కాని ౪-వ పాదమునందు మాత్రము "పాపం దహతి పండితః" అని చెప్పఁబడినది.

ప్రథమాధ్యాయము, ౧౫-వ మంత్రము.

అవ. ఇదివఱకు నిరూపించినవిషయమునకు దృష్టాంతము ప్రదర్శింపఁబడుచున్నది —

మూ॥ తిలేషు తైలం దధినీవ సర్పి
రాప స్స్రోతస్స్వరణీషుచాగ్నిః,
ఏవ మాత్మాఽఽత్మని గృహ్యతే ఽసౌ
సత్యేనైనం తపసా యో ఽనుపశ్యతి    ౧౫

పద. తిలేషు తైలం దధిని ఇవ సర్పిః అపః స్రోతస్సు అరణీషు చ అగ్నిః, ఏవం ఆత్మా ఆత్మని గృహ్యతే అసౌ సత్యేన ఏనం తపసా యః అనుపశ్యతి.    ౧౫

టీక. తిలేషు=నువ్వులయందు, తైలంఇవ=నూనెవలెను, దధిని=పెరుగునందు, సర్పిః ఇవ=నెయ్యివలెను, స్రోతస్సు = నదులందు, అపఃఇవ=జలములవలెను, అరణీషు = అరణులందు, అగ్నిఃఇవ = అగ్నిహోత్రమువలెను, యః=ఎవ్వఁడు, ఏనం=ఈయాత్మను, సత్యేన=సత్యముచేత, తపసా=తపస్సుచేతను, అనుపశ్యతి = చూచుచున్నాఁడో, తేన=అట్టివానిచేత, అసౌ=ఈయాత్మ, ఆత్మని=తనదేహమునందు, ఏవం=ఈప్రకారముగా, గృహ్యతే = గ్రహింపఁబడుచున్నాఁడు.

తా॥ నువ్వులయందున్న తైలము గానుగయొక్క ఆపీడనమువలన వెలుపలకు వచ్చుచున్నది. పెరుగునందున్న నెయ్యి మంథనమువలన వేఱుపడుచున్నది. ప్రవాహము—పాఱుదలగల యుదకము లేని నదీభూభాగమునందు త్రవ్వుటచేత ఉదకము బహిర్గతమగుచున్నది. అదేవిధముగా ఆత్మయున్నూ తనదేహమునందే అన్నమయమును ప్రాణమయమునందును, ప్రాణమయమును మనోమయమునందును, మనోమయమును విజ్ఞానమయమునందును, విజ్ఞానమయమును ఆనందమయమునందున్నూ ప్రవిలాపనమొనర్చుటచేత పూర్ణానందరూపమయిన స్వాత్మస్వరూపము తెలియఁబడుచున్నది. ఎట్టిపురుషునిచేత ఆత్మతత్త్వము తెలిసికొనఁబడుచున్న దనువిషయము చెప్పఁబడుచున్నది.—

సత్యముచేతను తపస్సుచేతను ఎవ్వఁడు ఆత్మనుగాంచునో అట్టివాఁడు తన దేహమునందే ఆత్మ సాక్షాత్కారమును పొందును.

సత్యమనఁగా—"సత్యం భూతహితం ప్రోక్తం" అని స్మృతివచన మగుటచేత యథార్థమయినదియు, భూతహితకరమును అగువచనము. తప స్సనఁగా—"మనసశ్చేంద్రియాణాం చ ఐకాగ్ర్యంపరమంతపః"అని చెప్పఁ బడియుండుటచేత ఇంద్రియములను మనస్సును ఏకాగ్రముగ నుంచుట.

ప్రథమాధ్యాయము, ౧౬-వ మంత్రము.

మూ సర్వవ్యాపిన మాత్మానం క్షీరే సర్పి రివార్పితమ్,
ఆత్మవిద్యా తపోమూలం తద్బ్రహ్మోపనిషత్పరమ్,
తద్బ్రహ్మోపనిషత్పరమ్. ౧౬
ఇతి శ్వేతాశ్వతరోపనిషది ప్రథమోఽధ్యాయః

పద. సర్వవ్యాపినం ఆత్మానం క్షీరే సర్పిః ఇవ అర్పితం, ఆత్మవిద్యా తపోమూలం తత్ బ్రహ్మ ఉపనిషత్ పరం, తత్ బ్రహ్మ ఉపనిషత్ పరం.

టీ. సర్వవ్యాపినం = అంతట వ్యాపించియున్నట్టియు, క్షీరే=పాల యందు, సర్పిఃఇవ = నెయ్యివలె, అర్పితం = అర్పితుఁ డయియున్నట్టియు, ఆత్మవిద్యాతపోమూలం = ఆత్మజ్ఞానతపస్సులకు మూలకారణభూతుఁ డయి యున్నట్టియు, తత్ = ఆ, బ్రహ్మ = బ్రహ్మము, పరం = శ్రేష్ఠమయినది. ఉపనిషత్ = రహస్యమయినది, తత్ బ్రహ్మ = ఆబ్రహ్మమే, పరం = శ్రేష్ఠ మయినది, ఉపనిషత్ = రహస్యమయినది.

తా. సర్వవ్యాపియనఁగా అంతట వ్యాపించియున్నవాఁడు—అనఁగా దేహేంద్రియాదులందు మాత్రమేగాక ప్రకృతియందంతట వ్యాపించి

యున్నవాఁడు. పాలయందు అంతట నెయ్యి సారభూతముగా అర్పితమయి యెట్లున్నదో అదేవిధముగా అంతట సారభూతుఁ డయియున్నవాఁడును, ఆత్మ జ్ఞానమునకును, తపస్సునకును మూలకారణభూతుఁడయినవాఁడును, విద్యాతప స్సులకు ఆత్మయే కారణభూతుఁడను విషయమయి శ్రుతిస్మృతు లిట్లు చెప్పు చున్నవి:—

శ్రుతి. ఏష హ్యేవ సాధుకర్మ కారయతి. కౌషీ. 3—౮

స్మృతి. దదామి బుద్ధియోగంతం యేన మా ముపయాంతి యే. భగ. ౧౦. ౧౦.

ఆత్మవిద్యాతపస్సులకు మూలభూతుఁడయినవాఁడనియును చెప్ప వచ్చును. ఇందులకు శ్రుతిప్రమాణములు:—

౧. విద్యయా౽మృతమశ్నుతే. ఈశావాస్య. ౧౧.

అర్థ. జ్ఞానము చేత మోక్షమును పొందుచున్నాఁడు.

౨. తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ. తైత్తిరీయ. 3-౨-౧.

అర్థ. తపస్సు చేత బ్రహ్మము నెఱుంగుము.

ఎవ్వఁడు సత్యాదిసాధనసంపత్తిసహితుఁడో అట్టివాఁడు సర్వవ్యా పియు, క్షీరమునందంతట నెయ్యివలె వ్యాపించియున్నవాఁడును, ఆత్మవిద్యా తపోమూలుఁడును అగు ఉపనిషత్ప్రతిపాద్యుఁ డగుపరమాత్మను గాంచు చున్నాఁడు. సత్యాదిసాధనసంపత్తిగల ఆత్మదర్శియగువాఁడు సర్వగతమగు బ్రహ్మమును ఆత్మయందే గ్రహింపఁగలుగును గాని సత్యాది సాధనసంపత్తి లేనివాఁడు చూడఁజాలఁడు. మఱియు పరిచ్ఛిన్నబ్రహ్మమయమగు అన్న మయాద్యాత్మస్వరూపునిఁగఁ గాంచఁజాలఁడు.

శ్రు. ౧. సత్యేన లభ్యస్తపసా హ్యేష ఆత్మా
సమ్యక్జ్ఞానేన బ్రహ్మచర్యేణనిత్యమ్. ముండక. 3-౧-౫.

౨. న యేషు జిహ్మ మనృతం న మాయా. ప్రశ్న. ౧౧-౬.

"తద్బ్రహ్మోపనిషత్పరం, తద్బ్రహ్మోపనిషత్పరం" అని రెండుపర్యాయములు చెప్పుట అధ్యాయసమాప్తిసూచకమని గ్రహించవలయును.

## శ్వేతాశ్వతరోపనిషత్తునందు ప్రథమాధ్యాయము సమాప్తము.

---

ఈ యధ్యాయమునకు సంబంధించిన ఇతరగ్రంథభాగములు:-

ఆత్మపురాణము—అష్టమాధ్యాయము. శ్లో. ౧-౪౯౬ వఱకు.

అనుభూతిప్రకాశము—ద్వాదశాధ్యాయము. శ్లో. ౧-౩౬.

బ్రహ్మగీత-సూతసంహితాంతర్గతము, ౧౧ అధ్యాయము. శ్లో. ౫౭-౬౭.

శ్రీ గురుభ్యో నమః.

కృష్ణయజుర్వేదాంతర్గత మగు

# శ్వేతాశ్వతరోపనిషత్తు

ఆంధ్రటీకాతాత్పర్య వివరణసమన్వితము



# ద్వితీయాధ్యాయము.

ద్వితీయాధ్యాయము, ౧-వ మంత్రము.

మూ. యుంజానః ప్రథమం మన స్తత్త్వాయ సవితా ధియః,
అగ్నిం జ్యోతి ర్నిచాయ్య పృథివ్యా అధ్యాభరత ౧

పద. యుంజానః ప్రథమం మనః తత్త్వాయ సవితా ధియః, అగ్నిం జ్యోతిః నిచాయ్య పృథివ్యాః అధి ఆభరత. ౧

టీ. ప్రథమం = ధ్యానారంభమునకు మొదట, మనః = మనస్సును, యుంజానః = (పరమాత్మయందు) చేర్చుచున్నవాఁడై, సవితా = ప్రేరకుఁడగు చిదాత్మ, ధియః = ఇంద్రియములనులేక బాహ్యవిషయజ్ఞానములను, తత్త్వాయ = తత్త్వజ్ఞానముకొఱకు, అగ్నింజ్యోతిః = అగ్నిప్రకాశమును, నిచాయ్య=చూచి, పృథివ్యాః = భూమివల్లనుండి, అధి = శరీరమునందు, ఆభరత = భరించెను.

తా. ఈ యుపనిషత్తుయొక్క పూర్వాధ్యాయమునందు "ధ్యానని ర్మథనాభ్యాసాత్ దేవం పశ్యేన్నిగూఢవత్" (శ్వేతాశ్వతర. ౧-౧౪.)నందు చెప్పినప్రకారము ధ్యానము పరమాత్మదర్శనమునకు ఉపాయముగా చెప్పఁబడినది. ఈ రెండవఅధ్యాయమునందు అట్టిధ్యానమునకు అత్యావశ్యకములగుసాధనములను నిరూపించుచున్నాఁడు. ప్రప్రథమమున అట్టిసాధనము సిద్ధించుటకొఱకు సూర్యోపాసనము నిరూపింపఁబడుచున్నది. ధ్యానారంభసమయమునందు పరమాత్మయందు మనస్సును ఇతరేంద్రియములను చేర్చవలయును. లేక పరమాత్మయందు మనస్సును బాహ్యవిషయజ్ఞానములను తత్త్వజ్ఞానముకొఱకు చేర్చవలయును. సాధకుఁ డగువాఁడు ధ్యానారంభమునందు మనస్సును పరమాత్మయందు చేర్చవలయును. అదేవిధముగా ఇతరేంద్రియములనుకూడా పరమాత్మయందు చేర్చవలయును. 'ప్రాణా వై ధియః' అని చెప్పఁబడియుండుటచేత ధీశబ్దము ప్రాణవాచకము. లేక 'ధియః' అనుపదమునకు బాహ్యవిజ్ఞానవిషయములని అర్థము చెప్పవచ్చును. సర్వప్రేరకుఁడగు పరమాత్మ బాహ్యవిషయవిజ్ఞానముగల అగ్నివల్లనుండి జ్యోతిస్సును అనఁగా ప్రకాశమునుగాంచి యీశరీరమునందు దానిని ప్రవేశింపఁజేసెను. అనఁగా జ్ఞానార్థము ప్రయత్నించువాఁడు ఇంద్రియములను బాహ్యవిషయార్థములనుండి మరలించి పరమాత్మయందే చేర్చియుంచుటకు తగిన అనుగ్రహము చేయవలయునని సర్వదేవతాస్వరూపుఁడును, అగ్న్యాది సకలదేవతలకు సకలవస్తుప్రకాశనసామర్థ్యము నొసంగువాఁడును, సర్వప్రేరకుఁడగుటచేత సవిత యని చెప్పఁబడుచున్నట్టియు దేవత మా వాగాదీంద్రియములకు సామర్థ్యమును కలుగఁజేయుఁగాక. మూలమునందుగల 'అగ్నిః' అనుపదము ఇతర ఇంద్రియాభిమాని దేవతలకందఱకు ఉపలక్షణము.

ద్వితీయాధ్యాయము, ౨-వ మంత్రము.

**మూ॥ యుక్తేన మనసా వయం దేవస్య సవితుః సవే,**
**సువర్గేయాయ శక్త్యా.** ౨

పద. **యుక్తేన** మనసా **వయం** దేవస్య సవితుః సవే, సువర్గేయాయ శక్త్యై. ౨

టీక. వయం = మేము, యుక్తేన = (పరమాత్మయందు) కూడుకొని యున్న, మనసా = మనస్సుచేత, దేవస్య=స్వయంప్రకాశుఁడగు, సవితుః= సవితయొక్క, సవే = అనుజ్ఞకలిగినదగుచుండఁగా, సువర్గేయాయ = స్వర్గప్రాప్తికి హేతుభూతమైన, శక్త్యా = సామర్థ్యముచేత, (ప్రయత్నించుచున్నాము.)

తా. తత్తదింద్రియాధిష్ఠానదేవతలయొక్క అనుగ్రహరూపమైన శక్తిచేత దేహేంద్రియాదులకు దారుఢ్యము యెప్పుడు కలుగునో, అప్పుడు మేము ఆ పరమాత్మయందు మనస్సును చేర్చినవారమై ఆ పరమేశ్వరుని యొక్క అనుగ్రహముచేతనే అతనిని పొందునిమిత్తము సామర్థ్యానుసారము ధ్యాన మొనర్చెదము. మూలమునందుగల 'సువర్గేయాయ' అనుపదము పరమాత్మవాచకము,యేలయనఁగా యిచ్చట ప్రకరణముననుసరించి సువర్గశబ్దమునకు పరమాత్మయనియే గ్రహించవలయును. నిరతిశయమైనసుఖము పరమాత్మయే కాని యితరము కాజాలదు. శ్రుతి. 'ఏతస్యైవానందస్యాన్యాని భూతాని మాత్రా ముపజీవంతి.' బృహ. ౪-3-3౨. అను శ్రుతియు పైయర్థమునే బోధించుచున్నది.

వివరణము —'సువర్గేయాయశక్త్యై' అని పాఠాంతరము గలదు.

ద్వితీయాధ్యాయము, 3-వ మంత్రము.

అవ. మఱల ఆసవితయే మాకీ చెప్పఁబోవువిధముగా బుద్ధినొసంగు గాక యని ప్రార్థింపఁబడుచున్నది.

మూ॥ యుక్త్వాయ మనసా దేవాన్ సువర్యతో ధియాదివమ్,
బృహజ్జ్యోతిః కరిష్యత స్సవితా ప్రసువాతి తాన్ 3

పద. యుక్త్వాయ మనసా దేవాన్ సువః యతః ధియా దివమ్, బృహత్ జ్యోతిః కరిష్యతః సవితా ప్రసువాతి తాన్. 3

టీక. సవితా = సర్వప్రేరకుఁ డగు సవిత, మనసా = మనస్సుతోడ, యుక్త్వాయ = ప్రత్యగాత్మనుచేర్చి, సువఃయతః = పూర్ణానందరూపమగు బ్రహ్మమునుపొందుచున్న, దేవాన్ = మనస్సు మొదలగు ఇంద్రియములను, ధియా=సమ్యక్ జ్ఞానముతో, దివం=ద్యోతనస్వభావమును, బృహత్=సర్వశ్రేష్ఠమును,జ్యోతిః=ప్రకాశమును, కరిష్యతః=ఆవిష్కరించునట్టివానినిగా, ప్రసువాతి=కలుగఁజేయుఁగాక.

తా. సర్వప్రేరకుఁ డగుసవిత మామనస్సును పరమాత్మయందు సంలగ్నమొనర్చి సర్వేంద్రియములను పూర్ణానందస్వరూపుఁ డగుబ్రహ్మమును పొందువానినిగా నొనర్చుఁగాక. శబ్దాదివిషయాభిముఖము గలవానినిగా చేయకపోవుఁగాక. మఱియు ఆఇంద్రియములను సమ్యగ్దర్శనముచేత ద్యోతనస్వభావమును చైతన్యైకరసమును సర్వబృహత్తును అగు జ్యోతిస్సును పూర్ణానంద బ్రహ్మరూపమును ఆవిష్కరింపఁజేయువానినిగా నొనర్చుఁగాక. అనఁగా నా ఇంద్రియములన్నియు బాహ్యవిషయ విముఖములయి ఆత్మాభిముఖములయి ఆత్మప్రకాశమునే యెటుల గాంచుచుండునో అట్టిస్థితిని సవిత మా కొనర్చుఁగాక.

ద్వితీయాధ్యాయము, ౪-వ మంత్రము.

అవ. ఈవిధముగా అనుగ్రహించిన భగవంతుని విశేషముగ కొని యాడవలయునని చెప్పఁబడుచున్నది —

మూ॥ యుఞ్జతే మన ఉత యుఞ్జతే ధియో
విప్రా విప్రస్య బృహతో విపశ్చితః,
వి హోత్రా దధే వయునావి దేక ఇ
న్మహీ దేవస్య సవితుః పరిష్టుతిః. ౪

పద. యుఞ్జతే మనః ఉత యుఞ్జతే ధియః విప్రాః విప్రస్య బృహతః విపశ్చితః, వి హోత్రాః దధే వయునావిత్ ఏకః ఇత్ మహీ దేవస్య సవితుః పరిష్టుతిః. ౪

టీక. (యే=ఏ) విప్రాః=బ్రాహ్మణులు, మనః=తమయొక్క-చిత్తమును, యుంజతే=(పరమాత్మయందే) చేర్చుచున్నారో, ఉత=మఱియు, ధియః= ఇతరములయిన ఇంద్రియములను, యుంజతే=(ఆపరమాత్మయందే) చేర్చు చున్నారో, (అట్టి బ్రాహ్మణులచేత) విప్రస్య=విశేషముగా వ్యాపించియున్న ట్టియు, బృహతః=మహాత్స్వరూపుఁడయినట్టియు, విపశ్చితః= సర్వజ్ఞుఁడయి నట్టియు, సవితః=సర్వప్రేరకుఁడగు పరమేశ్వరునియొక్క-, మహీ=గొప్పదైన, పరిష్టుతిః = అంతట వ్యాప్తమయిన స్తుతి (చేయఁదగినది), (యః=ఏసవిత) హోత్రాః = యజ్ఞయాగాది సకలకర్మలను, విదధే=సృజించెనో (ఆసవిత) వయునావిత్ = ప్రజ్ఞావంతుఁడు. (మఱియు అతఁడు సర్వజ్ఞుఁడును సాక్షి భూతుఁడును) ఏకఇత్=అద్వితీయుఁడే అగుచున్నాఁడు.

తా. ఏ బ్రాహ్మణులు సర్వకాలములందు తమచిత్తమును ఇతరేంద్రియ ములను సర్వప్రేరకుఁడగుటచేత సవితృశబ్దవాచ్యుఁడగు ఏపరమాత్మయందుంచు

చున్నారో అట్టిపరమాత్మ సర్వవ్యాపకుఁడును సర్వమహాత్తును అగుటచేత అతనిని అంతట మిక్కిలి కొనియాడవలయును. ఇంద్రియములన్నియు బుద్ధియే కారణముగాఁ గలవియగుటచేత ధీశబ్ద మిట ఇంద్రియార్థమునందు ప్రయోగింపఁబడినది. ఇందులకు శ్రుతిప్రమాణముగూడ గలదు —యదా పంచావతిష్ఠంతే జ్ఞానాని మనసాసహ. కఠ. ౬-౧౦. విప్రశబ్దమున కిచట "విశేషేణ వ్యాప్తః విప్రః"అనివ్యుత్పత్తి చెప్పఁబడినది. అంతట వ్యాపించినట్టియు, సర్వమహత్తును సర్వజ్ఞుఁడును అగుపరమేశ్వరుని చక్కఁగా కొనియాడవలయును. ఆపరమాత్మనే మఱల ప్రకారాంతరముగ స్తుతించుచున్నాఁడు —ఏపరమాత్మ యజ్ఞయాగాది సర్వక్రియల నొనర్చునో,ఏపరమాత్మ ప్రజ్ఞావంతుఁడో, సర్వజ్ఞుఁడో, సర్వసాక్షిభూతుఁడయిన అద్వితీయుఁడో ఏపరమేశ్వరుని వేదవేత్తలగు బ్రాహ్మణులు మనస్సు మొదలగు సకలేంద్రియములను విషయముల నుండి మరలించి ఆత్మయందే చేర్చుచున్నారో అట్టి పరమాత్మను విశేషముగా కొనియాడవలయును.

వివరణము.—'వయునావిత్' అను పదమునందు 'వయునా'యను పదము దీర్ఘముగానుండుట ఛాందసము. విప్రస్య అను పదమునకు 'దేశతః పూర్ణస్య' అని విజ్ఞానభిక్షు వ్యాఖ్యానమునందు గలదు. ఉపనిషద్బ్రహ్మ వ్యాఖ్యయందున్నూ ఇట్లేగలదు. ప్రాపూరణే అని ధాతువు. "హోత్రాః" ఋత్విగభిధానమేతత్, ఇహతు తత్కర్మసు వర్తతే-ఋత్విజ్ నిర్వర్త్యాంతఃకరణహేతుభూతాః క్రియాస్సర్వా ఇతియావత్' అని ఉపనిషద్బ్రహ్మ వ్యాఖ్య.

ద్వితీయాధ్యాయము, ౫-వ మంత్రము.

అవ. పూర్వులొనరిచ్చినవిధముగా నేనున్నూ పరమేశ్వరునిస్తుతి చేయుచున్నాఁడ —

మూ॥ యుజే వాం బ్రహ్మ పూర్వ్యం నమోభి
ర్విశ్లోక ఏతు పథ్యేవ సూరేః,
శృణ్వన్తు విశ్వే అమృతస్య పుత్రా
ఆ యే ధామాని దివ్యాని తస్థుః ॥ 5

పద. యుజే వాం బ్రహ్మ పూర్వ్యం నమోభిః వి శ్లోకః ఏతు పథి ఏవ సూరేః, శృణ్వన్తు విశ్వే అమృతస్య పుత్రాః ఆ యే ధామాని దివ్యాని తస్థుః. ॥ 5

టీ. యే=ఏ దేవతలు, దివ్యాని = దేవసంబంధములయిన, ధామాని= స్థానములను, ఆతస్థుః=అధిష్ఠించియుండిరో, అమృతస్య = అమరణధర్ముఁడగు పరమేశ్వరునకు, పుత్రాః=పుత్రతుల్యులయిన, తే విశ్వే = హిరణ్యగర్భాదులగు ఆమహానుభావులందఱు, శృణ్వంతు = నేను చేయుచున్న యీస్తుతిని ఆలకించెదరుగాక.—(ఓహిరణ్యగర్భాదిసకలదేవతలారా!) వాం = మీకు (కారణభూతమును), పూర్వ్యం=చిరంతనమును అగు, బ్రహ్మ=బ్రహ్మమును, నమోభిః = నమస్కారములచేతను, చిత్తప్రణిధానాద్యుపాయములచేతను, యుజే=చేర్చుచున్నాఁడను. శ్లోకః=కీర్తి, సూరేః పథి ఏవ=ముక్తులయినవారి మార్గమునందే, విఏతు=అనుసరించుఁగాక. ॥ 5

తా. ఓ హిరణ్యగర్భాదిదేవతలారా! మీకు కారణభూతమయినట్టియు, అతిప్రాచీనమయినట్టియు పరబ్రహ్మమునకు నమస్కరించుచున్నాఁడను. చిత్తమును ఆబ్రహ్మమునందే ఐక్యమొనర్చుచున్నాఁడను.ఈవిధముగా బ్రహ్మమునందు మనస్సమాధానము చేయుచున్న నాయొక్కకీర్తి ముక్తులయిన సత్పురుషు లనుసరించిన సన్మార్గమునే అనుసరించుఁగాక. ఆయాదేవతాస్థానముల నధిష్ఠించియున్నట్టియు, సర్వకారణభూతుఁడగు పరమేశ్వరునకు పుత్రభూతులయినట్టియు హిరణ్యగర్భాదిదేవతలందఱు నాయీప్రార్థనము నాల

కించెదరుగాక. ఓమనోబుద్ధులారా! మిమ్ముల నిద్దఱను సర్వకారణభూతుఁడును, చిరంతనుఁడును అగు బ్రహ్మమునందు నమస్కారపూర్వకముగ చేర్చుచున్నాఁడను.

వివరణము —'విశ్లోకా యంతు పథ్యేవసూరాః' పాఠాంతరముగలదు.

ద్వితీయాధ్యాయము, ౬-వ మంత్రము.

అవ. "యుంజానః ప్రథమం మనః" అనుద్వితీయాధ్యాయ ప్రారంభ మంత్రమునుండి గతించిన ౫ మంత్రములందు సవిత్రాది ప్రార్థనము ప్రతిపాదింపఁబడినది. ఎవ్వఁడు సవిత్రాది దేవతలను ప్రార్థింపక, వారియొక్క అనుజ్ఞను గైకొనక యోగమునందు ప్రవర్తించునో వాఁడు భోగహేతువగు కర్మయందే ప్రవర్తించునని యీ మంత్రమునందు చెప్పఁబడుచున్నది.—

మూ. అగ్నిర్యత్రాభిమథ్యతే వాయుర్యత్రాధిరుధ్యతే,
సోమో యత్రాతిరిచ్యతే తత్ర సఞ్జాయతే మనః. ౬

పద. అగ్నిః యత్ర అభిమథ్యతే వాయుః యత్ర అధిరుధ్యతే, సోమః యత్ర అతిరిచ్యతే తత్ర సంజాయతే మనః. ౬

టీ. యత్ర = ఏయాధానాదికర్మలయందు, అగ్నిః = అగ్ని, అభిమథ్యతే = మథింపఁబడుచున్నాఁడో, యత్ర = ఏప్రవర్గ్యాదికమునందు, వాయుః=వాయువు, అధిరుధ్యతే = (సవితచేతప్రేరేపింపఁబడినదై) శబ్దము చేయుచున్నదో, యత్ర=ఎచ్చట, సోమః=సోమరసము, అతిరిచ్యతే=దశాపవిత్రముచేత పూయమానమయి అభివృద్ధినిపొందుచున్నదో, తత్ర=అచ్చట, మనః=మనస్సు,సంజాయతే=పుట్టుచున్నది.

తా. ఎవ్వరు పరమేశ్వరు నారాధింపక అగ్న్యాధానాదిక్రతువుల నాచరించుచు అగ్నినిమాత్రము మథించుచున్నారో,వాయువు ఎచ్చట ప్రవ

గ్వ్యాదికమునందు సవితృప్రేరితమయి శబ్దమొనర్చుచున్నదో, సోమరస మెచట దశాపవిత్రముచేత సంస్కృతమయి వృద్ధినిపొందుచున్నదో, అట్టి క్రతువునందు మనస్సు పుట్టుచున్నది. అనఁగా మనోఽనుకూలమయిన కామాదిభోగహేతువులే వారికి కలుగును.

## అర్థాంతరము.

టీ. అగ్నిః=పరమాత్మ, యత్ర=ఎచ్చట-అనఁగా ఏపురుషునియందు, అభిమథ్యతే = మథింపఁబడుచున్నాఁడో, యత్ర = ఏపురుషునియందు, వాయుః = వాయువు, అధిరుధ్యతే = (రేచకాదికము నాచరించుటవలన) శబ్దించుచున్నదో, యత్ర = ఏపురుషునియందు, సోమః = సోమరసము, అతిరిచ్యతే = అధికముగ గ్రహింపఁబడున్నదో, తత్ర=అచ్చట, మనః= మనస్సు, సంజాయతే = (అద్వితీయ బ్రహ్మాకారముగలదిగ) అగుచున్నది.

తా. అగ్నియనఁగా పరమాత్మయని గ్రహించవలయును. అవిద్యాతత్కార్యములను దహించుటచేత పరమాత్మ అగ్నిశబ్దవాచ్యుఁడగుచున్నాఁడు. భగవద్గీతయం (౧౦-౧౧) దీవిషయ మిట్లు తెలుపఁబడినది —

శ్లో. తేషా మేవానుకంపార్థ మహమజ్ఞానజం తమః,
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా.

అట్టిపరమాత్మ ఏపురుషునియందు "స్వదేహమరణింకృత్వా ప్రణవం చోత్తరారణిమ్, జ్ఞాననిర్మథనాభ్యాసా ద్దేవం పశ్యేన్నిగూఢవత్" శ్వేతా. ౧-౧౪. అను మంత్రమునందు చెప్పినవిధముగ ధ్యానముచేత గ్రహింపఁబడుచున్నాఁడో, ఏపురుషునియందు రేచకపూరకాదిక్రమముగ ప్రాణాయామము నభ్యసించుటవలన వాయువు అవ్యక్తమయిన ధ్వనినిచేయుచున్నదో, అనఁగా ఎవ్వఁడు గురూపదిష్టక్రమము ననుసరించి ప్రాణాయామాదికము

నభ్యసించుచున్నాఁడో, సోమరస మెవ్వనిచేత అధికముగ గైకొనఁబడుచున్నదో, అనఁగా అనేక జన్మములందు అగ్నిష్టోమాదికము నాచరించుటచేత అధికముగ సోమరసము పరిగ్రహింపఁబడుచున్నదో, అట్టివానియొక్క (అనఁగా యజ్ఞదానతపః ప్రాణాయామసమాధివిశుద్ధాంతఃకరణుఁడయిన వానియొక్క) చిత్తము పరిపూర్ణానందాద్వితీయబ్రహ్మాకారమగును. విశుద్ధాంతఃకరణము లేని వారలకు ఆత్మానందానుభవము లేదు. ఈవిషయమునంగీ క్రిందిప్రమాణములను తిలకింపుఁడు —

శ్లో. ప్రాణాయామ విశుద్ధాత్మా యస్మాత్పశ్యతి తత్పరమ్,
తస్మాన్నాతః పరంకించిత్ ప్రాణాయామాదితి శ్రుతిః.
అనేకజన్మసంసారచితే పాపసముచ్చయే,
తత్క్షీణే జాయతే పుంసాం గోవిందాభిముఖీమతిః.
జన్మాంతరసహస్రేషు తపోజ్ఞానసమాధిభిః,
నరాణాం క్షీణపాపానాం కృష్ణేభక్తిః ప్రజాయతే.

అనఁగా ప్రథమమున యజ్ఞాద్యనుష్ఠానము, పిదప ప్రాణాయామాదికము, తరువాత చిత్తసమాధి, తర్వాతవాక్యార్థజ్ఞాననివృత్తి, పిదప కృతకృత్యత యని గ్రహించవలయును.

వివరణము —'తత్రసంజాయతేపునః' అని నాల్గవపాదమున పాఠాంతరముగలదు. ఉపనిషద్బ్రహ్మవ్యాఖ్యయందు ఇది మొదలుకొని ౫ మంత్రములు మధ్యమాధికారికి "సాంగయోగోపదేశము ప్రతిపాదింపఁబడుచున్నదని" వివరింపఁబడినది. విజ్ఞానభిక్షువుకూడ ఇట్టి యభిప్రాయమునే చెప్పియున్నాఁడు. చూడుఁడు —"అనేకజన్మానుష్ఠిత పుణ్యనిచయైః ప్రక్షీణాశేషపాపస్య శుద్ధాంతఃకరణస్య విరక్తస్య శమదమాదిసాధనకలాపవత ఉత్తమాధికారిణో ముముక్షోః మోక్షసాధనమాత్మైకత్వజ్ఞాన ముపదిశ్య తస్మిన్ అయో

గ్యస్య మధ్యమాధికారిణః శుద్ధిద్వారేణ ఆత్మజ్ఞానాధికార సిద్ధ్యర్థం యోగ ముపదిశంతి ఉత్తరే కేచి న్మంత్రాః'' అని చెప్పఁబడినది.

నారాయణగీపికయందుమాత్రము 'అస్య యోగస్య శరీరసాధ్యత్వాత్ శరీరోత్పత్తి ప్రకారమాహ' యని అవతారిక నొనర్చి 'యత్ర = ఏగర్భాశయమునందు, అగ్నిః=పురుషాశ్రయమగు వీర్యము, అభిమథ్యతే = వాతపిత్తకఫములతో మిశ్రితమగుచున్నదో, యత్ర=ఎచ్చట, వాయుః=వాయువు, అభిరుధ్యతే=ఊర్ధ్వభాగమునందు అంకురానుకూల వ్యాపారము నొనర్చుచున్నదో, యత్ర=ఎచ్చట, సోమః=స్త్రీభాగము, అతిరిచ్యతే = గర్భోచితమగు లోహితమువల్లనుండి వృద్ధిని పొందుచున్నదో, తత్ర= అచ్చట, మనః = బ్రహ్మశక్తి, సంజాయతే = పుట్టుచున్నది.' అని అర్థము చేయఁబడియున్నది.

ద్వితీయాధ్యాయము, ౭-వ మంత్రము.

అవ. భగవదనుగ్రహము లేనియెడల కర్మబంధకరమగును కావున తద్విధానము చెప్పఁబడుచున్నది:—

మూ॥ సవిత్రా ప్రసవేన జుషేత బ్రహ్మ పూర్వ్యమ్,
తత్ర యోనిం కృణవసే న హి తే పూర్త మక్షిపత్ ౭

పద. సవిత్రా ప్రసవేన జుషేత బ్రహ్మ పూర్వ్యమ్, తత్ర యోనిం కృణవసే న హి తే పూర్తం అక్షిపత్.  ౭

టీ. ప్రసవేన = సర్వమునకు కారణభూతుఁడైన, సవిత్రా = సవితృస్వరూపముతో, పూర్వ్యం = పురాతనమగు, బ్రహ్మ = బ్రహ్మమును, జుషేత = సేవించవలయును. తత్ర = ఆబ్రహ్మమునందే, యోనిం=సమాధిరూపమయిన నిష్ఠను, కృణవసే= చేయుము. (అట్టిసమాధినిష్ఠను చేయనియె

డల) తే=నీయొక్క, పూర్తం= ఇష్టాపూర్తలక్షణమగు కర్మ, న అక్షిపత్ = చలింపఁజేయఁజాలదు.

తా. సర్వమునకు కారణభూతుఁడగు సవితయొక్క స్వరూపముతో పురాతనమగు బ్రహ్మమును సేవించవలయును. అట్టి బ్రహ్మమునందు సమాధి లక్షణమయిన నిష్ఠను చేయుము. ఇట్టి సమాధివలన నీకు కలుగబోవుఫలమేమ నఁగా; నీ విదివఱకు చేసినట్టి శ్రౌతస్మార్తరూపమయిన కర్మజాతమంతయు సమూలముగ నశించిపోవునుగాని భోగహేతువు కాజాలదు. అనఁగా జ్ఞానాగ్ని చేత సబీజముగ కర్మజాతము దగ్ధమగుచున్నదని భావము. ఈవిషయమునే శ్రుతిస్మృతు లిట్లు చెప్పుచున్నవి —

శ్రు. యథైషీకాతూల మగ్నౌ ప్రోతం ప్రదూయత ఏవం హాస్య సర్వేపాప్మానః ప్రదూయంతే. ఛాందోగ్యము. ౫-౨౪-3.

అర్థ. అగ్నియందు పడిన నూలుపోగు ఏవిధముగా దగ్ధమయిపోవుచున్నదో అదేవిధముగా బ్రహ్మవేత్తయొక్క పుణ్యపాపకర్మలన్నియు నశించి పోవుచున్నవి.

స్మృతి.—జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసా త్కురు తేఽర్జున.
భగ. అ-౪. శ్లో-3౭.

అర్థ. ఓ యర్జునా! జ్ఞానాగ్ని పుణ్యపాపకర్మల నన్నిటిని కాల్చి వేయుచున్నది.

వివరణము —'సవితా ప్రసవేన' 'నహి తే పూర్వ్యమక్షిపత్' అనియుం పాఠాంతరములుంగలవు.

ఉపనిషద్బ్రహ్మ, విజ్ఞానభిక్షువ్యాఖ్యలయందు యోగాభ్యాసవిధాన మున ననుసరించి అర్థము వ్రాయఁబడియున్నది.

ద్వితీయాధ్యాయము, ౮-వ మంత్రము.

అవ. 'తత్ర యోనిం కృణవసే' యని గతమంత్రమునందు చెప్పఁబడిన విషయ మీమంత్రమునందు వివరింపఁబడుచున్నది —

మూ॥ త్రిరున్నతం స్థాప్య సమం శరీరం
హృదీంద్రియాణి మనసా సన్నివేశ్య,
బ్రహ్మోడుపేన ప్రతరేత విద్వాన్
స్రోతాంసి సర్వాణి భయావహాని   ౮

పద. త్రిరున్నతం స్థాప్య సమం శరీరం హృది ఇంద్రియాణి మనసా సన్నివేశ్య, బ్రహ్మోడుపేన ప్రతరేత విద్వాన్ స్రోతాంసి సర్వాణి భయావహాని.   ౮

టీ. త్రిరున్నతం= 'ఱొమ్ము, మెడ, శిరస్సు' అనుమూఁడు అవయవములు ఎత్తుగాఁగల, శరీరం = దేహమును, సమం=సమానముగా, స్థాప్య= ఉంచి, ఇంద్రియాణి = చక్షురాదీంద్రియములను, మనసా=మనస్సుతో, హృది=హృదయమునందు, సన్నివేశ్య=చక్కఁగా నియమించి, బ్రహ్మోడుపేన=బ్రహ్మము అనఁగా ప్రణవమను తెప్పచేతను, భయావహాని=భయమును కలుగఁజేయుచున్న, సర్వాణి=సమస్తమయిన, స్రోతాంసి=(స్వాభావికఅజ్ఞానప్రవర్తిత జననమరణప్రవాహరూప) సంసారనదులను, ప్రతరేత = దాఁటవలయును.

తా. ఉరోగ్రీవశిరస్సులను నవి మూఁడున్ను ఎచ్చట ఉన్నతముగా నుండునో అట్టిది త్రిరున్నతమని చెప్పఁబడును. అట్టి త్రిరున్నతమయిన శరీరమును సమముగా నుంచి చక్షురాది సకలేంద్రియములను హృదయమునందు మిక్కిలి నియమించినవాఁడయి ప్రణవమను తెప్పయందు హృదయ

మునుంచినవాఁడయి స్వాభావికమయిన అవిద్యాకామకర్మప్రవర్తితమయినట్టి యు, ప్రేతతిర్యగూర్ధ్వప్రాప్తికారణములయి పునరావృత్తికి కారణభూతము లగుటచేత భయంకరములును అగు సంసారరూపనదులను దాఁటవలయును. అనఁగా బ్రహ్మస్వరూపమయిన ప్రణవమును ధ్యానించుటచేత జననమరణ రూపసంసారము నశించుచున్నదనిభావము.

ద్వితీయాధ్యాయము, ౯-వ మంత్రము.

అవ. ప్రాణాయామముచేత మనోమలము నశించుటచేత బ్రహ్మము నందు చిత్తము స్థిరమగును కావున ప్రాణాయామము చెప్పఁబడుచున్నది —

మూ ప్రాణాన్ ప్రపీడ్యేహ సన్ యుక్తచేష్టః
క్షీణే ప్రాణే నాసికయోచ్ఛ్వసీత,
దుష్టాశ్వయుక్త మివ వాహ మేనం
విద్వా న్మనో ధారయేతాప్రమత్తః ౯

పద. ప్రాణాన్ ప్రపీడ్య ఇహ సన్ యుక్తచేష్టః క్షీణే ప్రాణే నా సికయా ఉచ్ఛ్వసీత, దుష్టాశ్వయుక్తం ఇవ వాహం ఏనం విద్వాన్ మనః ధారయేత అప్రమత్తః. ౯

టీ. (సాధకుఁడగువాఁడు) యుక్తచేష్టః సన్=యుక్తాహారవిహారము లుగలవాఁడయి, ఇహ=ఇచ్చట - అనఁగా ఈశరీరమునందు, ప్రాణాన్= ప్రాణవాయువులను, ప్రపీడ్య=మనస్సుతోడ నిరోధించి, ప్రాణే=ప్రాణవా యువు, క్షీణే=క్షీణించినదగుచుండఁగా, నాసికయా = నాసికాపుటముచేత, ఉచ్ఛ్వసీత=నిట్టూర్పువిడువవలయును. విద్వాన్ = విద్వాంసుఁడగు సాధ కుఁడు, (రథసారథి) దుష్టాశ్వయుక్తం = పోకిరి గుఱ్ఱములను పూన్చిన, ఏనంవాహం ఇవ=ఈరథమును వలెనే, మనః = మనస్సును, అప్రమత్తః= ప్రమాదములేనివాఁడయి, ధారయేత=ధరించవలయును.

తా. ప్రాణాయామముచేత మనోమాలిన్యము నశించుచున్నది. అట్టి ప్రాణాయామమునకు ముందుగా నాడీశోధనము ఆవశ్యకమగుచున్నది. నాడీ శోధనమయిన తరువాత ప్రాణాయామమునందు అధికారము కలుగును. ప్రాణాయామవిధి సంగ్రహముగ తెలుపఁబడుచున్నది:— దక్షిణనాసికాపుటమును అంగుష్ఠముచేత నొక్కిపట్టి వామనాసికాపుటముచేత తన శక్తికొలఁది వాయువును పూరించవలయును. అనంతరము దక్షిణనాసికాపుటముచేత విడువవలయును. ఇట్లు మఱల దక్షిణనాసికాపుటముచేత వాయువును పూరించి వామనాసికాపుటముచేత విడువవలయును. ఇట్లు 3 పర్యాయములుగాని ౫ దు పర్యాయములుగాని అభ్యాసము చేయవలయును. ఇట్లు ప్రాణాయామమును అపరరాత్రియందును, మధ్యాహ్నమునందును, పూర్వరాత్రమునందును, అర్ధరాత్రియందును అభ్యసించుటచేత ఒకపక్షమునకో మాసమునకో ప్రాణాయామసిద్ధి యగుచున్నది.

ప్రాణాయామము 'రేచకము, పూరకము, కుంభకము' అని త్రివిధముగా చెప్పఁబడుచున్నది —

శ్లో. ఆసనాని సమభ్యస్య వాంఛితాని యథావిధి,
ప్రాణాయామం తతో గార్గి జితాసనగతోఽభ్యసేత్.
మృద్వాసనే కుశాన్సమ్యగాస్తీర్యాజినమేవచ,
లంబోదరంచ సంపూజ్య ఫలమోదకభక్షణైః.
తదాసనే సుఖాసీనః సవ్యేన్యస్యోత్తరం కరమ్,
సమగ్రీవశిరాస్సమ్యక్సంవృతాస్యస్సునిశ్చలః.
ప్రాఙ్ముఖో దఙ్ముఖో వాఽపి నాసాగ్రన్యస్తలోచనః,
అతిభుక్తి మభుక్తించ వర్జయిత్వా ప్రయత్నతః.
నాడీసంశోధనం కుర్యాదుక్తమార్గేణ యత్నతః,
వృథాక్లేశో భవేత్తస్య తచ్ఛోధన మకుర్వతః.
నాసాగ్రే శశభృద్బీజం చంద్రాతపవితానితమ్,

సప్తమస్యతువర్గస్య చతుర్థం బిందుసంయుతమ్.
విశ్వమధ్యస్థమాలోక్య నాసాగ్రే చక్షుషీశుభే,
ఇడయా పూరయేద్వాయుం బాహ్యం ద్వాదశమాత్రకైః.
తతోఽగ్నింపూర్వవద్ధ్యాయే త్స్ఫురజ్జ్వాలావలీయుతమ్,
రుషష్ఠంబిందు సంయుక్తం శిఖామండల సంస్థితమ్.
ధ్యాయేద్విరేచయే ద్వాయుం మందం పింగలయాపునః,
పునః పింగలయాఽఽపూర్య ఘ్రాణం దక్షిణత స్సుధీః.
తద్వద్విరేచయే ద్వాయు మిడయాతు శనై శ్శనైః,
త్రిచతుర్వత్సరంచాపి త్రిచతు ర్మాస మేవవా.
గురుణోక్తప్రకారేణ రహస్యేవం సమభ్యసేత్,
ప్రాతర్మధ్యందినే సాయం స్నాత్వా షట్కృత్వ ఆచరేత్.
సంధ్యాదికర్మ కృత్త్వైవ మధ్యరాత్రేఽపి నిత్యశః,
నాడీశుద్ధి మవాప్నోతి తచ్చిహ్నం దృశ్యతే పృథక్.
శరీరలఘుతా దీప్తి ర్జఠరాగ్నివివర్ధనమ్,
నాదాభివ్యక్తి రిత్యేత ల్లింగం తచ్ఛుద్ధిసూచనమ్.
శుధ్యంతి న జపై స్తైన స్పర్శశుద్ధే రహేఽపవః,
ప్రాణాయామం తతః కుర్యా ద్రేచపూరకకుంభకైః.
ప్రాణాపానసమాయోగః ప్రాణాయామః ప్రకీర్తితః,
ప్రణవం త్ర్యాత్మకం గార్గి రేచపూరకకుంభకమ్.
తదేతత్ప్రణవం విద్ధి తత్స్వరూపం బ్రవీమ్యహమ్,
యోవేదాదౌ స్వరః ప్రోక్తో వేదాంతేషు ప్రతిష్ఠితః.
తయో రన్తంతు యద్గార్గి వర్గపంచకపంచమమ్,
రేచకం ప్రథమం విద్ధి ద్వితీయం పూరకం విదుః.
తృతీయం కుంభకం ప్రోక్తం ప్రాణాయామ స్త్రిరాత్మకః,
త్రయాణాం కారణం బ్రహ్మ భారూపం సర్వకారణమ్.
రేచకః కుంభకో గార్గి సృష్టిస్థిత్యాత్మకా శుభా,

కుంభక స్త్వథ సంహారః కారణం యోగినా మిహ.
పూరయేత్ షోడశై ర్మాత్రై రాపాదతలమ స్తకమ్,
మాత్రై ర్ద్వాత్రింశకైః పశ్చా ద్రేచయే త్సుసమాహితః.
సంపూర్ణకుంభవద్వాయో ర్నిశ్చలం మూర్ధదేశతః,
కుంభకం ధారణం గార్గి చతుష్షష్ట్యా తు మాత్రయా.
ఋషయ స్తు వదంత్యన్యే ప్రాణాయామపరాయణాః,
పవిత్రభూతాః పూతాంత్రాః ప్రభంజనజయే రతాః.
తత్రాదౌ కుంభకం కృత్వా చతుష్షష్ట్యా తు మాత్రయా,
రేచయేత్ షోడశై ర్మాత్రై ర్నాసికేనైవ సుందరి.
తయో శ్చ పూరయే ద్వాయుం శనై ష్షోడశమాత్రయా,
ప్రాణస్యాయమనం త్వేవం వశం కుర్యా జ్జయా వశః.
పంచప్రాణా స్సమాఖ్యాతాః వాయవః ప్రాణ మాశ్రితాః,
ప్రాణో ముఖ్యతమ స్తేషు సర్వప్రాణిభృతాం సదా.
ఓష్ఠనాసికయో ర్మధ్యే హృదయే నాభిమండలే,
పాదాంగుష్ఠాశ్రితః ప్రాణః సర్వాంగేషు చ తిష్ఠతి.
నిత్యం షోడశసంఖ్యాభిః ప్రాణాయామం సమభ్యసేత్,
మనసా ప్రార్థితం యాతి సర్వప్రాణజయా భవేత్.
ప్రాణాయామై ర్దహే ద్దోషా న్ధారణాభిశ్చ కిల్బిషాన్,
ప్రాణాయామశతం స్నాత్వా యః కరోతి దినేదినే,
మాతాపితృగురుఘ్నోఽపి త్రిభి ర్వర్షై ర్వ్యపోహతి.

సాధకుఁడయినవాఁడు యోగశాస్త్రమునందు చెప్పినప్రకారము యుక్తమయిన ఆహారవిహారములుగలవాఁడయి తన దేహమునందున్న ప్రాణాది పంచవాయువులను మనస్సుతోడ నిరోధించినవాఁడయి, ఆ ప్రాణవాయువు యొక్క వేగము కొరవడినదగుచుండఁగా ముక్కుయొక్క రంధ్రమునుండి మెల్లగావదలవలయును. ముఖమార్గమునుండి వదలగూడదు. అనఁగా వాయు

వును ప్రథమమునపూరించి ఒకచోటనిలిపియుంచి పిదప ఆ వాయువును మెల్లగా నాసికా రంధ్రమార్గముగా వదలవలయును. మదించియున్న పోకిరి గుఱ్ఱములు కట్టియున్న రథమునందు కూర్చుండియున్న సారథి ఆరథమును ఎంత మెలకువతో తోలునో అదేవిధముగా దుష్టాశ్వతుల్యములగు ఇంద్రియముల తో కూడుకొనియున్న జీవుఁడు తనమనస్సును జాగరూకుఁడయి చెడుదారులను త్రొక్కకుండ గమనించుచుండవలయును. దుష్టాశ్వములనుపూన్చినరథమునుతోలుచున్న సారథి అజాగరూకుఁడయియున్నరథమునకు సారథికి చిట్టచివరకు గుఱ్ఱములకును యెట్లుఅపాయముకలుగునో అదేవిధముగా స్వేచ్ఛగా సంచరించు స్వభావములుగల ఇంద్రియములను అణఁచిపెట్టనియెడల జీవునకు దేహమునకు ఇంద్రియములకు మనస్సునకు తప్పక కీడు కలుగునని గ్రహించవలయును.

ద్వితీయాధ్యాయము, ౧౦-వ మంత్రము.

మూ॥ సమే శుచౌ శర్కరావహ్నివాలుకా
వివర్జితే శబ్దజలాశ్రయాదిభిః,
మనోఽనుకూలే న తు చక్షుపీడనే
గుహానివాతాశ్రయణే ప్రయోజయేత్. ౧౦

పద. సమే శుచౌ శర్కరావహ్నివాలుకావివర్జితే శబ్దజలాశ్రయాదిభిః, మనోఽనుకూలే న తు చక్షుపీడనే గుహానివాతాశ్రయణే ప్రయోజయేత్. ౧౦

టీ. సమే=మిట్టపల్లములుగాక సమానముగా నున్నట్టియు, శుచౌ=పరిశుద్ధమయినట్టియు, శర్కరా వహ్నివాలుకా వివర్జితే - శర్కరా=గులకరాళ్ళు, వహ్ని=నిప్పు, వాలుకా=ఇసుక (మున్నగువానిచేత), వివర్జితే=వదలిపెట్టఁబడినదియును, శబ్దజలాశ్రయాదిభిః = ధ్వని, నీటియొక్క యీ కువ

మున్నగువాని చేత (విరహితమయినట్టియు), మనోఽనుకూలే = మనస్సునకు అనుకూలమయినట్టియు, నతు చక్షుపీడనే=చూచుటకు అసహ్యముగా నుండ నట్టిదియు, గుహానివాతాశ్రయణే = గాలిమున్నగువాని బాధలేకయుండు నట్టి గొప్ప కొండగుహలుమున్నగు స్థానమునందు, ప్రయోజయేత్ =యోగా భ్యాసపూర్వకముగ, (చిత్తమును పరమాత్మయందు) లయము చేయవలయును.

తా. యోగాభ్యాసమనఁగా తన మనస్సునందు ఏకాగ్రముగా పర మాత్మను చేర్చి నిశ్చలముగా ధ్యానించుట. అట్టి చిత్తైకాగ్రత అభ్యాసకుఁ డగు వానికి తగిన ప్రదేశమునందు అభ్యసించినచే కలుగునుగాని సర్వత్ర సాధారణముగా కలుగఁజాలదు. కనుక అట్టిప్రదేశము వర్ణింపఁబడుచున్నది — యోగాభ్యాసప్రదేశము మిట్టపల్లములు లేక సమముగా నుండవలయును. పరిశుద్ధముగా నుండవలయును. గులకరాళ్ళు, నిప్పు, ఇసుకమున్నగునవి ఆ ప్రదేశమునందుండఁగూడదు. కేకలుమున్నగు ధ్వనులుగాని నీటి యూఁకువ గాని ఉండగూడదు. మూలమునందుగల ఆదిశబ్దము చేత సింహవ్యాఘ్రాది దుష్టమృగముల బాధకలిగియుండఁగూడదు. ఇన్నియున్నను సాధకుఁడగు వాని మనస్సునకున్నూ కన్నులకున్నూ ఇంపుగా నుండవలయును. గాలి మున్నగు వానియుపద్రవము కలుగజాలని కొండగుహ లేక తత్తుల్యమయిన మఱొక ఏకాంతప్రదేశమునందుగాని సాధకుఁడగు వాఁడు యోగాభ్యాసము చేయవలయును. ఇచట యోగమనఁగా చిత్తమునకుగల స్వాభావికవృత్తులను నిరోధించి ఆచిత్తమునందు పరమాత్మను చేర్చియుంచుట.

ద్వితీయాధ్యాయము, ౧౧-వ మంత్రము.

అవ. యోగసిద్ధి సూచకలింగములు వివరింపఁబడుచున్నవి —

మూ. నీహార ధూమార్కా నిలా నలానాం
ఖద్యోత విద్యుత్స్ఫటికశశీనామ్,

ఏతాని రూపాణి పురస్సరాణి
బ్రహ్మణ్యభివ్యక్తికరాణి యోగే. ౧౧

పద. నీహారధూమార్కానిలానలానాం ఖద్యోతవిద్యుత్స్ఫటికశశీనాం, ఏతాని రూపాణి పురస్సరాణి బ్రహ్మణి అభివ్యక్తికరాణి యోగే. ౧౧

టీ. యోగే = యోగాభ్యాసమునందు, నీహార ధూమ అర్క అనిల అనలానాం - నీహార = మంచు, ధూమ = పొగ, అర్క = సూర్యుఁడు, అనిల = వాయువు, అనలానాం = అగ్ని (అనునీ యైదింటి) యొక్కయు, ఖద్యోతవిద్యుత్ స్ఫటికశశీనాం = మిణుగురు మెరుపు స్ఫటికము చంద్రుఁడు (అను నీ నాలిగింటి) యొక్కయు, ఏతాని= ఈ, రూపాణి = రూపములు, పురస్సరాణి= ముందు గనంబడుచున్నవై, బ్రహ్మణి = బ్రహ్మమువిషయమై, అభివ్యక్తికరాణి = ప్రకటగము చేయునవి అగుచున్నవి.

తా. సాధకుఁడగువాఁడు బ్రహ్మప్రాప్తికిగాను యోగాభ్యాసము చేయుచుండఁగా అతనిచిత్తప్రవృత్తికి ప్రథమమున అంతట మంచువలెస్ఫురించును, తరువాత అగ్నివలెతోఁచును, పిదప మెరుపువలె గనంబడును. తర్వాత మెఱుపువలె ప్రకాశించును. పిదప స్ఫటికముగాఁ గనంబడును. పిమ్మట చంద్రునివలెతోఁచును. ఇవి బ్రహ్మాభివ్యక్తికరములు.—అనఁగా ఇట్టిరూపములు గనంబడినయెడల అతనికి యోగము సిద్ధించినదనియు, త్వరలో బ్రహ్మప్రాప్తి వానికి కలుగఁగలదనియు పైనిదర్శనములవలన నెఱుంగవలయును.

వివరణము —అభివ్యక్తికరములనఁగా రాఁబోవునట్టి సుఖదుఃఖాదిక మును సూచించునట్టి శకునముమున్నగునవి. దృష్టాంతము —

౧. లోకమునం దెవనికిగాని భుజము కన్ను అదిరినయెడల వానికి త్వరలో బంధుమిత్రాది సందర్శనము కలుగనున్నదని తలంచుచున్నారము.

౨. ప్రభాసక్షేత్రమునందు సముద్రధ్వని వినంబడినయెడల అప్పుడు సోమేశ్వరసందర్శనము త్వరలో కలుగునని తలంచుచున్నారము.

అదేవిధముగా పైనచెప్పిన నీహారధూమాదికముయొక్క అభివ్యక్తి యోగాభ్యాసమునందు గనంబడినయెడల వానికి త్వరలో బ్రహ్మప్రాప్తి నిశ్చితమని గ్రహించునది.

'ధూమార్కానలానిలానాం' అని పాఠాంతరములుగలవు.

ద్వితీయాధ్యాయము, ౧౨-వ మంత్రము.

మూ. పృథ్వ్యప్యతేజోఽనిలఖే సముత్థితే
పఞ్చాత్మకే యోగగుణే ప్రవృత్తే,
న తస్య రోగో న జరా న మృత్యుః
ప్రాప్తస్య యోగాగ్నిమయం శరీరమ్ ౧౨

పద. పృథ్వ్యప్యతేజోఽనిలఖే సముత్థితే పఞ్చాత్మకే యోగగుణే ప్రవృత్తే, న తస్య రోగః న జరా న మృత్యుః ప్రాప్తస్య యోగాగ్నిమయం శరీరమ్. ౧౨

టీ. పృథ్వ్యప్యతేజోఽనిలఖే=భూమి, జల, అగ్ని, వాయు ఆకాశముల యొక్కసంబంధమునందు, సముత్థితే=పుట్టినటువంటిది, (అగుటచేత) పంచాత్మకే=పంచభూతాత్మకమయిన యీ శరీరమునందు, యోగగుణే=యోగాభ్యాసగుణము, ప్రవృత్తే = ప్రవర్తించినదగుచుండఁగా, యోగాగ్నిమయం=యోగాగ్నిసంబంధమయిన, శరీరం=శరీరమును, ప్రాప్తస్య=పొందిన, తస్య=అట్టియోగికి, రోగః=రోగము, న=లేదు. జరా=ముదిమి, న=లేదు. మృత్యుః=మృత్యువు, న=లేదు.

తా. భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము అను పంచ భూతములకు సంబంధించినదగుటచేత, పంచాత్మకమనంబడు నీదేహము ఆది యందు పాంచభౌతికమయినప్పటికిన్నీ యోగాభ్యాససంబంధముచేత పాంచభౌతికసంబంధమునువదలి యోగాగ్నిమయమగుచున్నది. అట్టి యోగాగ్నిమయశరీరముగల యోగికి రోగము, ముసలితనము మున్నగు దుఃఖములు గనంబడవు.

యోగప్రవృత్తులు నాలుగు, వానియందొకటి సిద్ధించినను యోగాభ్యాసము వానికి అనుకూలమగుచున్నదని తలంచవచ్చునను విషయ మిట్లు చెప్పఁబడుచున్నది —

శ్లో. జ్యోతిష్మతీ స్పర్శవతీ తథా రసవతీ పరా,
గంధవత్యపరా ప్రోక్తా చతస్రస్తుప్రవృత్తయః.
ఆసాం యోగప్రవృత్తీనాం యద్యేకాఽపి ప్రవర్తితే,
ప్రవృత్తయోగం తం ప్రాహు ర్యోగినో యోగచింత ...

వివరణము —'పృథ్వ్యప్తేజోఽనిలఖే' అనియు, 'నఙగా నమృత్యుః' అనియు పాఠాంతరములుఁగలవు. బ్ర. ౧-3-33. సూత్రభాష్యమునందు యోగాభ్యాసమువలన అణిమాదిసిద్ధులు కలుగుచున్న వనువిషయమును తెలుపుటకయి ఈ మంత్రమును శ్రీమచ్ఛంకరభగవత్పాదులవా రుదాహరించిరి.

ద్వితీయాధ్యాయము, ౧3-వ మంత్రము.

మూ. లఘుత్వ మారోగ్య మలోలుపత్వం
వర్ణప్రసాదం స్వరసౌష్ఠవఞ్చ,
గన్ధశ్శుభో మూత్రపురీష మల్పం
యోగప్రవృత్తిం ప్రథమాంవదన్తి ౧3

పద. లఘుత్వం ఆరోగ్యం అలోలుపత్వం వర్ణప్రసాదం స్వరసౌష్ఠవం చ, గంధః శుభః మూత్రపురీషం అల్పం యోగప్రవృత్తిం ప్రథమాం వదన్తి. ౧3

టీ. లఘుత్వం = దేహము తేలికగానుండుట, ఆరోగ్యం=రోగము లేకయుండుట, అలోలుపత్వం = విషయలంపట లేకపోవుట, వర్ణప్రసాదం = మంచిరంగు కలిగియుండుట, స్వరసౌష్ఠవంచ=మంచిధ్వనికలిగియుండుట, శుభః గంధః = మంచిపరిమళము కలిగియుండుట, అల్పం మూత్రపురీషం=మూత్రపురీషములు కొద్దిగా అగుచుండుట (మున్నగునవి), ప్రథమాం = మొదటిదైన, యోగప్రవృత్తిం = యోగప్రవృత్తి (అని) వదంతి = చెప్పుచున్నారు.

తా. యోగవేత్తలగువారలు ఈక్రింద చెప్పఁబోవులక్షణములు యోగాభ్యాసకులకు ముందుగాఁ గలుగునని చెప్పుచున్నారు. అవి ఏవియనఁగా, దేహము తేలికగానుండుటయు, ఆరోగ్యముగా నుండుటయు, ఇంద్రియచాపల్యము లేకపోవుటయు, దేహకాంతి స్వచ్ఛముగానుండుటయు, మాటయొక్క ధ్వని స్పష్టముగా నుండుటయు, దేహము సుగంధముగా నుండుటయు, మూత్రపురీషములు అల్పముగా నుండుటయు, మున్నగునవి యోగాభ్యాసకులకు ప్రథమమున కలుగును.

వివరణము —'లఘుత్వమారోగ్యం' అని పాఠాంతరము గలదు.

ద్వితీయాధ్యాయము, ౧౪-వ మంత్రము.

మూ॥ యథైవ బిమ్బం మృదయోపలిప్తం
తేజోమయం భ్రాజతే తత్సుధాంతమ్,

తద్వా౽౽త్మతత్త్వం ప్రసమీక్ష్య దేహీ
ఏకః కృతార్థో భవతే వీతశోకః. ౧౪

పద. యథా ఏవ బిమ్బం మృదయా ఉపలిప్తం తేజోమయం భ్రాజతే తత్ సుధాంతమ్,తత్ వా ఆత్మతత్త్వం ప్రసమీక్ష్య దేహీ ఏకః కృతార్థః భవతే వీతశోకః. ౧౪

టీ. తత్=అప్రసిద్ధమయిన, బింబం = (సువర్ణరజతాదివినిర్మితమగు) విగ్రహము, మృదయా=మృత్తికమున్నగువానిచేత, ఉపలిప్తం=పూయఁబడినదై, సుధాంతం=బాగుగా పరిశుద్ధము చేయఁబడినదై, తేజోమయం=తేజస్సు గలదిగా, యథాఏవభ్రాజతే=ఏవిధముగా ప్రకాశించుచున్నదో, తత్ వా= ఆప్రకారమే, దేహీ=జీవుఁడు, ఆత్మతత్త్వం=ఆత్మతత్త్వమును,ప్రసమీక్ష్య= చూచి, ఏకః=అద్వితీయుఁడును, కృతార్థః = కృతార్థుఁడును, వీతశోకః= దుఃఖరహితుఁడును, భవతే=అగుచున్నాఁడు.

తా. లోకమునందు బంగారుతోగాని వెండితోగాని చేయఁబడిన విగ్రహమునందు మన్ను మున్నగు మలినపదార్థము చేరియున్నప్పుడు ఆవిగ్రహమునందున్న మలినము మున్నగుదానిని అగ్ని మున్నగువానిచేత తొలగించినయెడల ఆవిగ్రహములు తేజోవంతములయి యెటుల ప్రకాశించునో అదేవిధముగా జీవుఁడు ఆత్మతత్త్వము నెఱింగినయెడల తాను అద్వితీయుండననియు, కృతార్థుఁడననియు దుఃఖరహితుఁడననియు నెఱుంగును.

వివరణము —'సుధౌతం' అను అర్థమునందు 'సుధాంతం' అని ప్రయోగించుట ఛాందసము. మూఁడవపాదమున 'తత్వతత్వం ప్రసమీక్ష్య దేహీ' అని పాఠాంతరము గలదు.

ద్వితీయాధ్యాయము, ౧౫-వ మంత్రము.

అవ. ఆత్మతత్త్వము నేవిధముగా నెఱింగిన దుఃఖవిరహితుఁ డగునో ఆవిషయము తెలుపఁబడుచున్నది —

మూ. యదాఽఽత్మతత్త్వేన తు బ్రహ్మతత్త్వం
దీపోపమే నేహ యుక్తః ప్రపశ్యేత్,
అజం ధ్రువం సర్వతత్త్వైర్విశుద్ధం
జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః. ౧౫

పద. యదా ఆత్మతత్త్వేన తు బ్రహ్మతత్త్వం దీపోపమేన ఇహ యుక్తః ప్రపశ్యేత్, అజం ధ్రువం సర్వతత్త్వైః విశుద్ధం జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః. ౧౫

టీ. యదా = ఏయవస్థయందు, ఇహ=ఈబ్రహ్మమునందే, యుక్తః= కూడుకొన్నవాఁడై, దీపోపమేన=దీపముతో సమానమయిన, ఆత్మతత్త్వేన = ఆత్మతత్త్వముతో, బ్రహ్మతత్త్వం = బ్రహ్మతత్త్వమును, ప్రపశ్యేత్ = చూచునో, (సః = అట్టివాఁడు) అజం = పుట్టుకలేనట్టియు, ధ్రువం=శాశ్వతుఁడైనట్టియు, సర్వతత్త్వైః = సర్వవిధతత్త్వములతో, విశుద్ధం = విశుద్ధమయినట్టియు (అనఁగా తాఁకబడనివాఁడనుట), దేవం = దేవుని, జ్ఞాత్వా= తెలిసికొని, సర్వపాశైః = సర్వవిధపాశములచేతను, ముచ్యతే = వదలఁబడుచున్నాఁడు.

తా. సాధకుఁ డగువాఁడెప్పుడు బ్రహ్మమునందు కూడుకొన్నవాఁడయి దీపప్రకాశతుల్యమయిన ఆత్మతత్త్వముతో నెప్పుడు బ్రహ్మతత్త్వము నెఱుంగుచున్నాఁడో అప్పుడే అతఁడు జన్మాదివిరహితుఁడును, శాశ్వతుఁడును, అవిద్యాతత్కార్యరూపములగు తత్త్వములచేత అసంస్పృష్టుఁడును

అగు దేవుని ఎఱింగినవాఁడయి అవిద్యాపాశములచేత—అనఁగా అహం మమాద్యభిమానబంధనములచేత విముక్తుఁ డగుచున్నాఁడు.

ద్వితీయాధ్యాయము, ౧౬-వ మంత్రము.

అవ. పరమాత్మను తానుగా తెలిసికొనవలయునని చెప్పినవిధము తెలుపఁబడుచున్నది —

మూ॥ ఏష హ దేవః ప్రదిశోఽను సర్వాః
పూర్వోహి జాతః స ఉగర్భే అన్తః,
సఏవ జాతః స జనిష్యమాణః
ప్రత్యఙ్ జనాం స్తిష్ఠతి సర్వతోముఖః ౧౬

పద. ఏషః హ దేవః ప్రదిశః అను సర్వాః పూర్వః హి జాతః సః ఉ గర్భే అన్తః, సః ఏవ జాతః సః జనిష్యమాణః ప్రత్యఙ్ జనాన్ తిష్ఠతి సర్వతోముఖః ౧౬

టీ. ఏషః = ఈ, దేవఃహ = దేవుఁడే, సర్వాః=సమస్తములయిన, ప్రదిశః = దిక్కులను, విదిక్కులను, అను=అనుసరించియున్నాఁడు, పూర్వః హి జాతః=(ఈదేవుఁడే హిరణ్యగర్భాత్మకుఁడుగా అందఱికంటె) ముందుగా పుట్టినవాఁడు, సఃఉ=అతఁడే, గర్భేఅంతః = గర్భమునందు ఉన్నవాఁడు, సఏవ = అతఁడే, జాతః = శిశువుగాపుట్టినవాఁడు, జనిష్యమాణః = పుట్టఁబోవువాఁడును, సః= అతఁడే, సర్వతోముఖః = అంతట ముఖములు గల వాఁడయి, జనాన్ = జనులందఱినిగూర్చి, ప్రత్యఙ్ తిష్ఠతి = ఎదురుగా నుంటున్నాఁడు.

తా. ఈదేవుఁడు ప్రాగాదినాలుగుదిక్కులను, ఆగ్నేయాదినాలుగు విదిక్కులను ఊర్ధ్వాధోభాగములను అంతట అనుసరించియున్నాఁడు. అం

దటికంటె ముందుగా హిరణ్యగర్భరూపమున జన్మించినది అతఁడే. ప్రాణులుగా పుట్టుటకుముందుగా మాతృకుక్షియందు గర్భరూపముగా నున్నదియీదేవుఁడే. తర్వాత శిశువుగా జన్మించినదియుఁ నీదేవుఁడే. పుట్టఁబోవునదియుఁ నితఁడే. సర్వతోముఖుఁడయి అందఱకు అభిముఖుఁడుగా నుండువాఁడును ఇతఁడే.

వివరణము — ఈమంత్రమే అక్షరభేదముతో తై. ఆరణ్యకాది గ్రంథములందు గలదు.

౨-వ అధ్యాయము. ౧౭-వ మంత్రము.

అవ. యోగమువలెనే నమస్కారాదిసాధనాంతరములు చెప్పఁబడు చున్నవి —

యో దేవో౽గ్నౌ యో౽ప్సు
యోవిశ్వం భువన మావివేశ,
య ఓషధీషు యో వనస్పతిషు
తస్మై దేవాయ నమోనమః. ౧౭

పద. యః దేవః అగ్నౌ యః అప్సు యః విశ్వం భువనం ఆవివేశ, యః ఓషధీషు యః వనస్పతిషు తస్మై దేవాయ నమః నమః. ౧౭

ఇతి శ్వేతాశ్వతరోపనిషది ద్వితీయో౽ధ్యాయః

---

టీ. యః దేవః=ఏదేవుఁడు, అగ్నౌ ఆవివేశ=అగ్నియందు ప్రవేశించెనో, యః=ఏదేవుఁడు, అప్సు=జలములందు, ఆవివేశ=ప్రవేశించెనో, యః=ఏదేవుఁడు, విశ్వంభువనం = సకలలోకములను, ఆవివేశ = ప్రవేశించెనో, యః=ఏదేవుఁడు, ఓషధీషు=శాల్యాద్యోషధులందు, ఆవివేశ=ప్రవేశించెనో, యః=ఏదేవుఁడు, వనస్పతిషు=అశ్వత్థాదివనస్పతులందు, ఆవివేశ=ప్రవేశించె

నో, తస్మై=అట్టి, దేవాయ=దేవునికొఱకు, నమఃనమః = నమస్కారము నమస్కారము.

తా. ఏ దేవుఁడు అగ్నియందును, జలములందును, సకలప్రపంచమునందును, ఓషధులందును, వనస్పతులందును ప్రవేశించియున్నాఁడో అట్టి పరమేశ్వరునికొఱకు నమస్కారము. 'నమోనమః' అని రెండుపర్యాయములు చెప్పుట ఆదరార్థము. అధ్యాయపరిసమాప్తిసూచకము అనియు తెలియంగవలయును.

## శ్వేతాశ్వతరోపనిషత్తునందు ద్వితీయాధ్యాయము సమాప్తము

---

ఈ యధ్యాయమునకు సంబంధించిన ఇతరగ్రంథభాగములు:-

ఆత్మపురాణము—అష్టమాధ్యాయము. శ్లో. ౪౯౭-౫౪౦ వఱకు.
అనుభూతిప్రకాశము—ద్వాదశాధ్యాయము. శ్లో. ౩౬-౪౭.
బ్రహ్మగీత-సూతసంహితాంతర్గతము, ౧౧ అధ్యాయము.

శ్రీగురుభ్యో నమః.

కృష్ణయజుర్వేదాంతర్గత మగు

# శ్వేతాశ్వతరోపనిషత్తు

ఆంధ్రటీకాతాత్పర్య వివరణసమన్వితము

---

# తృతీయాధ్యాయము.

తృతీయాధ్యాయము, ౧-వ మంత్రము.

అవ. అద్వితీయుఁడగు బ్రహ్మమునకు ఈశితృ, ఈశితవ్యభావ మెట్లను విషయము చెప్పఁబడుచున్నది —

మూ॥ య ఏకో జాలవా౯ ఈశత ఈశనీభిః
సర్వాఀల్లోకానీశత ఈశనీభిః,
య ఏవైక ఉద్భవే సమ్భవేచ
య ఏత ద్విదు రమృతాస్తే భవన్తి ౧

పద. యః ఏకః జాలవా౯ ఈశతే ఈశనీభిః సర్వా౯ లోకా౯ ఈశతే ఈశనీభిః, యః ఏవ ఏకః ఉద్భవే సమ్భవే చ యే ఏతత్ విదుః అమృతాః తే భవన్తి. ౧

టీ. ఏకః=ఒక్కఁడగు, యః = ఏపరమాత్మగలఁడో, సః=ఆపరమాత్మయే, జాలవా౯ = మాయావిశిష్టుఁడై, ఈశనీభిః=స్వశక్తులచేత, ఈశతే=

సర్వమును నియమించుచున్నాఁడు, ఏకః = ఒక్కఁడగు, యః=ఏపరమాత్మ గలఁడో, సఃఏవ=ఆపరమాత్మయే, సర్వాన్ లోకాన్ = సమస్తలోకములను, ఉద్భవే సంభవేచ = విభూతి సంయోగమునందున్నూ పుట్టుకయందున్నూ, ఈశనీభిః=స్వశక్తులచేత, ఈశతే = నియమించుచున్నాఁడు, యే=ఎవ్వరు, ఏతత్=దీనిని, విదుః=తెలిసికొనుచున్నారో, తే=వారు, అమృతాః=మరణ ధర్మవిరహితులు, భవంతి=అగుచున్నారు.

తా. అద్వితీయుఁడగు పరమాత్మయే మాయాశక్తివిశిష్టుఁడయి తన శక్తులచేతనే సర్వమును నియమించుచున్నాఁడు. ఆపరమాత్మయే ఈసకల ప్రపంచమును తనమాయాశక్తిచేత పుట్టింపజేసి పోషింపఁజేయుచు సంహరించుచున్నాఁడు. ఈవిషయము నెవ్వరెఱుంగుదురో వారు మరణధర్మవిరహితులయి ముక్తులగుదురు.

తృతీయాధ్యాయము ౨-వ మంత్రము.

అవ. పరమాత్మ 'జాలవాన్' అనఁగా మాయాసహితుఁడెట్లనువిషయము తెలుపఁబడుచున్నది:—

మూ. ఏకో హి రుద్రో న ద్వితీయాయ తస్థు
ర్య ఇమాన్ల్లోకాన్ ఈశత ఈశనీభిః,
ప్రత్యఙ్జనాం స్తిష్ఠతి సఞ్చుకోచాన్తకాలే
సంసృజ్య విశ్వా భువనాని గోపాః ౨

పద. ఏకః హి రుద్రః న ద్వితీయాయ తస్థుః యః ఇమాన్ లోకాన్ ఈశతే ఈశనీభిః, ప్రత్యఙ్ జనాన్ తిష్ఠతి సంచుకోచ అన్తకాలే సంసృజ్య విశ్వా భువనాని గోపాః. ౨

టీ. హి=ఏకారణమువలన, రుద్రః = రుద్రుఁడు, ఏకః=ఒక్కఁడో (ఆకారణమువలన బ్రహ్మవేత్తలు) ద్వితీయాయ = రెండవవానికొఱకు,

నతస్థుః = ఉండకపోయిరి. సః = ఆరుద్రుఁడు, ఇమాన్ లోకాన్ = ఈలోకములనన్నింటిని, ఈశనీభిః = నియమించునట్టి తనశక్తులచేత, ఈశతే=నియమించుచున్నాఁడు. జనాన్ = జనులనుగూర్చి, ప్రత్యఙ్ తిష్ఠతి = ప్రత్యగాత్మయై యుంటున్నాఁడు. విశ్వాభువనాని=లోకములనన్నిఁటిని, గోపాః=సంరక్షించుచున్నవాఁడై, సంసృజ్య = కలిపి, అంతకాలే=ప్రళయకాలమునందు, సంచుకోచ = లయింపఁజేసెను.

తా. జగదుత్పత్తికిముందు చిదానందరసస్వరూపుఁడగు ఆత్మయొక్కఁడే యున్నటుల శ్రుత్యనుభవసిద్ధమగుటచేత బ్రహ్మవేత్తలు రెండవవాఁడున్నటుల తలంచలేదు. ఆఏకుఁడగుఆత్మయే మాయాశక్తివిశిష్టుఁడయి తన మాయాశక్తిచేత ఈప్రపంచమును నియమించుచున్నాఁడు. అతఁడే 'రూపం రూపం ప్రతిరూపోబభూవ' యనుశ్రుతిననుసరించి సర్వస్వరూపుఁడై అందఱియందు ప్రత్యగాత్మగా నుంటున్నాఁడు. ఇతఁడే స్థితికాలమునందు సర్వప్రపంచమును పరిపాలించుచున్నవాఁడై, ప్రళయకాలమునందు తనయందు లయింపఁజేసుకొనుచున్నాఁడు. కుంభకారుఁడు తాను ఘటనిర్మాణమునందున్న రీతిగాగాక పరమేశ్వరుఁడు స్వశక్తివిక్షేపముచేత స్రష్టయు నియంతయు నగుచున్నాఁడని భావము.

తృతీయాధ్యాయము, 3-వ మంత్రము.

మూ. విశ్వత శ్చక్షు రుత విశ్వతోముఖో
విశ్వతోబాహు రుత విశ్వతస్పాత్,
సంబాహుభ్యాం ధమతి సమ్పతత్రై
ర్ద్యావాభూమీ జనయన్ దేవ ఏకః. 3

పద. విశ్వతశ్చక్షుః ఉత విశ్వతోముఖః విశ్వతోబాహుః ఉత

విశ్వతస్పాత్, సంబాహుభ్యాం ధమతి సమ్పతత్రైః ద్యావాభూమీ జన
యన్ దేవః ఏకః. 3

టీ. దేవః = స్వయంప్రకాశమానుఁడును, ఏకః = అద్వితీయుఁడును అగుపరమాత్మ, ద్యావాపృథివీ=ఆకాశమును భూమిని, జనయన్ = పుట్టించుచున్నవాఁడయి, విశ్వతశ్చక్షుః=అంతటను నేత్రములుగలవాఁడు, (లోకమునందుగల సకల ప్రాణులయొక్క నేత్రములును విరాట్పురుషుని నేత్రములే గనుక విరాట్పురుషుఁడు 'విశ్వతశ్చక్షువు' అనంబడుచున్నాఁడు. ఇదేవిధముగ ముందు చెప్పఁబోవు విశ్వతోముఖ ఇత్యాదులాదు సైతము గ్రహించవలయును) ఉత=మఱియు, విశ్వతోముఖః=అంతట ముఖములు గలవాఁడును, విశ్వతోబాహుః=అంతట బాహువులుగలవాఁడును, ఉత = మఱియు, విశ్వతస్పాత్ = అంతట పాదములు గలవాఁడును, (అయి) బాహుభ్యాం=బాహువులతో, సంధమతి = (మనుష్యులను) చేర్చుచున్నాఁడు. పతత్రైః=ఱెక్కలతో (పక్షులను), సంధమతి = చేర్చుచున్నాఁడు.

తా. అద్వితీయుఁడగు ఆపరమాత్మయే విరాడాత్మయైయుండి జగత్సృష్టిని సలుపుచున్నాఁడని చెప్పఁబడుచున్నది:—స్వయంప్రకాశమానుఁడును అద్వితీయుఁడును అగు నీయాత్మయే విశ్వతశ్చక్షువనంబడుచున్నాఁడు. లోకమునందుగల సకలప్రాణిజాతముయొక్క నేత్రములన్నియు పరమాత్మకు చేరినవియే కావున జగమునందున్న దానినంతయు చూచునట్టి సామర్థ్యము గలవాఁడని గ్రహింపవలయును. విశ్వతోముఖుఁడు. విశ్వతోబాహువు, విశ్వతస్పాత్తు, మున్నగు పదములవిషయమునందును గ్రహించవలయును. ఇతఁడే భూమ్యంతరిక్షములను తదంతర్గతులగు మనుష్యాదులను పక్ష్యాదులను కూడ సృజించుచున్నాఁడు. మనుష్యులకు బాహువులను పక్షులకు ఱెక్కలను కలుగఁజేసి వారివారికర్మల నొనర్చుకొనుటకు సమర్థులఁజేయుచున్నాఁడు.

ధాతువుల కనేకార్థములు కలవని వ్యాకరణశాస్త్రసిద్ధాంతమగుటచేత ఇచట 'ధమతి' యనుక్రియ సంయోజనార్థమునందు గైకొనఁబడినది.

వివరణము:—'సంబాహుభ్యాం ధమతి సంపతత్రైః' అను మంత్ర భాగము వివిధవ్యాఖ్యాతలచేత భిన్నభిన్నముగ వ్యాఖ్యాతమయినది. ౧ శంక రానందుఁడు 'బాహుభ్యాం' అని ద్వివచనముండుటచేత సర్వకర్మలకు హేతు భూతములయిన 'ధర్మాధర్మములవలన' అని వ్యాఖ్యానమొనర్చి 'పతత్రైః' అను పదమునకు "పతనశీలైః పంచీకృతమహాభూతైః" అని వ్యాఖ్యానము చేసియున్నాఁడు.

నారాయణదీపికయందు 'బాహుభ్యాం=విద్యాకర్మభ్యాం, పతత్రైః= వాసనారూపైః, సంధమతి=దీపయతి, అని అర్థము చేయఁబడినది.

విజ్ఞానభగవద్వ్యాఖ్యయందు 'బాహుభ్యాం మనుష్యాదీన్ సంధమతి= సంయోజయతి సంపతత్రైః=పతనసాధనైః పాదైః సంధమతి. ఉపలక్షణేన ఇతరేంద్రియసంయోజయితృత్వమప్యుక్తం ద్రష్టవ్యం, అథవా పతత్రైః పక్షిణః సంధమతి సర్వేషాం స్రష్టాఽప్యేష ఏవేత్యాహ' అని చెప్పఁబడినది. ఉపనిష ద్వృత్తివ్యాఖ్య విజ్ఞానభగవద్వ్యాఖ్యానమునే అనుసరించినది.

### తృతీయాధ్యాయము, ౪-వ మంత్రము.

మూ. యో దేవానాం ప్రభవశ్చోద్భవశ్చ
విశ్వాధిపో రుద్రో మహర్షిః,
హిరణ్యగర్భం జనయామాస పూర్వం
స నో బుద్ధ్యా శుభయా సంయునక్తు ౪

పద. యః దేవానాం ప్రభవః చ ఉద్భవః చ విశ్వాధిపః రుద్రః

మహర్షిః, హిరణ్యగర్భం జనయామాస పూర్వం సః నః బుద్ధ్యా శుభయా సంయునక్తు. ౪

టీక. యః=ఏదేవుఁడు, దేవానాం=దేవతలకు, ప్రభవః=జన్మకుకారణభూతుఁడును, ఉద్భవః చ = కారణభూతుఁడును అగుచున్నాఁడో, యః రుద్రః=ఏరుద్రుఁడు, విశ్వాధిపః=ప్రపంచమునకు పరిపాలకుఁ డగుచున్నాఁడో, మహర్షిః=మహర్షి — అనఁగా సర్వజ్ఞుఁడునగుచున్నాఁడో, యః=ఏపరమేశ్వరుఁడు, పూర్వం=సృష్ట్యాదికాలమునందు, హిరణ్యగర్భం=హిరణ్యగర్భుని, జనయామాస=పుట్టించెనో, సః=అట్టిరుద్రుఁడు, నః=మమ్ములను, శుభయా బుద్ధ్యా=మంచిబుద్ధితో, సంయునక్తు=చేర్చుఁగాక.

తా. ఏరుద్రుఁడు ఇంద్రాదిసకలదేవతలకు ఆదికారణభూతుఁడో, ఆ యింద్రాదులకుఁ గల తత్తదైశ్వర్యములన్నియు ఎవనివలన కలుగుచున్నవో, ఎవ్వఁ డీప్రపంచమునకు పరిపాలకుఁడో, ఎవ్వఁడు సర్వజ్ఞుఁడో, ఎవ్వఁడు సృష్ట్యారంభసమయమునందు హిరణ్యగర్భుని సృజించెనో అట్టి పరమేశ్వరుఁడు మమ్ములను మంచిబుద్ధితో చేర్చుఁగాక. అనఁగా మాకు మంచిబుద్ధిని కలుగఁ జేయుఁగాక యనిభావము. హిరణ్యగర్భపదమునకు 'హితం=అతిరమణీయం అత్యుజ్జ్వలం జ్ఞానం గర్భః=అంతస్సారః యస్య తం' అని భాష్యమునందు వ్యుత్పత్తి చెప్పఁబడియుండుటచేత హిరణ్యగర్భుఁడనఁగా మంచిజ్ఞానముగలవాఁడని భావము.

తృతీయాధ్యాయము. ౫-వ మంత్రము.

అవ. మఱియు రెండుమంత్రములతో రుద్రుని ప్రార్థనము చేయఁబడుచున్నది :—

మూ. యా తే రుద్ర శివా తనూ రఘోరా௨పాపకాశినీ,
తయా న స్తనువా శ న్తమయా గిరిశన్తాభిచాకశీహి. ౫

పద. యా తే రుద్ర శివా తనూః అఘోరా అపాపకాశినీ, తయా నః తనువా శన్తమయా గిరిశన్త అభిచాకశీహి. ౨

టీ. రుద్ర=ఓరుద్రుఁడా! తే=నీయొక్క, యా=ఏ, శివా=మంగళకరమయిన, తనూః = శరీరము, అఘోరా=భయంకరముగాదో, అపాపకాశినీ = స్మరించినంతమాత్రముననే పుణ్యమును కలుగఁజేయుచున్నదో, గిరిశంత=పర్వతమునందు నివాసముగా కలిగియున్న ఓరుద్రుఁడా! శంతమయా=సుఖమును కలుగఁజేయుచున్నట్టి, తయా = ఆ, తనువా = శరీరముతో, నః = మమ్ములను, అభిచాకశీహి=అంతటచూడుము. అనఁగా శ్రేయస్సుతో మమ్ములను గూర్చుమా యని భావము.

తా. ఓరుద్రుఁడా! నీయొక్క మంగళకరమయిన శరీరము ఏయది గలదో ఆశరీరము అఘోరము అనఁగా చంద్రబింబమువలె ఆహ్లాదకారిణి యగుచున్నది. మఱియు అపాపకాశిని-అనఁగా స్మరించినంతమాత్రముచేతనే సకలపాపములనుపోఁగొట్టి పుణ్యమును కలుగఁజేయునది. పర్వతము నివాసముగా గలిగియుండుటచేత గిరిశంతుఁడని పిలువఁబడుచున్న ఓరుద్రుఁడా! సుఖమును కలుగఁజేయునట్టి అట్టి శరీరముతో మమ్ములనంతట కలయఁజూడుము. అనఁగా మాకు సకలశ్రేయములను కలుగఁజేయుమని భావము. 'శివా తనుః' అనుచోట శివమనఁగా శుద్ధము—అవిద్యాతత్కార్యవినిర్ముక్తమయి సచ్చిదానందాద్వయ బ్రహ్మరూపమయినదని అర్థాంతరమునుకూడ చెప్పవచ్చును. పరమశివునకు 'ఘోరాతనువు, శివాతనువు' అని రెండుతనువు లున్నటుల శ్రుతియందు ప్రతిపాదింపఁబడియున్నది.

వివరణము —ఈశ్వరునకు ఘోరాతనువు అనియు, శివాతనువు అనియు శరీరద్వయముగలదనియు, శతరుద్రీయహోమమువలన ఘోరా

తనువు తృప్తిని చెందుననియు, వసోర్ధారాహోమమువలన శివాతనువు తృప్తినిచెందుననియు, తైత్తిరీయసంహితయం దిట్లు చెప్పఁబడినది —.

శ్రు. రుద్రో వా ఏష యదగ్నిస్తస్యైతే తనువౌ ఘోరాఽన్యా శివాఽన్యాయచ్ఛతరుద్రీయం జుహోతి యైవాస్యఘోరా తనూ స్తాం తేన శమయతి యద్వసోర్ధారాం జుహోతి యైవాస్య శివాతనూ స్తాం తేన ప్రీణాతి యోవై వసో ర్ధారాయై ప్రతిష్ఠాంవేద ప్రత్యేవతిష్ఠతి.

తై సం. ౫-౭-౩-౩-౪.

ఈమంత్రము తైత్తిరీయసంహితయందు ౪-౫-౧. శతరుద్రీయ (నమకప్రశ్న)మునందును, శుక్లయజుర్వేదము ౧౬-౩ నందును, మైత్రాయణిసంహిత ౨-౯-౨ యందును, కాఠకసంహిత ౧౭-౧౧ యందును, నీలరుద్రోపనిషత్తు ౮ నందును, మానవశ్రౌతసూత్రమునందు ౧౧-౧౨ నందును గలదు.

తృతీయాధ్యాయము. ౬-వ మంత్రము.

మూ॥ యా మిషుం గిరిశన్త హస్తే బిభర్ష్యస్తవే,
శివాంగిరిత్ర తాంకురు మాహింగ్ంసీః పురుషంజగత్ ౬

పద. యాం ఇషుం గిరిశన్త హస్తే బిభర్షి అస్తవే,
శివాం గిరిత్ర తాం కురు మా హింసీః పురుషం జగత్. ౬

టీ. గిరిశంత=పర్వతమునందు నివసించుచున్న ఓరుద్రుఁడా! అస్తవే= శత్రువులపై ప్రయోగించుటకొఱకు, యాం ఇషుం = ఏబాణమును, హస్తే= హస్తమునందు, బిభర్షి =ధరించియున్నాఁడవో, గిరిత్ర = పర్వతమునందు నివసించుచున్న ఓరుద్రుఁడా! తాం=ఆబాణమును, శివాం=శుభమును కలుగఁ జేయుందానినిగా, కురు = చేయుము, పురుషం=మా సంబంధి యగుజనమును, జగత్ = ఇతరప్రపంచమును, మాహింగ్ంసీః=హింసింపకుము.

తా. పర్వతమునందు నివసించుచున్న ఓ రుద్రుఁడా! నీవు శత్రువుల పయి ప్రయోగించుటకు ఏబాణమును చేతియందు ధరించియున్నాఁడవో అట్టిబాణమును మంగళము నొసంగుదానినిగా నొనర్పుము. నాసంబంధ మయిన జనమునుగాని ఇతర ప్రపంచమునుగాని హింసింపకుము.

వివరణము:— తైత్తిరీయసంహిత ౬-౨-3 యందు సర్వదేవాత్మక మగు బాణముతో రుద్రుఁడు త్రిపురాసురసంహార మొనర్చినాఁడను ఆఖ్యాయిక ఇట్లు గలదు —

శ్రు. తేషా మసురాణాం తిస్రః పుర ఆసన్నయస్మయ్యవమాఽథరజ తాఽథహారిణీతా దేవా జేతుం నాశక్నువ న్తా ఉపసదైవా జిగీషం తస్మాదా హుర్యశ్చైవంవేద యశ్చనోపసదా వై మహాపురం జయంతీతి త ఇషుగ్ం సమ స్కుర్వతాగ్నిమనీకగ్ం సోమగ్ం శల్యం విష్ణుం తేజనం తేఽబ్రువన్క ఇమా మసిష్యతీతి. ౧. రుద్ర ఇత్యబ్రువ న్రుద్రో వై క్రూర స్సోఽస్యత్వితి సోఽబ్రవీ ద్వరం వృణా అహ మేవపశూనా మధిపతి రసానీతి తస్మాద్రుద్రః పశూనా మధిపతిస్తాగ్ం రుద్రోఽవాసృజ త్స తిస్రః పురో భిత్త్వైభ్యో లోకేభ్యో ఽసురా న్ప్రాణుదత.

3-వ అధ్యాయము. ౭-వ మంత్రము.

అవ. ఈరుద్రుఁడే సర్వమునకు కారణభూతుఁడనియు, ఇతఁడిట్టి వాఁడని యెఱింగినయెడల అమృతత్వమును పొందుచున్నాఁడనియు తెలుపఁ బడుచున్నది —

మూ॥ తతఃపరం బ్రహ్మ పరం బృహన్తం
యథానికాయం సర్వభూతేషు గూఢమ్,
విశ్వస్యైకం పరివేష్టితారం
ఈశం తం జ్ఞాత్వా ఽమృతా భవన్తి ౭

పద. తతః పరం బ్రహ్మ పరం బృహన్తం యథానికాయం సర్వభూతేషు గూఢమ్, విశ్వస్య ఏకం పరివేష్టితారం ఈశం తం జ్ఞాత్వా అమృతాః భవన్తి. 2

టీ. తతః=పురుషసహితమయినజగత్తుకంటె, పరం=పరమైనట్టియు,(లేక, తతః = జగదాత్మయగు విరాడాత్మకంటె, పరం=పరుఁడైనట్టియు,) పరం= మిక్కిలి, బృహంతం=గొప్పది(యగుటచేత), బ్రహ్మ=బ్రహ్మమని చెప్పఁబడునదియు, యథానికాయం=ఆయాశరీరములకు తగినవిధముగా, సర్వభూతేషు= సర్వవిధప్రాణులందు, గూఢం—అంతర్యామిరూపమున నున్నవాఁడును, విశ్వస్య=ప్రపంచమునకు, ఏకం=ఒక్కఁడుగా, పరివేష్టితారం=పరివేష్టించియుండు వాఁడును అగు, తం=ఆ, ఈశం=పరమేశ్వరుని, జ్ఞాత్వా=తెలిసికొని, అమృతాః=మరణరహితులు, భవంతి=అగుచున్నారు.

తా. పురుషసహితమగు జగత్తుకంటె పరుఁడయినవాఁడును—అనఁగా కార్యభూతమయిన ప్రపంచమునకు కారణభూతుఁడయి అంతట వ్యాపించియున్నవాడని భావము. లేక జగదాత్మకుఁడగు విరాట్పురుషునికంటె పరుఁడయినవాఁడును, మిక్కిలి గొప్పవాఁడగుటచేత బ్రహ్మశబ్దవాచ్యుఁడును, హిరణ్యగర్భునికంటె గొప్పవాఁడును, ప్రపంచమునందుఁగల సర్వప్రాణుల యొక్క శరీరములందు అంతర్యామిరూపమున వ్యాపించియున్నవాఁడును, ప్రపంచమునంతయు తనయందు లీనమొనర్చుకొని స్వాత్మభూతముగా దానియందు వ్యాపించియున్నవాఁడును అగు పరమేశ్వరుని ఎఱింగినవారలు అమృతులు—అనఁగా ముక్తులగుచున్నారు.

3-వ అధ్యాయము. ౮-వ మంత్రము.

అవ. ఆ బ్రహ్మము నెఱింగిన మంత్రద్రష్ట స్వాత్మానుభవమును చెప్పుచున్నాఁడు —

మూ॥ వేదాహమేతం పురుషం మహాన్త
మాదిత్యవర్ణం తమసః పరస్తాత్,
తమేవ విదిత్వా అతిమృత్యుమేతి
నాన్యః పంథా విద్యతేఽయనాయ ౮

పద. వేద అహం ఏతం పురుషం మహాన్తం ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్, తం ఏవ విదిత్వా అతిమృత్యుం ఏతి న అన్యః పంథాః విద్యతే అయనాయ. ౮

టీక. అహం=నేను, పురుషం = అంతటపూర్ణుఁడయియున్నవాఁడును, మహాంతం = సర్వాత్మకుఁడగుటచేత అందఱికంటె గొప్పవాఁడును, ఆదిత్యవర్ణం=సూర్యునివంటి ప్రకాశముగలవాఁడును, తమసః=అజ్ఞానముకంటె, పరస్తాత్=వేఱుగానుండువాఁడును, అగు, ఏతం = సాక్షిభూతుఁడగు ఈప్రత్యగాత్మను, వేద=ఎఱుంగుదును. తం=అట్టి ప్రత్యగాత్మని, విదిత్వాఏవ=తెలిసికొన్ననే, అతిమృత్యుం = మృత్యువు నతిక్రమించుటను, ఏతి=పొందుచున్నాఁడు అయనాయ=పరమపదప్రాప్తికొఱకు, అన్యః=వేఱయిన, పంథాః=మార్గము, నవిద్యతే=లేదు.

తా॥ పూర్ణానందాద్వితీయ బ్రహ్మాత్మపరిజ్ఞానమువల్లనే పరమపురుషార్థరూపమగు మోక్షము సిద్ధించునుగాని ప్రకారాంతరముచేత మోక్షము సిద్ధింపఁజాలదను విషయ మీమంత్రమునందు ప్రదర్శింపఁబడినది. అంతట పూర్ణముగా నిండియుండుటచేత పురుషశబ్దవాచ్యుఁడును, సర్వాత్మకుఁడగుటచేత అందఱికంటె గొప్పవాఁడును, సూర్యునివలె ప్రకాశస్వరూపుఁడును, అజ్ఞానముకంటె వేఱుగానుండువాఁడును (అనఁగా జ్ఞానస్వరూపుఁడును) అగు ఈసాక్షిభూతుఁడగు ప్రత్యగాత్మను నేను తెలిసికొంటిని. అట్టి ప్రత్యగాత్మను తెలిసికొన్నవాఁడే మృత్యువును దాఁటుచున్నాఁడు. అనఁగా మరణరహిత

మయిన స్థితిని పొందుచున్నాఁడు. పరమపురుషార్థరూపమగు మోక్షమును పొందుటకు బ్రహ్మాత్మపరిజ్ఞానముకంటె వేఱయిన మార్గమే లేదు.

వివరణము — ఆత్మజ్ఞానముచేతనే ముక్తికలుగును కాని ఇతరసాధనములచేత ముక్తిలభింపదను విషయమునకు ఉపోద్బలకముగ శ్రీమచ్ఛంకర భగవత్పాదులవారు శారీరకమీమాంసాభాష్యమునందు ఈక్రిందిసూత్రములం దీమంత్రము నుదహరించిరి.

బ్ర. సూ. ప్రాణస్తథాఽనుగమాత్. ౧-౧-౨౮.
,, ,, కారణత్వేనచాకాశాదిషు యథావ్యపదిష్టోక్తేః. ౧-౪-౧౪.
,, ,, ఏతేనయోగః ప్రత్యుక్తః. ౨-౧-3.
,, ,, యావదాత్మభావిత్వాచ్చనదోషస్తద్దర్శనాత్. ౨-3-30.
,, ,, న చ కార్యే ప్రతిపత్త్యభిసంధిః. ౪-3-౧౪.

మహచ్ఛబ్దము ఆత్మవాచకముగ ఉపనిషత్తులందు ప్రతిపాదింపఁబడుచున్నదను విషయమున కుపోద్బలకముగ

బ్ర. సూ. మహద్వచ్చ. ౧-౪-౭. అనుసూత్రభాష్యమునందు "వేదాహమేతం పురుషం మహాంతం" అను మంత్రముఁ గైకొనఁబడినది.

3-వ అధ్యాయము, ౯-వ మంత్రము.

మూ. యస్మాత్పరం నాపరమస్తి కించిత్
యస్మాన్నాణీయో న జ్యాయోఽస్తి కించిత్,
వృక్ష ఇవ స్తబ్ధో దివి తిష్ఠత్యేక
స్తేనేదం పూర్ణం పురుషేణ సర్వమ్. ౯

పద. యస్మాత్ పరం న అపరం అస్తి కిఞ్చిత్ యస్మాత్ న అణీ

యః న జ్యాయః అస్తి కిఞ్చిత్, వృక్షః ఇవ స్తబ్ధః దివి తిష్ఠతి ఏకః తేన ఇదం పూర్ణం పురుషేణ సర్వమ్. ౯

టీక. యస్మాత్ = ఏప్రత్యగాత్మకంటె, పరం=శ్రేష్ఠమయిన, అపరం= మఱొకవస్తువు, కించిత్ = కొంచెమైనను, న అస్తి=లేదో, యస్మాత్ = ఏప్రత్యగాత్మకంటె, అణీయః = సూక్ష్మమయిన వస్తువు, న అస్తి=లేదో (అట్లే), యస్మాత్ = ఏపరమాత్మకంటె, జ్యాయః = గొప్పదియగు (వస్తువు), కించిత్ = కొంచెమైనను, న అస్తి = లేదో, ఏకః=అద్వితీయుఁడగు ఏపర మాత్మ, వృక్షఃఇవ = వృక్షమువలె, స్తబ్ధః = చలనములేక, దివి = ప్రకా శాత్మకమగు స్వమహిమయందే, తిష్ఠతి=ఉంటున్నాఁడో, తేన=అట్టి, పురు షేణ = పూర్ణస్వరూపుఁడయిన పురుషునిచేత, ఇదం సర్వం=ఇది అంతయు, పూర్ణం = నైరంతర్యముగ వ్యాప్తమయియున్నది.

తా. ఏపరమాత్మకంటె వేఱుగా శ్రేష్ఠమయినదిగాని తక్కువఅయినది గాని అగు మఱొకవస్తు వేలోకమునందుఁగాని గనంబడఁజాలదో, ఏపరమాత్మ కంటె సూక్ష్మమయినట్టిగాని, లేక స్థూలమైనట్టిగాని వస్త్వంతర మేలోకమునఁ గాని గనంబడఁజాలదో అట్టిపరమాత్మయొక్కఁడే అద్వితీయుఁడయి వృక్ష మువలె చలనములేక ద్యోతనాత్మకమగు స్వమహిమయం దుంటున్నాఁడు. పూర్ణమయి యుండుటచేత పురుషశబ్దవాచ్యుఁడగు ఆపరమాత్మచేతనే ఈ ప్రపంచమంతయు వ్యాప్తమయియున్నది.

వివరణము.—బ్రహ్మాభిన్నమగు వస్త్వంతరము లేదని నిషేధించు సందర్భమునందు "బ్ర. సూ తథాఽన్యప్రతిషేధాత్. 3. ౨. 3౬. సూత్ర శాంకరభాష్యమునం దీమంత్ర ముదాహరింపఁబడినది."

3-వ అధ్యాయము, ౧౦-వ మంత్రము.

అవ. బ్రహ్మము కార్యకారణాత్మకమను విషయమును తెలిసినవాఁడై జ్ఞానులకు మోక్షప్రాప్తియనియు,అజ్ఞానులకు సంసారప్రాప్తియనియు వివరింపఁబడుచున్నది —

మూ॥ తతో యదుత్తరతరం
తదరూప మనామయమ్,
య ఏత ద్విదు రమృతా స్తే భవ
న్త్యథేత రే దుఃఖ మేవాపియన్తి ౧౦

పద. తతః యత్ ఉత్తరతరం తత్ అరూపం అనామయం, యే ఏతత్ విదుః అమృతాః తే భవన్తి అథ ఇతరే దుఃఖం ఏవ అపియన్తి.౧౦

టీక. తతః=ఇదంశబ్దవాచ్యమగు నీజగత్తుకంటె, యత్ = ఎయ్యది, ఉత్తరం=కారణభూతమైయున్నదో (అదియు బ్రహ్మస్వరూపమే), తత్ = ఆబ్రహ్మము, అరూపం=రూపరహితము, అనామయం = ఆధ్యాత్మికాదితాపత్రయరహితము, యే=ఎవ్వరు? ఏతత్ =ఈ బ్రహ్మమును, విదుః=తెలిసికొనుచున్నారో, తే = వారు, అమృతాః భవంతి = మరణరహితులగుచున్నారు-ముక్తులగుచున్నారు. అథ=పిమ్మట, ఇతరే=ఎఱుంగని ఇతరులు, దుఃఖంఏవ= దుఃఖమునే, అపియంతి=పొందుచున్నారు.

తా. ఇదంశబ్దవాచ్యమగు నీజగత్తుకంటె ఉత్తరుఁడును, అనఁగా కారణ స్వరూపమును, కార్యకారణ వినిర్ముక్తమును అగునది ఎయ్యదిగలదో అది బ్రహ్మము. ఆబ్రహ్మము రూపాదివిరహితము, మఱియు ఆధ్యాత్మిక, అధిభౌతిక, అధిదైవికతాపత్రయ విరహితము. ఎవ్వరిట్టి బ్రహ్మమును "అహమస్మి" యని యెఱుంగుచున్నారో, వారు మరణ విరహితులగుచున్నారు-

ముక్తులగుచున్నారని భావము. ఇట్టి జ్ఞానము లేనివారలు దుఃఖమును పొందుచున్నారు- అనఁగా జననమరణ రూపమయిన సంసారచక్రమునఁబడి నానావిధయోనులందు పుట్టుచు గిట్టుచు నుందురనుట.

3-వ అధ్యాయము. ౧౧-వ మంత్రము.

అవ. ఈ మంత్రమునందు శివుఁడు సర్వాత్మకుఁడని చెప్పఁబడుచున్నది —

మూ॥ సర్వాననశిరోగ్రీవః సర్వభూతగుహాశయః,
సర్వవ్యాపీ స భగవాన్ తస్మా త్సర్వగత శ్శివః. ౧౧

పద. సర్వాననశిరోగ్రీవః సర్వభూతగుహాశయః, సర్వవ్యాపీ సః భగవాన్ తస్మాత్ సర్వగతః శివః. ౧౧

టీక. భగవాన్=భగవంతుఁడగు, సఃశివః=ఆశివుఁడు, సర్వాననశిరోగ్రీవః=అందఱియొక్క ముఖశిరోగ్రీవాద్యంగములే తనయంగములుగాఁగలవాఁడు (మఱియు), సర్వభూతగుహాశయః=సర్వప్రాణులయొక్క హృదయగుహాయందుండువాఁడు (మఱియు), సర్వవ్యాపీ=అంతట వ్యాపించియుండువాఁడు, తస్మాత్=అందువలన, సర్వగతః=అంతట వ్యాపించియుండువాఁడు.

తా. భగవానుఁడగు ఆశివుఁడు లోకమునందుగల సకలప్రాణులయొక్క ముఖశిరోగ్రీవాద్యంగములే స్వావయవములుగా గలవాఁడగుటచేత సర్వాననశిరోగ్రీవుఁ డనంబడుచున్నాఁడు. అదేవిధముగా సర్వప్రాణులయొక్క హృదయగుహాయందు నివసించుచున్నవాఁడును, సర్వత్రవ్యాపించియుండువాఁడును అగుటచేత సర్వగతుఁ డనంబడుచున్నాఁడు. ఇచట భగవంతుఁడను పదమునకు అర్థము షడ్గుణైశ్వర్యములు గలవాఁడని భావము. ఆషడ్గుణైశ్వర్యము లివి —

శ్లో. [1]ఐశ్వర్యస్యసమగ్రస్య [2]ధైర్యస్య [3]యశసః [4]శ్రియః,
[5]జ్ఞాన [6]వైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగ ఇతీరణా.

అర్థ. సమగ్రమయిన ఐశ్వర్యము, సమగ్రమయిన ధైర్యము, సమగ్రమయిన కీర్తి, సమృద్ధమయిన సంపద, సంపూర్ణమయిన జ్ఞానము, సంపూర్ణ వైరాగ్యము, అను ఈ ౬ టి యొక్క సమూహము భగ మనంబడును. ఇట్టి భగముగలవాఁడు భగవంతుఁ డనంబడును.

౩-వ అధ్యాయము, ౧౨-వ మంత్రము.

మూ. మహాన్ప్రభుర్వై పురుషః సత్త్వస్యైష ప్రవర్తకః,
సునిర్మలా మిమాం ప్రాప్తి మీశానో జ్యోతిరవ్యయః.

పద. మహాన్ ప్రభుః వై పురుషః సత్త్వస్య ఏషః ప్రవర్తకః, సునిర్మలాం ఇమాం ప్రాప్తిం ఈశానః జ్యోతిః అవ్యయః. ౧౨

టీక. పురుషః = పరిపూర్ణుఁడగు, ఏషః = ఈ శివుఁడు, మహాన్ ప్రభుః వై = గొప్పసమర్థుఁడుగదా. ఏషః = ఇతఁడు, సత్త్వస్య=అంతఃకరణమునకు—విరాట్పురుషునకు, ప్రవర్తకః = ప్రవర్తకుఁడుగదా. సునిర్మలాం = పరిశుద్ధమయిన, ఇమాం = స్వరూపావస్థాలక్షణమయిన, ప్రాప్తిం = పరమపదప్రాప్తిని, ఈశానః = నియమించువాఁడు, జ్యోతిః = విజ్ఞానప్రకాశుఁడు, అవ్యయః = అవినాశస్వభావముగలవాఁడు.

తా. అంతట నిండియుండుటచేత పురుషశబ్దముచేత వాచ్యుఁడగుచున్న యీశివుఁడే గొప్పప్రభువు. అనఁగా సమర్థుఁడుగదా. జగదుత్పత్తి స్థితి సంహారములందు అంతఃకరణమును ప్రవర్తింపఁజేయువాఁ డితఁడే. మఱియు పరిశుద్ధమయినట్టియు, స్వరూపావస్థాన లక్షణరూపమయిన పరమ

పదప్రాప్తికి అధిపతియు నితఁడే. మఱియు నితఁడు విజ్ఞానప్రకాశుఁ డగుట చేత జ్యోతిస్సనియు, వినాశరహితుఁడగుటచేత అవ్యయుఁడనియు చెప్పఁబడుచున్నాఁడు.

వివరణము —'సునిర్మలా మిమాం శాంతిం' అని పాఠాంతరము గలదు.

3-వ అధ్యాయము, ౧3-వ మంత్రము.

మూ అంగుష్ఠమాత్రః పురుషోఽన్తరాత్మా
సదా జనానాం హృదయే సన్నివిష్టః,
హృదా మన్వీశో మనసాఽభిక్లప్తో
య ఏత ద్విదు రమృతా స్తే భవన్తి ౧3

పద. అంగుష్ఠమాత్రః పురుషః అన్తరాత్మా సదా జనానాం హృదయే సన్నివిష్టః, హృదా మన్వీశో మనసా అభిక్లప్తః యే ఏతత్ విదుః అమృతాః తే భవన్తి. ౧3

టీ పురుషః=పురుషశబ్దవాచ్యుఁడగు పరమాత్మ, సర్వాంతరాత్మా = అందఱకు అంతరాత్మభూతుఁడయి, అంగుష్ఠమాత్రః=అంగుష్ఠమాత్రుఁడుగా, హృదయే=హృదయమునందు, సదా=ఎల్లప్పుడు, సన్నివిష్టః = ఉన్నటువంటి వాఁడై, హృదా=హృదయమునందున్న, మనసా=మనస్సుచేత, అభిక్లప్తః= అంతట గుప్తముగానున్నవాఁడై, మన్వీశః=జ్ఞానమునకు ప్రభువగుచున్నాఁడు. యే=ఎవ్వరు, ఏతత్=ఈవిషయమును, విదుః=తెలిసికొనుచున్నారో, తే= వారు, అమృతాః=అమరణధర్ములు-ముక్తులు, భవంతి=అగుచున్నారు.

తా అంగుష్ఠమాత్రుఁడయినట్టియు, అంతట నిండియుండుటచేత పురుష శబ్దవాచ్యుఁడును అగు పరమాత్మ సర్వప్రాణులకు అంతరాత్మభూతుఁ

డై ఎల్లప్పుడు జనులహృదయమునందు సన్నిహితుఁడయి హృదయమునం దున్న మనస్సుచేత కప్పఁబడినవాఁడయి జ్ఞానమునకు ప్రభువయియుంటు న్నాఁడు. ఈ విషయము నెవ్వరెఱుంగుదురో వారు ముక్తిని పొందు చున్నారు.

వివరణము — శంకరానంద, నారాయణ, విజ్ఞానభిక్షు ఉపనిష ద్వృత్తివ్యాఖ్యలయందు "హృదామనీషా మనసాఽభిక్లృప్తః" అని పాఠాం తరముగలదు. అప్పుడు, హృదా=హృదయమునందున్నబుద్ధిచేత, మనీషా= సంకల్పాదికముగల, మనసా=మనస్సుచేత అని అర్థమును గ్రహించునది "మనీషా=మనస ఈష్టే యా సా మనీట్ తయా, తచ్ఛక్తి చిచ్ఛక్తి రిత్యత అహ- మనసా=అంతఃకరణేన, హృదయస్థేన సంకల్పవికల్పనియంత్రా నిశ్చయాత్మ కేన అంతఃకరణవ్యాపారేణేత్యర్థః" అని శంకరానందదీపిక యందుగలదు.

విజ్ఞానభగవద్వ్యాఖ్యయందు 'హృదా=హృదయస్థబుద్ధ్యా, మనీషా= మన ఈష్టఇత్యసావేవమసీట్ తయా మనీషా హృదా=మనసాసంకల్పాత్మకేన అభిక్లృప్తః అభిప్రకాశితః. మనసా సంకల్పితః బుద్ధ్యానిశ్చితఇతి మనసా బుద్ధ్యా అభిప్రకాశిత ఇత్యుక్తం' అథవా హృదా మనీషా 'హృఞ్ హరణే, హృదా నేతి నేతీత్యాది సర్వప్రతిషేధోపదేశేన, మనీషా=విచారేణ ఆత్మా నాత్మవివేకవిషయేణ మనసా తదుభయజనిత సమ్యక్ జ్ఞానేన అభిక్లృప్తః అభి ప్రకాశితః' అని వ్యాఖ్యాతమైనది.

ఉపనిషద్వృత్తివ్యాఖ్య విజ్ఞానభగవద్వ్యాఖ్య ననుసరించియున్నది.

సంకల్పవికల్పాత్మకమయిన మనస్సుచేతను, నిశ్చయాత్మకమయిన బుద్ధిచేతను నిర్ణయింపఁబడినదని పై పాఠాంతరముయొక్క సారమయి యున్నది.

3-వ అధ్యాయము. ౧౮-వ మంత్రము.

అవ. వెనుకటి మంత్రమునందు పురుషుఁడు **అంతరాత్మ**యని చెప్పఁబడినది. అతఁడే సర్వాత్మకుఁడనియుఁ నీమంత్రమునందు చెప్పఁబడుచున్నది:-

మూ సహస్రశీర్షా పురుష స్సహస్రాక్ష స్సహస్రపాత్,
సభూమిం విశ్వతో వృత్వా అత్యతిష్ఠద్దశాంగులమ్.౧౮

పద సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్, సః భూమిం విశ్వతః వృత్వా అత్యతిష్ఠత్ దశాఙ్గులమ్. ౧౮

టీక సః=ఆపరమాత్మ, సహస్రశీర్షా = అనేకములయిన శిరస్సులు గలవాఁడు, పురుషః=అంతట పరిపూర్ణుఁడయియుండువాఁడు, సహస్రాక్షః= అనేకనేత్రములుగలవాఁడు, సహస్రపాత్ = అనేకపాదములుగలవాఁడు, సః=ఆపరమాత్మ, భూమిం విశ్వతః= ప్రపంచము నందంతట లోపల బయట, వృత్వా = వ్యాపించినవాఁడయి, దశాంగులం = అపారమయిన భాగమును, అత్యతిష్ఠత్ =అధిష్ఠించియున్నాఁడు.

తా. కనఁబడుచున్నదంతయుఁ భగవత్స్వరూపమేగాని తద్భిన్నముగ నేమియుఁ లేదను విషయమును దృఢపఱుచుచు 'అధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచ్యతే' అను న్యాయము ననుసరించి వివరింపఁబడుచున్నది. అంతట పరిపూర్ణుఁడయి యుండుటచేత పురుషశబ్దవాచ్యుఁడయిన **ఆపరమాత్మ** సర్వాత్మకుఁడు కావున అనంతములయిన శిరస్సులును, నేత్రములును పాదములును గలవాఁడగుటచేత సహస్రశీర్షుఁడనియుఁ, సహస్రాక్షుఁడనియుఁ,సహస్రపాత్తనియుఁ చెప్పఁబడుచున్నాఁడు. ఆపురుషుఁ డీభూమిని- అనఁగా ప్రపంచమునందంతట లోపల, బయట వ్యాపించియున్నవాఁడయి ప్రపంచమునకు పైనకూడ అపారమయిన భాగమును వ్యాపించియున్నాఁడు

లేక దశాంగుల మనఁగా నాభికిపైగా ౧౦ అంగుళముల ప్రదేశమునందుగల హృదయగుహ నధిష్ఠించియున్నాఁడని భావము.

వివరణము:—విజ్ఞాన భగవత్కృతవ్యాఖ్యయందు, పరమేశ్వరుఁడే స్వమాయచేత కార్యకారణాత్మకములను సృష్టించి వానియందు తాను ప్రవేశించి జీవుఁ డనుపేరును పొందుచున్నాఁడు. కావున వీనికి ఈశ్వరుఁడే కారణభూతుఁడనియు, స్వయముగా విశుద్ధుఁడనియు చెప్పుటకయి ఇట్లు చెప్పఁబడుచున్నది —ఈపురుషుఁడు సహస్రశీర్షుఁడు, సహస్రాక్షుఁడు, సహస్రపాదములు గలవాఁడు. ఈపురుషుఁడు భూతభౌతికాత్మకమగు ప్రపంచమునంతయు సృష్టిచేసి దానియందు లోపల బయట అంతటవ్యాపించి తన్మాత్రాపంచక సమష్టిరూపుఁడగు హిరణ్యగర్భుని, పంచీకృతపంచమహాభూత సమష్టిరూపుఁడగు విరాడ్రూపుని ఇటుల ఉభయాత్మకుఁడగు దశాంగులని అతిక్రమించి వ్యాపించియున్నాఁడు అని చెప్పఁబడియున్నది. 'దశాంగులం' అను పదమునకు మఱియు త్రివిధముగ చెప్పఁబడినది.

౧. మాయాప్రకృతి, భూతపంచకము, అహంకారచతుష్టయము, ఇవి కలసి ౧౦ అగుటచేత దశాంగులమని చెప్పఁబడుచున్నది.

౨. లేక దశవిధేంద్రియములు, పదిదిక్కులు మున్నగు పరిచ్ఛిన్నములగు స్థానములన్నియు దశాంగులము లనంబడుచున్నవి. అట్టి పరిచ్ఛిన్నవిభాగములను అతిక్రమించి యున్నవాఁడనియు గ్రహించవచ్చును

3. భూతభౌతికమునంతయు దశాంగులమను పదముచేత గ్రహించి అట్టిదానిని అతిక్రమించియున్న వాఁడని యర్థమును గ్రహించవచ్చును. అడ్డులేని మహత్త్వసంపత్తిగలవాఁడని భావము. ఉపనిషద్బ్రహ్మవ్యాఖ్యయందును ఇట్లే గలదు.

3-వ అధ్యాయము, ౧౫-వ మంత్రము.

అవ. సర్వాత్మకము బ్రహ్మము అన్నయెడల బ్రహ్మము ప్రపంచ సహితమని చెప్పవలసివచ్చును. తన్నివారణార్థము బ్రహ్మవ్యతిరేకముగ నేమియులేదు. అంతయు బ్రహ్మమేయని చెప్పఁబడుచున్నది —

మూ. పురుషఏవేదగ్ం సర్వం యద్భూతం యచ్చ భవ్యమ్,
ఉతామృతత్వస్యేశానో యదన్నేనాతిరోహతి ౧౫

పద. పురుషః ఏవ ఇదం సర్వం యత్ భూతం యత్ చ భవ్యం, ఉత అమృతత్వస్య ఈశానః యత్ అన్నేన అతిరోహతి. ౧౫

టీక. యత్ = ఎయ్యది, భూతం = ఇదివఱకు గలించిపోయినదో, యత్ = ఎయ్యది, భవ్యం = భవిష్యత్ప్రపంచముగలదో, ఇదంసర్వం = ఇదిఅంతయు, పురుషఃఏవ = పురుషుఁడే, ఉత=మఱియు, అమృతత్వస్య = అమరణధర్మమగు కైవల్యమునకు, ఈశానః = ప్రభువున్నూ, అన్నేన=అన్నము చేత, యత్ = ఎయ్యది, అతిరోహతి = ఉంటున్నదో, (దానికి, ఈశానః = ప్రభువున్నూ) సః=అపురుషుఁడే.

తా. ఏ ప్రపంచము అన్నముచేత ఉత్పన్నమయినదై మననేత్రములకు ఇప్పుడు గనంబడుచున్నదో, ఏ ప్రపంచము ఇదివఱకు గలించిపోయినదో, ఏ ప్రపంచము ముందురాగలదో అది అంతయు పురుషస్వరూపమే గాని తద్భిన్నముగ నేమియులేదు. మఱియు అమరణధర్మమయిన కైవల్యమునకు ప్రభువయినవాఁడున్నూ అపురుషుఁడే.

3-వ అధ్యాయము, ౧౬-వ మంత్రము.

మూ సర్వతః పాణిపాదంతత్ సర్వతోఽక్షిశిరోముఖమ్,
సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి. ౧౬

పద. సర్వతః పాణిపాదం తత్ సర్వతః అక్షిశిరోముఖం, సర్వతః శ్రుతిమత్ లోకే సర్వం ఆవృత్య తిష్ఠతి. ౧౬

టీక. సర్వతః = అంతట, పాణిపాదం = చేతులు పాదములు కలిగినట్టియు, సర్వతః = అంతట, అక్షిశిరోముఖం = నేత్రములు శిరస్సులు ముఖములు కలిగినట్టియు, సర్వతః = అంతట, శ్రుతిమత్ = చెవులుకలదియు నగు, తత్ = ఆబ్రహ్మస్వరూపము, లోకే = ప్రపంచమునందు, సర్వం = అంతయు, ఆవృత్య = ఆవరించి, తిష్ఠతి = ఉంటున్నది.

తా. ఇచట అనిర్విశేషబ్రహ్మమే ప్రతిపాదింపఁ బడుచున్నది. అంతట చేతులు పాదములు గలదియు, అంతట నేత్రములు శిరస్సులు ముఖములుగలదియు, అంతట కర్ణములుగలదియునగు ఆబ్రహ్మస్వరూప మీ లోకమునందుగల ప్రాణిసమూహమును ఆవరించి నిలిచియున్నది.

3-వ అధ్యాయము, ౧౭-వ మంత్రము

అవ. విషయపరిజ్ఞానార్థము బ్రహ్మమునందు ఉపాధిభూతములగు పాణిపాదనేత్రాదికమును ఆరోపించుటచేత జ్ఞేయమగు బ్రహ్మమునకు ఆ పాణిపాదాదికము వాస్తవముగా నున్నటుల తలంచకూడదనుటకయి యీ మంత్రముఁ జెప్పఁబడుచున్నది:—

మూ సర్వేంద్రియగుణాభాసం సర్వేంద్రియవివర్జితమ్,
సర్వస్య ప్రభు మీశానం సర్వస్య శరణం బృహత్ ౧౭

పద. సర్వేంద్రియగుణాభాసం సర్వేంద్రియవివర్జితం, సర్వస్య ప్రభుం ఈశానం సర్వస్య శరణం బృహత్. ౧౭

టీక. బృహత్ = ఆబ్రహ్మతత్త్వము, సర్వేంద్రియగుణాభాసం =

సకలేంద్రియములయొక్క రూపము గుణములు వాస్తవముగా లేకపోయి నను ఉన్నదానివలె తోఁచుచున్నదానిగను, సర్వేంద్రియవివర్జితం=సర్వేం ద్రియ విరహితమయినదానిగను, సర్వస్య = సకలప్రపంచమునకు, ప్రభుం= ప్రభువుగను, ఈశానం = నియామకమయిన దానిగను, సర్వస్య = సకల మునకు, శరణం = రక్షకమయినదానిగను (ఎఱుఁగవలయును).

తా. శ్రోత్రాద్యన్తఃకరణపర్యంతములగు సకలేంద్రియములును, ఇచట సర్వేంద్రియపదముచేత గ్రహించుట యుక్తమగుచున్నది. జ్ఞానేం ద్రియములు కర్మేంద్రియములను ఉపాధులతో కూడియుండువాఁడును, ఆయా ఇంద్రియగుణములగు అధ్యవసాయ సంకల్పశ్రవణాదీంద్రియ గుణములు గలవానివలె గనంబడుచున్న దానివలెను, వాస్తవముగా జూచిన యెడల సర్వేంద్రియ వివర్జితమయినదియును, ఇచట సర్వేంద్రియ వివర్జిత మయినదని చెప్పియుండుటచేత వెనుకచెప్పఁబడిన సర్వేంద్రియగుణములు కలిగియుండుట ఆభాసమాత్రముకాని వాస్తవముకాదని యెఱుంగవల యును సకలప్రపంచమునకు అధిపతిఅయినదియును, సకలప్రపంచమును రక్షించునదియును, నియమించునదియును (అగుచున్నది).

3-వ అధ్యాయము, ౧౮-వ మంత్రము.

మూ॥ నవద్వారే పురే దేహీ హంసో లీలాయతే బహిః,
వశీ సర్వస్య లోకస్య స్థావరస్య చరస్య చ   ౧౮

పద. నవద్వారే పురే దేహీ హంసః లీలాయతే బహిః, వశీ సర్వస్య లోకస్య స్థావరస్య చరస్య చ.   ౧౮

టీ॥ హంసః=పరమాత్మ, నవద్వారే=తొమ్మిదిద్వారములుగల, పురే= శరీరమునందు, దేహీ = విజ్ఞానాత్మయై, బహిః = (విషయగ్రహణార్థము)

వెలుపల, లీలాయ తే=సంచరించుచున్నాఁడు. (సః=ఆపరమాత్మ) స్థావరస్య = స్థావరమయినట్టియు, చరస్యచ=జంగమమయినట్టియు, సర్వస్యలోకస్య = ప్రపంచమునకు అంతయు, వశీ=స్వాధీనముగాఁగలవాఁడు.

తా. ఈశరీరమునందు తొమ్మిదిద్వారములుండుటచేత ఇయ్యది నవ ద్వారమనంబడుచున్నది. శిరస్సునందు రెండుకర్ణములు, రెండుముక్కులు, రెండుకన్నులు, నోరు అని ౭ ద్వారములు. అధోభాగమునందు ౨ ద్వారములు, మొత్తము తొమ్మిదిద్వారములగుచున్నవి. ఇట్టి నవద్వారమయిన శరీరమునందు పరమాత్మ విజ్ఞానాత్మగా ప్రవేశించినవాఁడయి విషయగ్రహణార్థము సంచరించుచున్నాఁడు. ఈపరమాత్మ స్థావరజంగమాత్మకమగు సకల ప్రపంచమును తన యధీనమునం దుంచుకొనుచున్నాఁడు. హంసశబ్దమునకు 'హంతి అవిద్యాత్మకం కార్యం ఇతి హంసః' అని వ్యుత్పత్తియగుటచేత హంసశబ్ద మిట పరమాత్మవాచకముగ గైకొనఁబడినది.

3-వ అధ్యాయము, ౧౯-వ మంత్రము.

అవ. ఇదివఱకు బ్రహ్మము సర్వాత్మకమని మాత్రము ప్రతిపాదింపఁబడియెను. ఇప్పుడు అఖండజ్ఞానాత్మస్వరూపుఁ డాయాత్మయని చెప్పఁబడుచున్నది ––

అపాణిపాదో జవనో గ్రహీతా
పశ్యత్యచక్షుః స శృణోత్యకర్ణః,
స వేత్తి వేద్యం న చ తస్యాఽస్తి వేత్తా
త మాహు రగ్ర్యం పురుషం మహాన్తమ్. ౧౯

పద. అపాణిపాదః జవనః గృహీతా పశ్యతి అచక్షుః సః శృణోతి అకర్ణః, సః వేత్తి వేద్యం న చ తస్య అస్తి వేత్తా తం ఆహుః అగ్ర్యం పురుషం మహాన్తమ్. ౧౯

టీక. సః = ఆపరమాత్మ, అపాణిపాదః = చేతులు పాదములులేని వాఁడు (అయినప్పటికిన్నీ), జవనః=శీఘ్రముగా నడుచువాఁడును, గృహీతా= గ్రహించువాఁడును అగుచున్నాఁడు. సః=ఆపరమాత్మ, అచక్షుఃఅపి=నేత్రములు లేనివాఁడయి నప్పటికిన్నీ, పశ్యతి = చూచుచున్నాఁడు. అకర్ణః = చెవులు లేకపోయినప్పటికిన్నీ, శృణోతి=వినుచున్నాఁడు. సః=ఆపరమాత్మ, వేద్యం=తెలిసికొనఁదగినదానిని, వేత్తి = తెలుసుకొనుచున్నాఁడు. తస్య= అతనియొక్క, వేత్తా=తెలుసుకొనువాఁడు, నచఅస్తి=లేదు. తం పురుషం= ఆపురుషుని, అగ్ర్యం=శ్రేష్ఠుఁడయినవానిగను, మహాంతం = గొప్పవానిగను (త్రివిధపరిచ్ఛేదశూన్యునిగను), ఆహుః = చెప్పుచున్నారు.

తా. ఆపరమాత్మ చేతులు పాదములు మున్నగు కర్మేంద్రియములు లేకపోయినప్పటికిన్నీ శీఘ్రముగ వెళ్ళువాఁడును, వస్తువులను గ్రహించువాఁడును అగుచున్నాఁడు. నేత్రములు లేకపోయినను అంతట చూచుచున్నాఁడు. చెవులు లేకపోయినప్పటికిన్నీ అన్నియు వింటున్నాఁడు. తెలిసికొనవలసిన దానిని తెలిసికొనుచున్నాఁడు. అతనిని తెలిసికొనఁగలవాఁడు మఱొక్కరుఁడు లేడు. అతఁడే సర్వకారణభూతుఁడగుటచేత మొట్టమొదటివాఁడనియు, పురుషుఁడనియు, గొప్పవాఁడనియు చెప్పఁబడుచున్నాఁడు. 'నాన్యోఽతోఽస్తి ద్రష్టా'యనుశ్రుతి ఇతఁడే సర్వద్రష్టయని చెప్పుచున్నది.

వివరణము —ఆత్మ సర్వవిధవిశేషవిరహితుఁడయినప్పటికిన్నీ, సర్వశక్తి సమన్వితుఁడను విషయమును తెలుపు సందర్భమునందు

బ్ర. సూ. వికరణత్వాన్నేతి చేత్తదుక్తమ్. ౨-౧-౩౧.

అను బ్రహ్మసూత్రభాష్యమునం దీమంత్రమును శంకరభగవత్పాదులవారుదాహరించిరి.

'మహాంతం' అను పదమునకు త్రివిధపరిచ్ఛేదశూన్యుఁడను అర్థము

నిటగ్రహించుట యుక్తము. త్రివిధపరిచ్ఛేదశూన్యుఁ డనగా దేశకాలవస్తు పరిచ్ఛేదశూన్యుఁ డని అర్థము.

తద్వివరణము —

శ్లో. న వ్యాపిత్వా ద్దేశతో ఽన్తః కారణత్వా న్న కాలతః,
న వస్తుతో ఽపి సార్వాత్మ్యా దానన్త్యం బ్రహ్మణి త్రిధా

3-వ అధ్యాయము, ౨౦-వ మంత్రము.

మూ॥ అణో రణీయాన్ మహతో మహీయాన్
నాఽత్మా గుహాయాం నిహితో ఽస్య జన్తోః,
తమక్రతుం పశ్యతి వీతశోకో
ధాతుః ప్రసాదా న్మహిమాన మీశమ్ ౨౦

పద. అణోః అణీయాన్ మహతః మహీయాన్ ఆత్మా గుహాయాం నిహితః అస్య జన్తోః, తం అక్రతుం పశ్యతి వీతశోకః ధాతుః ప్రసాదాత్ మహిమానం ఈశమ్. ౨౦

టీ. అణోః=అణువుకంటె, అణీయాన్ = సూక్ష్మమయినవాఁడును, మహతః=గొప్పదిఅయిన దానికంటె, మహీయాన్=మిక్కిలిగొప్పది అయి నట్టివాఁడును అగు, ఆత్మా=ఆత్మ, అస్య=ఈ, జన్తోః=బ్రహ్మాది స్తంబపర్యంత మయిన ప్రాణిజాతముయొక్క, గుహాయాం = హృదయాకాశమునందు, నిహితః=అత్మభూతుఁడయియున్నాఁడు. యః=ఎవ్వఁడు, ధాతుః=పరమేశ్వ రునియొక్క, ప్రసాదాత్ = అనుగ్రహమువలన, అక్రతుం=విషయభోగ సంకల్పరహితుఁడగు, తం=ఆ, మహిమానంఈశం=మహిమగలపరమేశ్వరుని పశ్యతి=చూచుచున్నాఁడో,సః=వాఁడు, వీతశోకః భవతి=దుఃఖవిరహితుఁడగు చున్నాఁడు.

తా. అతిసూక్ష్మమయిన పరమాణువుకంటె మిక్కిలి సూక్ష్మమయి నవాఁడును, గొప్పదియగు పృథివ్యాదికముకంటె గొప్పవాఁడును అగు ఆత్మ బ్రహ్మాదిస్థావరపర్యంతమయిన ప్రాణిసమూహముయొక్క హృదయగుహ నాశ్రయించి యుంటున్నాఁడు. ఈవిధముగా హృదయగుహ నాశ్రయించి యున్న వాఁడును, విషయభోగసంకల్పవిరహితుఁడును, కర్మనిమిత్తమయిన వృద్ధిక్షయవిరహితుఁడును అగు పరమాత్మను పరమేశ్వరునియొక్క అను గ్రహమువలన గాంచినవాఁడు శోకవిరహితుఁ డగుచున్నాఁడు ఈశ్వరాను గ్రహమువలన ఆత్మజ్ఞానము కలుగును.

ఇచట 'ధాతుప్రసాదాత్' అని పాఠాంతరము గలదు. ఆపాఠము నం దర్థమిట్లు గ్రహించునది —

ధాతువులనఁగా శరీరమును ధరించునవి కనుక ఇంద్రియములు ధాతువు లనంబడుచున్నవి అట్టి ఇంద్రియములను విషయానుభవమునందుగల దోష మును తెలిపి అట్టి విషయములనుండి మఱలించుటచేత ఇంద్రియములు ప్రస న్నములు—నిర్మలములు అగును అట్టి ప్రసన్నేంద్రియములు గలుగుటవలన ఈశ్వరు నెఱుంగుచున్నాఁడు. కాములగు ప్రాకృతపురుషులకు ఆత్మసందర్శనము అశక్యమనియు,వశీకృతేంద్రియులకే ఇది శక్యమనియు గ్రహించవలయును.

వివరణము —ఆత్మశబ్దనిర్వచనము నిట్లు గ్రహించునది.

శ్లో. యచ్చాప్నోతి యదాదత్తే యచ్చాత్తి విషయా నిహ,
యచ్చాస్య సంతతోభావ స్తస్మా దాత్మేతి గీయతే.

3-వ అధ్యాయము, ౨౧-వ మంత్రము.

అవ. ఈవిషయమును దృఢపఱుచుటకు మంత్రద్రష్ట తన యనుభవమును చెప్పుచున్నాఁడు —

మూ॥ వేదాహమేత మజరం పురాణం
సర్వాత్మానం సర్వగతం విభుత్వాత్,
జన్మనిరోధం ప్రవదన్తి యస్య
బ్రహ్మవాదినోఽభివదన్తి నిత్యమ్ ౨౧

శ్వేతాశ్వతరోపనిషది తృతీయోఽధ్యాయః సమాప్తః

పద. వేద అహం ఏతం అజరం పురాణం సర్వాత్మానం సర్వగతం విభుత్వాత్, జన్మనిరోధం ప్రవదన్తి యస్య బ్రహ్మవాదినః అభివదన్తి నిత్యమ్. ౨౧

టీక. బ్రహ్మవాదినః=బ్రహ్మవేత్తలు, యస్య=ఎవ్వనికి, జన్మనిరోధం= జన్మముయొక్క అభావమును, ప్రవదంతి = చెప్పుచున్నారో, (మఱియు ఎవ్వని బ్రహ్మవేత్తలు) నిత్యం=శాశ్వతునిగా, అభివదంతి=పలుకుచున్నారో, (అట్టి) ఏతం=ఈయాత్మను, అజరం=పరిణామధర్మరహితునిగను, పురాణం= పురాతనునిగను, సర్వాత్మానం = అందఱకు ఆత్మభూతుఁడయినవానిగను, విభుత్వాత్=ఆకాశాదికమువలె సర్వవ్యాపకుఁ డగుటచేత, సర్వగతం=సర్వగతుని గను, అహం=నేను, వేద=ఎఱుంగుదును.

తా. బ్రహ్మవేత్తలయినవారలు ఏపరమాత్మకు ఉత్పత్తిలేదనియు, శాశ్వతుఁడనియు తలంచుచున్నారో ఆట్టియాత్మ పరిణామధర్మవివర్జితుఁ డనియు, పురాతనుఁడనియు, సర్వాత్మకుఁడనియు, ఆకాశాదికమువలె సర్వ వ్యాపకుఁ డగుటచేత సర్వగతుఁడనియు నెఱుంగుదునని మంత్రద్రష్ట స్వాత్మానుభవమును చెప్పుచున్నాఁడు.

**వివరణము:**—పురాణశబ్దమునకు 'పురాఽపి నవం' అను వ్యుత్పత్తి నారాయణ, శంకరానంద, విజ్ఞానభగవద్వ్యాఖ్యానములందు గలదు. ఉప

నిషద్బ్రహ్మవ్యాఖ్యయందు 'జన్మాదిషడ్భావవికారప్రతిషేధం' అని వ్యాఖ్యాతము.

'జన్మనిరోధం' అనుశబ్దమునకు "యస్య పరమేశ్వరస్య కర్మ జగతః జన్మసంహారౌ, 'ఇతి బ్రహ్మవేదినః వదంతి' అను (ప్రపంచముయొక్క ఉత్పత్తి సంహారములు పరమేశ్వరుని కృత్యములు అని భావము.) వ్యుత్పత్తి ఉపనిషద్బ్రహ్మ, విజ్ఞానభగవద్వ్యాఖ్యలందు గలదు.

శంకరానంద, నారాయణ గీషికలందు-'యస్య జన్మనిరోధం మూఢాః ప్రవదంతి' అని మూఢపదమును అధ్యాహారముచేసి అర్థము నొనర్చియున్నారు. ఎవ్వనికి ఉత్పత్తినాశములు కలవని మూఢులు తలంచుచున్నారో అట్టిఆత్మ నిత్యుఁడని బ్రహ్మవేత్తలు పలుకుచున్నారని పైవారి యభిప్రాయము.

నారాయణదీపికయందు 'జన్మనిరోధం న వదంతి యస్య' అని పాఠముంకొట యుక్తమని సూచింపఁబడినది.

## శ్వేతాశ్వతరోపనిషత్తునందు తృతీయాధ్యాయము సమాప్తము.

---

ఈ యధ్యాయమునకు సంబంధించిన ఇతరగ్రంథభాగములు:-

అనుభూతిప్రకాశము—ద్వాదశాధ్యాయము. శ్లో. ౩౬-౪౭.

ఆత్మపురాణము—అష్టమాధ్యాయము. శ్లో. ౪౯౭-౫౮౦ వఱకు.

బ్రహ్మగీత-సూతసంహితాంతర్గతము, ౧౧ వ-అధ్యాయము.

---

శ్రీగురుభ్యో నమః.

కృష్ణయజుర్వేదాంతర్గత మగు

# శ్వేతాశ్వతరోపనిషత్తు

ఆంధ్రటీకాతాత్పర్య వివరణసమన్వితము



## చతుర్థాధ్యాయము.

### చతుర్థాధ్యాయము, ౧-వ మంత్రము.

అవ. ఆత్మవిషయము అతిగహనమయినదగుటచేత మాటిమాటికి చెప్పుట అత్యావశ్యకము కావున ఈయధ్యాయమునందును ఆత్మవిషయమే మఱల చెప్పఁబడుచున్నది —

మూ. య ఏకోఽవర్ణో బహుధా శక్తియోగాత్
వర్ణాననేకాన్ నిహితార్థో దధాతి,
విచైతి చాన్తే విశ్వమాదౌ స దేవః
స నో బుద్ధ్యా శుభయా సంయునక్తు ౧

పద. యః ఏకః అవర్ణః బహుధా శక్తియోగాత్ వర్ణాన్ అనేకాన్ నిహితార్థః దధాతి, విచైతి చ అన్తే విశ్వం ఆదౌ సః దేవః సః నః బుద్ధ్యా శుభయా సంయునక్తు. ౧

టీ. యః=ఏ, ఏకః=అద్వితీయుఁ డగుపరమాత్మ, అవర్ణః = (స్వయముగా) జాత్యాదివిరహితుఁ డయినప్పటికిన్నీ, బహుధా=నానావిధమయిన, శక్తియోగాత్=మాయాశక్తియొక్క సంబంధమువలన, అనేకాన్ వర్ణాన్ = అనేకములయినజాతులను, నిహితార్థః = ప్రయోజనరహితుఁడయి - అనఁగా స్వార్థనిరపేక్షుఁడయి, దధాతి = (ఆదియందు) చేయుచున్నాఁడో, యస్మిన్=ఏపరమాత్మయందు, విశ్వం=ప్రపంచము, అంతే=ప్రళయకాలమునందు, విచైతి=లీనమగుచున్నదో,(మధ్యే)చ=మధ్యకాలమునందు, యస్మిన్ = ఏపరమాత్మయందు (స్థితినిపొందుచున్నదో), సః=ఆపరమాత్మ, దేవః=ద్యోతనస్వభావుఁడు, (అనఁగా విజ్ఞానమే ముఖ్యముగాఁగలవాఁడు) సః=ఆపరమాత్మ, నః=మమ్ములను, శుభయా=మంగళకరమగు, బుద్ధ్యా=బుద్ధితో, సంయునక్తు=చేర్చుఁగాక.

తా. అద్వితీయుఁడగు ఏపరమాత్మ స్వయముగా తాను జాత్యాదివిరహితుఁడయినను, నానావిధరూపములుగల మాయాశక్తియొక్క సంబంధమువలన తన కెట్టిప్రయోజనమును అపేక్షించనివాఁడై నానావిధజాతులను అనఁగా చిదచిద్విశిష్టప్రాణిజాతమును ఆదియందు నిర్మించుచున్నాఁడో, ప్రళయకాలమునందే పరమాత్మయందీప్రపంచము విలీనమగుచున్నదో, మధ్యకాలమునందు ఎవనియొక్క సంబంధమువలన నిలిచియున్నదో అట్టిపరమాత్మ నిత్యప్రకాశస్వరూపుఁడు—అనఁగా విజ్ఞానైకరసుఁడు. అట్టిపరమాత్మ మంగళకరమగు బుద్ధిని మాకు కలుగఁజేయుఁగాక.

వివరణము·—ఈమంత్రము వివిధవ్యాఖ్యాతలచేత వివిధముగ వ్యాఖ్యానము చేయఁబడినది. శంకరానందునియొక్క వ్యాఖ్యయందు ౫ విధములుగ వ్యాఖ్యాతమయినది. "విచైతిశాంతేవిశ్వమాదౌ" అని పాఠాంతరము.

## ౧-వ ప్రకారము

టీ. యః=ఏ, ఏకః=భేదశూన్యమగు, వర్ణః=పదార్థము - అనఁగా స్వయంప్రకాశమయిన చిదానందాత్మ, బహుధా=బహుప్రకారమయిన, శక్తియోగాత్ = మాయాసంబంధమువలన, అనేకాన్ = అనేకవిధములయిన, వర్ణాన్=చిదచిదాత్మకపదార్థములను, నిహితార్థాన్ = స్వార్థనిరపేక్షుఁడయి, దధాతి=సృజించుచున్నాఁడో, ఆదౌ = జగదుత్పత్తికిముందు, అంతే=స్వప్రకాశచిదానందాత్మకుఁడగు ఎవ్వనియందు, విశ్వం=ప్రపంచము, వ్యేతిచ=వివిధముగానుంటున్నదో, సః=అట్టివస్తువు, దేవః = స్వయంప్రకాశము, సః=అట్టి స్వయంప్రకాశమయినవస్తువు, నః = మమ్ములను, శుభయా బుద్ధ్యా=మంగళకరమయినబుద్ధితో, సంయునక్తు=చేర్చుఁగాక.

## ౨-వ ప్రకారము

టీక. యః=ఏ, ఏకః=ఒక్కటియగు, వర్ణః = ఓంకారము, శక్తియోగాత్ = స్వశక్తిసంబంధమువలన, బహుధా = బహుశాఖలు, షడంగములు, షడుపాంగములు, ఉపవేదములు మున్నగు విభేదములుగల, అనేకాన్ = అనేకములయిన, వర్ణాన్ =ఋుగాదివేదములను, నిహితార్థః = తనయందుంచఁబడిన అర్థముగలదియై, (అనఁగా సకలవేదప్రతిపాదితార్థము ప్రణవమునందు ఇమిడియున్నదని భావము) దధాతి = ధరించియున్నదో, సః=ఆ, దేవః = ప్రకాశస్వరూపమగు ఓంకారము, ఆదౌ = శబ్దముయొక్క ఉత్పత్తికి పూర్వమందును, అంతేచ=అభిధాన అభిధేయశూన్యమయిన స్వాత్మయందును, విశ్వం = అభిధానాభిధేయ రూపప్రపంచమును, వ్యేతిచ = వివిధముగా పొందుచున్నదో, సః=ఆ ప్రణవము, నః = మమ్ములను, శుభయా బుద్ధ్యా = మంచిబుద్ధితో, సంయునక్తు = సమకూర్చుఁగాక.

3-వ ప్రకారము.

టీక. యః=ఏ, ఏకః=ఒక్కటియగు, అవర్ణః = అకారము, బహుధా=బహువిధములయిన—అనఁగా హ్రస్వదీర్ఘాదిభేదరూపమయిన, శక్తియోగాత్ = సామర్థ్యాతిశయమువలన, నిహితార్థః = స్వార్థనిరపేక్షమయి, వివిధాన్ = వివిధమయిన, వర్ణాన్ = ఓంకారమును, దధాతి = కలుగఁజేయుచున్నదో, ఆదౌ=సృష్టికిపూర్వమందును, అంతేచ = సృష్టికి అంతమునందును, విశ్వం = అక్షరప్రపంచమును, వ్యేతిచ = వివిధముగా పొందుచున్నదో, సః=ఆఅకారము, దేవః = స్వయంప్రకాశము, సః = ఆఅకారము, నః = మమ్ములను, శుభయా బుద్ధ్యా = మంచిబుద్ధితో, సంయునక్తు=చేర్పుఁగాక.

౪-వ ప్రకారము

టీక యః = ఏ, ఏకః = ఒక్కటియగు, వర్ణః = శబ్దతత్త్వము, బహుధా = అనేకవిధములుగ, శక్తియోగాత్ = కుండలినీశక్తిసంబంధమువలన, అనేకాన్ = అనేకములయిన, వర్ణాన్ = సస్వరములయిన కాదివర్ణములను, నిహితార్థః = స్వాత్మయందుంచఁబడిన ప్రయోజనముగలదియై, దధాతి = ధరించుచున్నదో, అంతే = చిదచిదాదిభేదశూన్యమయిన ఆత్మయందు, ఆదౌ = సర్వవర్ణోత్పత్తికంటె ముందు, విశ్వం = ప్రపంచమును, వ్యేతిచ = వివిధముగా పొందుచున్నదో, సః = ఆ, దేవః=స్వయంప్రకాశమగు శబ్దతత్త్వము, నః=మమ్ములను, శుభయా బుద్ధ్యా = మంచిబుద్ధితో, సంయునక్తు = చేర్పుఁగాక.

౫-వ ప్రకారము

టీక. (అష్టాంగయోగనిరతుఁడయిన యోగీశ్వరునకు యోగాభ్యాసము ప్రారంభించినప్పుడు మొట్టమొదట కొన్నిసిద్ధులు కలుగును. అప్పుడతనికి పరమాత్మతత్త్వము ప్రథమమున స్ఫురించుటకు ముందు ఒక్కవిధముగ

గనంబడును. ఆవిషయమిట వర్ణితమగుచున్నది.) యః=ఏ, ఏకః = ఒక్కటియగు, వర్ణః = మంచు మున్నగు రూపభేదశూన్యమగు రూపతన్మాత్రము (హృదయగుహాంతర్గతమయినది), బహుధా = (మనఃపవనవిధారణాయాస శక్తిసంబంధమువలన) అనేకవిధములగు, వర్ణాన్ = నీహారధూమ సూర్యాగ్నిసదృశవర్ణములను, నిహితార్థః = ఉంచఁబడినయోగసిద్ధియే ప్రయోజనముగా గలదియై, దధాతి = ధరించియున్నదో, శాంతే = ఆయోగసిద్ధియొక్కవిఘ్నము శాంతించిన దగుచుండఁగా, విశ్వం = భేదాత్మకమగు ప్రపంచమును, విఏతిచ = తెలిసికొనుచున్నదో, సః=అట్టి, దేవః = ద్యోతనాత్మకమగువర్ణము, నః = మమ్ములను, శుభయా బుద్ధ్యా=మంచిబుద్ధితో, సంయునక్తు = చేర్చుఁగాక. మోక్షమునకు హేతుభూతమయిన బ్రహ్మవిషయిక బుద్ధిని మాకు కలుగఁజేయుఁగాక.

౪-వ అధ్యాయము, ౨-వ మంత్రము.

అవ. ఆధిదైవిక సమష్టిరూపోపాధిగలవాఁడు పరమేశ్వరుఁడే యని చెప్పుచున్నాఁడు —

మూ॥ తదేవాగ్ని స్తదాదిత్య స్తద్వాయు స్తదు చంద్రమాః,
తదేవ శుక్రం తద్బ్రహ్మ తదాప స్తత్ప్రజాపతిః ౨

పద. తత్ ఏవ అగ్నిః తత్ ఆదిత్యః తత్ వాయుః తత్ ఉ చన్ద్రమాః, తత్ ఏవ శుక్రం తత్ బ్రహ్మ తత్ ఆపః తత్ ప్రజాపతిః. ౨

టీక. తత్ ఏవ=ఆయాత్మతత్త్వమే, అగ్నిః=అగ్ని, తత్=ఆయాత్మతత్త్వమే, ఆదిత్యః = సూర్యుఁడు, తత్ = ఆయాత్మతత్త్వమే, వాయుః= వాయువు, తత్ ఉ=ఆయాత్మతత్త్వమే, చంద్రమాః = చంద్రుఁడు, తత్ = ఆయాత్మతత్త్వమే, శుక్రం = పరిశుద్ధమయినది, తత్ =ఆయాత్మతత్త్వమే, బ్రహ్మ=బ్రహ్మము, తత్ = ఆయాత్మతత్త్వమే, ఆపః=ఉదకములు, తత్ = ఆయాత్మతత్త్వమే, ప్రజాపతిః=విరాట్పురుషుఁడు.

తా. ఇంతవఱకు చెప్పఁబడిన గ్రంథసందర్భమునం దేయాత్మతత్త్వము చెప్పఁబడినదో ఆయాత్మయే స్రష్టయు,లయస్వరూపుఁడును అగుటచేత అతఁడే సర్వాత్మకుఁడు, అతనికంటె భిన్నమయినది ఏమియు లేదనువిషయము మంత్రత్రయముచేత వర్ణింపఁబడుచున్నది — ఈయాత్మతత్త్వమే అగ్ని, ఈయాత్మతత్త్వమే సూర్యుఁడు, ఈయాత్మతత్త్వమే వాయువు, ఈయాత్మతత్త్వమే చంద్రుఁడు. ఈయాత్మతత్త్వమే నిర్మలమయినది, ఈయాత్మతత్త్వమే బ్రహ్మము, ఈయాత్మతత్త్వమే జలములు, ఈయాత్మతత్త్వమే విరాట్పురుషుఁడు.

వివరణము — ఈమంత్రము మహానారాయణోపనిషత్తు అనంబడు నారాయణప్రశ్నమునందు (యాజ్ఞిక్యుపనిషత్తునందు) ప్రథమానువాకమునందుకూడ ఇట్లే గలదు. అచట ఈమంత్రమునకు ముందుగా — 'యదేకమవ్యక్త మనంతరూపం విశ్వం పురాణం తమసః పరస్తాత్, తదేవర్తంతదు సత్యమాహు స్తదేతద్బ్రహ్మ పరమం కవీనామ్.'

ఇష్టాపూర్తంబహుధాజాతంజాయమానం విశ్వంబిభర్తి భువనస్యనాభిః,
తదేవాగ్ని స్తద్వాయు స్తత్సూర్య స్తదు చంద్రమాః,
తదేవ శుక్రమమృతం తద్బ్రహ్మ తదాప స్సప్రజాపతిః.

విజ్ఞానభిక్షువ్యాఖ్యయందు "స్వమాయయా అధిదైవికోపాధీన్ సమష్టిరూపాన్ సృష్ట్వా తేష్వనుప్రవిశ్య అగ్న్యాదిత్యాద్యాఖ్యాం లబ్ధ్వా స్థితోఽపీశ్వర ఏవేత్యాహ" అను అవతారికతో నీమంత్రము వ్యాఖ్యాతమగుటచేత పరమేశ్వరుఁడే తన మాయాశక్తిచేత అగ్న్యాదిసమష్ట్యుపాధులను సృజించి అగ్న్యాదినామధేయములతో వ్యవహరింపఁబడుచు వానియందు తాను ప్రవేశించియున్నాఁడని సిద్ధించుచున్నది.

౪-వ అధ్యాయము, 3-వ మంత్రము.

అవ. వ్యష్టిరూపోపాధియు ఆత్మస్వరూపమే యని చెప్పఁబడుచున్నది:-

మూ. త్వం స్త్రీ త్వం పుమా నసి త్వం
కుమార ఉతవా కుమారీ,
త్వం జీర్ణో దండేన వఞ్చసి త్వం
జాతో భవసి విశ్వతోముఖః 3

పద. త్వం స్త్రీ త్వం పుమాన్ అసి త్వం కుమారః ఉత వా కుమారీ, త్వం జీర్ణః దండేన వఞ్చసి త్వం జాతః భవసి విశ్వతోముఖః. 3

టీ. (ఓపరమేశ్వరా!) త్వం=నీవు, స్త్రీ=ఆడదానవు, అసి = అగుచున్నావు. త్వం=నీవు, పుమాన్ అసి=పురుషుఁడవు అగుచున్నాఁడవు. త్వం=నీవు, కుమారః అసి=కుమారుఁడవు అగుచున్నాఁడవు. ఉతవా=మఱియు, కుమారీ అసి=కుమారివి అగుచున్నాఁడవు. త్వం=నీవు. జీర్ణః=ముసలివాఁడవై, దండేన=దండముతో, వంచసి=తిరుగుచున్నాఁడవు, త్వం=నీవు, జాతః భవసి=(స్వేచ్ఛగా) జన్మించినవాఁడవు అగుచున్నాడవు. త్వం=నీవు, విశ్వతోముఖః అసి=సర్వతోముఖుఁడవు అగుచున్నాఁడవు.

తా. ఓపరమేశ్వరా! నీవు స్త్రీయును, పురుషుఁడవును, కుమారుఁడవును, కుమారియును అగుచున్నాఁడవు. నీవే ముదుసలివై చేత కఱ్ఱఁబట్టుకొని తిరుగునట్టివాఁడవును, అప్పుడు పుట్టినట్టి బాలుఁడవును అగుచున్నాఁడవు. ఇదియని చెప్పనేల సర్వతోముఖుఁడవు నీ వగుచున్నాఁడవు. అనఁగా స్వేచ్ఛగా మాయాశక్తితో వివిధరూపములతో గనఁబడుచున్నాఁడవని భావము.

వివరణము.—సర్వము బ్రహ్మస్వరూపమే యను సందర్భమునందు బ్రహ్మసూత్రమునందు అంశాధికరణమునందు సూ. 'అంశో నానావ్యపదేశా

దన్యథాచాపి దాశకితవాదిత్వ మధీయత ఏకే.' ౨-౩-౪ ౩. అను సూత్రశంకర భాష్యమునం దీమంత్రము ప్రమాణార్థము గైకొనఁబడినది.

౪-వ అధ్యాయము, ౪-వ మంత్రము.

అవ. తిర్యగాదిస్వరూపుఁడుకూడ పరమాత్మయే యని చెప్పఁబడుచున్నది —

మూ॥ నీలః పతంగో హరితో లోహితాక్ష
స్తటిద్గర్భ ఋతవ స్సముద్రాః,
అనాదిమత్త్వం విభుత్వేన వర్తసే
యతో జాతాని భువనానివిశ్వా   ౪

పద. నీలః పతఙ్గః హరితః లోహితాక్షః తటిద్గర్భః ఋతవః సముద్రాః, అనాదిమత్ త్వం విభుత్వేన వర్తసే యతః జాతాని భువనాని విశ్వా.   ౪

టీక. (ఓపరమేశ్వరా !) యతః = ఏనీవలన, విశ్వాభువనాని = సకలలోకములు, జాతాని = పుట్టినవో, (తతః = అందువలన) నీలః పతంగః = నల్లనితుమ్మెదయు, హరితః = పచ్చనివర్ణముగల, లోహితాక్షః = ఎఱ్ఱనికన్నులు గల చిలుకయు, తటిద్గర్భః = మెఱుపులోపల గల మేఘమున్నూ, ఋతవః = వసంతాదిఋతువులున్నూ, సముద్రాః = సముద్రములున్నూ అగుచున్నాఁడవు. త్వం = నీవు, విభుత్వేన = సర్వవ్యాపకుఁడవైయుండుటచేత, అనాదిమత్ = ఆద్యంతశూన్యుఁడవుగా, వర్తసే = ఉంటున్నాఁడవు.

తా. ఓపరమేశ్వరా ! నీవల్లనుండియే సకలలోకములు పుట్టియున్నవి కావున, నీవు సర్వాత్మకుఁడ వగుచున్నాఁడవు, అనఁగా తుమ్మెదలు, చిలుకలు

మున్నగు తిర్యగ్జంతువులు, మేఘములు, వసంతాదిఋతువులు, సముద్రములు ఇవన్నియు భగవత్స్వరూపములే. ఓపరమేశ్వరా! నీవు విభువై సర్వ వ్యాపకుఁడవగుటచేత ఆద్యంతశూన్యుఁడవని భావము.

౪-వ అధ్యాయము, ౫-వ మంత్రము.

అవ. తేజోఽబన్నాత్మకమగు ప్రకృతిని, ఛాందోగ్యోపనిషత్ప్రసిద్ధ మయినదానిని అజారూపకల్పనముగ నిరూపించుచున్నాఁడు —

మూ అజా మేకాం లోహితశుక్లకృష్ణాం
బహ్వీః ప్రజా స్సృజమానాం సరూపామ్,
అజో హ్యేకో జుషమాణోఽను శేతే
జహాత్యేనాం భుక్తభోగా మజోఽన్యః ౫

పద. అజాం ఏకాం లోహితశుక్లకృష్ణాం బహ్వీః ప్రజాః సృజమానాం సరూపాం, అజః హి ఏకః జుషమాణః అనుశేతే జహాతి ఏనాం భుక్తభోగాం అజః అన్యః. ౫

టీ. అజః=పుట్టుకలేనట్టియు, ఏకః=ఒక్కఁడయిన, అజః=విజ్ఞానాత్మ, అజాం = పుట్టుకలేనట్టియు, ఏకాం=ఒక్కటిఅయినట్టియు, లోహితశుక్ల కృష్ణాం=లోహితశుక్లకృష్ణవర్ణములుగలదియు, బహ్వీః ప్రజాః = అనేకులగు ప్రజలను, సృజమానాం = పుట్టించుచున్నదియును, సమానాం = సమాన రూపముగల ప్రకృతిని, జుషమాణః = సేవించుచున్నవాఁడై (అనాదికామ కర్మపాశపాశితుఁడయి ఆప్రకృతిని తానుగా తలంచినవాఁడయి), అనుశేతే= పొందుచున్నాఁడు. అజః=పుట్టుకలేని, అన్యః=ఇతరుఁడు, (అనఁగా సదా చార్యునిచేత ఉపదిష్టమయిన బ్రహ్మవిద్యాప్రకాశముచేత నశింపఁజేయఁబడిన

అవిద్యాంధకారముగల బ్రహ్మవేత్త, భుక్తభోగాం=అనుభవింపఁబడిన భోగము గల, ఏనాం=ఈప్రకృతిని, జహాతి = వదలుచున్నాఁడు.

తా. అవిద్యాకామకర్మపాశబద్ధుఁ డయినట్టియు, అజుఁడును-పుట్టుక లేనట్టియు జీవుఁడు, లోహితశుక్లకృష్ణయు, అనేకములయిన ప్రాణిజాతమును సృజించుచున్నదియుం, సరూపయు, పుట్టుకలేనట్టియు ఒక్కటియుం నగు ప్రకృతిని లేక ధ్యానయోగముచేత నెఱింగిన దేవాత్మశక్తిని అనుసరించుచున్నాఁడు. ఆచార్యునియొక్క సదుపదేశముచేత నివారింపఁబడిన అవిద్యాంధకారముగల అట్టిఅధికారి భుక్తభోగయగు నీప్రకృతిని వదలుచున్నాఁడు. 'లోహితశుక్లకృష్ణాం' అనుపదమునకు లోహితమనఁగా తేజస్సనియు, శుక్లమనఁగా జలమనియు, కృష్ణమనఁగా పృథివియనియు అర్థమును గ్రహించునది. ఛాందోగ్యమునందు ప్రకృతి తేజోఽబన్నాత్మకమని ప్రతిపాదింపఁబడియున్నది. లేక లోహితశబ్దముచేత రజోగుణమును, శుక్లశబ్దముచేత సత్వగుణమును, కృష్ణశబ్దముచేత తమోగుణమును గ్రహించి త్రిగుణాత్మకమగు ప్రకృతియనియు గ్రహించవచ్చును

వివరణము:—ఈమంత్రము మహానారాయణోపనిషత్తునందును, నారాయణమనఁబడు 'అంభస్యపారే' యను ప్రశ్నమునందును గలదు. బ్ర. సూ. శంకరభాష్యమునందు పలుతావుల ఈమంత్రము ప్రమాణార్థము గైకొనఁబడినది.

విజ్ఞానభగవత్, ఉపనిషద్బ్రహ్మవ్యాఖ్యలందు ఈక్రింది యవతారికతో నీమంత్రము వ్యాఖ్యాతమైనది —"ఇదానీం తేజోఽబన్నలక్షణాం ప్రకృతిం ఛాందోగ్యోపనిషదుక్తాం నిఖిలప్రపంచస్య తద్వివర్తతాం ఈశ్వరాభిన్నప్రకృతి వివర్తరూపశబ్దాదిషు విషయేష్వసంయోగాయ ఆత్మనః తస్యాః సంసారకారణతాం తన్నివృత్తేః మోక్షహేతుతాం చాహ, అజామితి" తద్వ్యాఖ్యననుసరించి అర్థము వ్రాయఁబడుచున్నది.

టీక. అజాం=పుట్టుకలేనిదియును (మూలప్రకృతియగుటచేత జన్మరహితమైనదియును), ఏకాం = (సర్వమును తానే వ్యాపించి అఖండాత్మకముగా నుండుటచేత) ఒక్కటిగానున్నదియు, లోహితశుక్లకృష్ణాం = లోహిత శుక్లకృష్ణమయినదియు, (అనఁగా లోహితమనఁగా ఎరుపు—తేజస్సు, ఆతేజస్సును సృజించి తదవస్థను పొందినదగుటచేత లోహితయు, శుక్లమనఁగా తెలుపు—జలము, ఆజలమును సృజించి తదవస్థను పొందినదగుటచే శుక్లయు, కృష్ణమనఁగా నలుపు—పృథివి, అన్నశబ్దవాచ్యము, అట్టి పృథ్విని సృజించి తదవస్థను పొందినదగుటచేత కృష్ణయు, లేక రజస్సత్వతమోగుణాత్మకయు, సరూపాః=తనతో సమానరూపముగల, బహ్వీః=అనేకములయిన, ప్రజాః=ప్రజలను, జనయంతీం=పుట్టించుచున్నదియును, అగు ప్రకృతిని, అజః=పుట్టుకలేని, ఏకః=ఒక్కఁడగుజీవుఁడు, (అవిద్యాకామకర్మపాశబద్ధుఁడు) జుషమాణః= సేవించుచున్నవాఁడయి (అనఁగా ప్రకృతిసంబంధమైన భోగములందు ప్రీతిగలవాఁడయి జలమునందు చంద్రునివలె ప్రవేశించి తద్ధర్మములను స్వధర్మములనుగా స్వీకరించి ప్రకృతిప్రాకృతుల ననుసరించి), అనుశేతే=ఉంటున్నాఁడు. అన్యః అజః=ఇతరుఁడగు పుట్టుకలేని ఆత్మ, భుక్తభోగాం=సంసారభోగముల ననుభవించు, ఏనాం=ఈప్రకృతిని, జహాతి= వదలుచున్నాఁడు.

ప్రథమమున చెప్పినవిధముగ అజ్ఞాని ప్రకృతికి వశంవదుఁడయియుండుననియు, జ్ఞానిప్రకృతి నతిక్రమించియుండుననియు ఇందుకూడ చెప్పఁబడినది.

వివరణము:—సూ. చమసవదవిశేషాత్. ౧-౪-౮ అను సూత్రము యొక్క శంకరభాష్యమునం దీమంత్రము ప్రమాణార్థము గైకొనఁబడినది.

౩-వ అధ్యాయము, ౧-వ మంత్రము.

అవ. పరమార్థవస్తునిశ్చయార్థము సూత్రభూతమగు మంత్రద్వయము చెప్పఁబడుచున్నది —

మూ. ద్వాసుపర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరిషస్వజాతే,
తయో రన్యః పిప్పలం స్వాద్వ
త్త్యనశ్నన్నన్యోఽభిచాకశీతి ౧

పద. ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే, తయోః అన్యః పిప్పలం స్వాదు అత్తి అనశ్నన్ అన్యః అభిచాకశీతి.

టీక సయుజా = ఎల్లప్పుడు కలసియుండునట్టియు, సఖాయా = సమానమయిన నామము గలట్టియు, సుపర్ణా=మంచిగమనములుగల, ద్వా = జీవేశ్వరులను ఇద్దఱుపక్షులు, సమానం వృక్షం = సమానమయిన (దేహమను) వృక్షమును, పరిషస్వజాతే = ఆలింగనముచేసికొని (ఆశ్రయించుకొని) యుంటున్నారు, తయోః = ఆజీవేశ్వరులిద్దఱిలో, అన్యః = ఒకఁడు—అనఁగా అవిద్యా కామవాసనాశ్రయ సూక్ష్మశరీరోపాధియగు విజ్ఞానాత్మ (జీవుఁడు), స్వాదు = (అజ్ఞానమువలన) రుచిగాగనంబడు, పిప్పలం = (సుఖదుఃఖలక్షణమయినట్టియు, అనేకవిచిత్రవేదనా స్వాదరూపమయిన) కర్మఫలమును, అత్తి = అనుభవించుచున్నాఁడు. అన్యః = మఱొకఁడు—అనఁగా నిత్యశుద్ధ బుద్ధ ముక్తస్వభావుఁడగు పరమేశ్వరుఁడు, అనశ్నన్ = కర్మఫలమును అనుభవించనివాఁడై, అభిచాకశీతి = సాక్షిభూతుఁడయి కేవలముగా చూచుచుండును.

తా. ఎల్లప్పుడు కలసియుండువారును, సమానమయిన నామములు-లేక అభివ్యక్తి కారణములు గలవారలును, మంచిగమనముగలవా రగుటచేత సుపర్ణశబ్దవాచ్యులును అగు జీవేశ్వరులను పక్షిద్వయము సమానమయిన దేహమను వృక్షమును ఆశ్రయించుకొనియున్నారు. ఇచట శరీరమునకు వృక్షసామ్యమును చెప్పుట ఉచ్ఛేదమను సామ్యధర్మము కలిగియుండుట చేత నని గ్రహించవలయును. ఆజీవేశ్వరులను పక్షిద్వయమునం దొకఁడగు జీవుఁడును పక్షి అవిద్యాకామవాసనాశ్రయమగు సూక్ష్మశరీరోపాధి గలవాఁడగుటచేత అజ్ఞానవశముచేత రుచిగలదానివలె తోఁచునట్టియు, అనేక విచిత్ర వేదనాస్వాదరూపమయినట్టియు కర్మఫలమును అనుభవించును. తజ్జీవ విభిన్నుఁడగు పరమేశ్వరుఁడను పక్షి మాత్రము నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వభావ మగుటచేత కర్మఫలము ననుభవింపకయే సాక్షిభూతుఁడయి చూచుచుండును.

వివరణము —ఈమంత్రము, ముండకోపనిషత్తు. 3. ముం. 3 ఖం. ౧. మం. గా గలదు. మఱియు, ఋగ్వేదము. ౧. మం. ౧౬౪ సూ. ౨౦. మం ; అథర్వవేదము. కాం ౯ ౫. ౯ న్నూగలదు. యాస్కనిరుక్తమం దున్నూ వ్యాఖ్యాతము. మేము ముండకోపనిషత్తునం దీవిషయమును విపులముగ చర్చించియున్నారము కావున నిట ఉపేక్షించితిమి.

సూ. స్మరంతిచ. ౨. 3. ౪౭ అను బ్రహ్మసూత్ర శంకరభాష్యమునం దీమంత్రము ప్రమాణార్థ ముదాహరింపఁబడినది.

## ౪-వ అధ్యాయము, ౭-వ మంత్రము.

మూ. సమానే వృక్షే పురుషో నిమగ్నో
ఽనీశయా శోచతి ముహ్యమానః,

జుష్టం యదా పశ్యత్యన్యమీశ మస్య
మహిమాన మితి వీతశోకః    ౭

పద. సమానే వృక్షే పురుషః నిమగ్నః అనీశయా శోచతి ముహ్యమానః, జుష్టం యదా పశ్యతి అన్యం ఈశం అస్య మహిమానం ఇతి వీతశోకః.    ౭

టీక. పురుషః=భోక్తయగుజీవుఁడు, సమానే=సమానమయిన, వృక్షే=శరీరమను వృక్షమునందు, నిమగ్నః=మునిఁగినవాఁడయి——అనఁగా నిశ్చయముగా దేహమే తానను అభిప్రాయమును పొందినవాఁడై, ముహ్యమానః=మోహమును పొందుచున్నవాఁడయి, శోచతి=దుఃఖించుచున్నాఁడు.యదా=ఎప్పుడు,జుష్టం=(అనేకవిధములయిన యోగ,ఉపాసనాద్యుపాయములచేత) సేవింపఁబడినవాఁడును, అన్యం=(శరీరోపాధిలక్షణుఁ డగువానికంటె) వేఱయినవాఁడును అగు, ఈశం = ఈశ్వరుని, పశ్యతి=(నేనే ఇతఁడైతినని) చూచుచున్నాఁడో, మహిమానం=జగద్రూపమయిన ఈమహిమను, అస్యఇతి=ఈ యీశ్వరునియొక్క సంబంధమయినదనియు (చూచుచున్నాఁడో, అప్పుడు), వీతశోకః=దుఃఖరహితుఁడు (అగుచున్నాఁడు).

తా. జీవేశ్వరులిద్దఱు ఈశరీరమనువృక్షమును ఆశ్రయించియున్నారు. పై యిద్దఱిలో శరీరమనువృక్షమును ఆశ్రయించియున్న కర్మఫలభోక్తయగు పురుషుఁడు అవిద్య, కామము, కర్మఫలము, రాగము మున్నగు గొప్పభారములచేత ఆక్రమింపఁబడినవాఁడై భారాక్రాంతమయిన సొరకాయ నీటియందు మునిఁగినటుల సంసారసాగరమునందు మునుఁగుచు నిశ్చయముగా దేహమేతానను దుర్బుద్ధిమనుపొందినవాఁడయి ఈదేహమే నేను నేనీదేవదత్తుని పుత్త్రుఁడను, సోమదత్తునిపౌత్త్రుఁడను, యజ్ఞదత్తుని మునిమనుమఁడను, చిక్కిపోయినాను, బలిసియుంటిని, గుణవంతుఁడను, గుణవిహీనుఁడ నయితిని,

సుఖముకలిగియుంటిని, దుఃఖముగలవాఁడనయితిని, బంధుమిత్రాదులతో సంబంధము కలిగియుంటిని, ఇప్పుడు నాబంధుమిత్రాదులు గతించుచున్నారు, నాకు దిక్కెవ్వరులేరు, నేనొక్కఁడనే అయిపోతిని, కనుక ఇఁక నేనేమి చేయఁగలను? నాపుత్త్రుఁడు గతించెను, నాభార్య చనిపోయెను, నేను బ్రతికి యుండిన కలుగఁబోవు ప్రయోజనమేమి? అని అవివేకముతో దుఃఖించు చుండును. ఇట్లనేకవిధములయిన అవిద్యాజన్యదుఃఖములచేత బహువిధములు గా పీడితుఁడయి ప్రేతతిర్యఙ్మనుష్యాదిబహువిధయోనులందు పుట్టుచు గిట్టుచు కొంతకాలమునకు జన్మాంతరకృత సుకృతకర్మపరిపాకవశముచేత విద్యాధి కారముగల మనుష్యజన్మను పొందినవాఁడై, అనేకజన్మాంతరకృత సుకృత కర్మపరిపాకవశముచేత పరమకారుణికుఁడగు సదాచార్యునియొక్క అను గ్రహమునకు పాత్రుఁడయి,అతని యనుగ్రహముచేత యోగమార్గమిట్టిదని యెఱింగినవాఁడై, అహింస, సత్య, బ్రహ్మచర్య, వైరాగ్యాదిసుగుణసంపత్తి చేత విభూషితుఁడై,శమాదిషట్కసంపన్నుఁడయి, అనేకవిధములయిన యోగ సాధనోపాయములచేతఁ దెలిసికొనఁదగినవాఁడును, అసంసారియు నగుపర మాత్మను యెప్పుడు గాంచుచున్నాఁడో అనఁగా ఆత్మ శరీరోపాధిగల జీవుని కంటె విలక్షణుఁడు, ఇతఁడు అశనాయా (ఆకలి) పిపాసా (దప్పిక) శోక, మోహ, జరా, మృత్యువిరహితుఁడు, సర్వసముఁడు, సర్వభూతాంతరస్థుఁడు, అవిద్యోపాధిజనితుఁ డగుమాయాత్మ కాజాలఁడు. జగద్రూపమయిన ఈ విభూతియంతయుం పరమేశ్వరస్వరూపుఁడగు నాయొక్క సంబంధమయినదే అని యెప్పుడు తలంచుచున్నాఁడో అప్పుడు సర్వదుఃఖవిముక్తుఁ డగు చున్నాఁడు. అనఁగా కృతార్థుఁ డగుచున్నాఁడు. ఈమంత్రముయొక్క ద్వితీ యార్థమునకు మఱొకవిధముగా అర్థము చెప్పఁబడుచున్నది.—

యదా=ఎప్పుడు, జుష్టం=యోగాద్యుపాయములచేత పొందఁదగిన, ఈశం=ఆత్మను, పశ్యతి=చూచుచున్నాఁడో, అన్యం=జీవాత్మను, అన్యమహి

మానం ఇతి = ఈ ప్రత్యగాత్మయొక్క మహిమయనియు, (చూచుచు న్నాఁడో, తదా=అప్పుడు) వీతశోకఃభవతి=దుఃఖరహితుఁ డగుచున్నాఁడు.

వివరణము. ఈమంత్రము ఋగ్వేద, అథర్వవేదములందును, ముండకోపనిషత్తునందును గలదు. చూ. వెనుకటిమంత్ర వివరణము.

సూ. ఇయదామననాత్. 3-3-34 అను బ్రహ్మసూత్రశంకర భాష్యమునం దీమంత్రము ప్రమాణార్థము గైకొనఁబడినది.

౪-వ అధ్యాయము, ౮-వ మంత్రము.

అవ. ఈ మంత్రమునందు పరమాత్మస్వరూపము నెఱింగినవారలు కృతార్థులగుచున్నారని చెప్పఁబడుచున్నది —

మూ॥ ఋచో అక్షరే పరమే వ్యోమన్
యస్మిన్దేవా అధి విశ్వే నిషేదుః,
యస్తన్న వేద కిమృచా కరిష్యతి
యఇత్తద్విదుస్త ఇమే సమాసతే ౮

పద. ఋచః అక్షరే పరమే వ్యోమన్ యస్మిన్ దేవాః అధి విశ్వే నిషేదుః, యః తం న వేద కిం ఋచా కరిష్యతి యే ఇత్ తత్ విదుః తే ఇమే సమాసతే. ౮

టీ. విశ్వేదేవాః = దేవతలందఱున్నూ, ఋచః = ఋగాది సకలవేదములును, అక్షరే = అక్షరస్వరూపుఁడును, వ్యోమన్ = ఆకాశకల్పుఁడును, (అగు) పరమే=శ్రేష్ఠుఁడయిన పరమాత్మయందు, అధినిషేదుః=ఆశ్రయించి యున్నారో, తం = అట్టిపరమాత్మను, యః = ఎవ్వఁడు? నవేద = తెలిసి కొనఁజాలఁడో, సః=వాఁడు, ఋచా=ఋగాదివేదములచేత, కిం కరిష్యతి?=

ఏమిచేయఁగలఁడు? యే=ఎవ్వరు, తత్ ఇత్ విదుః = ఆపరమాత్మ నెఱుంగుచున్నారో, తఇమే = ఆవీరలు, సమాసతే=కృతార్థులయి యుంటున్నారు.

తా. సకలదేవతలు, ఋగాది సకలవేదములు నాశవిరహితుఁడును, ఆకాశకల్పుఁడును అగు పరమాత్మయందు ఆశ్రయించియుంటున్నవి. ఇట్టిపరమాత్మ నెవ్వఁ డెఱుంగఁడో అట్టివాఁడు ఋగాదివేదములను పఠించినంత మాత్రముచేత పొందఁగల లాభమేమియు లేదు. ఎవ్వ రీయాత్మ నెఱుంగుచున్నారో వారే కృతార్థులు. తదితరులు కృతార్థులు కారు.

వివరణము —జీవేశ్వరుల కభేదమనువిషయము ప్రకారాంతరముగ తెలుపఁబడుచున్నది. అట్టిజ్ఞానమునకు కర్మోపాసనములు సాధనభూతములు. మఱియు వేదాంతశాస్త్రశ్రవణముకూడ సాధనభూతమగుచున్నది. అట్టివిషయములు వేదములందు ప్రతిపాదింపఁబడియున్నవి. బ్రహ్మవిద్యోపకారార్థము దేవతాపూజాదిక మావశ్యకము. ఇట్టివేదములు, దేవతలు పరమేశ్వరునియందుంటున్నారు కనుక అట్టియాత్మవిజ్ఞాన మీమంత్రమునందు చెప్పఁబడుచున్నదని విజ్ఞానభగవత్కృతవ్యాఖ్యయందు ఈమంత్రమునకు అవతారిక యొసంగఁబడినది. ఋగాది సర్వవేదములు అక్షరుఁడును పరముఁడును-శ్రేష్ఠుఁడును, ఆకాశశబ్దవాచ్యుఁడును - లేక అసంగత్వాదికముచేతను సర్వాంతరత్వముచేతను ఉండుటచేత ఆకాశతుల్యుఁడును అగు పరమాత్మయందుంటున్నారు. ఆపరమాత్మయందే సమష్టిభూతులయిన హిరణ్యగర్భాదిదేవతలును, తద్వ్యష్టిభూతులయిన అగ్న్యాది సర్వదేవతలును ఆశ్రయించియున్నారు. ఎవ్వరు ఋగాదివేదప్రతిపాదితములగు కర్మోపాసనాదికము ననుష్ఠించియు, తద్వేదప్రతిపాదితమును, అక్షరశబ్దవాచ్యమును అగు బ్రహ్మతత్త్వమును తెలిసికొనఁజాలరో అట్టివారికి వేదాధ్యయనాదికమువలన నేమిలాభము? ఏమియు లాభములేదని భావము. ఎవ్వరు ఋగాదివేదములందు ప్రతిపాదింపఁబడిన

కర్మోపాసనాదికము నొనర్చి శుద్ధాంతఃకరణులయి సాధనచతుష్టయసంపన్నులయి శాస్త్రమునం దుపదిష్టమయినప్రకారము తచ్ఛబ్దవాచ్యమయిన పరబ్రహ్మతత్త్వము నెఱుంగుదురో—అనఁగా అహంబ్రహ్మాస్మి యని అపరోక్షజ్ఞానమునం దెదరో ఆట్టివారు సంసారదుఃఖవిరహితులగుటచేత నిరతిశయానందస్వరూపులయి యుంటున్నారు. అని విజ్ఞాన భగవద్వ్యాఖ్య.

ఈమంత్రము ఋగ్వేదమునందును, అథర్వవేదమునందును, తైత్తిరీయ, గోపథబ్రాహ్మణములందును, తైత్తిరీయారణ్యకమునందును, నృసింహతాపిన్యుపనిషత్తులందును గలదు. యాస్కనిరుక్తమునందుకూడ వ్యాఖ్యాతమయియున్నది

ర-వ అధ్యాయము, ౯-వ మంత్రము.

అవ. వెనుకచెప్పఁబడిన యఖశ్వరుఁడే మాయోపాధివిశిష్టుఁడయి జగత్స్రష్టయనియు, జగత్కారణభూతుఁడనియు నీమంత్రమునందు ప్రతిపాదింపఁబడుచున్నది —

మూ. ఛందాంసి యజ్ఞాః క్రతవో వ్రతాని
భూతం భవ్యం యచ్చ వేదా వదంతి,
అస్మా న్మాయీ సృజతే విశ్వ మేతత్
తస్మిం శ్చాన్యో మాయయా సన్నిరుద్ధః   ౯

పద. ఛందాంసి యజ్ఞాః క్రతవః వ్రతాని భూతం భవ్యం యత్ చ వేదాః వదన్తి, అస్మాత్ మాయీ సృజతే విశ్వం ఏతత్ తస్మిన్ చ అన్యః మాయయా సన్నిరుద్ధః.   ౯

టీక. ఛందాంసి = ఋగ్యజుస్సామాథర్వణములను వేదములును, యజ్ఞాః = యజ్ఞములును, క్రతవః = క్రతువులును, వ్రతాని = చాంద్రాయ

ణాదివ్రతములను, వేదాః=వేదములు, యత్ = ఏ, భూతం భవ్యంచ = భూతభవిష్యత్ వర్తమానములను, వదంతి = చెప్పుచున్నవో (ఇదియంత యు) అస్మాత్ = ఈ అక్షరునివల్లనుండియే (పుట్టుచున్నవి). ఏతత్ విశ్వం= ఈప్రపంచమును, మాయీ = మాయోపాధిగలవాఁడై, సృజతే = సృజించుచున్నాఁడు. తస్మిన్ = అస్వనిర్మితప్రపంచమునందే, మాయయా = మాయచేత, అన్యఃచ = ఇతరునివలె, సన్నిరుద్ధః = సంబంధించి యున్నాఁడు.

తా. ఈ యక్షరునివల్లనుండియే, ఋగ్యజుస్సామాథర్వవేదములు, యజ్ఞములు, క్రతువులు, కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతములు, వేదప్రతిపాదితములగు భూతభవిష్యత్ వర్తమానములను కాలమునకు సంబంధించినదంత యు పుట్టుచున్నది. యజ్ఞములనఁగా యూపస్తంభము లేకయే నిర్వర్తింపఁబడు దేవయజ్ఞాదులు, క్రతువులనఁగా యూపసమన్వితముగఁ జేయఁబడు జ్యోతిష్టోమాది సంస్థలు. అవికారియు నిర్గుణుఁడును అగు బ్రహ్మమునుండి ప్రపంచము యెట్లు పుట్టును అను సంశయముతో స్వమాయాశక్తిసంబంధము వలన ప్రపంచస్రష్టృత్వముపపన్న మగుచున్నది. స్వమాయాకల్పితమయిన భూతాదిప్రపంచమునందు అవిద్యావశముచేత జీవుఁడు తాను ఇతరుఁడుగా భావించుకొని ప్రవేశించి సంసారసముద్రమునందు భ్రమించుచున్నాఁడు.

౪-వ అధ్యాయము, ౧౦-వ మంత్రము.

అవ. మాయయే ప్రకృతియనియు, చిదానందస్వరూపుఁ డగు బ్రహ్మము మాయాధిష్ఠితుఁ డగుటచేత మాయి యని వ్యవహరింపఁబడుచున్నాఁడనియు, చిద్రూపుఁడగు పరమేశ్వరుఁడు మాయావశముచేత కల్పితములయిన కార్యకారణ సంఘాతములచేత ఈగనంబడుచున్న ప్రపంచమునంతయు వ్యాపించియున్నాఁడనియు నీమంత్రమునందు చెప్పఁబడుచున్నది —

మూ॰ మాయాంతు ప్రకృతిం విద్యా
న్మాయినంతు మహేశ్వరమ్,
తస్యావయవ భూతైస్తు
వ్యాప్తం సర్వం మిదంజగత్. ౧౦

పద. మాయాం తు ప్రకృతిం విద్యాత్ మాయినం తు మహేశ్వరమ్,
తస్య అవయవభూతైః తు వ్యాప్తం సర్వం ఇదం జగత్. ౧౦

టీక. ప్రకృతిం=ప్రకృతిని (పూర్వగ్రంథమునందు జగత్తు ప్రకృతి
యని చెప్పఁబడియున్నది), మాయాంతు=మాయయని, విద్యాత్=తెలిసికొన
వలయును మహేశ్వరం = ఈశ్వరుని, మాయినంతు = మాయకలవానినిగ,
విద్యాత్ = తెలిసికొనవలయును. తస్య = అపరమేశ్వరునియొక్క, అవ
యవభూతైః = మాయాకల్పితములగు అవయవముల చేత, ఇదం=ఈ, సర్వం
జగత్ = జగత్తంతయు, వ్యాప్తం = నిండియున్నది.

తా. ఈ ఉపనిషత్తునందు పలుతావుల జగత్తు ప్రకృతియని వ్యవ
హరింపఁబడియున్నది. సర్పమునకు రజ్జువువలె మాయకు సత్తాప్రదుఁడగు
పరమేశ్వరుని మాయిగ—మాయగలవానినిగ నెఱుంగవలయును. రజ్జువున్నగు
అధిష్ఠానములందు కల్పితములయిన సర్పాదికమువలె పరమేశ్వరునియందు
అభాసమాత్రముగా కల్పితములయిన అవయవముల చేతనే భూరాదిప్రపం
చమంతయు వ్యాప్తమయియున్నది.

వివరణము —తదధీనత్వాదర్థవత్. ౧. ౪. 3 అను బ్రహ్మసూత్ర
మునం దీమంత్రము ప్రమాణార్థము గైకొనఁబడినది.

౪-వ అధ్యాయము, ౧౧-వ మంత్రము.

అవ. మాయాతత్కార్యాదులకు కారణభూతుఁడయిన కూటస్థునకు స్వశక్తివలన అధిష్ఠాతృత్వమున్ను, ఆకాశాదికార్యములకు ఉత్పత్తిహేతుత్వమున్ను, సర్వాధిష్ఠాతృత్వముచేత ఉపలక్షితములయిన సచ్చిదానందములే దేహముగాఁగల ఆ కూటస్థుఁడే. 'అహం బ్రహ్మాస్మి' యని దృఢైకాత్మ్యజ్ఞానమునుపొందిన ముక్తికలుగుచున్నదనియు నిందుఁ దెలుపఁబడుచున్నది —

మూ. యో యోనిం యోని మధితిష్ఠత్యేకో
యస్మిన్నిదం సంచవిచైతిసర్వమ్,
తమీశానం వరదం దేవమీడ్యం
నిచాయ్యేమాంశాన్తి మత్యన్తమేతి ౧౧

పద. యః యోనిం యోనిం అధితిష్ఠతి ఏకః యస్మిన్ ఇదం సం చ విచ ఏతి సర్వమ్, తం ఈశానం వరదం దేవం ఈడ్యం నిచాయ్య ఇమాం శాంతిం అత్యంతం ఏతి. ౧౧

టీక. ఏకః = (మాయావినిర్ముక్తుఁడగుటచేత) అద్వితీయుఁడగు, యః = (ఆనందైకఘనుఁడగు) ఏపరమేశ్వరుఁడు, యోనింయోనిం = మూలప్రకృతియు, మాయయు, అవాంతరప్రకృతులును, ఆకాశాదికములు మున్నగువానిని, అధితిష్ఠతి=(అంతర్యామిరూపమున) అధిష్ఠించియుంటున్నాఁడో, యస్మిన్ = మాయాదులకు అధిష్ఠాతయగు ఏపరమేశ్వరునియందు, ఇదం సర్వం = ఈ ప్రపంచమంతయు, సంఏతి = (ప్రళయకాలమునందు) లయమును పొందుచున్నదో, విచైతి=(మఱల సృష్టికాలమునందు) నానారూపమును పొందుచున్నదో, తం=అట్టివాఁడును—అనఁగా సర్వాధిష్ఠాతయు, ఈశానం = నియామకుఁడును, వరదం = మోక్షప్రదుఁడును, ఈడ్యం = వేదాదికముచేత కొనియాడఁదగినవాఁడును (అగు), దేవం = ప్రకాశస్వరూ

పుఁడగు పరమేశ్వరుని, నిచాయ్య = నిశ్చయముగాచూచి (అనఁగా అహం బ్రహ్మాస్మి=నేను బ్రహ్మమైతినని అపరోక్షముగా నెఱింగి, ఇమాం శాంతిం= ఈశాంతిని, అత్యంతం ఏతి=మిక్కిలి పొందుచున్నాఁడు.

తా. మాయావినిర్ముక్తుఁడును, ఆనందైకఘనుఁడును అగు పరమేశ్వరుఁడు, మూలప్రకృతి, మాయ, అవాంతరప్రకృతులు, ఆకాశాదికములు మున్నగు ప్రకృతులను సత్తాస్ఫూర్తిప్రదుఁడయి అంతర్యామిరూపమున అధిష్ఠించియుంటున్నాఁడో, ఈమాయాదికమును అధిష్ఠించియున్న ఏపరమేశ్వరునియందు ప్రళయకాలమునందు ఈగనంబడుచున్న ప్రపంచమంతయుఁ లయించిపోవుచున్నదో, మఱల సృష్టికాలమునందు వివిధరూపములతో అనఁగా ఆకాశాదిరూపములతో నానాత్వమును పొందుచున్నదో, అట్టివాఁడును—అనఁగా సర్వాధిష్ఠాతయుఁ, సర్వనియంతయుఁ, మోక్షప్రదాతయుఁ, ప్రకాశస్వరూపుఁడును అగువేదాదికముచేత కొనియాడఁబడుచున్నవాఁడును అగు పరమేశ్వరునిగాంచి అనఁగా 'బ్రహ్మోహమస్మి' యని అపరోక్షజ్ఞానమును పొందవలయును ఇట్టిజ్ఞానమును పొందుటచేత సర్వోపరమలక్షణమును, సార్వజనీనమును అగుశాంతిని పొందుచున్నాఁడు. ఇచట శాంతియనఁగా సర్వదుఃఖనివృత్తిపూర్వకముగ సుఖైకతానస్వరూపమగు ముక్తియని గ్రహించునది. గురూపదిష్టమయిన తత్త్వమస్యాది వాక్యార్థ శ్రవణజన్యమయిన తత్త్వజ్ఞానముచేత అవిద్యా తత్కార్యరూపమగు విశ్వ మాయానివృత్తి పర్యంతమయినట్టియుఁ, పునరావృత్తి రహితమయినట్టియుఁ శాంతి యెటుల కలుగునో అటుల ఏకరసుఁడగుచున్నాఁడని తాత్పర్యము.

వివరణము —అంతర్యామిరూపమున సర్వత్ర ఆత్మవ్యాపించియున్నాఁడను విషయము బృహదారణ్యకోపనిషత్తు తృతీయాధ్యాయము 2-వ బ్రాహ్మణమునందు ప్రశ్న ప్రతివచనపూర్వకముగ, విపులముగ చెప్పఁబడియున్నది —

......యాజ్ఞవల్క్య అంతర్యామిణం బ్రూహీతి. ౨

యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యా అన్తరో యం పృథివీ నవేద యస్య పృథివీ శరీరం యః పృథివీ మంతరో యమయత్యేషత ఆత్మాఽన్తర్యామ్యమృతః. 3

యోఽప్సుతిష్ఠన్నద్భ్యోఽంతరో యమాపో నవిదుః...ఆత్మాన్తర్యామ్యమృతః. ౪

యోఽగ్నౌతిష్ఠన్నగ్నేరంతరో ,, ౫

యోఽంతరిక్షేతిష్ఠన్నన్తరిక్షాదంతరో ... ,, ౬

యోవాయౌతిష్ఠన్వాయోరంతరో ,, ౭

యోదివితిష్ఠన్దివోఽంతరో ,, ౮

యఆదిత్యేతిష్ఠన్నాదిత్యాదంతరో . ,, ౯

యోదిక్షుతిష్ఠన్దిగ్భ్యోఽంతరో .. ,, ౧౦

యశ్చంద్రతారకేతిష్ఠన్చంద్రతారకాదంతరో ,, ౧౧

య ఆకాశేతిష్ఠన్నాకాశాదంతరో .. ,, ౧౨

య స్తమసితిష్ఠన్తమసోఽంతరో ,, ౧౩

య స్తేజసితిష్ఠన్ తేజసోఽంతరో ... ,, ౧౪

యస్సర్వేషు భూతేషు తిష్ఠన్ . ,, ౧౫

యః ప్రాణేతిష్ఠన్ ప్రాణాదంతరో . ,, ౧౬

యోవాచితిష్ఠన్వాచోఽంతరః ... ,, ౧౭

యశ్చక్షుషితిష్ఠన్ చక్షుషోఽంతరః ... ,, ౧౮

యశ్శ్రోత్రేతిష్ఠన్ శ్రోత్రాదంతరః . ,, ౧౯

యోమనసితిష్ఠన్ మనసోఽంతరః . ,, ౨౦

య స్త్వచితిష్ఠన్ త్వచోఽంతరః ... ,, ౨౧

యోవిజ్ఞానేతిష్ఠన్ విజ్ఞానాదంతరః ... ,, ౨౨

యోరేతసితిష్ఠన్ రేతసోఽంతరః .. .ఆత్మాంతర్యామ్యమృతో ఽదృష్టోద్రష్టా

అశ్రుతః శ్రోతా ఽమతో మంతా ఽవిజ్ఞాతో విజ్ఞాతా నాన్యోఽతోఽస్తి ద్రష్టా నాన్యోఽతోఽస్తి శ్రోతా నాన్యోఽతోఽస్తి మంతా నాన్యోఽతోఽస్తి విజ్ఞాతైషత ఆత్మాఽన్తర్యామ్యమృతో ఽతోఽన్యదార్తంతతో హోద్దాలక ఆరుణి రుపరరామ.

గ్రంథవిస్తరభీతిచేత దీని తాత్పర్యము నిచట వ్రాయలేదు. మేము ప్రకటింపఁబోవు బృహదారణ్యకోపనిషద్వివరణమునందు గాంచునది.

౪-వ అధ్యాయము, ౧౨-వ మంత్రము.

అవ. హిరణ్యగర్భుని నిరంతరముగ అభిముఖముగ గాంచుచున్న పరమేశ్వరుని అఖండితతత్త్వజ్ఞానసిద్ధికయి ప్రార్థించుచున్నాఁడు.—

యో దేవానాం ప్రభవశ్చోద్భవశ్చ
విశ్వాధిపో రుద్రో మహర్షిః,
హిరణ్యగర్భం పశ్యత జాయమానం
స నో బుద్ధ్యా శుభయా సంయునక్తు. ౧౨

పద. యః దేవానాం ప్రభవః చ ఉద్భవః చ విశ్వాధిపః రుద్రః మహర్షిః, హిరణ్యగర్భం పశ్యత జాయమానం సః నః బుద్ధ్యా శుభయా సంయునక్తు. ౧౨

టీక. యః=ఏదేవుఁడు, దేవానాం = దేవతలకు, ప్రభవః = జన్మమునకు కారణభూతుఁడును, ఉద్భవః చ = విభూతియోగకారణుఁడును (అగుచున్నాఁడో), యః రుద్రః = ఏరుద్రుఁడు, విశ్వాధిపః = ప్రపంచమునకు పరిపాలకుఁ డగుచున్నాఁడో, మహర్షిః = మహర్షి-అనఁగా సర్వజ్ఞుఁ డగుచున్నాఁడో, (ఏరుద్రుఁడు,) హిరణ్యగర్భం = హిరణ్యగర్భుని, జాయ

మానం = పుట్టినవానినిగా, పశ్యతి = చూచెనో, సః=ఆరుద్రుఁడు, నః = మమ్ములను, శుభయాబుద్ధ్యా=మంచిబుద్ధితో, సంయునక్తు = చేర్చుఁగాక.

తా. ఏరుద్రుఁడు ఇంద్రాది సకలదేవతలకు ఆదికారణభూతుఁడో, ఆయింద్రాది సకలదేవతలకుఁ గల తత్తదైశ్వర్యాదికమంతయు ఎవని యొక్క అనుగ్రహమువలన కలుగుచున్నదో, ఎవ్వఁ డీప్రపంచమునకు పరిపాలకుఁడో, ఎవ్వఁడు సర్వజ్ఞుఁడో, ఎవ్వఁడు సృష్ట్యారంభసమయమునందు హిరణ్యగర్భుని సృజించెనో అట్టిపరమేశ్వరుఁడు మమ్ములను మంచిబుద్ధితో చేర్చుఁగాక. అనఁగా మాకు మంచిబుద్ధిని కలుగఁజేయుఁగాక.

హిరణ్యగర్భపదవ్యుత్పత్తి — 'హితం అతిరమణీయం అత్యుజ్జ్వలం జ్ఞానం, గర్భః=అంతస్సారః యస్యతం, హిరణ్యగర్భమ్.' అనఁగా హితమయినట్టియు, అత్యుజ్జ్వలమయినట్టియు జ్ఞానముఁగలవాఁడు.

వివరణము —ఈమంత్ర మిదివఱకు 3-వ అధ్యాయమునందు ౪-వ మంత్రముగా చెప్పఁబడినప్పటికిన్ని ఈశ్వరానుగ్రహసంపాదనార్థము స్తుతిరూపమగుటచేత మఱల నిట పఠింపఁబడినది. 3-వ పాదమునందుమాత్రము, "హిరణ్యగర్భం జనయామాస పూర్వం" అని 3-వ అధ్యాయమునందు పాఠము.

"విశ్వాధిపో దేవో మహర్షిః" అని రెండవపాదమునందు పాఠాంతరము గలదు.

౪-వ అధ్యాయము, ౧3-వ మంత్రము.

అవ. బ్రహ్మాదిసకలదేవతలకు ప్రభువైనట్టియు, ఆకాశాదిలోకములకు ఆశ్రయభూతుఁడైనట్టియు, ప్రమాత్రాదులకు నియంతయైనట్టియు పరమేశ్వరుని ముముక్షువగువాఁడు బుద్ధిశుద్ధిద్వారా సమ్యక్ జ్ఞానము సిద్ధించుటకొఱకు ప్రార్థించవలయుననని యీ మంత్రమునందు చెప్పఁబడుచున్నది.—

మూ॥ యో॥ దేవానా మధిపో
యస్మి౯ ల్లోకా అధిశ్రితాః,
య ఈశే ఽస్య ద్విపద శ్చతుష్పదః
కస్మై దేవాయ హవిషా విధేమ ౧౩

పద. యః దేవానాం అధిపః యస్మి౯ లోకాః అధిశ్రితాః, యః ఈశే అస్య ద్విపదః చతుష్పదః కస్మై దేవాయ హవిషా విధేమ. ౧౩

టీ. యః = ఏపరమేశ్వరుఁడు, దేవానాం = బ్రహ్మాదిదేవతలకు, అధిపః = అధిపతియో, యస్మి౯ = సర్వకారణభూతుఁడగు ఏపరమేశ్వరునియందు, లోకాః = భూరాదిలోకములు, అధిశ్రితాః = అధిష్ఠింపఁబడియున్నవో, యః = ఏపరమేశ్వరుఁడు, అస్య = ఈ, ద్విపదః=మనుష్యాదులకున్నూ, చతుష్పదఃచ = పశ్వాదులకున్నూ, ఈశే = నియామకుఁడుగానుంటున్నాఁడో, (అట్టి) కస్మై = ఆనందస్వరూపుఁడును, దేవాయ=ప్రకాశస్వరూపుఁడును అగు పరమేశ్వరునికొఱకు, హవిషా=చరుపురోడాశాదిద్రవ్యములతో, విధేమ = పరిచర్యను చేయుచున్నారము.

తా. పరమేశ్వరుఁడు బ్రహ్మేంద్రాది సకలదేవతలకు అధిపతియైయున్నాఁడో, సర్వకారణభూతుఁడగు ఏపరమేశ్వరునియందు భూరాది సకలలోకములు ఆశ్రితములయియున్నవో, ఏపరమేశ్వరుఁడు, మనుష్యాదులగు ద్విపాత్తులను, చతుష్పాత్తులగు పశ్వాదులను నియమించుసామర్థ్యము కలిగి నియమించుచున్నాఁడో, అట్టివాఁడును, ఆనందరూపుఁడును ప్రకాశస్వరూపుఁడును అగు పరమేశ్వరుని చరుపురోడాశాదిద్రవ్యములతో సేవించుచున్నారము.

వివరణము:—'ఈష్టే'అనుటకు, 'ఈశే' అనుటయు,'కాయ' అనుట 'కస్మై' అని 'స్మై' భావమువచ్చుటయు ఛాందసము.

౪-వ అధ్యాయము, ౧౪-వ మంత్రము.

అవ. పరమాత్మతత్త్వము అతిసూక్ష్మమయినదనియు, అయ్యది జగచ్చక్రమునందు సాక్షిగానున్నదనియు,అయ్యదియే సకలజగత్స్రష్టయనియు, సర్వాత్మకమనియు, అట్టి తత్త్వముతో తాదాత్మ్యభావమును పొందినవారలకే ముక్తియనియు ఇదివఱకు పలుతావుల ప్రతిపాదింపఁబడియున్నను సులభముగా బుద్ధిచేత గ్రహింపఁబడుటకుఁగాను మఱలఁ జెప్పఁబడుచున్నది -

మూ సూక్ష్మాతిసూక్ష్మం కలిలస్య మధ్యే
విశ్వస్య స్రష్టార మనేకరూపమ్,
విశ్వస్యైకం పరివేష్టితారం
జ్ఞాత్వాశివం శాన్తి మత్యన్త మేతి ౧౪

పద. సూక్ష్మాతిసూక్ష్మం కలిలస్య మధ్యే విశ్వస్య స్రష్టారం అనేకరూపం, విశ్వస్య ఏకం పరివేష్టితారం జ్ఞాత్వా శివం శాన్తం అత్యన్తం ఏతి.

టీక. కలిలస్య = అవిద్యా తత్కార్యరూపమయిన గహనమయిన సంసారదుర్గముయొక్క, మధ్యే=మధ్యమునందు, సూక్ష్మాతిసూక్ష్మం=(పృథివ్యాద్యవ్యాకృతాంతము ఉత్తరోత్తరముగ ఒక్కదానికంటె మఱొక్కటి సూక్ష్మమయినదగుటచేత) అతిసూక్ష్మముగా నున్నవాఁడును, విశ్వస్య = ప్రపంచముయొక్క, స్రష్టారం = సృష్టికర్తయైనవాఁడును, అనేకరూపం = అనేకరూపములుగలవాఁడును, విశ్వస్య = ప్రపంచముయొక్క, పరివేష్టితారం = చుట్టుకొనియుండువాఁడును, ఏకం=అద్వితీయుఁడును, (అగు) శివం=మంగళకరుఁడగు పరమేశ్వరుని, జ్ఞాత్వా = తెలిసికొని, అత్యంతం శాంతిం=అత్యంతమయినశాంతిని—అనఁగా మోక్షమును, ఏతి = పొందుచున్నాఁడు.

తా. పృథివ్యాద్య వ్యాకృతాంతమువఱకుఁ గలపదార్థజాతము ఒకొ్కక దానికంటె మఱొక్కటి సూక్ష్మమయినదగుటచేత వీనికన్నిఁటికంటె పరమాత్మ అతిసూక్ష్మమయినవాఁ డగుటచేత సూక్ష్మాతిసూక్ష్ముఁ డనంబడుచున్నాఁడు. ప్రపంచమునకు సృష్టికర్తయు, అనేకరూపములతో గనంబడుచున్నవాఁడును, ప్రపంచమునందంతట వ్యాపించియున్నవాఁడును అగు పరమేశ్వరు నెఱింగిన వానికి ఆత్యంతికమయిన శాంతి—అనఁగా మోక్షము లభించును.

వివరణము —'సూక్ష్మాతిసూక్ష్మ' శబ్దమీవిధముగ విజ్ఞానభగవద్వ్యాఖ్యయందు వ్యాఖ్యాతమయినది. భూతానిసూక్ష్మాణి, తేష్వపి ఉత్తరోత్తరాత్పూర్వం పూర్వం సూక్ష్మం, తేభ్యస్తన్మాత్రాణిసూక్ష్మాణి, తేష్వప్యుత్తరోత్తరాత్పూర్వం పూర్వం సూక్ష్మం, తేభ్యోమహచ్ఛబ్దవాచ్యమీక్షణంసూక్ష్మం, తస్మాదపిప్రకృతిః సూక్ష్మా, ప్రకృతేరపి స్వప్రకాశచిదేకరసవపురీశ్వరః సూక్ష్మఇతి సూక్ష్మాతిసూక్ష్మమ్, బ్రహ్మాండపురాణమునందు 'కేశకోట్యంశైకభాగసూక్ష్మం బ్రహ్మసుఖాత్మకమ్' అని చెప్పఁబడియున్నది.

ఈ మంత్రము ఈ యుపనిషత్తుయొక్క 3-వ అధ్యాయమునందు కొలదిమార్పుతో నిట్లుగలదు —

మం. తతః పరంబ్రహ్మపరంబృహన్తం
యథానికాయం సర్వభూతేషు గూఢమ్,
విశ్వస్యైకం పరివేష్టితార
మీశంతం జ్ఞాత్వాఽమృతాభవంతి. 2

౪-వ అధ్యాయము, ౧౫-వ మంత్రము.

అవ. పరమాత్మ సాక్షిరూపమున నున్నాఁడనియు, సనకాదిమహర్షులచేతను, హిరణ్యగర్భాది అధికారపురుషులచేతను పొందఁదగియున్నాఁ

డనియు, సాధన చతుష్టయసంపన్నులగు అస్మదాదిసాధకులు ఆపరమాత్మను పొందుదురనియు నీమంత్రమునందు తెలుపఁబడుచున్నది —

మూ. స ఏవకాలే భువనస్యాస్యగోప్తా
విశ్వాధిప స్సర్వభూతేషు గూఢః,
యస్మిన్ యుక్తా బ్రహ్మఋషయో దేవతాశ్చ
తమేవం జ్ఞాత్వా మృత్యుపాశాం శ్ఛినత్తి ౧౫

పద. స ఏవ కాలే భువనస్య అస్య గోప్తా విశ్వాధిపః సర్వభూతేషు గూఢః, యస్మిన్ యుక్తాః బ్రహ్మఋషయః దేవతాః చ తం ఏవం జ్ఞాత్వా మృత్యుపాశాన్ ఛినత్తి. ౧౫

టీక. యస్మిన్ = చిదానందస్వరూపుఁడగు ఏపరమాత్మయందు, బ్రహ్మఋషయః=సనకాది బ్రహ్మర్షులున్నూ, దేవతాశ్చ = బ్రహ్మాదిదేవతలున్నూ, యుక్తాః = ఐక్యమును పొందియున్నారో, సః ఏవ = ఆపరమాత్మయే, కాలే = (గతించినకల్పములందు ఆయాజీవులు సంచితమొనర్చుకొనియున్న సుకృతదుష్కృతకర్మముయొక్క పరిపాక) సమయమునందు, గోప్తా = (తత్తత్కర్మానుగుణముగ, రక్షకుఁడౌను, విశ్వాధిపః = ప్రపంచమునకు ప్రభువును (అగుచున్నాఁడు), సర్వభూతేషు = (బ్రహ్మాదిస్తంబపర్యంతము లయిన) సకలప్రాణులందు, గూఢః = సాక్షిమాత్రుఁడుగా గూఢముగ నుంటున్నాఁడు. ఏవం = ఈప్రకారము, తం = ఆ ఈశ్వరుని, జ్ఞాత్వా = (బ్రహ్మాహమస్మి యని అపరోక్షముగ) తెలిసికొని, మృత్యుపాశాన్ =మృత్యువుయొక్క పాశములను, ఛినత్తి = తెగనరుకుచున్నాఁడు.

తా. సనకాది బ్రహ్మర్షులున్నూ, బ్రహ్మాదిదేవతలున్నూ చిదానంద స్వరూపుఁడగు ఏపరమాత్మయందు ఐక్యమును పొందియుంటున్నారో, అట్టి

పరమాత్మయే ఆయాగతించినకల్పములందు ఆయాప్రాణులచేత సలుపఁ బడిన పుణ్యపాపకర్మల ననుసరించి తత్తత్కర్మపరిపాక కాలమునందు తత్తత్కర్మానుగుణముగ ఆయా ప్రాణుల సృజించి వారిని సంరక్షించుచున్నాఁడు. ఆపరమాత్మయే జగత్తునకు ప్రభువు. బ్రహ్మాదిస్థావరపర్యంతము లగు సకల ప్రాణులందు సాక్షిరూపుఁడయి గూఢముగా నుంటున్నాఁడు. అట్టి ఈశ్వరునే "బ్రహ్మాహమస్మి" యని అపరోక్షముగ గ్రహించినవాఁడు అవిద్యా, కామక్రోధాదిరూపములగు మృత్యుపాశముల నన్నిటిని నశింపఁ జేసి కొనుచున్నాఁడు. "మృత్యురై వ తమః" అని శ్రుతియుండుటచేత అవిద్యాతత్కార్యరూప మగు అజ్ఞానప్రపంచమును ప్రకాశస్వరూపమగు జ్ఞానాగ్ని చేత దహించుచున్నాఁడని భావము.

౪-వ అధ్యాయము, ౧౬-వ మంత్రము.

అవ. పరమాత్మ అత్యంతము సూక్ష్మమయినవాఁ డనియుం, ఆనందాతిశయస్వరూపుఁ డనియుం, దోషవిరహితుఁ డనియు, ఆయాప్రాణులందు అతిసూక్ష్మస్వరూపముననుండియున్నాఁ డనియు, అంతటికిన్ని సత్తాప్రదుఁ డగుటచేత వ్యాపిత్వముగలవాఁడనియుం, తదేకత్వవిజ్ఞానమువలన - అది యొక్కటే యని తెలిసికొనుటవలన పాశచ్ఛేదము కలుగుననియు నిరూపింపఁ బడుచున్నది —

మూ॥ ఘృతాత్పరం మణ్డమివాతిసూక్ష్మం
జ్ఞాత్వా శివం సర్వభూతేషు గూఢమ్,
విశ్వస్యైకం పరివేష్టితారం
జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః. ౧౬

పద. ఘృతాత్ పరం మణ్డం ఇవ అతి సూక్ష్మం జ్ఞాత్వా శివం సర్వభూతేషు గూఢమ్, విశ్వస్య ఏకం పరివేష్టితారం జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః. ౧౬

టీక. ఘృతాత్ = నేతికంటె, పరం=శ్రేష్ఠమయిన, అతిసూక్ష్మం= మిక్కిలి సూక్ష్మమయిన, మండంఇవ=మీగడవలె, సర్వభూతేషు=సర్వప్రాణులందు, గూఢం=రహస్యముగానున్న, శివం=పరమేశ్వరుని, జ్ఞాత్వా=తెలిసికొని, విశ్వస్య=ప్రపంచముయొక్క, పరివేష్టితారం = చుట్టుకొనియున్న, ఏకందేవం = ఒక్కఁడయినదేవుని, జ్ఞాత్వా=తెలిసికొని, సర్వ పాశైః=సర్వపాశములచేత, ముచ్యతే = వదలఁబడుచున్నాఁడు.

తా. నేతియొక్క పయిభాగమునందున్న సారమగుమండము నేతికంటె అతిశయమయినరుచి కలిగియుండుటచేత ఏవిధముగా ప్రీతికి పాత్రమగుచున్నదో అదేవిధముగా నిరతిశయానందప్రదుఁడగుటచేత పరమాత్మ పరమప్రీతిపాత్రుఁడను విషయము నెఱింగి, అతఁడు బ్రహ్మాదిస్తంబపర్యంతముగల ప్రాణిసమూహమునందు కర్మఫలభోగసాక్షిగా ఉన్నప్పటికిన్నీ వారిచేత తిరస్కృతమయిన ఈశ్వరభావముతో చూడఁబడుచున్నవాఁడును, ప్రపంచమునంతయు వ్యాపించియున్నవాఁడును అగు పరమేశ్వరు నెఱింగిన వానియొక్క మృత్యుపాశములు నశించుచున్నవి. ఇటుల బ్రహ్మస్వరూపము నెఱింగినవానికి మరణభయము లేదని భావము.

వివరణము:—— ఈ మంత్రముయొక్క ఉత్తరార్థమున్ను, ఈ యధ్యాయమునందున్న ౧౪-వ మంత్రముయొక్క ఉత్తరార్థమున్ను చాలవరకు ఒకేవిధముగఁ గలదు.

౪-వ అధ్యాయము, ౧౭-వ మంత్రము.

అవ. భేదవిరహితుఁడును, ఆనందైకతానస్వరూపుఁడును అగు పరమాత్మ విశ్వమునకు కర్తయనియు, ప్రపంచమునందు వ్యాపించియున్నాఁడనియు, సాధనచతుష్టయసంపత్తిగల సన్న్యాసులు ఆబ్రహ్మమును పొందుదురనియు తెలుపఁబడుచున్నది.——

మూ॥ ఏష దేవో విశ్వకర్మా మహాత్మా
సదా జనానాం హృదయే సన్నివిష్టః,
హృదా మనీషా మనసా ఽభిక్లృప్తో
య ఏత ద్విదు రమృతా స్తే భవంతి ౧౭

పద. ఏషః దేవః విశ్వకర్మా మహాత్మా సదా జనానాం హృదయే సన్నివిష్టః, హృదా మనీషా మనసా అభిక్లృప్తః యే ఏతత్ విదుః అమృతాః తే భవంతి. ౧౭

టీక. ఏషః=ఈ, దేవః = ద్యోతనాత్మకుఁడగు పరమేశ్వరుఁడు, విశ్వకర్మా=(మాయాలేశమువలన) ప్రపంచస్వరూపమయిన కార్యమును చేయుచున్నాఁడు. మహాత్మా = సర్వవ్యాపియు, సదా=ఎల్లప్పుడు, జనానాం = జనులయొక్క, హృదయే=హృదయమునందు, సన్నివిష్టః=ప్రవేశించియున్నవాఁడు, హృదా=('ఇది కాదు, ఇది కాదు' అని నిషేధోపదేశముచేత సర్వమును) నిషేధించుటచేతను, మనీషా =('ఇదిపురుషార్థము, ఇది పురుషార్థము కాదు. ఇతఁడు విజ్ఞానాత్మ, ఇతఁడు విజ్ఞానాత్మ కాదు.' అను) వివేకబుద్ధి చేతను, మనసా = విచారసాధ్యమయిన ఏకత్వజ్ఞానముచేతను, అభిక్లృప్తః = ప్రకాశింపఁజేయఁబడుచున్నాఁడు. యే=(సాధనచతుష్టయసంపన్నులయిన)యే ముముక్షువులు, ఏతత్ =ఈ బ్రహ్మమును, విదుః= (తత్త్వమస్యాదిమహావాక్యప్రతిపాదితమయినదనియు, ఏకరూపమయినదనియు, అఖండైకరసమయినదనియు) తెలిసికొనుచున్నారో, తే = వారు, అమృతాః = మరణధర్మము లేనివారలు, భవంతి=అగుచున్నారు.

తా. ద్యోతనాత్మకుఁడు—అనఁగా ప్రకాశస్వరూపుఁడగు నీపరమాత్మయే మాయాలేశముచేత ప్రపంచరూపమయిన కార్యము నొనర్చుచున్నాఁడు. కావున విశ్వకర్మ యనంబడుచున్నాఁడు. ఇతఁడే మహాత్ముఁడు.

అనఁగా సర్వవ్యాపి. మఱియు ఎల్లప్పుడు సర్వప్రాణుల హృదయాకాశము లందు జలాద్యుపాధులందు సూర్యప్రతిబింబమువలె ప్రవేశించియుంటు న్నాఁడు. ఈపరమాత్మయే సాక్షిరూపముతో 'ఇది కాదు, ఇది కాదు' అని నిషేధోపదేశముచేత సర్వమును నిషేధించుటచేతను, 'ఎయ్యది పురుషార్థము, ఎయ్యది పురుషార్థము కాదు. ఎయ్యది ఆత్మ, ఎయ్యది అనాత్మ' అను వివేక బుద్ధిచేతను, మనస్సు—అనఁగా విచారసాధ్యమయిన ఏకత్వజ్ఞానముచేతను ప్రకాశింపఁబడినవాఁడయి—అనఁగా అఖండైకరసస్వరూపుఁడుగ తెలియఁబడు చున్నాఁడు. సాధనచతుష్టయ సంపన్నులయిన సన్న్యాసులయిన యే బ్రహ్మ వేత్తలు ఈయాత్మతత్త్వమును తత్త్వమస్యాదిమహావాక్యప్రతిపాద్యమయిన ఏకరూపునిగను, అఖండైకరసునిగను తెలిసికొందురో- "బ్రహ్మాహమస్మి" యని అపరోక్షముగ నెఱుంగుదురో అట్టిజ్ఞానులు అమృతులు - అనఁగా అమరణధర్ము లగుచున్నారు. పునరావృత్తి వారికిలేదు.

వివరణము —ఈమంత్రము కొంచెము భేదముతో ఈయుపనిషత్తు 3-వ అధ్యాయమునందు ౧3-వ మంత్రముగ నిట్లు చెప్పఁబడినది —

మం. అంగుష్ఠమాత్రః పురుషోఽంతరాత్మా
సదా జనానాం హృదయే సన్నివిష్టః,
హృదా మనీషా మనసాఽభిక్లృప్తో
య ఏత ద్విదు రమృతా స్తే భవంతి. ౧3

౪-వ అధ్యాయము, ౧౮-వ మంత్రము.

అప. కాలత్రయమునందును, ముక్తియందును, ప్రళయాదికము నందును, పరమాత్మ కూటస్థుఁడను నిశ్చయజ్ఞానమువలన జాగ్రత్స్వప్నముల యందును, భ్రాంతిచేత సద్వితీయునివలె అవభాసించుచున్నాఁడు. కాని వాస్త

వముగాఁ జూచిన ఎల్లప్పుడు భేదవిరహితుఁడే యనువిషయము నిరూపింపఁ బడుచున్నది —

మూ॥ యదా౽తమ స్తన్న దివా న రాత్రి
ర్న స న్న చాసం చ్ఛివ ఏవ కేవలః,
త దక్షరం తత్సవితు ర్వ రేణ్యం
ప్రజ్ఞా చ తస్మా త్ప్రసృతా పురాణీ. ౧౮

పద. యదా అతమః తత్ న దివా న రాత్రిః న సత్ న చ అసత్ శివః ఏవ కేవలః, తత్ అక్షరం తత్ సవితుః వరేణ్యం ప్రజ్ఞా చ తస్మాత్ ప్రసృతా పురాణీ. ౧౮

టీక. యదా = ఏసమయమునందు, అతమః = అవిద్యాంధకారము నశించుటచేత ప్రకాశస్వరూపమయిన తత్త్వస్ఫురణము (యెప్పుడుగలదో), తదా=ఆసమయమునందు,నదివా=పగలులేదు,నరాత్రిః=రాత్రి లేదు, సత్ న= సద్రూపములేదు, అసత్ నచ = అసద్రూపమున్నూలేదు, కేవలః=అవిద్యా వికల్పశూన్యుఁడయిన, శివఃఏవ=శుద్ధస్వభావుఁడైనశివుఁడే (కలఁడు). తత్ = శుద్ధస్వభావమయిన ఆత్మ తత్త్వము, అక్షరం=నాశములేనిది-నిత్యము, తత్ =ఆ తత్త్వము, సవితుః=సూర్యమండలాభిమానికిన్నీ, వరేణ్యం = పొందఁదగినది. తస్మాత్ = శుద్ధస్వభావమయిన హేతువువలన, ప్రజ్ఞా=(గురూపదేశలభ్య మయిన - తత్త్వమస్యాదిమహావాక్యశ్రవణమనననిదిధ్యాసాది లభ్యమయిన) వివేకబుద్ధి, ప్రసృతా = (నిత్యానిత్యవస్తువివేకముగల బ్రహ్మవేత్తలందు) వ్యాప్తమయినది. పురాణీచ=(ఆప్రజ్ఞ బ్రహ్మమొదలుకొని సాధకునివఱకు) పరంపరగా ప్రాప్తమయినది. ౧౮

తా. ఏయవస్థయందు తత్త్వమస్యాదిమహావాక్యశ్రవణ మనన నిది ధ్యాసాది జన్యమయిన దీపస్థానీయమయిన జ్ఞానప్రకాశముచేత అవిద్యా

తత్కార్యరూపమయిన అంధకారము నశించునో అట్టికాలమునందు రాత్రి యనిగాని, పగలు అనిగాని విభేదమేలేదు. అదేవిధముగ సత్స్వరూపము, అసత్స్వరూపము అను విభేదము కూడలేదు. అట్లయినయెడల కేవలము శూన్యమేయని చెప్పునెడల అప్పుడు బౌద్ధమతమగునుగదా యని ఆశంకించి శూన్యము కాదనియు శుద్ధస్వభావముగలశివుఁడుగా అవశేషించియున్నాఁడు. అని తెలుపఁబడినది. కేవలము— అనఁగా అవిద్యావికల్పశూన్యమయిన శుద్ధస్వభావుఁడని విశేషింపఁబడినది. ఆతత్త్వము అక్షరము—అనఁగా నాశ రహితము, సూర్యమండలాభిమానియగు ఆదిత్యునకుకూడ సేవించఁదగినది. అందువలనఁ బ్రాచీనమయినట్టి - బ్రహ్మాదిపరంపరగా ప్రాప్తమయినట్టి వివేక బుద్ధి నిత్యానిత్యవస్తువివేకజ్ఞానముగల బ్రహ్మవేత్తలందు వ్యాప్తమయి యున్నది.

౪-వ అధ్యాయము, ౧౯-వ మంత్రము.

అవ. కూటస్థస్వరూపమగు బ్రహ్మమును ఊర్ధ్వాదిదిక్కులందు ఎవ్వరును గ్రహింపఁజాలరనియు, అద్వితీయ మగుటచేత దేనిచేతను సామ్యము లేదనియు, కాలదిగాదులచేత వేరుపరుపఁబడని యశోరూపము గలదనియు చెప్పఁబడుచున్నది —

మూ నైన మూర్ధ్వం న తిర్యఞ్చం న మధ్యే పరిజగ్రభత్,
న తస్య ప్రతిమా అస్తి యస్య నామ మహద్యశః

పద. న ఏనం ఊర్ధ్వం న తిర్యఞ్చం న మధ్యే పరిజగ్రభత్, న తస్య ప్రతిమా అస్తి యస్య నామ మహత్ యశః. ౧౯

టీక. ఏనం = ఈపరమాత్మను, ఊర్ధ్వం=పైదిక్కునందు, నపరిజగ్రభత్ =గ్రహించుటకు శక్యముకాదు. తిర్యంచం=అడ్డముగా, నపరిజగ్రభత్ =

గ్రహించుటకు శక్యముకాదు. మధ్యే=మధ్యభాగమునందు, నపరిజగ్రభత్= గ్రహించుటకు శక్యముకాదు. యస్య = ఏపరమేశ్వరునియొక్క, నామ= పేరు, మహత్ యశః = గొప్పకీర్తికలదో, తస్య=ఆపరమాత్మకు, ప్రతిమా= సామ్యము, న అస్తి=లేదు.

తా. ఈపరమాత్మ అపరిచ్ఛిన్నరూపుఁ డగుటవలనను, నిరంశుఁడగుటవలనను, నిరవయవుఁడగుటవల్లనున్నూ, ఊర్ధ్వాదిదిక్కులందుగాని, తిర్యగ్దిక్కులందుగాని ఎవ్వఁడున్నూ గ్రహింపఁజాలఁడు. ఈపరమేశ్వరుఁడు అఖండసుఖానుభవరూపుఁడగుటచేతను, అద్వితీయుఁడగుటచేతను ఇతనియొక్క కీర్తి దిగాదులకు అనవచ్ఛిన్నమయి వెలయుచుండుటచేతను,ఇతనితో పోల్చఁదగినవాఁడు మఱొకఁడు లేడని భావము.

వివరణము —ఈమంత్రము బ్ర. సూ. న చ కార్యే ప్రతిపత్త్యభిసంధిః. ४-3-౧४ అను బ్రహ్మసూత్రభాష్యమునందు శంకరాచార్యులవారిచేత ఉదాహరింపఁబడినది.

४-వ అధ్యాయము, ౨౦-వ మంత్రము.

అవ. పరమేశ్వరుఁడు ఇంద్రియాదులకు విషయుఁడు కాఁడనియు, ప్రత్యగ్రూపుఁడనియు, తదైక్యజ్ఞానముచేత మోక్షమనియు తెలుపఁబడుచున్నది —

మూ॥ న సన్దృశే తిష్ఠతి రూప మస్య<br>
న చక్షుషా పశ్యతి కశ్చ నైనమ్,<br>
హృదా హృదిస్థం మనసా య ఏన<br>
మేవం విదు రమృతా స్తే భవంతి ౨౦

పద. న సందృశే తిష్ఠతి రూపం అస్య న చక్షుషా పశ్యతి కః చ న ఏనమ్, హృదా హృదిస్థం మనసా యే ఏనం ఏవం విదుః అమృతాః తే భవంతి. ౨౦

టీక. అస్య = ఈపరమేశ్వరునియొక్క, రూపం = స్వరూపము, (అనఁగా రూపాదిరహితమును నిర్విశేషమును అగు స్వప్రకాశాఖండ సుఖానుభవము) సందృశే=చక్షురాదీంద్రియములచే గ్రహింపఁదగిన ప్రదేశమునందు, నతిష్ఠతి=ఉండఁజాలదు. కశ్చన=ఒకఁడున్నూ, ఏనం=ఈపరమాత్మను, చక్షుషా=నేత్రముచేత, నపశ్యతి=చూడఁజాలఁడు. యే=ఎవ్వరు, హృదా=సర్వనిషేధోపదేశముగల నిశ్చయబుద్ధిచేతను, మనసా=విచారరూపజ్ఞానముచేతను, హృదిస్థం=హృదయాకాశ గుహాయందున్న, ఏనం=ఈపరమాత్మను, ఏవం=ఈవిధముగా, విదుః = తెలిసికొనుచున్నారో, తే=వారు, అమృతాః=అమరణధర్ములు, భవంతి = అగుచున్నారు.

తా. ఈ పరమేశ్వరునియొక్క స్వరూపము—అనఁగా రూపాదిరహితమును, నిర్విశేషమును, స్వప్రకాశాఖండసుఖానుభవరూపమును అగు బ్రహ్మతత్త్వము, నేత్రాదీంద్రియములచేత గ్రహించుటకు యోగ్యమయిన ప్రదేశమునందు ఉండుటలేదు. అనఁగా ఇంద్రియగోచరము కాఁజాలదని భావము. ఇంద్రియములకు అగోచరుఁడగుటచేతనే ఎవ్వఁడున్నూ నేత్రాదీంద్రియములలో దేనిచేతనైనను చూడఁజాలఁడు.

ఇఁక నేమనఁగా హృదయముచేతను—హృదయమనఁగా 'ఇదిగాదు, ఇదిగాదు' అని సర్వనిషేధోపదేశ శిష్టమయిన శుద్ధబుద్ధిచేతను, విచారజ్ఞానరూపమయిన మనస్సుచేతను హృదయాకాశ గుహాయందున్న పరమాత్మను ఎవ్వరు గాంచుచున్నారో అట్టివారలు - అనఁగా సాధనచతుష్టయవిశిష్టులయిన యోగ్యులయిన అధికారులు "బ్రహ్మాహమస్మి"యని అపరోక్షముగా

నెవ్వ రెఱుంగుదురో వారలు అమృతులు—అనఁగా పునర్జన్మ లేనివారలు అగుచున్నారు. మరణహేతువు అయిన అవిద్యాదికము తత్త్వజ్ఞానాగ్నిచేత దగ్ధమగుటచేత మఱల దేహాదిప్రాప్తి అట్టివారికి లేదని భావము.

వివరణము —పరమాత్మ నేత్రాదీంద్రియగోచరుఁడు కాఁడని కేనోపనిషత్తునం దిట్లు తెలుపఁబడియున్నది —

మం. యద్వాచా ఽనభ్యుదితం యేన వాగభ్యుద్యతే,
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిద ముపాసతే. ౧-౪
య న్మనసా నమనుతే యేనాహు ర్మనోమతమ్,
తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిద ముపాసతే. ౧-౫

మం. యచ్చక్షుషా నపశ్యతి యేన చక్షూంషి పశ్యతి,
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిద ముపాసతే. ౧-౬
యత్ప్రాణేన నప్రాణితి యేన ప్రాణః ప్రాణీయతే,
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిద ముపాసతే. ౧-౮

౪-వ అధ్యాయము, ౨౧-వ మంత్రము.

అవ. ఇష్టప్రాప్తియు, అనిష్టపరిహారమున్నూ ఈశ్వరునియొక్క అనుగ్రహముచేతనే కలుగును కావున ఆపరమేశ్వరుని ఈ చెప్పఁబోవు మంత్రద్వయముచేత ప్రార్థించుచున్నాఁడు —

మూ॥ అజాతో జాత ఇత్యేవం కశ్చిద్భీరుః ప్రపద్యతే,
రుద్రయత్తే దక్షిణం ముఖం తేన మాం పాహినిత్యమ్.

పద. అజాతః జాతః ఇతి ఏవం కః చిత్ భీరః ప్రపద్యతే, రుద్ర యత్ తే దక్షిణం ముఖం తేన మాం పాహి నిత్యమ్. ౨౧

టీక. కశ్చిత్=ఒకానొక ముముక్షువు, అజాతః=తాను స్వయముగా జన్మాదికము లేనివాఁడై నను, జాతః ఇతి=పుట్టినవాఁడనని, భీరుః=భయము గలవాఁడై, "రుద్ర=ఓరుద్రుఁడా! తే=నీయొక్క, దక్షిణం ముఖం=దక్షిణ మయినముఖము, యత్=ఎయ్యదిగలదో? తేన=ఆముఖము చేత, మాం=నన్ను, నిత్యం పాహి=ఎల్లప్పుడు సంరక్షింపుము" అని, ప్రపద్యతే=శరణును పొందు చున్నాఁడు.

తా. పరమేశ్వరుఁడు జన్మ, జరా, మరణ, అశనాయా, పిపాసా, శోక, మోహాది వివర్జితుఁడు, తదితరమయినదంతయు వినాశసమన్వితము, ఈశ్వరభిన్నమయిన దంతయుం జరామరణశోకమోహాదిసంకలితమయిన దగుటచేత భయంపడినవాఁడయి "ఓపరమేశ్వరా! నిన్ను శరణుసొచ్చినాఁడను, ఉత్సాహకరమయిన నీదక్షిణముఖముచేత నన్ను కాపాడుము." అని భక్తుఁడు ప్రార్థించుచున్నాఁడు.

౪-వ అధ్యాయము, ౨౨-వ మంత్రము

మూ॥ మానస్తోకే తనయే మాన ఆయుషి
మానో గోషు మానో అశ్వేషు రీరిషః,
వీరా న్మానో రుద్ర భామితో౽వధీ
ర్హవిష్మంత స్సదమిత్త్వా హవామహే ౨౨

పద. మా నః తోకే తనయే మా నః ఆయుషి మా నః గోషు మా నః అశ్వేషు రీరిషః, వీరాన్ మా నః రుద్రః భామితః అవధీః హవిష్మంతః సదం ఇత్ త్వా హవామహే. ౨౨

శ్వేతాశ్వతరోపనిషది చతుర్థో౽ధ్యాయః సమాప్తః.



టీక. (ఓపరమేశ్వరా!) నఃతోకే = నాయొక్క పుత్రునియందును, తనయే = పౌత్రునియందున్నూ, మారీరిషః = మరణమును చేయకుము. నః ఆయుషి = నాయొక్క ఆయుస్సునందు, మారీరిషః = మరణమును చేయవలదు. నః గోషు=మాయొక్క గోవులందు, మారీరిషః = మరణమును చేయవలదు. నః అశ్వేషు మారీరిషః = మాయొక్క గుఱ్ఱములందు మరణమును చేయవలదు. రుద్ర=ఓరుద్రుఁడా! భామితః = క్రోధముగలవాఁడవై, నః వీరాన్=నాయొక్క వీరులను, మావధీః=చంపకుము. హవిష్మంతః=హవిస్సుతో కూడుకొన్నవారమై, సదంఇత్=ఎల్లప్పుడు, త్వా=నిన్ను, హవామహే=రక్షణార్థము పిలుచుచున్నారము

తా. ఓపరమేశ్వరా! నీవు ఆగ్రహముగలవాఁడవై నా పుత్రపౌత్రాదులను చంపవలదు. నా ఆయుస్సును నశింపఁజేయవలదు. నాగోవులను, గుఱ్ఱములను, వీరులను చంపవలదు. నిన్నెప్పుడు మేము హవిస్సుతో పూజించుచు మమ్ములను సంరక్షించవలయు నని ఆహ్వానము చేయుచుందుము.

## శ్వేతాశ్వతరోపనిషత్తునందు నాల్గవ అధ్యాయము సమాప్తము

---

ఈ యధ్యాయమునకు సంబంధించిన ఇతరగ్రంథభాగములు:-

అత్మపురాణము, అష్టమాధ్యాయము. శ్లో - ౫౮౧.
అనుభూతిప్రకాశిక, ద్వాదశాధ్యాయము. శ్లో - ౪౭.
బ్రహ్మగీత, సూతసంహితాంతర్గతము, ౧౧-వ అధ్యాయము.

---

శ్రీ గురుభ్యో నమః.

కృష్ణయజుర్వేదాంతర్గత మగు

# శ్వేతాశ్వతరోపనిషత్తు

ఆంధ్రటీకాతాత్పర్య వివరణసమన్వితము



## పఞ్చమాధ్యాయము.

౫-వ అధ్యాయము, ౧-వ మంత్రము.

అవ. విద్యాఽవిద్యలు రెండున్నూ పరమేశ్వరుని యధీనము లనియు, అవిద్యాఽవిద్యలయొక్క స్వరూపమున్నూ, పరమేశ్వరుఁడీవిద్యాఽవిద్యల కు ప్రభువైనను వీనికి సంబంధింపక యున్నాఁడను అపూర్వవిషయములను నిర్ణయించుట కీ ౫-వ అధ్యాయము ప్రారంభింపఁబడుచున్నది —

మూ॥ ద్వే అక్షరే బ్రహ్మపరే త్వనంతే
విద్యాఽవిద్యే నిహితే యత్ర గూఢే,
క్షరం త్వవిద్యా హ్యమృతం తు విద్యా
విద్యాఽవిద్యే ఈశతే యస్తు సోఽన్యః ౧

పద. ద్వే అక్షరే బ్రహ్మపరే తు అనంతే విద్యాఽవిద్యే నిహితే యత్ర గూఢే, క్షరం తు అవిద్యా హి అమృతం తు విద్యా విద్యాఽవిద్యే ఈశతే యః తు సః అన్యః. ౧

టీక. ద్వే=రెండైన, విద్యాఽవిద్యే=విద్యయు అవిద్యయు, అక్షరే=నాశరహితములును, అనంతే = దేశకాలవస్తువులచేత అపరిచ్ఛిన్నములును, యత్ర=ఏ, బ్రహ్మపరే=హిరణ్యగర్భునికంటె శ్రేష్ఠమయిన బ్రహ్మమునందు, గూఢే=గూఢముగా, నిహితే = ఉంచఁబడినవి. అవిద్యాతు = అజ్ఞానము, క్షరం = క్షరమయినది—నశించునది, విద్యా=విద్య, అమృతంతు = మోక్షహేతువు. అని, విద్యాత్ = తెలిసికొనవలయును. యః=ఎవ్వఁడు, విద్యాఽవిద్యే=విద్యయు అవిద్యయు అనునీరెంటిని, ఈశతే = నియమించుచున్నాఁడో, సః=వాఁడు (అవిద్యాఽవిద్యలకంటె), అన్యః=వేఱయినవాఁడు (భవతి = అగుచున్నాఁడు).

తా. విద్యయు అవిద్యయు అనునీరెండున్నూ నాశరహితములును, దేశకాలవస్తుపరిచ్ఛేదశూన్యములును, హిరణ్యగర్భునికంటె శ్రేష్ఠమగు పరబ్రహ్మమునందు గూఢముగా స్థాపితములయియున్నవి. ఆపరబ్రహ్మమునందు గూఢముగానున్న విద్యావిద్యలను విభజించి చెప్పుచున్నాఁడు. అవిద్యాఽవిద్యలు రెంటిలోను అవిద్యయనునది సంసారమునకు హేతువగుటచేత క్షరమని చెప్పఁబడుచున్నది. విద్యయనునది మోక్షహేతువగుటచేత అక్షర మనఁబడుచున్నది. ఎవ్వఁడు విద్యావిద్యలు రెంటిని నియమించుచున్నాఁడో అతఁడు ఈవిద్యావిద్యలకంటె అన్యుఁడును, సాక్షిభూతుఁడును అగుచున్నాఁడు.

వివరణము —శంకరానందదీపికయం దీయధ్యాయప్రారంభమునం దిట్లుపోద్ఘాతము వ్రాయఁబడినది —"తత్త్వంపదార్థౌతృతీయే అధ్యాయే నిరూపితౌయద్యపి తథాఽపి త్వంపదార్థో నాత్యంతం నిరూపితః, తదర్థ మయం పంచమోఽధ్యాయ ఆరభ్యతే."

౫-వ అధ్యాయము, ౨-వ మంత్రము.

మూ. యో యోనిం యోని మధితిష్ఠ త్యేకో
విశ్వాని రూపాణి యోనీశ్చ సర్వాః,
ఋషిం ప్రసూతం కపిలం య స్తమగ్రే
జ్ఞానై ర్బిభ ర్తి జాయమానం చ పశ్యేత్. ౨

పద. యః యోనిం యోనిం అధితిష్ఠతి ఏకః విశ్వాని రూపాణి యోనీః చ సర్వాః, ఋషిం ప్రసూతం కపిలం యః తం అగ్రే జ్ఞానైః బిభ ర్తి జాయమానం చ పశ్యేత్. ౨

టీక. ఏకః=అద్వితీయుఁడగు, యః=ఏపరమాత్మ, యోనిం యోనిం= ప్రతిస్థానమును, విశ్వాని = సమస్తములయిన, రూపాణి = రూపములను, సర్వాః=సమస్తములయిన, యోనీఃచ = ఉత్పత్తిస్థానములను, అధితిష్ఠతి = అధిష్ఠించి యుంటున్నాఁడో, ఋషిం=సర్వజ్ఞుఁడయినట్టియు, కపిలం = కపిల వర్ణముగల, ప్రసూతం=తనచేత సృజింపఁబడిన, తం=ఆహిరణ్యగర్భుని (జన యామాస=పుట్టించెనో), అగ్రే=సృష్టికాలమునందు, జ్ఞానైః=ధర్మజ్ఞానవైరా గ్యైశ్వర్యములచేత, బిభ ర్తి = భరించుచున్నాఁడో, జాయమానం చ=పుట్టఁ బోవుదానిన్నీ, పశ్యేత్=చూచునో (సః=అతఁడే, పరమాత్మ).

తా. "యః పృథివ్యాంతిష్ఠన్ పృథివ్యాఅంతరో యం పృథివీనవేద యస్యపృథివీశరీరం యః పృథివీమంతరో యమయత్యేషత ఆత్మాఽంతర్యా మ్యమృతః" మున్నగు శ్రుతుల ననుసరించి పృథివ్యాది సకల స్థానములను, సకలరూపములను, ఆయా ఉత్పత్తిస్థానములను అద్వితీయుఁడయిన ఎవ్వఁడు అధిష్ఠించియున్నాఁడో,సర్వజ్ఞుఁడును,కపిలవర్ణము గలవాఁడును అగు హిరణ్య గర్భుని ఎవ్వఁడు ఆదియందుసృజించెనో, సృష్టికాలమునందు ఎవ్వఁడు ధర్మ జ్ఞానవైరాగ్య ఐశ్వర్యములను భరించియున్నాఁడో అతఁడే పరమాత్మ.

ఈమంత్రమునందుఁగల 'కపిల' శబ్దమునకు హిరణ్యగర్భుఁడని అర్థము చెప్పుటకు కారణమేమనఁగా ఈ యుపనిషత్తునందే ముందు ౬వ అధ్యాయమునందు ఇట్లు చెప్పఁబడుచున్నది —

౧. మం. యో బ్రహ్మాణం విదధాతి పూర్వం
యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై,
తగ్ంహ దేవ మాత్మబుద్ధిప్రకాశం
ముముక్షుర్వై శరణ మహంప్రపద్యే.   ౧౮

౨. మం. హిరణ్యగర్భ స్సమవర్తతాగ్రే.

అను శ్రుత్యంతరము కూడ గలదు.

కనుక ప్రథమమున కపిలుఁడు జనించెనని మంత్రమునందున్నను శ్రుత్యంతరానురోధముచేత "హిరణ్యగర్భుఁ"డని యిచట అర్థమును గ్రహించుటయుక్తమే యగును.

ఇందుల కుపబృంహణముగ పురాణవాక్యములుకూడ గలవు.

శ్లో. కపిలర్షి ర్భగవత స్సర్వభూతస్య వైకిల,
విష్ణోరంశో జగన్మోహనాశాయ సముపాగతః.
కృతేయుగే పరంజ్ఞానం కపిలాది స్వరూపధృత్,
దదాతి సర్వభూతాత్మా సర్వస్య జగతో హితమ్.
త్వం శక్ర స్సర్వదేవానాం బ్రహ్మ బ్రహ్మవిదా మసి,
వాయు ర్బలవతాం దేవో యోగినాం త్వం కుమారకః.
ఋషీణాం చ వసిష్ఠ స్త్వం వ్యాసో వేదవిదా మసి,
సాంఖ్యానాం కపిలో దేవః రుద్రాణా మసి శంకరః.

వివరణము.—ఈమంత్రము విజ్ఞానభగవద్వ్యాఖ్యయందు భంగ్యంతరముగ వ్యాఖ్యాతమైయున్నది —యః=సత్యసుఖానుభూతిగల విపరమేశ్వ

రుఁడు, అయోనిం=అనాదిసిద్ధమయిన, యోనిం=మూలప్రకృతిని, అధితిష్ఠతి =స్వరూపస్ఫురణ ప్రదుఁడై అధిష్ఠించియున్నాఁడో, యః=ఏపరమాత్మ, ఏకః =అద్వితీయుఁడై, విశ్వాని=సకలములయిన, రూపాణి=శరీరములను, సర్వాః యోనీఃచ=సమష్టిరూపములను, వ్యష్టిరూపములను అగు ఆకాశాది సర్వకారణములను, అధితిష్ఠతి=సత్తాస్ఫురణప్రదుఁడై అధిష్ఠించుచున్నాఁడో, ఋషిం=సర్వజ్ఞుఁడును, ప్రసూతం=తనవల్లనుండి పుట్టినవాఁడును, కపిలం=బంగారు రంగుగలవాఁడును అగు, తం=ఆహిరణ్యగర్భుని, అగ్రే=సృష్టికాలమునందు, జ్ఞానైః = ధర్మజ్ఞానవైరాగ్యఐశ్వర్యములచేత, బిభర్తి=భరించుచున్నాఁడో, జాయమానంచ = అవాంతరకల్పమునందు సర్గస్థిత్యంతకర్తగను, వేదసంప్రదాయకర్తగను, పుట్టఁబోవువానిగను, పశ్యేత్ =చూచెనో, సః=అతఁడు (పరమాత్మయని గ్రహించవలయును).

బ్ర. సూ. స్మృత్యనవకాశదోషప్రసంగ ఇతిచే న్నాన్య స్మృత్యనవకాశదోషప్రసంగాత్. ౨-౧-౧. అను బ్రహ్మసూత్రభాష్యమునందు శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యులవారిచేత యీ మంత్రము ప్రమాణార్థము దాహృతమైనది.

౫-వ అధ్యాయము, 3-వ మంత్రము.

అవ. పరమేశ్వరునియొక్క జగత్సృష్ట్యాదికృత్యములఁగూర్చి తెలుపఁబడుచున్నది —

మూ. ఏకైకం జాలం బహుధా వికుర్వ
న్యస్మిన్ క్షేత్రే సంహరత్యేష దేవః,
భూయః సృష్ట్వా పతయ స్తథేశ
స్సర్వాధిపత్యం కురుతే మహాత్మా 3

పద. ఏకైకం జాలం బహుధా వికుర్వన్ అస్మిన్ క్షేత్రే సంహరతిష ఏ దేవః, భూయః సృష్ట్వా పతయః స్తథా ఈశః సర్వాధిపత్యం కురుతే మహాత్మా. 3

టీక. ఏషః=ఈ, దేవః=ప్రకాశస్వరూపుఁడగు, మహాత్మా=మహాత్ముఁడగు దేవుఁడు, ఏకైకం=ఒక్కొక, జాలం=సంసారరూపమును, బహుధా=అనేకవిధములుగా, వికుర్వన్ = సృజించుచు, అస్మిన్ క్షేత్రే=ఈ దేహమునందు, సంహరతి = ఉపసంహరించుచున్నాఁడు. ఈశః=పరమేశ్వరుఁడు, భూయః=తిరిగి, తథా=అదేవిధముగా, పతయః = మరీచ్యాది ప్రజాపతులను, సృష్ట్వా=సృజించి, సర్వాధిపత్యం = సర్వాధిపత్యమును, కురుతే = చేయుచున్నాఁడు.

తా. ద్యోతనస్వభావుఁడగు ఈపరమేశ్వరుఁడును సురనరతిర్యగాది రా లక్షల విభేదములుగల ప్రాణిజాతమును నానావిధములుగా సృజించి వానియందు తానున్నూ చేరి ప్రకాశించుచున్నాఁడు. మఱియు నీపరమేశ్వరుఁడు నానావిధభూతసృష్టికి అధిపతులగు మరీచ్యాదిప్రజాపతులను సృజించి వారికి తాను సర్వాధిపత్యమును వహించుచున్నాఁడు.

వివరణము —విజ్ఞానభగవద్వ్యాఖ్యయందు ఈమంత్రమున కిట్లుపోద్ఘాతము వ్రాయఁబడినది —"అంతఃకరణ సమష్టిం ప్రాణసమష్టిం చక్షురాది జ్ఞానేంద్రియసమష్టిం వాగాదికర్మేంద్రియసమష్టిం చ స్వమాయయా సృష్ట్వా తదవస్థాపన్నస్య పరమేశ్వరస్య తత్తద్వ్యష్టీనాం స్రష్టృత్వం తత్తదుపాధ్యుపహితానాం ఘటాకాశజలచంద్రస్థానీయానాం హిరణ్యగర్భప్రముఖానాం జీవానాం మహాకాశబింబస్థానీయస్య తస్యైవేశ్వరస్య కారణత్వం సర్వాధిపతిత్వం చాహ" అంతమునందు "భూయః వ్యష్టిసమష్టిరూపకార్యకారణోపాధీన్ సృష్ట్వా అనంతరం పతీంశ్చ సమష్టిరూపకార్యకారణపతీన్ స్వామినః

హిరణ్యగర్భప్రముఖాన్ మశకపర్యంతాన్ సృష్ట్వా అనన్తరమీశ్వరః సర్వాధిపత్య ముపాధీనా ముపహితానాం చ సర్వేషా మాధిపత్య మధిపతిత్వ మప్రతిషిద్ధనియంతృత్వం కురుతే మహాత్మా మహేశ్వరః" అని వ్రాయఁబడియున్నది.

౫-వ అధ్యాయము, ౪-వ మంత్రము.

అవ. పరమేశ్వరుఁడు సర్వజ్ఞుఁడనియు, అఖండస్వయంప్రకాశజ్ఞానస్వరూపుఁడనియు, సర్వనియంతయనియు తెలుపఁబడుచున్నది —

మూ॥ సర్వా దిశ ఊర్ధ్వ మధ శ్చ తిర్య
క్ప్రకాశయన్ భ్రాజతే యద్వనడ్వాన్,
ఏవగ్ం స దేవో భగవా న్వరేణ్యో
యోనిస్వభావా నధితిష్ఠ త్యేకః. ౪

పద. సర్వాః దిశః ఊర్ధ్వం అధః చ తిర్యక్ ప్రకాశయన్ భ్రాజతే యత్ ఉ అనడ్వాన్, ఏవం సః దేవః వరేణ్యః యోనిస్వభావాన్ అధితిష్ఠతి ఏకః. ౪

టీక. అనడ్వాన్ = సూర్యుఁడు, సర్వాః దిశః = అన్నిదిక్కులను, ఊర్ధ్వం అధః చ = ఊర్ధ్వాధోదిక్కులను, తిర్యక్ చ = పార్శ్వదిక్కులను, ప్రకాశయన్ = ప్రకాశింపఁజేయుచు, యత్ ఉ = ఏప్రకారము, భ్రాజతే = ప్రకాశించుచున్నాఁడో, ఏవం = ఈప్రకారము, ఏకః = అద్వితీయుఁడును, వరేణ్యః = అందరిచేతను కోరఁదగినవాఁడును, దేవః = ద్యోతనస్వభావుఁడును అగు, స భగవాన్ = ఆపరమాత్మ, యోనిస్వభావాన్ = జగత్కారణభూతములగు పృథివ్యాది స్వభావములను, అధితిష్ఠతి= నియమించుచున్నాఁడు.

తా. సూర్యుఁడు ఏవిధముగా ప్రాగాదిదిక్కులను, ఆగ్నేయాది విదిక్కులను, ఊర్ధ్వాధోదిశలను స్వకీయప్రకాశము చేత ప్రకాశింపఁ జేయుచున్నాఁడో అదేవిధముగా ద్యోతనస్వభావుఁడును, అద్వితీయుఁడును, షడ్గుణైశ్వర్యసంపన్నుఁడును అగు ఆపరమేశ్వరుఁడు సకల ప్రపంచమునకు కారణభూతములగు పృథివ్యాదిస్థానములను అధిష్ఠించి వానిని నియమించుచున్నాఁడు.

౫-వ అధ్యాయము, ౫-వ మంత్రము.

అవ. పరమేశ్వరుఁడు, మూలప్రకృత్యవాంతర ప్రకృతులను తత్తత్కార్యోన్ముఖములయినవానినిగ నొనర్చువాఁడనియు, తత్తత్కార్యరూపము చేత పరిణామమును చేయువాఁడనియు, సర్వనియంతయనియు, ఆయాజీవులయొక్క సంచితమయిన పుణ్యపాపకర్మానుసారము సత్వరజస్తమోగుణములను వినియోగించుననియు నిందు తెలుపఁబడుచున్నది —

మూ. యచ్చ స్వభావం పచతి విశ్వయోనిః
పాచ్యాంశ్చ సర్వాన్ పరిణామయేద్యః,
సర్వ మేత ద్విశ్వ మధితిష్ఠ త్యేకో
గుణాంశ్చ సర్వా న్వినియోజయే ద్యః  ౫

పద. యత్ చ స్వభావం పచతి విశ్వయోనిః పాచ్యాన్ చ సర్వాన్ పరిణామయేత్ యః, సర్వం ఏతత్ విశ్వం అధితిష్ఠతి ఏకః గుణాన్ చ సర్వాన్ వినియోజయేత్.  ౫

టీక. విశ్వయోనిః = జగత్కారణుఁడగు, యత్ చ = ఏపరమాత్మ, స్వభావం=స్వభావమును లేక గుణమును, పచతి=(స్వసత్తాసన్నిధిమాత్రము చేత తత్తత్కార్యానుగుణముగ) పక్వము చేయుచున్నాఁడో, యః=ఏపర

మాత్మ, సర్వాన్ = సమస్తములయిన, పాచ్యాన్ = పాకయోగ్యములయిన పృథివ్యాదికములను, పరిణామయేత్ = పరిణమింపఁజేయుచున్నాఁడో, యః = ఏపరమాత్మ, సర్వాన్ గుణాన్ = సత్త్వరజస్తమస్సులను గుణముల నన్నిఁటిని, వినియోజయేత్ = వినియోగించునో, ఏకః = ఒక్కఁడగు, సః = ఆపరమాత్మ, ఏతత్ సర్వం విశ్వం = ఈప్రపంచమునంతయు, అధితిష్ఠతి = నియమించుచున్నాఁడు.

తా. జగత్కారణభూతుఁడగు పరమాత్మయే స్వసత్తాసన్నిధిమాత్రముచేత తత్తత్కార్యానుగుణముగ ఆయాపదార్థస్వభావమును వినియోగించుచున్నాఁడు. పచనయోగ్యములయిన పృథివ్యాదిపదార్థములను పరిణమింపఁజేయుచున్నాఁడు. తత్తత్ప్రాణులొనర్చిన పుణ్యపాపకర్మానుసారముగ సత్త్వరజస్తమోగుణములను దేహధారణాదివిషయములందు వినియోగించుచున్నాఁడు. అద్వితీయుఁడయిన అతఁడే ఈప్రపంచమునంతయు నియమించుచున్నాఁడు.

౫-వ అధ్యాయము, ౬-వ మంత్రము.

అవ. బ్రహ్మతత్త్వము వేదాంతములందు గూఢముగ ప్రతిపాదింపఁబడియున్నదనియు, ఆబ్రహ్మతత్త్వము నెఱింగినవారలు మోక్షమును పొందిరనియు తెలుపఁబడుచున్నది —

మూ తద్వేద గుహ్యోపనిషత్సు గూఢం
తద్బ్రహ్మా వేదతే బ్రహ్మయోనిమ్,
యే పూర్వం దేవా ఋషయ శ్చ తద్విదు
స్తే తన్మయా అమృతా వై బభూవుః ౬

పద. తత్ వేదగుహ్యోపనిషత్సు గూఢం తత్ బ్రహ్మా వేదతే బ్రహ్మ యోనిం, యే పూర్వం దేవాః ఋషయః చ తత్ విదుః తే తన్మయాః అమృతాః వై బభూవుః. ౬

టీక. తత్=ఆపరమాత్మస్వరూపము, వేదగుహ్యోపనిషత్సు=వేదములలో రహస్యభూతములయిన ఉపనిషత్తులందు, గూఢం = గూఢమయి యున్నది. బ్రహ్మా=హిరణ్యగర్భుఁడు, బ్రహ్మయోనిం=వేదప్రమాణకమయిన, తత్=ఆబ్రహ్మమును, వేదతే=తెలిసికొనుచున్నాఁడు. యే=ఏ, పూర్వ దేవాః ఋషయఃచ = పూర్వదేవులున్నూ, ఋషులున్నూ, తత్=ఆపరమాత్మస్వరూపమును, విదుః=తెలిసికొనుచున్నారో, తే=వారు, తన్మయాః = ఆపరమాత్మస్వరూపులయి, అమృతాః=మరణవిరహితులు—అనఁగా మోక్షమును పొందినవారు, బభూవుః=అయిరి.

తా. ఆపరమాత్మస్వరూపము, వేదములలో రహస్యభాగము ఉలగుపనిషత్తులందు ప్రతిపాదింపఁబడియున్నది. ఉపనిషత్ప్రతిపాదితమయిన ఆ పరమాత్మతత్త్వమును బ్రహ్మయనఁగా ప్రథమజుఁడగు హిరణ్యగర్భుఁడు తెలిసికొనుచున్నాఁడు. పూర్వకాలమునం దీబ్రహ్మస్వరూపమును రుద్రాది దేవతలున్నూ, వామదేవాదిమహర్షులున్నూ తెలిసికొన్నవారలయి తదాత్మస్వరూపులయి అమృతత్వమునందిరి. ఆదేవిధముగా ఇప్పటిముముక్షువులు కూడ ఉపనిషత్ప్రతిపాదితమయిన ఆబ్రహ్మతత్త్వము నెఱింగినయెడల అమృతత్వమును (మోక్షమును) పొందఁగలరు.

వివరణము:—ఈమంత్రము 3-వ పాదమునందు "యే పూర్వం దేవా ఋషయశ్చ తద్విదుః" అని పాఠాంతరము గలదు. అప్పుడు. "పూర్వం=పూర్వకాలమునందు, దేవాః ఋషయః చ తత్ విదుః తే తన్మయాః అమృతాః బభూవుః వై" అని అన్వయము.

౫-వ అధ్యాయము, ౭-వ మంత్రము.

అవ. ఇంతవఱకు తత్పదార్థము వర్ణితమయినది, ఇఁకమీఁద త్వంపదార్థము వర్ణింపఁబడుచున్నది —

మూ॥ గుణాన్వయో యః ఫలకర్మకర్తా
కృతస్య తస్యైవ సచోపభోక్తా,
స విశ్వరూప స్త్రిగుణ స్త్రివర్త్మా
ప్రాణాధిప స్సంచరతి స్వకర్మభిః ౭

పద. గుణాన్వయః యః ఫలకర్మకర్తా కృతస్య తస్య ఏవ సః చ ఉపభోక్తా, సః విశ్వరూపః త్రిగుణః త్రివర్త్మా ప్రాణాధిపః సంచరతి స్వకర్మభిః. ౭

టీక. యః=ఎవ్వఁడు, గుణాన్వయః=కర్మజ్ఞానకృతములయిన వాసనారూపములయిన గుణములతోకూడుకొన్నవాఁడై, ఫలకర్మకర్తా = ఫలకర్మములను చేయుచున్నాఁడో, సః=వాఁడు, కృతస్య = చేయఁబడిన, తస్యఏవ=ఆ ఫలమునకే, ఉపభోక్తా=అనుభోక్త - అనుభవించుచువాఁడు, సః=అతఁడు, విశ్వరూపః = నానారూపములుగలవాఁడై, త్రిగుణః = సత్వరజస్తమోగుణములు గలవాఁడై, త్రివర్త్మా=దేవయాన, పితృయాన, మనుష్యయానములను 3 మార్గములుగలవాఁడై, ప్రాణాధిపః = ప్రాణాపానాది పంచవృత్తులకు ప్రభువై, స్వకర్మభిః=తనకర్మలతో, సంచరతి=తిరుగుచున్నాఁడు.

తా. జీవుఁడు కర్మజ్ఞానరూపములయిన వాసనారూపములయిన గుణములతో కూడుకొన్నవాఁడై, తత్తత్ఫలముల నొసంగు కర్మల నాచరించుచున్నాఁడు. ఆచేయఁబడిన కర్మలయొక్క ఫలము ననుభవించువాఁడునున్నా ఆ జీవుఁడేయగుచున్నాఁడు. ఇతఁడు నానావిధరూపములుగలిగి సత్వరజస్తమో

గుణాన్వితుఁడయి తత్తత్కర్మానుసారము దేవపితృమనుష్య యానములద్వారా ఇహాపరలోకములకు గమనాగమనముల నొనర్చుచుండును. కార్యకారణ సంఘాతరూపమయిన యీ దేహమునకు అధిపతియై సుఖదుఃఖముల నందు చుండును.

వివరణము —విజ్ఞానభగవద్వ్యాఖ్యయందు యీమంత్రము చాల మనోహరముగ వ్యాఖ్యాతమయియున్నది. తదుపోద్ఘాతము నిట నుదాహ రించుచున్నారము.

"తత్పదార్థభూతస్య ఈశ్వరస్య సత్యసుఖసంవిన్మాత్రరసత్వం, అద్వితీయత్వం, అఖండత్వం, వేదాంతగమ్యత్వం, అవికారిత్వం, ప్రత్యక్త్వం; త్వం పదార్థభూతస్య జీవస్య కార్యకరణాదిభ్యో వైలక్షణ్యం సత్యసుఖానుభూతిత్వం అసంగత్వం నిత్యత్వం పరమాత్మస్వరూపత్వం చ ప్రతిపాదయితుం ఉత్తరే కేచి న్మంత్రాః ప్రస్తూయంతే; తత్ర ప్రథమం జీవస్య కర్తృత్వభోక్తృత్వాది సంసారః స్వాభావికో న భవతి, కిం తు దేహేంద్రియాద్యుపాధ్యవివేకకృత ఇత్యాహ."

"గుణాన్వయోయః ఫలకర్మకర్తా" యనుదానియొక్కవివరణము చాలరమ్యముగ నొనర్పఁబడినది —

౧. ఈషద్రజోఽన్విత సత్వగుణపరవశ స్సన్ జ్ఞానద్వారేణ మోక్షార్థం కర్మ కరోతి.

౨. ఈషత్సత్వాన్వితరజోగుణపరవశస్సన్ స్వర్గాదిసాధనం కర్మ కరోతి.

3. ఈషద్రజోఽన్వితతమోగుణపరవశస్సన్ నరకాదిసాధనం కర్మ కరోతి.

అంతమునందు "స్వకర్మభిః ఏకాదశేంద్రియ భూతసూక్ష్మపంచక ప్రాణాఖ్యస్తదశాత్మకం లింగశరీరమాత్మసాత్కృత్య తదుపాధికస్సన్

సత్త్వాదికామాదిగుణపరవశో భూత్వా శుభాశుభాని కర్మాణి కృత్వా తైః స్వకర్మభిః పరవశో భూత్వా ఉదధిమధ్యవర్తిశుష్కాలాబువత్ సంసార దుఃఖమహోదధౌ సంచరతి-పరిభ్రమతి.

౫-వ అధ్యాయము, ౮-వ మంత్రము.

అవ. అద్వితీయుఁడయిన పరమేశ్వరుఁడే, జీవుఁడుగాని జీవుఁడను వాఁడు వేఱుగాలేఁడనియు, జీవునకు గలపరిచ్ఛేదము ఔపాధిక మగుటచేత ఆభాసమాత్రముకాని వాస్తవము గాదనియు, తెలిసియు తెలియకయు జీవుఁడే సర్వసాక్షిగా వ్యవహరింపఁబడుచున్నాఁడనియు, ఇతఁడు అఖండ బోధైకరసుఁడనియు తెలుపఁబడుచున్నది —

మూ. అంగుష్ఠమాత్రో రవితుల్యరూప
స్సంకల్పాహంకారసమన్వితో యః,
బుద్ధే ర్గుణే నాత్మగుణేన చైవ
ఆరాగ్రమాత్రో ప్యపరోఽపి దృష్టః ౮

పద. అంగుష్ఠమాత్రః రవితుల్యరూపః సంకల్పాహంకారసమన్వితః యః, బుద్ధేః గుణేన ఆత్మగుణేన చ ఏవ ఆరాగ్రమాత్రః హి అపరః అపి దృష్టః. ౮

టీక. అంగుష్ఠమాత్రః = స్వకీయాంగుష్ఠమాత్రపరిమాణము గల వాఁడును, (అంగుష్ఠపరిమాణముగల స్వహృదయగుహామధ్యభాగమునందు ఉన్నట్టు శ్రుతియందు ప్రతిపాదింపఁబడియుండుటచేత అంగుష్ఠమాత్రుఁ డనంబడును.) రవితుల్యదేహః = సూర్యునితో సమానమయిన స్వరూపము (జ్యోతిస్స్వరూపము) గలవాఁడును, సంకల్పాహంకారసమన్వితః = సంకల్పాహంకారములు గలవాఁడును, ఎవ్వఁడో, (సః=వాఁడు), బుద్ధేః = బుద్ధి యొక్క, గుణేన = గుణమగుసంకల్పాహంకారాదిగుణముచేతను, ఆత్మ

గుణేనచఏవ = దేహగుణమగు జరామరణాదికముచేతను, ఆరాగ్రమాత్రః= ఆరాగ్రస్వరూపుఁడుగా, అపరఃహి= వేఱయినవాఁడుగా, దృష్టః = చూడఁబడుచున్నాఁడు.

తా. అంగుష్ఠపరిమితమగు హృదయగుహాయందుండుటచేత అంగుష్ఠమాత్రుఁడును, తేజోరూపుఁడగుటచేత సూర్యునితో సమానమయిన రూపముగలవాఁడును, సంకల్పాహంకారాది గుణములతోఁ గూడుకొనియున్న ఆత్మబుద్ధి గుణమయిన మోహాదికముచేతనున్ను, శరీరగుణములయిన జరాదికములోనున్ను, ముల్లుకర్రయొక్క కొనయందుగల ఇనుపచీలయొక్క కొనవలె స్వరూపముగలవాఁడయి జలసూర్యునివలె ఉపాధిసంబంధముచేత జీవాత్మగా తెలిసికొనఁబడుచున్నాఁడు.

వివరణము — బ్ర. సూ. స్వశబ్దోన్మానాభ్యాంచ. ౨-౩-౨౨. తద్గుణసారత్వాత్తు తద్వ్యపదేశః ప్రాజ్ఞవత్. ౨-౩-౨౯. అను బ్రహ్మసూత్రముల శంకరభాష్యమునం దీమంత్ర ముదాహృతమయినది.

౫-వ అధ్యాయము, ౯-వ మంత్రము.

అవ. మఱల మఱొకదృష్టాంతముతో జీవస్వరూపమును నిర్ణయించుచున్నాఁడు.—

మూ వాలాగ్రశతభాగస్య శతధా కల్పితస్య చ,
భాగో జీవ స్స విజ్ఞేయ స్సచానంత్యాయ కల్ప తే ౯

పద. వాలాగ్రశతభాగస్య శతధా కల్పితస్య చ, భాగః జీవః సః చ ఆనంత్యాయ కల్పతే. ౯

టీక. జీవః= జీవుఁడు, శతధా కల్పితస్య = నూరుగా భాగింపఁబడిన, వాలాగ్రశతభాగస్య = వెండ్రుకకొనయొక్క నూరవది అయిన, భాగః = భాగముగా, విజ్ఞేయః= తెలిసికొనఁదగినది. సఃచ= ఆజీవుఁడు, అనంత్యాయ=

అనంతత్వమునకు - బ్రహ్మభావమునకు, కల్పతే = సమర్థుఁ డగు చున్నాఁడు.

తా. జీవుఁడు తలవెండ్రుకయొక్క కొనభాగమును నూరుగా భాగింపగా వచ్చిన భాగములలో నొకభాగమును మఱల నూరుగా విభాగించిన యెడల ఎంతసూక్ష్మముగానుండునో అంతసూక్ష్మమయిన పరిమాణముగలవాఁడు. అతఁడే అనంతస్వరూపుఁ డగును. అనంతస్వరూపుఁడనఁగా పరమాత్మ యని గ్రహించవలయును.

వివరణము — బ్ర. సూ. స్వశబ్దోన్మానాభ్యాంచ. ౨-3-౨౨. తద్గుణసారత్వాత్తు తద్వ్యపదేశః ప్రాజ్ఞవత్. ౨-3-౨౯. అను బ్రహ్మ సూత్రములభాష్యమునందు శ్రీమచ్ఛంకరాచార్యులవారు జీవస్వరూపవిచారార్థ మీమంత్రము నుదహరించిరి.

౫-వ అధ్యాయము, ౧౦-వ మంత్రము.

మూ. నైవస్త్రీ నపుమానేష నైవచాయం నపుంసకః,
యద్య చ్ఛరీరమాదత్తే తేనతేన స రక్ష్యతే ౧౦

పద. న ఏవ స్త్రీ న పుమాన్ ఏషః న చ ఏవ అయం నపుంసకః, యత్ యత్ శరీరం ఆదత్తే తేన తేన సః రక్ష్యతే. ౧౦

టీక. ఏషః=జీవుఁడు, స్త్రీ నఏవ=స్త్రీ కాదు, న పుమాన్=పురుషుఁడు కాఁడు. అయం=ఈయాత్మ, నపుంసకః నఏవచ = నపుంసకుఁడున్నూ కాదు. యత్ యత్ శరీరం = ఏయేశరీరమును, ఆదత్తే=గ్రహించుచున్నాఁడో, తేన తేన=ఆయాశరీరాద్యభిమానము చేత, సః=ఆయాత్మ, రక్ష్యతే=రక్షింపఁబడు చున్నాఁడు.

తా. వాస్తవముగా చూచినయెడల జీవుఁడున్నూ అద్వితీయ అపరోక్ష బ్రహ్మాత్మస్వరూపుఁడు కావున స్త్రీగాని, పురుషుఁడుగాని, నపుంసకుఁడు

గాని కాఁజాలఁడు. కాని స్త్రీగానో, పురుషుఁడుగానో, నపుంసకుఁడుగానో ఏయేశరీరమును జన్మాంతరకృత సంచితకర్మానుసారము ధరించుచున్నాఁడో అట్టి యభిమానమును పొందినవాఁడయి తత్తద్ధర్మములను తనయందు తెచ్చి పెట్టుకొని నేను స్త్రీని, పురుషుఁడను, నపుంసకుఁడను, కుంటెని, గుడ్డిని, బలిసినాఁడను మున్నగునవి తలంచుకొనుచుండునని భావము.

౫-వ అధ్యాయము, ౧౧-వ మంత్రము.

అవ. ఎందువలన మనుష్యాదిశరీరముల నేల పొందుచున్నాఁ డనువిష యము తెలుపఁబడుచున్నది —

మూ సంకల్పన స్పర్శనదృష్టిమోహై
ర్గ్రాసాంబువృష్ట్యాత్మవివృద్ధిజన్మ,
కర్మానుగాన్యనుక్రమేణ దేహీ
స్థానేషు రూపాణ్యభిసంప్రపద్యతే ౧౧

పద. సంకల్పన స్పర్శన దృష్టిమోహైః గ్రాసాంబువృష్ట్యా ఆత్మ వివృద్ధజన్మ, కర్మానుగాని-అనుక్రమేణ దేహీ స్థానేషు రూపాణి అభి సం ప్రపద్యతే. ౧౧

టీక. సంకల్పనస్పర్శనదృష్టిమోహైః - సంకల్పన=(మనఃకార్యమగు) తలంపుచేతను, స్పర్శన=త్వగింద్రియవ్యాపారమగు తాఁకుటచేతను, దృష్టి= చూపుచేతను, మోహైః= మోహముచేతను,అనుక్రమేణ=క్రమముగ, దేహీ= జీవుఁడు, గ్రాసాంబువృష్ట్యా = అన్నపానములయొక్క సమృద్ధిచేత, ఆత్మ వివృద్ధిజన్మ=శరీరముయొక్క వృద్ధికలుగుచున్నటుల, స్థానేషు=దేవతిర్యఙ్మను ష్యాదిజన్మములందు, కర్మానుగాని రూపాణి = ఆయాపుణ్యపాపకర్మలకు అనుకూలములయిన స్త్రీపుంనపుంసకలక్షణములయిన రూపములను, అభిసం ప్రపద్యతే=పొందుచున్నాఁడు.

తా. లోకములందు అన్నపానములను సకాలమునందు సేవించుటచేత దేహ మేవిధముగా వృద్ధినిపొందుచున్నదో, అదేవిధముగా అనేకజన్మము లం దాచరింపఁబడి సంచితమయియున్న తత్తత్పాపపుణ్యకర్మఫలముల ననుసరించి, స్త్రీపుంసనపుంసకాది లక్షణములగు దేవతిర్యఙ్మనుష్యాదిలక్షణము లుగల శరీరములను సంకల్పన స్పర్శన దృష్టిమోహాములచేతను పొందుచున్నాఁడు.

వివరణము:—శంకరానంద, నారాయణ, విజ్ఞానభగవత్ వ్యాఖ్యలయందు "సంకల్పనస్పర్శనదృష్టిమోహైః" అని పాఠమొనర్చి తదనుసారము వ్యాఖ్యాతమయినది. విజ్ఞానభగవద్వ్యాఖ్యయందు "ఆత్మనః కార్యకరణోపాధి పరిగ్రహే కర్తృత్వాది సంసారధర్మభాక్త్వే చ కింనిమిత్త మిత్యాకాంక్షాయామాహ" అను అవతారికతో ఈమంత్రమునకు గొప్పవ్యాఖ్య వ్రాయఁబడియున్నది. గ్రంథవిస్తరభీతిచేత ఆవ్యాఖ్య నిట నుదహరించలేదు.

౫-వ అధ్యాయము, ౧౨-వ మంత్రము.

మూ స్థూలాని సూక్ష్మాణి బహూని చైవ
రూపాణి దేహీ స్వగుణై ర్వృణోతి,
క్రియాగుణై రాత్మగుణై శ్చ తేషాం
సంయోగహేతు రపరోఽపి దృష్టః. ౧౨

పద. స్థూలాని సూక్ష్మాణి బహూని చ ఏవ రూపాణి దేహీ స్వగుణైః వృణోతి, క్రియాగుణైః ఆత్మగుణైః చ తేషాం సంయోగహేతుః అపరః అపి దృష్టః. ౧౨

టీక. దేహీ = జీవుఁడు, స్వగుణైః = విహితప్రతిషిద్ధవిషయముల యొక్క అనుభవసంస్కారములచేతను, స్థూలాని=స్థూలములును, సూక్ష్మాణిచ=

సూక్ష్మములును అయిన, బహూనిరూపాణి=అనేకవిధములయిన రూపములను, వృణోతి = ఆవరించుచున్నాఁడు. తేషాం=అస్థూలసూక్ష్మరూపముల యొక్క, క్రియాగుణైః=కర్మగుణముల చేతను, ఆత్మగుణైశ్చ=స్వరూపగుణముల చేత, అపరశ్చ=వేఱయిన, సంయోగహేతుః=దేహాంతరసంయోగమునకు కారణుఁడుగానున్ను, దృష్టః=చూడఁబడుచున్నాఁడు.

తా. జీవుఁడు జన్మాంతరకృత సుకృతదుష్కృత కర్మవాసనానుసారము సత్వరజస్తమోరూప గుణత్రయ తారతమ్యానుసారము స్థూలములును సూక్ష్మములును అగు అనేకవిధశరీరములను పొందుచున్నాఁడు. ఆ ప్రకారము జన్మించినతరువాత జన్మాంతరకృత సుకృతదుష్కృత కర్మానుసారము ఈ జన్మమునందు సంభవించిన శ్రౌతస్మార్తవిహిత నిషిద్ధగుణసంస్కారములతోడను, విహిత ప్రతిషిద్ధోపాసనాద్యాత్మగుణములతోను కలసినవాఁడయి నియతకాలమునందు దేహాంతరసంయోగమును కూడ పొందుచున్నాఁడు. అనఁగా గతించిన జన్మాంతరములందు సంచితములయి అనుభవించగా మిగిలియున్న కర్మవాసనలతోడను, ఈజన్మమునందార్జిన విహిత ప్రతిషిద్ధ క్రియావాసనలతోడను జన్మాంతరమును పొందుటకు పోవుచున్నాఁడని భావము.

వివరణము—'స్థూలాని సూక్ష్మాణి బహూని రూపాణి' యనుట క్రిందివివరణము విజ్ఞానభగవద్వ్యాఖ్యయందుఁ గలదు —

౧. స్థూలాని పార్థివాని శరీరాణి భూలోకవర్తిని;
౨. తతః సూక్ష్మాణి అమ్మయాని భువర్లోకవర్తీని శరీరాణి;
3. తతోఽపి సూక్ష్మాణి తైజసాని స్వర్లోకవర్తీని శరీరాణి;
౪. తతోఽపి సూక్ష్మాణి వాయవీయాని మహర్లోకజనోలోకవర్తీని శరీరాణి ;

౫. తతోఽపి సూక్ష్మాణి శరీరాణి వియన్మయాని తపస్సత్యలోక వర్తీని;

సర్వశరీరారంభే సర్వభూతాని ఆరంభకతయా వర్తంతఏవ. అతః తత్తల్లోకవర్తి తత్తచ్ఛరీరారంభే తత్తద్భూత ప్రాధాన్యమేవోక్తమితి ద్రష్టవ్యమ్;

అథవా స్థూలాని హస్త్యాదిశరీరాణి, సూక్ష్మాణి మశకాది శరీరాణి; ప్రాణోత్క్రమణ సమయస్థితినిగూర్చి బృహదారణ్యకము చతుర్థాధ్యాయ చతుర్థబ్రాహ్మణమునం దిట్లు చెప్పఁబడినది:—

సయత్రాయ మాత్మాఽబల్యం న్యేత్య సంమోహ మివన్యేత్యథైన మేతేప్రాణా అభిసమాయాంతి స ఏతా స్తేజోమాత్రాః సమభ్యాదదానో హృదయమేవాన్వవక్రామతి సయత్రైష చాక్షుషః పురుషః పర్యావర్తతేఽథారూపజ్ఞోభవతి. ౧.

ఏకీభవతి నపశ్యతీత్యాహుః, ఏకీభవతి నజిఘ్రతీత్యాహుః, ఏకీభవతి నరసయతీత్యాహుః, ఏకీభవతి నవదతీత్యాహుః, ఏకీభవతి నశృణోతీత్యాహుః, ఏకీభవతి నమనుత ఇత్యాహుః ఏకీభవతి నస్పృశతీత్యాహుః, ఏకీభవతి నవిజానాతీత్యాహుః,తస్య హైతస్య హృదయస్యాగ్రం ప్రద్యోతతే తేన ప్రద్యోతేన ఏషఆత్మా నిష్క్రామతి చక్షుషోవా మూర్ధ్నోవా అన్యేభ్యోవాశరీరదేశేభ్యస్తముత్క్రామన్తం ప్రాణోఽనూత్క్రామతి ప్రాణమనూత్క్రామంతగ్ం సర్వేప్రాణా అనూత్క్రామంతి సవిజ్ఞానోభవతి సవిజ్ఞానమేవా న్వవక్రామతి తంవిద్యాకర్మణీ సమన్వారభేతే పూర్వప్రజ్ఞాచ. ౨.

౪-వ అధ్యాయము, ౧౩-వ మంత్రము.

అవ. పూర్వోక్తుఁడయినజీవుఁడు అవిద్యాకామకర్మఫలరాగాదులను అధికారముచేత అక్రమించినవాఁడయి అతిబరువుగలరాయినిగట్టి పడవేయుంటచేత అగాధజలములో సారకాయ మునిఁగిపోయినటుల తానుకూడ

సంసారసముద్రమున మునుఁగుచున్నవాఁడయి నిశ్చయముగా దేహమే తానని యెడి విపరీతజ్ఞానమును పొందినవాఁడయి ప్రేతతిర్యఙ్మనుష్యాద్యనేక యోనులందు పుట్టుచుగిట్టుచు దరిగానక మునుఁగుచు తేలుచునుండఁగా అతి ప్రయాసచేత పుణ్యావశముచేత ఈశ్వరార్థము కర్మలు చేయవలయునను సదూహ కలుగుటవలన అట్టికర్మనాచరించుచు ఈశ్వరప్రీత్యర్థము చేయఁబడిన సత్కర్మానుష్ఠానముచేత పోఁగొట్టఁబడిన రాగాదిమలములు కలవాఁడై, "తద్యథేహకర్మచితోలోకః క్షీయతే ఏవమేవాముత్ర పుణ్యచితోలోకః క్షీయత ఏవ" అను ప్రమాణమునననుసరించి ఇహాముత్రార్థఫలభోగమునందు విరాగము గలవాఁడయి, శమాదిసాధనసంపత్తిగలవాఁడయి ఆత్మను తెలిసికొని జన్మజరామరణాది సకలవిధ పాశములచేత విడువఁబడుచున్నాఁడను విషయము తెలుపఁబడుచున్నది:—

మూ॥ అనాద్యనంతం కలిలస్య మధ్యే
విశ్వస్య స్రష్టార మనేకరూపమ్,
విశ్వస్యైకం పరివేష్టితారం
జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః ౧౩

పద॥ అనాద్యనన్తం కలిలస్య మధ్యే విశ్వస్య స్రష్టారం అనేకరూపమ్, విశ్వస్య ఏకం పరివేష్టితారం జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః.౧౩

టీక. (దేహీ = జీవుఁడు) అనాద్యనంతం = ఆద్యంతవిరహితుఁడును, కలిలస్య = గహనమయిన, సంసారముయొక్క, మధ్యే = మధ్యయందు, విశ్వస్య = ప్రపంచముయొక్క, స్రష్టారం = సృష్టికర్తయును, అనేకరూపం = అనేకవిధములయిన రూపములుఁగలవాఁడును, విశ్వస్య = ప్రపంచమునకు, ఏకం = ఒక్కఁడుగా, పరివేష్టితారం = చుట్టుకొనియుండువాఁడును, దేవం = జ్యోతిస్స్వరూపుఁడును అగుపరమాత్మను, జ్ఞాత్వా=

తెలిసికొని, సర్వపాశైః = సకలపాశములచేత, ముచ్యతే = వదలఁబడు చున్నాఁడు.

తా. దేహియగు జీవుఁడు అద్యంతవిరహితుఁడును, మాయానిష్పన్న మయిన గభీరమయిన యీసంసారసముద్రమునందు సృష్టికర్తగా నున్నవాఁడును, వివిధరూపములతో నుండువాఁడును, ప్రపంచమునందంతట సర్వవ్యాపియైయుండువాఁడును అగు జ్యోతిస్స్వరూపుఁడగు దేవుని ఎఱింగినయెడల జన్మజరామరణాదిసకలపాశముచేత విడువఁబడుచున్నాఁడు.

వివరణము — ఈశ్వేతాశ్వతరోపనిషత్తుయొక్క ౪-వ అధ్యాయమునందు కొంచెము పాఠభేదముతో ఈమంత్ర మిట్లు పఠింపఁబడినది —

మం. సూక్ష్మాతిసూక్ష్మం కలిలస్య మధ్యే
విశ్వస్య స్రష్టార మనేకరూపమ్,
విశ్వస్యైకం పరివేష్టితారం
జ్ఞాత్వా శివం శాంతి మత్యంత మేతి. ౧౪

౫-వ అధ్యాయము, ౧౪-వ మంత్రము.

అవ. ఆత్మనెఱింగినవానియొక్క ఫలము తెలుపఁబడుచున్నది:—

మూ. భావగ్రాహ్య మనీడాఖ్యం భావాభావకరం శివమ్,
కలాసర్గకరం దేవం యే విదుస్తే జహుస్తనుమ్ ౧౪

పద. భావగ్రాహ్యం అనీడాఖ్యం భావాభావకరం శివమ్. కలాసర్గకరం దేవం యే విదుః తే జహుః తనుమ్. ౧౪

శ్వేతాశ్వతరోపనిషది పఞ్చమోఽధ్యాయః సమాప్తః.

టీక. భావగ్రాహ్యం = పరిశుద్ధమయినమనస్సు చేత గ్రహింపఁదగిన వాఁడును, అనీడాఖ్యం=అనీడమనఁగా శరీరము కావున శరీరములేనివాఁడును, భావాభావకరం = భావాభావములను చేయువాఁడును, శివం = పరిశుద్ధుఁడును, కలాసర్గకరం = షోడశకళలయొక్క సృష్టిని చేయువాఁడును అగు, దేవం = దేవుని, యేవిదుః = ఎవ్వరు "అహమస్మి"యని తెలిసికొనుచున్నారో, తే = వారు, తనుం = దేహమును, జహుః = వదలుచున్నారు. అనఁగా శరీరాభిమానమును వదలుటచేత ముక్తులగుచున్నారు.

తా. నిర్మలాంతఃకరణముగలవారిచేత గ్రహింపఁదగినవాఁడును, శరీరవిరహితుఁడును, మంగళస్వరూపుఁడును - అనఁగా అవిద్యాతత్కార్యవినిర్ముక్తుఁడును, ప్రశ్నోపనిషదుక్తములగు ప్రాణాదినామాంతములగు షోడశకళలను ఉత్పాదకుఁడును, భావాభావములనొనర్చువాఁడును అగుదేవుని ఎవ్వరు తెలిసికొనుచున్నారో వారు శరీరమును వదలుచున్నారు. అనఁగా శరీరాభిమానమును వదలుటచేత ముక్తులగుచున్నారు.

## శ్వేతాశ్వతరోపనిషత్తునందు ఐదవఅధ్యాయము సమాప్తము



శ్రీ గురుభ్యో నమః.

కృష్ణయజుర్వేదాంతర్గత మగు

# శ్వేతాశ్వతరోపనిషత్తు

ఆంధ్రటీకాతాత్పర్యవివరణసమన్వితము.



## షష్ఠాధ్యాయము.

౬-వ అధ్యాయము, ౧-వ మంత్రము.

అవ. పంచమాధ్యాయముయొక్క చివరమంత్రమునందు "కలాసర్గకరం దేవం యేవిదుస్తేజహుస్తనుమ్" అని ఈశ్వరుఁడే ప్రపంచనిర్మాతయని చెప్పఁబడియున్నది. అయినను స్వభావ, కాల, నియతి మున్నగునవి ప్రపంచకారణములని పక్షాంతరములందు గలదు కావున తన్నిరాస మీయధ్యాయమునందు విషయదార్ఢ్యార్థము చేయఁబడుచున్నది.—

మూ. స్వభావమేకే కవయో వదంతి
కాలం తథాఽన్యే పరిముహ్యమానాః,
దేవస్యైష మహిమా తు లోకే
యేనేదం భ్రామ్యతే బ్రహ్మచక్రమ్ ౧

పద. స్వభావం ఏకే కవయః వదంతి కాలం తథా అన్యే పరిముహ్యా

మానాః, దేవస్య ఏషః మహిమా తు లోకే యేన ఇదం భ్రామ్యతే బ్రహ్మ-
చక్రమ్. ౧

టీక. కవయః=విద్వాంసులగు, ఏకే=కొందఱు, స్వభావం=(జగత్కారణము) స్వభావమని, వదంతి=చెప్పుచున్నారు. తథా=అదేవిధముగా, పరిముహ్యమానాః=అజ్ఞానవశులయిన, అన్యే=కొందఱు పండితులు, కాలం=(జగత్కారణమును) కాలమని, (వదంతి=చెప్పుచున్నారు.) లోకే=లోకమునందు, యేన=ఎవ్వనిచేత, ఇదం=ఈ, బ్రహ్మచక్రం=బ్రహ్మచక్రము, భ్రామ్యతే=భ్రమింపఁజేయఁబడుచున్నదో, ఏషః=ఈ, మహిమా=సామర్థ్యము, దేవస్యతు=ఈశ్వరునియొక్కయే.

తా. లోకమునందుగల విద్వాంసులలో కొందఱు జగత్కారణము స్వభావమని పలుకుచున్నారు. మరికొందఱు విద్వాంసులు యుక్త్యాదులచేత యెంతగా విచారించినను యథార్థమయిన జగత్కారణమును కనుగొనఁజాలక విమోహితులయి కాలమే జగత్కారణమని పలుకుచున్నారు. కాని పైరెండున్నూ సిద్ధాంతములు కాఁజాలవు. ఈబ్రహ్మచక్రమంతయుం ఈవిధముగా సంచరించుచుండుటకు మూలకారణము ఈశ్వరునియొక్క సామర్థ్యమే గాని మఱొక్కటి కాఁజాలదు.

వివరణము.—ఈయుపనిషత్తు ౧-వ అధ్యాయమునందు ౨-వ మంత్రమునందు

"కాలః, స్వభావో, నియతిః, యదృచ్ఛా భూతాని, యోనిః పురుషఇతి చింత్యా; సంయోగ ఏషాంనత్వాత్మభావాదాత్మా త్వనీశస్సుఖదుఃఖహేతోః" అని కాల, స్వభావ, నియతి; యదృచ్ఛా మున్నగునవి జగత్కారణములని ఆదియందు శ్రుతివిరుద్ధపక్షీయుల అభిప్రాయము అనువదింపఁబడినది. ఆదియందు ప్రతిపాదింపఁబడిన సిద్ధాంతమునే స్పష్టీకరించి

చెప్పుట ప్రాచీనులధర్మము కావున 'జగత్కారణము'లని వేదబాహ్యులయిన వారిచేత చెప్పఁబడునట్టి కాలస్వభావములిం దనువదింపఁబడియున్నవి. యని త్యాదికములుకూడ జగత్కారణములు కావని నిర్ణయింపఁబడినది. ఈ మంత్రమునందు 'స్వభావ' కాలములను జగత్కారణ భూతములయిన వానిని రెంటినిమాత్రమే చెప్పినను తక్కిన నియత్యాదికమునుకూడ గ్రహించుట యుక్తమే యగుచున్నది. శ్రీమచ్ఛంకరానందులవారు "దాతుః ప్రసాదో పాయః, ధాతుఃప్రార్థనాదికం ధాతాచ జగత్కర్తృత్వాదిగుణోదర్శితః, తద్గుణాన్యపి తత్త్వాని వాదిభిరనంతాన్యంగీకృతాని తతఃకస్యచిత్ ధాతుః ప్రసాదోమయా సంపాదనీయ ఇతి వ్యాకులితాంతఃకరణం అధికారిణ మవలోక్య మాతేవ సానుకంపా శ్రుతిః కాలాదిపక్షాన్పూర్వపక్షీకృత్య స్వయంప్రకాశమాన మానందాత్మానం ఫలరూపం ప్రతిపాదయితు మంతిమ మధ్యాయమారభతే" అని అవతారికనువ్రాసి ఈమంత్రమునకు టీకను వ్రాసియున్నారు.

౬-వ అధ్యాయము, ౨-వ మంత్రము.

అవ. ఆపరమేశ్వరునియొక్క మహిమ యిట్టిదని వివరింపఁబడు చున్నది —

మూ॥ యేనావృతం నిత్యమిదం హి సర్వం
జ్ఞః కాలకారో గుణీ సర్వవిద్యః,
తేనేశితం కర్మ వివర్తతే హ
పృథ్వ్యాప్యతేజోఽనిలఖాని చింత్యమ్ ౨

పద. యేన ఆవృతం నిత్యం ఇదం హి సర్వం జ్ఞః కాలకారః గుణీ సర్వవిద్యః, తేన ఈశితం కర్మ వివర్తతే హ పృథ్వ్యాప్యతేజోఽనిలఖాని చింత్యమ్. ౨

టీక. యేన = ఏపరమేశ్వరునిచేత, ఇదం సర్వం=ఈకనంబడుచున్న ప్రపంచమంతయు, నిత్యం = నియమముగా, ఆవృతం = వ్యాప్తమయియున్నదో, (సః = ఆపరమేశ్వరుఁడు) జ్ఞః = జ్ఞానస్వరూపుఁడు, కాలకారః = కాలమునకు కూడ కర్త, గుణీ = అపహతపాప్మాది సర్వసద్గుణశోభితుఁడు, సర్వవిద్యః =సర్వము నెఱింగినవాఁడు, తేన=అట్టి ఈశ్వరుని చేత, ఈశితం= ప్రేరితమయినదై, కర్మ=(శుభాశుభరూపమయిన) కర్మము, వివర్తతే=వివర్తమును పొందుచున్నది. (ఆవివర్తము) పృథ్వ్యప్యతేజోఽనిలఖాని = భూమి, జల, అగ్ని, వాయు, ఆకాశములని, చింత్యం = తలంచవలయును.

తా. ఏపరమేశ్వరునిచేత ఈప్రపంచమంతయు నియమముగా వ్యాప్తమయియున్నదో అట్టి పరమేశ్వరుఁడు జ్ఞానస్వరూపుఁడు. కాలమునకుకూడ కర్త దోషములు లేనట్టి మంగళగుణస్వరూపుఁడు. మఱియు, సర్వము నెఱింగినవాఁడు. అట్టి పరమేశ్వరునిచేత శుభాశుభరూపమయినకర్మము ప్రేరితమయినదై జగద్రూపముగా వివర్తమును పొందుచున్నది. ఆవివర్తమే పృథివి, జల, అగ్ని, వాయు, ఆకాశములని యెఱుఁగవలయును.

వివరణము:—'జ్ఞః కాలకాలః' అని పాఠాంతరము గలదు. అప్పుడు సర్వనియంతయగు కాలునకుకూడ నియంతయని యర్థమును గ్రహించునది.

౬-వ అధ్యాయము, 3, ౪-వ మంత్రములు.

అన. ఈశ్వేతాశ్వతరోపనిషత్తుయొక్క ప్రథమాధ్యాయముయొక్క రెండవమంత్రమునందు "భూతానియోనిః పురుష ఇతి చింత్యమ్" అని చెప్పఁబడినవిషయము ఇట వివరింపఁబడుచున్నది —

మూ॥ తత్కర్మ కృత్వా వినివర్త్య భూయః
తత్త్వస్య తత్త్వేన సమేత్య యోగమ్,

ఏకేన ద్వాభ్యాం త్రిభి రష్టభిర్వా
కాలేన చైవాత్మగుణైశ్చ సూక్ష్మైః 3

పద. తత్ కర్మ కృత్వా వినివర్త్య భూయః తత్త్వస్య తత్త్వేన సమేత్య యోగమ్, ఏకేన ద్వాభ్యాం త్రిభిః అష్టభిః వా కాలేన చ ఏవ ఆత్మగుణైః చ సూక్ష్మైః. 3

మూ. ఆరభ్య కర్మాణి గుణాన్వితాని
భావాంశ్చ సర్వా న్వినియోజయేద్యః,
తేషా మభావే కృతకర్మనాశః
కర్మక్షయే యాతి స తత్త్వతోఽన్యః ४

పద. ఆరభ్య కర్మాణి గుణాన్వితాని భావాన్ చ సర్వాన్ వినియోజయేత్ యః, తేషాం అభావే కృతకర్మనాశః కర్మక్షయే యాతి సః తత్త్వతః అన్యః. ४

టీక. యః = ఏపరమేశ్వరుఁడు, తత్=ఆ, కర్మ=సృష్టికార్యమును, కృత్వా = చేసి, వినివర్త్య=బాగుగాచూచి, భూయః=మఱల, తత్త్వస్య= తత్త్వస్వరూపుఁడగు ఆత్మయొక్క, తత్త్వేన = స్వరూపమగు భూమ్యాదికముతో, యోగం=సంబంధమును, సమేత్య=పొంది, ఏకేన=ఒక్క దానిచేతఁగాని, ద్వాభ్యాం=రెంటిచేతఁగాని, త్రిభిః=మూఁడింటిచేతఁగాని,అష్టభిః వా=ఎనిమిదింటిచేతఁగాని, కాలేన = కాలముచేతఁగాని, సూక్ష్మైః = సూక్ష్మములయిన, ఆత్మగుణైః చ = కామాదికములగు అంతఃకరణగుణములచేఁగాని, గుణాన్వితాని=గుణములతోఁగూడిన, కర్మాణి = కర్మలను, ఆరభ్య= చేసి, (ప్రకటించెనో) యః = ఎవ్వఁడు, సర్వాన్ భావాన్ = ఈసర్వపదార్థములను, వినియోజయేత్ = ఈశ్వరునియందు సమర్పించునో, సః=

వాఁడు, తేషాం = ఆపదార్థములయొక్క, అభావే = అభావదశయందు, కృతకర్మనాశః=పూర్వకృతమగు కర్మముయొక్క నాశముగలవాఁడు ఆగుచున్నాఁడు.సః = అట్టికర్మనాశముగలవాఁడు, కర్మక్షయే = జన్మాంతరకృతమగుకర్మ నశించినదగుచుండఁగా, తత్త్వతః=పృథివ్యాది తత్త్వములకంటె, అన్యః = వేఱయినవాఁడయి, యాతి = బ్రహ్మమును పొందుచున్నాఁడు.

తా. పరమేశ్వరుఁడు సృష్టినిచేసినవాఁడయి దానిని బాగుగా ఆలోచించి మఱల తత్త్వస్వరూపములో సంబంధమును పొందినవాఁడయి ఒకటి, రెండు, మూఁడు, ఎనిమిది అగువానితోను కాలముతోను సూక్ష్మములగు కామాద్యంతఃకరణగుణములతోను త్రిగుణాత్మకములగు సకలపదార్థములను సృజించెను. ఈసృజించిన సకలభావములను ఎవ్వఁడు పరమేశ్వరునియందే సమర్పించునో అట్టివాఁడు కర్మనాశముగలవాఁ డగుచున్నాఁడు. అట్టి కర్మక్షయముగలవాఁడు పృథివ్యాదితత్త్వములకంటె ఇతరుఁడగు పరమాత్మను పొందుచున్నాఁడు. పరమేశ్వరునియందు కర్మఫలమును సమర్పించినవారలకు ముక్తికలుగుననుటకు ప్రమాణములు —

శ్లో. యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసియత్,
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వమదర్పణమ్.
శుభాశుభఫలైరేవం మోక్ష్యసే కర్మబంధనైః,
బ్రహ్మణ్యాధాయకర్మాణి సంగంత్యక్త్వా కరోతియః.
లిప్యతేనసపాపేన పద్మపత్ర మివాంభసా,
కాయేనమనసాబుద్ధ్యా కేవలై రింద్రియైరపి
యోగినః కర్మకుర్వంతి సంగంత్యక్త్వాఽఽత్మశుద్ధయే.
భూమిరాపోఽనలోవాయుః ఖం మనో బుద్ధిరేవ చ,
అహంకార ఇతీయం మే భిన్నాప్రకృతి రష్టధా.

అని అష్టవిధప్రకృతులు చెప్పఁబడుచున్నవి. తత్త్వములకంటె ఇతరుఁడగు ఆత్మయనఁగా అవిద్యా తత్కార్యములచేత వినిర్ముక్తుఁడును, చిత్స్వరూపుఁడును, అద్వితీయ బ్రహ్మాత్మస్వరూపుఁడు నని యెఱుంగునది.

వివరణము — "కర్మక్షయే యాతి సతత్త్వతోఽన్యత్" అని పాఠాంతరము ౪-వ మంత్రమున గలదు. వ్యాఖ్యానాంతరములం దీమంత్రములు ప్రకారాంతరముగా వ్యాఖ్యాతములయి యున్నవి. తద్విధము తెలుపఁబడుచున్నది —

౧ నారాయణదీపిక:—

అవ. మంత్రద్వయముచేత మోక్షసాధనోపాయము చెప్పఁబడుచున్నది:—

టీక. తత్ =మనుష్యశరీరసాధ్యమగు, కర్మ = కర్మను, కృత్వా= చేసి, భూయః=మఱల, వినివర్త్య = మఱలినవాఁడయి, (అనఁగా నివృత్త్యభిముఖుఁడై) తత్త్వస్య = తత్త్వమస్యాదివాక్యప్రతిపాదితపరమాత్మయొక్క, తత్త్వేన=తత్త్వమగు బ్రహ్మముతో, యోగం=ఐక్యమును, సమేత్య=పొంది, (తత్త్వమస్యాదిమహావాక్యార్థశ్రవణముచేత కర్మక్షయము గాగా మోక్షమును పొందుచున్నాఁడని పైమంత్రమునందు చెప్పఁబడినదానితో అన్వయము) ఎట్టివాఁడు ఎంతకాలమునకు పొందుచున్నాఁడనువిషయము తెలుపఁబడుచున్నది —(ఒకానొకసాధకుఁడు) కాలేన = కాలముచేతనున్నూ, సూక్ష్మైః=సూక్ష్మవస్తుప్రకాశభూతములగు, ఆత్మగుణైః = ధర్మజ్ఞానాదిగుణములచేతనున్నూ, ఏకేన = ఒక్కజన్మముతో (వానియొక్క ప్రయత్నానుసారము ముక్తుఁ డగుచున్నాఁడు.)(ఒకానొకఁడు,) ద్వాభ్యాం=రెండుజన్మములతో (ముక్తుఁడగుచున్నాఁడు) (మఱొకఁడు,) త్రిభిః=మూఁడుజన్మములలో (ప్రయత్నానుసారము ముక్తుఁడగుచున్నాఁడు.) (మఱొకఁడు) అష్టభిః వా=

ఎనిమిదిజన్మములతో ప్రయత్నానుసారము ముక్తుఁడగుచున్నాఁడు. (బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్మాం ప్రపద్యతే - అను గీతావాక్య మిందులకు ప్రమాణము.) 3

టీక. యః=ఎవ్వఁడు, గుణాన్వితాని = గుణవంతములగు, కర్మాణి= విహితములయిన కర్మలను, ఆరభ్య = చేసి, సర్వాన్ భావాన్ = చక్షురాది సర్వవిషయములను, వినియోజయేత్=ఆత్మయందు లేక ఆయాస్థానములందు వినియోగించునో, సః=వాఁడు, తేషాం = ఆచేసిన కర్మలయొక్క, అభావే= అభావమునందు, కృతకర్మనాశః = చేయఁబడినకర్మలు నశించినవాఁడగు చున్నాఁడు, సః=అట్టివాఁడు, కర్మక్షయే = కర్మక్షయమునందు, తత్త్వతః= తత్త్వములకంటె, అన్యః=వేఱయినవాఁడు, భవతి=అగుచున్నాఁడు. ౪

తా. ఎవ్వఁడు సకలవాసనలను ఆత్మయందు వినియోగించుచున్నాఁడో అట్టివాఁడు చేసినకర్మలన్నియు విషయాభిలాషతో చేసినవి కావు. కనుక అట్టికర్మలు ఫలము నొసంగఁజాలవు. అప్పుడు వాఁడు చేసిన కర్మఫలకారి కాజాలదు. కావున కర్మనాశమగుచున్నది. కర్మక్షయమయినయెడల ప్రపంచాతీతుఁడగుపరమాత్మను పొందుచున్నాఁడు. ఈవిషయమే మంత్ర మునం దిట్లు చెప్పఁబడినది —

> ఆపూర్యమాణ మచలప్రతిష్ఠం సముద్రమాపః ప్రవిశంతి యద్వత్,
> తద్వత్కామాయం ప్రవిశంతి సర్వే సశాంతి మాప్నోతినకామకామీ.

౨ విజ్ఞానభగవద్వ్యాఖ్యః—

టీక. తత్కర్మ=పరమేశ్వరునకు సంబంధించినకర్మను, కృత్వా=చేసి, (చేయఁబడిన ఈశ్వరారాధనరూపకర్మచేత నిర్మలాంతఃకరణుఁడై,) భూయః= మఱల, వినివృత్య=సర్వకర్మలనుండి మఱలి, తత్త్వస్య=(కార్యకరణసం ఘాతసాక్షియగుటవల్లను, అవస్థాత్రయసాక్షియగుటవల్లను, అవస్థాత్రయము

నందు నశింపని స్వరూపముగలవాఁ డగుటవల్లను వానికంటెఁ వ్యతిరిక్తభూతుఁ డయినట్టియు, త్వంపదార్థభూతుఁడయినట్టియు,) ఆత్మతత్త్వమునకు, తత్త్వేన =తత్పదార్థభూతుఁడయిన పరమేశ్వరునియొక్క తత్త్వముతో, ఏకేన=గురూపసదనముచేతను, ద్వాభ్యాం=గురుభక్తి ఈశ్వరభక్తులచేతను, త్రిభిః = శ్రవణమనననిదిధ్యాసలచేతను, అష్టభిః వా=యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణా, సమాధులచేతను, కాలేన ఈజన్మమునందుగాని జన్మాంతరమునందుగాని జ్ఞానార్థముచేయఁబడిన సత్కర్మపరిపాక) కాలముచేతను, సూక్ష్మైః = సూక్ష్మములయినట్టి, ఆత్మగుణైః చ = దయా, క్షాంతి, శౌచ, మాంగల్య, అస్పృహ, అకార్పణ్య, అనాయాస, అనసూయలను ఆత్మగుణములచేతను, చకారముచేత, చత్వారింశత్సంస్కారములచేతను, ఇట్టిసాధనకలాపముచేత, యోగం = పరమేశ్వరునితో ఐక్యలక్షణమయినసంబంధమును, సమేత్య=పొంది (ముక్తుఁ డగుచున్నాఁడు)·—

గౌతముఁడు చత్వారింశత్సంస్కారములను పేర్కొనియున్నాఁడు.

టీక. కర్మాణి=నిత్యనైమిత్తికకర్మలను, గుణాన్వితాని=ఈశ్వరారాధనరూపగుణముగలవానినిగా, ఆరభ్య=ఆరంభించిచేసి (ఈశ్వరారాధనపూర్వకముగనొనర్చిన నిత్యకర్మానుష్ఠానముచేత పరిపక్వచిత్తుఁడయి), భావాన్ = సర్వపదార్థములను, వినియోజయేత్ = (ఆత్మయందు) చేర్చవలయును, తేషాం= ఆకర్మలయొక్క, అభావే = అభావమునందు, కృతకర్మనాశః = అనారబ్ధఫలమయిన సంచితాగామిరూపమయిన చేయఁబడిన కర్మయంతయు నశించుచున్నది. (అనఁగా విషయాభిలాషలేక కర్మలననుష్ఠించుటచేత ఆకర్మఫలకారి కాఁజాలదు. కావున కర్మనాశమని చెప్పఁబడుచున్నది. కర్మక్షయే=అనుభోగముచేత ప్రారబ్ధకర్మక్షయించినది అగుచుండఁగా, తత్త్వతః=దేహేంద్రియాదితత్త్వములకంటె, అన్యుఁడయి, యాతి=బ్రహ్మమునుపొందుచున్నాఁడు. ఈవ్యాఖ్యయందు యతియొక్క సమాధి కథనమిట్లువివరింపఁబడినది —

యదగ్నేరోహితంరూపం తేజసస్తద్రూపం యచ్ఛుక్లంతదపాంయత్కృష్ణం తదన్నస్యాయా దగ్నేరగ్నిత్వం; వాచారంభణం వికారోనామధేయం త్రీణిరూపాణీత్యేవ సత్యమితి శ్రుత్యన్తరోక్తప్రకారేణ స్థూలం వ్యష్టిజాతం స్థూలసమష్టిషు వినియోజ్యతావన్మాత్రతయావితర్క్య స్థూలసమష్టీరపి పంచీకృతమహాభూతేషు వినియోజ్యతావన్మాత్రతయాచింతయిత్వా తేష్వప్యుత్తరోత్తరభూతం పూర్వపూర్వభూతమాత్రతయా ప్రవిలాప్య తదపితన్మాత్రతయా ప్రవిలాప్యతన్మాత్రమప్యుత్తరోత్తరతన్మాత్రం పూర్వపూర్వతన్మాత్రతయా ప్రవిలాప్యతదపి మూలప్రకృతిమాత్రతయా ప్రవిలాప్య తా మపి మాయాం సన్మాత్రతయా ప్రవిలాప్య తదపి చిన్మాత్రతయా బుద్ధ్వాతామపిచితిం ఆనందమాత్రతయా బుద్ధ్వా తమప్యానంద మద్వితీయ మాత్రతయా బుద్ధ్వా అద్వితీయసచ్చిదానందైకరసంవస్తు ప్రత్యక్త్వేన వినియోజయేత్.

౬-వ అధ్యాయము, ౫-వ మంత్రము.

అవ. ఈ వెనుక చెప్పినవిషయమును దృఢపఱుచుటకయి విషయాంధులయినవారలు బ్రహ్మము నెఱుంగువిషయము తెలుపఁబడుచున్నది —

మూ॥ ఆదిస్ససంయోగ నిమిత్తహేతుః
పరస్త్రికాలాదకలోఽపిదృష్టః,
తం విశ్వరూపం భవభూతమీడ్యం
దేవం స్వచిత్తస్థముపాస్య పూర్వమ్ ౫

పద. ఆది సః సంయోగనిమిత్తహేతుః పరః త్రికాలాత్ అకలః అపి దృష్టః, తం విశ్వరూపం భవభూతం ఈడ్యం దేవం స్వచిత్తస్థం ఉపాస్య పూర్వమ్. ౫

టీ. సః=ఆపరమాత్మయే, ఆదిః=సకలమునకు కారణభూతుఁ డగుచున్నాఁడు. సంయోగనిమిత్తహేతుః=శరీరసంయోగమునకు నిమిత్తభూతములయిన అవిద్యాదులకు కారణభూతుఁడును అగుచున్నాఁడు. త్రికాలాత్ = భూతభవిష్యద్వర్తమానములను కాలత్రయముకంటె, పరః = వేఱయినవాఁడును, (మఱియు) అకలః అపి=ప్రాణాదినామాంతములగు షోడశకలావిరహితుఁడుగను, దృష్టః=చూడఁబడుచున్నాఁడు. విశ్వరూపం=సకలవిధరూపములుగలవాఁడును, భవభూతం = సకలమునకు కారణభూతుఁడును, స్వచిత్తస్థం=తనహృదయమునం దున్నవాఁడును, ఈడ్యం=కొనియాడఁదగినవాఁడును అగు, దేవం=స్వయంప్రకాశమానుఁడగు దేవుని, పూర్వం=ముందుగా, ఉపాస్య = ఉపాసనమొనర్చి (యాతి = ఆబ్రహ్మమును పొందుచున్నాఁడు.)

తా. ఈపరమాత్మయే సకలప్రపంచమునకు కారణభూతుఁడు. మఱియు ఇతఁడే శరీరసంయోగమునకు నిమిత్తములగు అవిద్యాదులకున్ను కారణభూతుఁడు, "ఏషఏవసాధుకర్మకారయతి ఏషఏవాసాధుకర్మకారయతి." అనియు శ్రుతిచెప్పుచున్నది. అతీతానాగతవర్తమానములను కాలత్రయముకంటె ఇతఁడు వేఱయినవాఁడు. ఇందులకు ప్రమాణము:—

> యస్మా దర్వాక్సంవత్సరో అహోభిః పరివర్తతే,
> తద్దేవాజ్యోతిషాంజ్యోతిః ఆయుర్హోపాసతేఽమృతమ్.

మఱియు నితఁడు అకలుఁడు—ప్రాణాదినామాంతములగు షోడశకలలుగలవస్తువు కాలత్రయపరిచ్ఛిన్నమగుటచేత నశించును. ఇతఁడు అకలుఁడగుటచేత నిష్ప్రపంచుఁడు కావున కాలత్రయపరిచ్ఛిన్నుఁడయి నశించువాఁడు కాఁడని భావము. ప్రాణాదిషోడశకళలు ప్రశ్నోపనిషత్తుయొక్క షష్ఠప్రశ్నమునం దిట్లు చెప్పఁబడినవి —

శ్రు. 1 సప్రాణ, మసృజత ప్రాణా, 2 చ్ఛ్రద్ధాం, 3 ఖం, 4 వాయు, 5 ర్జ్యోతి, 6 రాపః, 7 పృథివీ, 8 ఇంద్రియం, 9 మనో, 10 ఽన్న, మన్నా, 11 ద్వీర్యం, 12 తపో, 13 మంత్రాః, 14 కర్మ, 15 లోకా లోకేషుచ 16 నామ చ.

అనఁగా కాలత్రయ పరిచ్ఛిన్నరహితుఁడును, విశ్వరూపుఁడును— అనఁగా నానావిధస్వరూపములు గలవాఁడును, సర్వమునకు తానే కారణ భూతుఁడును, అవితర్క్యస్వరూపుఁడును కొనియాడఁదగినవాఁడును స్వయం ప్రకాశమానుఁడును అగు దేవుని స్వహృదయాకాశాంతరవస్థితునిగా భావించి ఉపాసించినవాఁడు—అనఁగా "అయమహమస్మి" యను భావనతో సర్వదా ధ్యానించువాఁడు ఆబ్రహ్మమును పొందుచున్నాఁడు.

వివరణము —ఆత్మ అంతకు పరుఁడనువిషయమును కఠశ్రుతి ఇట్లు చెప్పుచున్నది —

శ్రు. ఇంద్రియేభ్యః పరాహ్యర్థాః అర్థేభ్యశ్చ పరంమనః,
మనసస్తు పరాబుద్ధిః బుద్ధేరాత్మా మహాన్పరః. ౧౦
మహతః పరమవ్యక్తం అవ్యక్తాత్పురుషః పరః,
పురుషాన్నపరం కించిత్సా కాష్ఠా సాపరాగతిః. ౧౧

కఠ. ౧-అ. వల్లి-3.

ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జునతిష్ఠతి,
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా.

అను గీతాస్మృతి పరమేశ్వరుఁడు ప్రాణుల హృదయగుహాయం దుండునని తెలుపుచున్నది. 'పూర్వం ఉపాస్య' అని చెప్పుటచేత జ్ఞానోత్పత్తికంటె ముందు ఉపాసనాదికము ఆవశ్యకమని తెలియవచ్చుచున్నది.

'సంయోగ నిమిత్తహేతుః' అనుపదము విజ్ఞానభగవద్వ్యాఖ్య

యందు శరీరసంయోగనిమిత్తములగు పుణ్యపాపములకు కారణభూతుఁడని వ్యాఖ్యాతమయినది.

విశ్వరూపం = అనుశబ్దము 'ఉపాసకైః యద్యద్రూప ముపాస్యతే తత్తద్రూపధారిణమ్' అని వ్యాఖ్యాతమయినది. అనఁగా ఉపాసకు లేరూపముతో ధ్యానించిన వారినిమిత్త మట్టిరూపమును ధరించువాఁడని భావము.

ఈమంత్రము కొందఱిచేత సగుణవస్తుపరముగను కొందఱిచేత నిర్గుణ వస్తుపరముగను వ్యాఖ్యాతమయినదని విజ్ఞానభగవద్వ్యాఖ్యయందు వ్రాయఁబడియున్నది. విశేషమును గమనింపఁగోరువారావ్యాఖ్యానమును గాంచునది. ఉపాసనమనఁగా విజాతీయ ప్రత్యయ శూన్యముగా సజాతీయ ప్రత్యయ ప్రవాహము కలిగియుండుట అని శంకరానందదీపికయందు చెప్పఁబడినది. అనఁగా ఏదేవతను తాను హృదయమునందు భావించి స్మరించుచుండునో అట్టిభావనమునకు భిన్నమయిన జ్ఞానము లేక సర్వదా అట్టిజ్ఞానమే అవిచ్ఛిన్నముగా కలిగియుండుట. నిరంతరముగ తద్విషయమునే భావించుట.

౬-వ అధ్యాయము, ౬-వ మంత్రము.

అవ. మఱల ఆయాత్మయే వివరింపఁబడుచున్నది.—

మూ. సవృక్షకాలాకృతిభిః పరోఽన్యో
యస్మా త్ప్రపంచః పరివర్తతేఽయమ్,
ధర్మావహం పాపనుదం భగేశం
జ్ఞాత్వాఽఽత్మస్థమమృతం విశ్వధామ ౬

పద. సః వృక్షకాలాకృతిభిః పరః అన్యః యస్మాత్ ప్రపంచః పరివర్తతే అయమ్, ధర్మావహం పాపనుదం భగేశం జ్ఞాత్వా ఆత్మస్థం అమృతం విశ్వధామ. ౬

టీక. యస్మాత్ = ఏపరమేశ్వరునివల్లనుండి, అయంప్రపంచః = ఈ ప్రపంచము, పరివర్తతే = ప్రవర్తించుచున్నదో, సః = ఆపరమేశ్వరుఁడు, వృక్షకాలాకృతిభిః = సంసారవృక్ష కాలములయొక్క ఆకారములకంటె, పరః = శ్రేష్ఠుఁడయినవాఁడు, అన్యః=వేఱయినవాఁడును (అగుచున్నాఁడు). (అట్టియాత్మను) ధర్మావహం = ధర్మమును వహించువానిగను, పాపనుదం = పాపమును నశింపఁజేయువానిగను, భగేశం = షడ్గుణైశ్వర్యమునకు ప్రభువయినవానిగను, ఆత్మస్థం = హృదయగుహాంతర్వర్తిగను, అమృతం = మరణధర్మవిరహితునిగను, విశ్వధామ = ప్రపంచమునకు ఆధారభూతునిగను, జ్ఞాత్వా=తెలిసికొని (ఆబ్రహ్మమును పొందుచున్నాఁడు).

తా. ఏపరమేశ్వరునివల్లనుండి ఈప్రపంచమంతయు సృష్టిస్థితిలయములను గాంచుచున్నదో, అట్టిపరమేశ్వరుఁడు ఈ సంసారవృక్షము కంటె కాలముకంటెను శ్రేష్ఠుఁడును, భిన్నుఁడును అగుచున్నాఁడు. "ఊర్ధ్వమూలోఽవాక్శాఖః ఏషోఽశ్వత్థ స్సనాతనః" అని ప్రపంచము వృక్షాత్మకముగ కఠశ్రుతియందు నిరూపితమైనది. అట్టిపరమేశ్వరుని, ధర్మ సంరక్షకునిగను, పాపనివారకునిగను, షడ్గుణైశ్వర్యమునకు అధిపతిగను, హృదయగుహాంతర్వర్తిగను, మరణ ధర్మరహితునిగను, ప్రపంచమున కాధారభూతునిగను తెలిసికొన్నవాఁడు ఆబ్రహ్మమును పొందుచున్నాఁడు.

వివరణము —విజ్ఞాన భగవద్వ్యాఖ్యయందీమంత్ర మీయవతారికతో వ్యాఖ్యాతమైనది:—

"పరమేశ్వరస్య సంసారదోషాస్పృష్టత్వం సర్వద్వైతకల్పనాధిష్ఠానత్వం తద్ధర్మప్రాపయితృత్వం నిరంకుశైశ్వర్యత్వం తద్జ్ఞానాత్ మోక్షసిద్ధించాహ"-'వృక్షకాలాకృతిభిః' అనుచోట పంచమ్యర్థమునందుతృతీయ.

౬-వ అధ్యాయము, ౭-వ మంత్రము.

అవ. ఇదివఱకు చెప్పఁబడినవిషయము విద్వదనుభవముచేత దృఢీకరింపఁబడుచున్నది —

మూ॥ తమీశ్వరాణాం పరమం మహేశ్వరం
తం దేవతానాం పరమఞ్చదైవతమ్,
పతిం పతీనాం పరమం పరస్తాత్
విదామ దేవం భువనేశమీడ్యమ్ ౭

పద. తం ఈశ్వరాణాం పరమం మహేశ్వరం తం దేవతానాం పరమం చ దైవతమ్, పతిం పతీనాం పరమం పరస్తాత్ విదామ దేవం భువనేశం ఈడ్యమ్. ౭

టీక. తం = ఆపరమేశ్వరుని, ఈశ్వరాణాం = వైవస్వతయమాదులలోపల, పరమం = శ్రేష్ఠుఁడయిన మహేశ్వరునిగను, తం = ఆఈశ్వరుని, దేవతానాం = ఇంద్రాదిదేవతలలోపల, పరమందైవతంచ = శ్రేష్ఠమైన దేవతగను, పతీనాం = ప్రజాపతులలోపల, పరమంపతిం = శ్రేష్ఠుఁడైన ప్రజాపతిగను, పరస్తాత్ = అక్షరస్వరూపునికంటె పరునిగను, ఈడ్యం = కొనియాడఁదగినవానిగను, భువనేశం = లోకమునకు ప్రభువైనవానిగను, విదామ = తెలిసికొనుచున్నారము.

తా. ఆపరమేశ్వరుని వైవస్వతుఁడగుయముఁడు మున్నగు వారికంటె గొప్పవానిగను, ఇంద్రాదిదేవతలలోపల శ్రేష్ఠమయిన దైవతముగను, సృష్టికర్తలగు ప్రజాపతులలోపల శ్రేష్ఠుఁడయిన ప్రజాపతిగను, అక్షరస్వరూపునికంటె పరునిగను, ప్రకాశస్వరూపునిగను, లోకేశునిగను కొనియాడఁదగినవానిగను తెలిసికొనుచున్నామని విద్వాంసులగు వారలు స్వానుభవమును తెలిపిరి.

౬-వ అధ్యాయము, ౮-వ మంత్రము.

అవ. మహేశ్వరత్వ మెట్లనువిషయము తెలుపఁబడుచున్నది:—

మూ. న తస్య కార్యం కరణఞ్చ విద్యతే
న తత్సమశ్చాప్యధికశ్చ దృశ్యతే,
పరాఽస్య శక్తిర్వివిధైవ శ్రూయతే
స్వాభావికీ జ్ఞానబలక్రియా చ. ౮

పద. న తస్య కార్యం కరణం చ విద్యతే న తత్సమః చ అపి అధికః చ దృశ్యతే, పరా అస్య శక్తిః వివిధా ఏవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ. ౮

టీక. తస్య=అపరమేశ్వరునకు, కార్యం = శరీరము, కరణంచ=చక్షురాదీంద్రియజాతమును, న విద్యతే = లేదు, తత్సమః = అపరమేశ్వరునకు సముఁడు కాని, అధికఃచ = అధికుఁడుకాని, నదృశ్యతే = కనంబడుటలేదు. అస్య=ఈపరమేశ్వరునియొక్క, పరా=శ్రేష్ఠమయిన, శక్తిః=శక్తి, వివిధా ఏవ=నానావిధమయినదిగా, శ్రూయతే=వేదములందు ప్రతిపాదింపఁబడుచున్నది. (అపరమేశ్వరునిశక్తి) స్వాభావికీ=స్వభావసిద్ధమయినది, జ్ఞానబలక్రియాచ=జ్ఞానక్రియయును బలక్రియయును గలది.

తా. అపరమేశ్వరునకు కార్యము-అనఁగా శరీరముగాని కరణము-అనఁగా చక్షురాదీంద్రియములుగాని లేవు. అపరమేశ్వరునితో సముఁడు కాని అధికుఁడు కాని ఎవ్వఁడు గనంబడఁడు. అపరమేశ్వరునియొక్క శ్రేష్ఠమయినశక్తి నానావిధముగా నుండునని వేదములు ప్రతిపాదించుచున్నవి. ఆ ఈశ్వరశక్తి స్వాభావికమయినది. జ్ఞానక్రియయును బలక్రియయుఁ గలది. జ్ఞానక్రియ యనఁగా సర్వవిషయజ్ఞానప్రవృత్తిగలది. బలక్రియ

యనఁగా స్వసన్నిధి మాత్రముచేత సర్వమును స్వాధీనముచేసికొని నియమించునది.

౬-వ అధ్యాయము, ౯-వ మంత్రము.

మూ. న తస్య కశ్చిత్పతిరస్తి లోకే
న చేశితా నైవ చ తస్య లిఙ్గమ్,
స కారణం కరణాధిపాధిపో
న చాస్య కశ్చిజ్జనితా న చాధిపః. ౯

పద. న తస్య కః చిత్ పతిః అస్తి లోకే న చ ఈశితా న ఏవ చ తస్య లిఙ్గమ్, స కారణం కరణాధిపాధిపః న చ అస్య కః చిత్ జనితా న చ అధిపః. ౯

టీక. లోకే = లోకమునందు, తస్య = ఆపరమేశ్వరునకు, కశ్చిత్ పతిః = ఒకానొకఁడయిన యజమానుఁడు, న=లేఁడు. తస్య=ఆపరమాత్మకు, ఈశితా నచ = నియంతయు లేదు. (ఆపరమేశ్వరునకు) లింగం =చిహ్నమున్నూ, నైవ=లేదు. సః=ఆపరమేశ్వరుఁడు, కారణం = సర్వమునకు కారణము, కరణాధిపాధిపః = కరణములనఁగా ఇంద్రియములకు అధిష్ఠానదేవతలగు సూర్యాదులకున్నూ ప్రభువు, అస్య = ఈపరమేశ్వరునకు, జనితా=జనకుఁడు,న కశ్చిత్ =ఒకఁడున్నూ లేఁడు, అధిపః=ప్రభువున్నూ,నచ=లేఁడు.

తా. ఈపరమేశ్వరుఁడు కార్యకరణాదిశూన్యుఁ డగుటచేత ఇతనికి ప్రభువుగాని నియంతగాని లేఁడు. ఇతఁ డిట్టివాఁడని ఊహించుటకు లింగభూతమయిన చిహ్నముగాని లేదు. ఇతఁడే సర్వకారణభూతుఁడు. ఇతఁడే ఇంద్రియాధిష్ఠాన దేవతలగు సూర్యాదిదేవతలకు ప్రభువు. ఇతనికి జనకుఁడుగాని, ఇతనికంటె అధికుఁడుగాని మఱొకఁడు లేఁడు.

౬-వ అధ్యాయము, ౧౦-వ మంత్రము.

అవ. మంత్రద్రష్ట తన స్వాభిప్రాయమును ప్రకటించుచున్నాఁడు:-

మూ. యస్తన్తునాభ ఇవ తన్తుభిః ప్రధానజైః స్వభావతో దేవ ఏకః స్వమావృణోత్, స నో దధాద్బ్రహ్మాప్య యమ్. ౧౦

పద. యః తన్తునాభః ఇవ తన్తుభిః ప్రధానజైః స్వభావతః దేవః ఏకః స్వం ఆవృణోత్, సః నః దధాత్ బ్రహ్మాప్యయమ్. ౧౦

టీక. స్వభావతః = స్వభావముగా, దేవః = ప్రకాశించువాఁడును, ఏకః = అద్వితీయుఁడును అగు, యః = ఏపరమేశ్వరుఁడు, తంతునాభః = సాలెపురుగు, తంతుభిః ఇవ=స్వోత్పన్నములగు దారములచేతనువలె, ప్రధానజైః=అవ్యక్తమునుండి పుట్టిన నామరూపకర్మములను తంతువులచేత, స్వం= ఆత్మను, ఆవృణోత్=ఆవరించుకొనెనో, సః = అట్టి పరమాత్మ, నః = మాకు, బ్రహ్మాప్యయం=బ్రహ్మమునం దేకీభావమును, దధాత్=ఇచ్చుఁగాక.

తా. స్వభావముగా ప్రకాశించువాఁడును అద్వితీయుఁడును అగు పరమేశ్వరుఁడు, సాలెపురుగు తనయందు పుట్టిన దారములచేత ఎటుల చుట్టఁబడుచున్నదో ఆదేవిధముగా అవ్యక్తమునుండి పుట్టిన నామరూపకర్మాది పాశములచేత ఆవరింపఁబడుచున్నాఁడు. అట్టి పరమేశ్వరుఁడు నాకు బ్రహ్మైక్యభావమును కలుగఁజేయుఁగాక.

౬-వ అధ్యాయము, ౧౧-వ మంత్రము.

అవ. ఆపరమాత్మనే కరతలామలకమువలె మంత్రద్వయముచేత నిరూపించుచున్నాఁడు ---

మూ. ఏకో దేవ స్సర్వభూతేషు గూఢ
స్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా,
కర్మాధ్యక్షః స్సర్వభూతాధివాస
స్సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ ౧౧

పద. ఏకః దేవః సర్వభూతేషు గూఢః సర్వవ్యాపీ సర్వభూతాన్త-రాత్మా, కర్మాధ్యక్షః సర్వభూతాధివాసః సాక్షీ చేతా కేవలః నిర్గుణః చ.

టీక. ఏకః=అద్వితీయుఁడును, దేవః = స్వయంప్రకాశమానుఁడును అగు పరమేశ్వరుఁడు, సర్వభూతేషు = సకలప్రాణులందు, గూఢః = గూఢముగా నుంటున్నాఁడు. (అతఁడు) సర్వవ్యాపీ = అంతట వ్యాపించియున్న వాఁడును, సర్వభూతాంతరాత్మా=సర్వభూతములందు అంతరాత్మరూపమున నుండువాఁడును, కర్మాధ్యక్షః=(సర్వప్రాణులొనర్చెడి వివిధ) కర్మలకు అధిష్ఠాతయును, సర్వభూతాధివాసః = సకలప్రాణులందు నివసించియుండువాఁడును, సాక్షీ=సర్వద్రష్టయును, చేతా = చైతన్యరూపుఁడును, (సర్వమును చలింపఁ జేయువాఁడును) కేవలః=నిరుపాధికుఁడును, నిర్గుణఃచ=సత్త్వాదిగుణత్రయ రహితుఁడును (అగుచున్నాఁడు).

తా. అద్వితీయుఁడును ప్రకాశస్వరూపుఁడును అగు ఆపరమేశ్వరుఁడే సకలప్రాణులందు అంతరాత్మభూతుఁడై యున్నాఁడు. ఇతఁడే ఆయా ప్రాణులొనర్చు నానావిధకర్మలకు అధిష్ఠాత. ఇతఁడే సర్వభూతాధివాసుఁడును సర్వద్రష్టయు చైతన్యమును కలుగఁజేయువాఁడును నిరుపాధికుఁడును సత్త్వాదిగుణరహితుఁడును అగుచున్నాఁడు.

వివరణము.—విజ్ఞానభగవద్వ్యాఖ్యయం దీమంత్రము విపులముగ వ్యాఖ్యాతమైనది. కాని ఇదివఱకువచ్చినమంత్రములందు చెప్పిన యంశమే

యగుటచేత మఱల నిట అనువదింపలేదు. వలయువారా వ్యాఖ్యను గాంచునది.

౬-వ అధ్యాయము. ౧౨-వ మంత్రము.

మూ ఏకో వశీ నిష్క్రియాణాం బహూనా
మేకం బీజం బహుధా యః కరోతి,
తమాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరా
స్తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్. ౧౨

పద. ఏకః వశీ నిష్క్రియాణాం బహూనాం ఏకం బీజం బహుధా యః కరోతి, తం ఆత్మస్థం యే అనుపశ్యన్తి ధీరాః తేషాం సుఖం శాశ్వతం న ఇతరేషామ్ ౧౨

టీ. నిష్క్రియాణాం = క్రియారహితులయిన, బహూనాం=అనేకులలో, వశీ=స్వతంత్రుఁడును, ఏకః=అద్వితీయుఁడును, యః = ఎవ్వఁడు, ఏకం = ఒక్కటి అయినట్టియు, బీజం = బీజస్థానీయమయిన భూత సూక్ష్మమును, బహుధా = అనేకవిధములుగా, కరోతి = చేయుచున్నాఁడో, యే ధీరాః = ఏవిద్వాంసులు, ఆత్మస్థం = బుద్ధియందున్న, తం = ఆఈశ్వరుని, అనుపశ్యంతి = చూచుచున్నారో, తేషాం = అట్టివారికే, శాశ్వతం = శాశ్వతమయిన, సుఖం=సుఖము, ఇతరేషాం = ఇతరులకు, న=లేదు.

తా. జీవులయొక్క సకలకర్మలు ఆత్మయందు లేవు. క్రియలన్నియు దేహేంద్రియములందే యున్నవి. ఆత్మ నిష్క్రియుఁడు, నిర్గుణుఁడు, సత్త్వాదిగుణరహితుఁడు, కూటస్థుఁడు అయినప్పటికిన్నీ, అనాత్మధర్మములగు కర్తృత్వ, భోక్తృత్వ, సుఖత్వ,దుఃఖత్వ, కృశత్వ, స్థూలత్వ,మనుష్యత్వాది ధర్మములను ఆత్మయందారోపించుకొని యజ్ఞదత్తునియొక్క పుత్త్రుఁడను,

దేవదత్తుని పుత్త్రుఁడను అని తలంచుచున్నాఁడు. ఈవిషయమే భగవద్గీతలయం దిట్లు చెప్పఁబడియున్నది —

శ్లో. ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః,
అహంకారవిమూఢాత్మా కర్తాఽహమితి మన్యతే.
తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మవిభాగయోః,
గుణా గుణేషు వర్తన్త ఇతి మత్వా న సజ్జతే.
ప్రకృతేర్గుణసమ్మూఢా స్సజ్జంతే గుణకర్మసు. భగవద్గీత.

పరమాత్మ ఒక్కఁటియును బీజస్థానీయమును అగు భూతసూక్ష్మమును అనేకవిధములుగా నొనర్చుచున్నాఁడో బుద్ధిగుహయందునున్న అట్టి ఆత్మను ఎవ్వరు గాంచుచున్నారో అట్టివారికే శాశ్వతమయిన సుఖముగాని తదితరుల కట్టి శాశ్వతమయిన సౌఖ్యము లేదు.

వివరణము —ఈ మంత్రము కఠాద్యుపనిషత్తులందు కూడ నిట్లే గలదు. (చూ. కఠ. ౨. ౨. ౧౨. మంత్రము.)

౬-వ అధ్యాయము, ౧౩-వ మంత్రము.

మూ. నిత్యో నిత్యానాం చేతనశ్చేతనానా
మేకో బహూనాం యో విదధాతి కామాన్,
తత్కారణం సాఙ్ఖ్యయోగాధిగమ్యం
జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః. ౧౩

పద. నిత్యః నిత్యానాం చేతనః చేతనానాం ఏకః బహూనాం యః విదధాతి కామాన్, తత్ కారణం సాంఖ్యయోగాధిగమ్యం జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః. ౧౩

టీక. నిత్యానాం=నిత్యులయిన జీవులలోపల, (లేక నిత్యములగు

పృథివ్యాదిభూతములలోపల) నిత్యః=నిత్యుఁడును, చేతనానాం=ప్రమాతలగు చేతనములలోపల, చేతనః = చేతనుఁడును, ఏకః=అద్వితీయుఁడును అగు, యః=ఏపరమేశ్వరుఁడు, బహూనాం=అనేకులగుజీవులకు, కామాన్=కామనిమిత్తములయిన భోగములను, విదధాతి=ఇచ్చుచున్నాఁడో, తత్=అట్టి, కారణం=కారణుఁడును, సాంఖ్యయోగాధిగమ్యం = జ్ఞానయోగముచేత పొందఁదగినట్టియు, దేవం=పరమేశ్వరుని, జ్ఞాత్వా=ఎఱింగి, సర్వపాశైః=అవిద్యాదిసకలపాశములచేత, ముచ్యతే=విడువఁబడుచున్నాఁడు.

తా. నిత్యులగు జీవులలోపల లేక పృథివ్యాదిపంచమహాభూతములలోపల నిత్యుఁడును, ప్రమాతలగు చేతనులలోపల చేతనుఁడును తానొక్కఁడేయైనను అనేకులకు అభిలషితార్థముల నెవ్వఁడొసంగుచున్నాఁడో, అట్టి సర్వకారణుఁడును జ్ఞానయోగముచేత పొందఁదగినవాఁడును అగు దేవుని ఎఱింగినవాఁడు అవిద్యాపాశములచేత విముక్తుఁ డగుచున్నాఁడు.

వివరణము —ఈ మంత్రము కఠోపనిషత్తునందు కొంచెము భిన్నముగ పఠింపఁబడినది. (చూ. ౨-౨-౧3)

## ౬-వ అధ్యాయము, ౧౪-వ మంత్రము.

అవ. పరమేశ్వరుఁడు చేతనులకుకూడ చేతనుఁ డెట్లనువిషయము తెలుపఁబడుచున్నది:—

మూ. న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం
నేమా విద్యుతో భాంతి కుతోఽయమగ్నిః,
తమేవ భాంతమనుభాతి సర్వం
తస్య భాసా సర్వమిదం విభాతి. ౧౪

పద. న తత్ర సూర్యః భాతి న చంద్రతారకం న ఇమాః విద్యుతః

భాంతి కుతః అయం అగ్నిః, తం ఏవ భాన్తం అనుభాతి సర్వం తస్య భాసా సర్వం ఇదం విభాతి. ౧౪

టీక. తత్ర=ఆబ్రహ్మమునందు, సూర్యః న భాతి=సూర్యుఁడు ప్రకాశించుటలేదు. చంద్రతారకం=చంద్రుఁడునక్షత్రములు, న=ప్రకాశించుటలేదు. ఇమాఃవిద్యుతః=ఈ మెరుపులున్ను,న భాంతి=ప్రకాశించుటలేదు.అయమగ్నిః కుతః =ఈయగ్నిమాత్రము ఎట్లు (ప్రకాశింపఁగలఁడు?) భాంతం=ప్రకాశించుచున్న, తంఏవ=ఆపరమాత్మనే, సర్వం=అంతయు, అనుభాతి=అనుసరించి ప్రకాశించుచున్నది. తస్య భాసా = ఆ పరమేశ్వరునియొక్క కాంతిచేతనే, ఇదంసర్వం=ఇదిఅంతయు, విభాతి=ప్రకాశించుచున్నది.

తా. ఆపరబ్రహ్మమునుగూర్చి సర్వప్రకాశకుఁడగు సూర్యుఁడు ప్రకాశించుటలేదు. అనఁగా సూర్యుఁడు బ్రహ్మమును ప్రకాశింపఁజేయఁజాలఁడు. సూర్యుఁడు పరమేశ్వరునియొక్క ప్రకాశముచేతనే రూపజాతమును ప్రకాశింపఁజేయుచున్నాఁడుగాని అతనికి స్వయముగా ప్రకాశింపఁజేయు సామర్థ్యములేదు. ఆదేవిధముగా చంద్రుఁడు, నక్షత్రములు, మెరుపులు అగ్ని మున్నగువానికిన్ని స్వయముగా ప్రకాశనసామర్థ్యము లేదు. స్వయముగా ప్రకాశించుచున్న ఆపరమాత్మ ననుసరించియే సర్వము ప్రకాశించుచున్నది. ఆపరమాత్మయొక్క తేజస్సుచేతనే సూర్యాదితేజస్సమూహము ప్రకాశించుచున్నది.

'యేన సూర్యస్తపతి తేజసేద్ధః'' అనుశ్రుతి యీ విషయమునే బోధించును. 'న తద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః.' అనుస్మృతియు నీయర్థమునే తెలుపును.

౬-వ అధ్యాయము, ౧౫-వ మంత్రము.

అవ. 'జ్ఞాత్వా దేవం ముచ్యతే' అని చెప్పఁబడినది. ఆ పరమాత్మ

**తెలిసినవాఁడే ముక్తుఁడేలకావలయును? ఇతరోపాయముచేత ముక్తి యేలకలుగఁజాలదను విషయము చెప్పఁబడుచున్నది:—**

మూ. ఏకో హగ్ంసో భువనస్యాస్య మధ్యే
స ఏవాగ్నిస్సలిలే సన్నివిష్టః,
తమేవ విదిత్వా ఽతిమృత్యుమేతి
నాన్యః పంథా విద్యతేఽయనాయ. ౧౫

పద. ఏకః హంసః భువనస్య అస్య మధ్యే సః ఏవ అగ్నిః సలిలే సన్నివిష్టః, తం ఏవ విదిత్వా అతిమృత్యుం ఏతి న అన్యః పంథాః విద్యతే అయనాయ. ౧౫

టీక. అస్య=ఈ, భువనస్య = ప్రపంచముయొక్క, మధ్యే = మధ్యభాగమునందు, ఏకః=ఒక్కఁడయిన ఆపరమాత్మయే, హంసః = బంధమును కలుగఁజేయు అవిద్యాదికమును నశింపఁజేయువాఁడు, సఃఏవ = ఆపరమాత్మయే, అగ్నిః = అవిద్యాతత్కార్యదాహకుఁడు, సలిలే=దేహాత్మగా పరిణమించిన సలిలమునందు, సన్నివిష్టః=చక్కఁగా ఆత్మభూతుఁడయి ఉంటున్నాఁడు. లేక, సలిలే = జలమువలె స్వచ్ఛమయినట్టియు, యజ్ఞదానాదికముచేత నిర్మలీకృతమయినట్టియు అంతఃకరణమునందు,సన్నివిష్టః=చక్కఁగా నుంటున్నాఁడు. తంఏవ = అట్టి అంతఃకరణమునందు సన్నివిష్టుఁడయియున్న పరమాత్మనే, విదిత్వా = ఎఱిఁగి, అతిమృత్యుం = మరణము నతిక్రమించిన పరమేశ్వరుని, ఏతి = పొందుచున్నాఁడు. అయనాయ= మోక్షముకొఱకు, అన్యః పంథాః = వేఱయిన మార్గము, న=లేదు.

తా. పరమాత్మ యొక్కఁడే బంధకారణమగు అవిద్యను నశింపఁజేయుచున్నాఁడు కావున హంసుఁ డనంబడుచున్నాఁడు. అతఁడే అగ్ని.

అనఁగా అవిద్యా తత్కార్యదాహకుఁడు, ఈవిషయమే "వ్యోమాతీతోఽగ్నిరీశ్వరః." అను శ్రుతియందు చెప్పఁబడినది. మఱియు ఇతఁడే సలిలము నందు-అనఁగా దేహాత్మగా పరిణమించిన యుదకములందు ఆత్మభూతుఁడయి యుంటున్నాఁడు. 'పంచమ్యా మాహుతావాపః పురుషవచసో భవంతి' అని చెప్పిన పంచాగ్నివిద్యాశ్రుతియం దీయర్థము తెలుపఁబడియున్నది. లేక జలమువలె స్వచ్ఛమయినట్టియు, యజ్ఞదానాదీశ్వరార్పణబుద్ధితో చేయఁబడిన సత్కర్మచేత నిర్మలమయిన అంతఃకరణమునందున్నవాఁడయి- అనఁగా వేదాంతవాక్యార్థ సమ్యగ్జ్ఞానమను ఫలకము నధిష్ఠించినవాఁడయి అవిద్యా తత్కార్యదాహకుఁ డగుచున్నాఁడు. అట్టి పరమేశ్వరు నెఱింగిన వాఁడే మృత్యువు నతిక్రమించుచున్నాఁడు. మోక్షమునకు మార్గాంతరము లేదు.

౬-వ అధ్యాయము, ౧౬-వ మంత్రము.

అవ. పరమపదప్రాప్త్యర్థము ఆపరమాత్మనే ప్రకారాంతరముగ నిరూపించుచున్నాఁడు:—

మూ. స విశ్వకృ ద్విశ్వవిదాత్మయోని
ర్జ్ఞః కాలకారో గుణీ సర్వవిద్యః,
ప్రధానక్షేత్రజ్ఞపతి ర్గుణేశ
స్సంసారమోక్షస్థితిబంధహేతుః ౧౬

పద. సః విశ్వకృత్ విశ్వవిత్ ఆత్మయోనిః జ్ఞః కాలకారః గుణీ సర్వవిద్యః, ప్రధానక్షేత్రజ్ఞపతిః గుణేశః సంసారమోక్షస్థితిబంధ హేతుః. ౧౬

టీక. సః=ఆపరమేశ్వరుఁడే, విశ్వకృత్ = ప్రపంచకర్త, విశ్వవిత్ = అంతయు నెఱింగినవాఁడు, ఆత్మయోనిః=ఆత్మయోని, జ్ఞః=అంతయు నెఱుం

గువాఁడు, కాలకారః = కాలమును చేయువాఁడు, గుణీ=అపహతపాప్మాది సద్గుణవిశిష్టుఁడు, సర్వవిద్యః=సర్వము నెఱింగినవాఁడు, ప్రధానక్షేత్రజ్ఞపతిః= అవ్యక్త, విజ్ఞానాత్మలకు పాలకుఁడు, గుణేశః = సత్వరజస్తమోగుణములకు ప్రభువు, సంసారమోక్షస్థితిబంధహేతుః=ప్రపంచముయొక్క మోక్షస్థితి బంధములకు కారణభూతుఁడు.

తా. ఆపరమేశ్వరుఁడే ప్రపంచనిర్మాత. అతఁడే సర్వము నెఱింగిన వాఁడు. అతఁడే ఆత్మయోని. జ్ఞానస్వరూపుఁడు. కాలమునకు కర్త. అపహత పాప్మాది సర్వసుగుణములుఁగలవాఁడు. సర్వవిద్యుఁడు. ఇతఁడే ప్రధానము నకును క్షేత్రజ్ఞునకున్నూ పతి. సత్వరజస్తమోగుణములకు ప్రభువు. సంసార మోక్షస్థితి బంధములకు కారణభూతుఁడు.

వివరణము —ఆత్మయోని యనఁగా 'ఆత్మా చాసౌ యోనిశ్చ ఆత్మ యోనిః' అని వ్యుత్పత్తి. "ఆత్మనాం యోనిః ఆత్మయోనిః,సురనరతిర్యక్శరీరా ణాంఆత్మనాం యోనిః కారణం, ఆత్మయోనిః" "పురశ్చక్రే ద్విపదః పురశ్చ క్రేచతుష్పదః" ఇతి శ్రుత్యంతరాత్. అథవా "ఆత్మా చ సఏవ యోనిశ్చేతి ఆత్మయోనిః. త్వంపదార్థభూత ప్రత్యగాత్మత్వేన తత్పదార్థ భూతజగత్కా రణత్వేన సఏవస్థిత ఇతి యావత్" విజ్ఞానభగవద్వ్యాఖ్య.

ఈమంత్రముయొక్క విజ్ఞానభగవద్వ్యాఖ్య చాలరమణీయముగ నున్నది. పాఠకులు పఠించి గ్రహింతురుగాక

౬-వ అధ్యాయము, ౧౭-వ మంత్రము.

మూ స తన్మయో హ్యమృత ఈశసంస్థో
జ్ఞస్సర్వగో భువనస్యాస్య గోప్తా,
య ఈశే అస్య జగతో నిత్యమేవ
నాన్యో హేతుర్విద్యతే ఈశనాయ ౧౭

పద. సః తన్మయః హి అమృతః ఈశసంస్థితః జ్ఞః సర్వగః భువనస్య అస్య గోప్తా, యః ఈశే అస్య జగతః నిత్యం ఏవ న అన్యః హేతుః విద్యతే ఈశనాయ. ౧౭

టీక. యః=ఏపరమాత్మ, అస్యజగతః = ఈజగత్తునకు, నిత్యంఏవ = నియమముగానే, ఈశే=పాలకుఁడైయుండెనో, సః=ఆపరమాత్మ, తన్మయః= ఆప్రపంచ స్వరూపుఁడు, లేక జ్యోతిస్స్వరూపుఁడు, అమృతః=మరణధర్మరహితుఁడు, ఈశసంస్థః=స్వామిత్వమునందు స్థితిగలవాఁడు, జ్ఞః=జ్ఞానస్వరూపుఁడు, సర్వగః=అంతటను పొందువాఁడు, అస్య భువనస్య=ఈలోకమునకు, గోప్తా=పాలకుఁడు, ఈశనాయ=ఈజగన్నియమనమునకు, అన్యః=వేఱయిన, హేతుః=కారణభూతుఁడయినవాఁడు, న=లేదు.

తా. ఏపరమేశ్వరుఁ డీజగత్తును నియమముగా పాలించుచున్నాఁడో ఆట్టిపరమాత్మ ఈ ప్రపంచమే స్వరూపముగాఁ గలవాఁడు, లేక జ్యోతిస్స్వరూపుఁడు. 'తస్య భాసా సర్వమిదం విభాతి' అను శ్రుతి యీవిషయమునే తెలుపుచున్నది. ఇతఁడు అమరణధర్ముఁడు. స్వామిత్వమునందు చక్కని స్థితిగలవాఁడు. జ్ఞానస్వరూపుఁడు. సర్వగుఁడు. సకలభువనసంరక్షకుఁడు. ఈ ప్రపంచమును నియమించుటకు ఇతనికంటె వేఱయిన కారణభూతుఁడు మఱొక్కఁడు లేఁడు.

వివరణము —ఈశసంస్థః=ఈశే స్వామిని సమ్యక్ స్థితిః యస్యాసౌ ఈశసంస్థః అని వ్యుత్పత్తి.

ఈశసంస్థః=ఈశ్వరత్వేన సమ్యక్ స్థితః ఈశసంస్థః=అనియుం చెప్ప వచ్చును.

౬-వ అధ్యాయము, ౧౮-వ మంత్రము.

అవ. సంసారమోక్ష స్థితి బంధములకు హేతుభూతుఁడు పరమేశ్వ

రుఁడే కావున ఆతనినే శరణం చొచ్చుట యుక్తమని యీ మంత్రమునందు చెప్పఁబడుచున్నది:—

మూ. యో బ్రహ్మాణం విదధాతి పూర్వం
యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై,
తగ్ంహదేవ మాత్మబుద్ధిప్రకాశం
ముముక్షుర్వై శరణమహం ప్రపద్యే. ౧౮

పద. యః బ్రహ్మాణం విదధాతి పూర్వం యః వై వేదాన్ చ ప్రహిణోతి తస్మై, తం హ దేవం ఆత్మబుద్ధిప్రకాశం ముముక్షుః వై శరణం అహం ప్రపద్యే. ౧౮

టీక. యః=ఏపరమేశ్వరుఁడు, పూర్వం=సృష్టియొక్క ఆదికాలమునందు, బ్రహ్మాణం = హిరణ్యగర్భుని, విదధాతి = సృజించుచున్నాఁడో, యః=ఏపరమేశ్వరుఁడు, తస్మై = తనచేత సృజింపఁబడిన ఆహిరణ్యగర్భునకు, వేదాన్ చ = వేదములను, ప్రహిణోతిచ = ఉపదేశించుచున్నాఁడో, ఆత్మబుద్ధిప్రకాశం=నాయందుండు బుద్ధిని ప్రకాశింపఁజేయునట్టి, తందేవంహ= అట్టి పరమేశ్వరునే, ముముక్షుః = మోక్షేచ్ఛగల, అహం=నేను, శరణం ప్రపద్యే = శరణు జొచ్చుచున్నాను.

తా. ఏపరమేశ్వరుఁడు సృష్ట్యాదియందు సృష్టిరచనార్థము చతుర్ముఖబ్రహ్మను సృజించి ఆతనికి సృష్టిక్రమప్రతిపాదకములగు వేదములనుపదేశించెనో ఆట్టి హిరణ్యగర్భుని ఆత్మబుద్ధిప్రకాశకుని మోక్షేచ్ఛగల నేను శరణు సొచ్చుచున్నాఁడను.

"తమేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః,
నానుధ్యాయాద్బహూన్ శబ్దాన్ వాచో విగ్లాపనం హి తత్."

"తమేవైకం జానథ ఆత్మానమ్"
మున్నగు శ్రుతులు పైయర్థమునే బలపఱచుచున్నవి.

వివరణము:—మూఁడవ పాదమునందు "ఆత్మబుద్ధి ప్రసన్నం" అని పాఠాంతరము గలదు. తనయందున్న బుద్ధికి ప్రసన్నత్వమును కలుగఁజేయు వాఁడని గ్రహించునది.

ఆత్మబుద్ధి ప్రకాశం అనుశబ్దమునకు ద్వివిధమయిన వ్యుత్పత్తి —

౧. ఆత్మైవ బుద్ధిః ఆత్మబుద్ధిః, సైవ ప్రకాశః అస్యేతి ఆత్మబుద్ధి ప్రకాశః. తం.

౨. ఆత్మబుద్ధిం ప్రకాశయతీతి ఆత్మబుద్ధిప్రకాశః. తం.

౬-వ అధ్యాయము, ౧౯-వ మంత్రము.

అవ. ఇదివఱకు సృష్ట్యాదిలక్ష్యమగు స్వరూపము చెప్పఁబడినది. ఇఁక తత్స్వరూపముచేత తెలుపఁబడుచున్నది:—

మూ॥ నిష్కళం నిష్క్రియగ్ం శాంతం నిరవద్యం నిరఞ్జనమ్,
అమృతస్య పరగ్ం సేతుం దగ్ధేన్ధనమివానలమ్. ౧౯

పద. నిష్కళం నిష్క్రియం శాంతం నిరవద్యం నిరఞ్జనం, అమృతస్య పరం సేతుం దగ్ధేన్ధనం ఇవ అనలమ్. ౧౯

టీక. నిష్కళం=అవయవరహితుఁడును, నిష్క్రియం=క్రియారహితుఁడు, శాంతం=శాంతుఁడును, నిరవద్యం= నిందితుఁడుకానివాఁడును, నిరంజనం=నిర్లిప్తుఁడును, అమృతస్య = మోక్షమునకు, సేతుం=వారధివంటివాఁడును, దగ్ధేంధనం=దహింపఁబడిన కట్టెలుగల, అనలంఇవ=అగ్నివంటివాఁడును అగు, పరం=పరమాత్మను, మోక్షేచ్ఛగల నేను శరణుపొందుచున్నాను.

తా. అవయవరహితుఁడును, కూటస్థుఁడగుటచేత నిష్క్రియుఁడును,

సర్వవికారములు శాంతించినవాఁడును, అనింద్యుఁడును, నిర్లేపుఁడును, మోక్షప్రాప్తికి సేతువువంటివాఁడును, సంసారసముద్రమును దాటుటకు వారవధి వంటివాఁడును, గణగణమండుచుండు అగ్నిహోత్రునివలె ప్రకాశించుచుండువాఁడును అగు పరమేశ్వరుని మోక్షార్థియయిన నేను శరణుసొచ్చుచున్నాఁడను.

వివరణము — ఈ మంత్రముయొక్క విజ్ఞానభగవద్వ్యాఖ్యను పాఠకులు పఠించుట యుక్తము.

౬-వ అధ్యాయము, ౨౦-వ మంత్రము.

అవ. ఆత్మ నెఱింగినచే ముక్తి సంభవించును,లేనియెడల ముక్తిలేదు. అను నిర్ణయమేమి? యనువిషయము సోపపత్తిగ నిరూపింపఁబడుచున్నది -

మూ. యదా చర్మవదాకాశం వేష్టయిష్యన్తి మానవాః,
తదా దేవ మవిజ్ఞాయ దుఃఖస్యాన్తో భవిష్యతి  ౨౦

పద. యదా చర్మవత్ ఆకాశం వేష్టయిష్యన్తి మానవాః, తదా దేవం అవిజ్ఞాయ దుఃఖస్య అన్తః భవిష్యతి.  ౨౦

టీక. మానవాః = మనుష్యులు, యదా=ఎప్పుడు, ఆకాశం=ఆకాశమును, చర్మవత్=చర్మమునువలె, వేష్టయిష్యంతి=చుట్టివేయఁగలరో, తదా=అప్పుడు, దేవం = పరమేశ్వరుని, అవిజ్ఞాయ = తెలిసికొనక, దుఃఖస్య = దుఃఖముయొక్క, అంతః=అంతము, భవిష్యతి=కాఁగలదు.

తా. లోకమునందు మనుష్యులు ఆకాశమును చర్మమును మడిచి చుట్టినటుల ఎన్నఁడు చుట్టెదరో అప్పుడు పరమేశ్వరు నెఱుంగక ఆధ్యాత్మిక, అధిభౌతిక, అధిదైవిక దుఃఖములయొక్క నాశమును పొందెదరు. అనఁగా ఆకాశమును చాపవలె చుట్టుటకెట్లు శక్యముకాదో అట్లే పరమేశ్వరు నెఱుంగక దుఃఖవిముక్తి కాఁజాలదు. ఎంతవఱకు పరమాత్మను దేహేం

ద్రియవిలక్షణుఁడయిన ఆత్మనుగా నెఱుంగఁజాలఁడో అంతవఱకు సంసార సముద్రమునఁ బడి మునుంగుచు మొసళ్ళవంటి రాగాదులచేత ఈడ్వఁబడు చున్నవాఁడయి ప్రేతతిర్యఙ్మనుష్యాది యోనులందు పుట్టుచు గిట్టుచు జీవభావమును పొంది అల్లాడుచుండును. ఎప్పుడు అపూర్వుఁడు, అనపరుఁడు, నేతి నేతీత్యాదిలక్షణ విశిష్టుఁడు, అశనాయాద్యసంస్పృష్టుఁడు, అనుదిత, అనస్తమిత, జ్ఞానాత్మ స్వరూపముననున్న పూర్ణానందపరమాత్మస్వరూపుఁడను తానని యెఱుంగునో అప్పుడు అజ్ఞానతత్కార్యములు నశించి పూర్ణానంద స్వరూపుఁడగును.

ఈవిషయమే భగవద్గీతలో ౫-వ అధ్యాయమునందిట్లు చెప్పఁబడినది -

అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః. ౧౫

జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః,
తేషామాదిత్యవద్జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్. ౧౬

తద్బుద్ధయస్తదాత్మానస్తన్నిష్ఠాస్తత్పరాయణాః,
గచ్ఛన్త్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః. ౧౭

౬-వ అధ్యాయము, ౨౧-వ మంత్రము.

అవ. సంప్రదాయపరంపరగా ప్రాప్తమయిన బ్రహ్మవిద్యయే మోక్ష ప్రదమని తెలుపుచు సంప్రదాయపరంపరను, విద్యాధికారిని తెలుపు చున్నాఁడు:—

మూ. తపః ప్రభావాద్దేవప్రసాదాచ్చ
బ్రహ్మహ శ్వేతాశ్వతరోఽథ విద్వాన్,
అత్యాశ్రమిభ్యః పరమం పవిత్రం
ప్రోవాచ సమ్యగృషిసఙ్ఘజుష్టమ్. ౨౧

పద. తపః ప్రభావాత్ దేవప్రసాదాత్ చ బ్రహ్మ హ శ్వేతాశ్వతరః అథ విద్వాన్, అత్యాశ్రమిభ్యః పరమం పవిత్రం ప్రోవాచ సమ్యక్ ఋషిసంఘజుష్టమ్. ౨౧

టీ. తపః ప్రభావాత్ = కృచ్ఛ్రచాంద్రాయణాది లక్షణమును, నిత్యకర్మాద్యాచరణ రూపమును అగు తపస్సుయొక్క ప్రభావమువల్లను, దేవప్రసాదాత్ చ = పరమేశ్వరుని యొక్క అనుగ్రహమువల్లను, విద్వాః శ్వేతాశ్వతరః = విద్వాంసుఁడగు శ్వేతాశ్వతరమహర్షి, బ్రహ్మ= బ్రహ్మతత్త్వమును, హ = పొందెనుగదా. అథ = ఆశ్వేతాశ్వతరుఁడు బ్రహ్మవిద్యను దైవానుగ్రహమువలనఁ బడసినతరువాత, ఋషిసంఘజుష్టం = వామదేవ, సనకాది ఋషిగణముచేత సేవితమయినట్టియు, పరమం = మిక్కిలి, పవిత్రం=పవిత్రమయిన యీ బ్రహ్మవిద్యను, అత్యాశ్రమిభ్యః= మిక్కిలి పూజ్యులయిన యతీశ్వరులకొఱకు, సమ్యక్ ప్రోవాచ = బాగుగా నుపదేశించెను.

తా. తపఃప్రభావమువల్లను, దేవతానుగ్రహమువల్లను విద్వాంసుఁడగు శ్వేతాశ్వతరుఁడు బ్రహ్మవిద్యను పొందెను. ఈవిధముగా బ్రహ్మవిద్య తనకు లభించిన తరువాత శ్వేతాశ్వతరమహర్షి మహర్షిసంఘముచేత కోరఁబడునట్టియు పరమ పవిత్రమయినట్టియు నీ బ్రహ్మవిద్యను అత్యాశ్రముల కొఱకు—పూజ్యులయిన యతీశ్వరుల కొఱకు ఉపదేశించెను. ఇచట తపస్సనఁగా కృచ్ఛ్రచాంద్రాయణాది రూపమయినదని గ్రహించుట యుక్తము. తపశ్శబ్ద మీయర్థమునందు రూఢిగా ప్రయోగింపఁ బడుచున్నది. ఈశ్వరార్పణబుద్ధితో యథావిధిగ సలుపఁబడిన నిత్యకర్మానుష్ఠానము కూడ తపశ్శబ్ద వాచ్యమే యగుచున్నది. "మనసశ్చేంద్రియాణాం చ ఐకాగ్ర్యం పరమం తపః" అను స్మృతి యిందులకు ప్రమాణము. ఈ శ్వేతాశ్వతరమహర్షి అనేక జన్మములందు పరమేశ్వరు నారాధించి యిం

డుటచేత ఇతనియందు పరమేశ్వరునకు అనుగ్రహ బుద్ధి కలిగియున్నదని భావము. అనఁగా భగవదనుగ్రహమువలన గురుముఖముగ ప్రాప్తమయిన బ్రహ్మవిద్యను మనన, నిదిధ్యాసన, ఆదర, నైరంతర్య సత్కారాదికముల చేత 'బ్రహ్మాహ మస్మి' యని అపరోక్ష సాక్షాత్కారముగ శ్వేతాశ్వతరుఁడు స్వానుభవముగ పొందెను. స్వానుభవ దార్ఢ్యానంతరము అత్యంతము పూజ్యులగు సాధన చతుష్టయ సంపత్తిగల వైరాగ్యవంతులగు యతీశ్వరులకు శ్వేతాశ్వతరుఁ డీ బ్రహ్మవిద్య నుపదేశించెను. పరిపూర్ణ వైరాగ్య విరహితులకు బ్రహ్మోపదేశము వ్యర్థమనుటకు ప్రమాణము:—

శ్లో. వైరాగ్యం పుష్కలం న స్యా న్నిష్ఫలం బ్రహ్మదర్శనమ్,
తస్మాద్రక్షేత విరతిం ముద్గో యత్నేన సర్వదా.
,, యదా మనసి వైరాగ్యం జాయతే సర్వవస్తుషు,
తదైవ సన్న్యసే ద్విద్వాన్ అన్యథా పతితో భవేత్.

అత్యాశ్రములు అనఁగా పరమహంస సన్న్యాసులు, ఈ యర్థమును బలపఱచు శ్రుతి —

న్యాస ఇతి బ్రహ్మ బ్రహ్మాహి పరః పరోహి బ్రహ్మ తానివా ఏతాన్యవరాణి తపాంసి న్యాస ఏవాత్యరేచయత్." (తై. ఆ. ౧౦. ౬౨.)

సన్న్యాసులు బహూదక, కుటీచక, హంస, పరమహంసులని నాల్గువిధములు; వారిలో పరమహంసుఁడు ఉత్తముఁడు:—

శ్లో. చతుర్విధా భిక్షవశ్చ కుటీచక బహూదకా,
హంసః పరమహంసశ్చ యోయః పశ్చాత్స ఉత్తమః.

౬-వ అధ్యాయము, ౨౨-వ మంత్రము.

అవ. శాస్త్రమునందు చెప్పఁబడినవిధముగా శిష్యుని పరీక్షించియే

విద్యను బోధించవలయునుగాని లేనియెడల దోషము కలుగుననియు, బ్రహ్మ విద్య వైదికమనియు, గోపనీయమనియు గురుపరంపరగా ప్రాప్తమయినదనియు తెలుపఁబడుచున్నది —

మూ॥ వేదాన్తే పరమం గుహ్యం
పురాకల్పే ప్రచోదితమ్,
నాప్రశాన్తాయ దాతవ్యం
న పుత్త్రాయ శిష్యాయ వా పునః. ౨౨

పద. వేదాన్తే పరమం గుహ్యం పురాకల్పే ప్రచోదితమ్, న అప్రశాన్తాయ దాతవ్యం న పుత్త్రాయ శిష్యాయ వా పునః. ౨౨

టీ.(ఈ బ్రహ్మవిద్య) వేదాంతే=ఉపనిషత్తులందు, పరమం=పరమపురుషార్థసాధనభూతమయినదియు, గుహ్యం = గోపనీయమయినదియు, పురాకల్పే=పూర్వకల్పమునందు, ప్రచోదితం=ఉపదేశింపఁబడినదియుఅగుచున్నది. (ఈ బ్రహ్మవిద్యను) పునః = మఱల, అప్రశాంతాయ = రాగాదిమలములు శాంతించని, శిష్యాయవా = శిష్యునికొఱకుగాని, పుత్త్రాయవా=అట్టిపుత్త్రునికొఱకుఁగాని, న దాతవ్యం = ఇవ్వకూడదు.

తా. పురుషార్థస్వరూపమగుటచేత సకలోపనిషత్తులందు ఈయాత్మతత్త్వము రహస్యముగా ప్రతిపాదింపఁబడియున్నది. ఈయాత్మతత్త్వము పూర్వకల్పమునందు సంప్రదాయపరంపరావిచ్ఛేదముకొఱకు అర్హులయినవారికొఱకు ఉపదేశింపఁబడెను. రాగాదిసకలమలములు నశించినచిత్తముగలశిష్యునికొలేక అట్టిపుత్త్రునికో నీయాత్మతత్త్వము నుపదేశింపవలయును. రాగాదిదూషితచిత్తులకు స్నేహమునను సరించి బ్రహ్మవిద్యను ఉపదేశింపకూడదు. లేనియెడల దోషము సంభవించును. బ్రహ్మవిద్యను బోధింపఁదలఁచిన గురువు

చిరకాలము శిష్యుని పరీక్షించియే ఉపదేశింపవలయుననుటకు ఉపనిషత్తులం దనేక సంవాదములు గలవు:—

౧. భూయ స్తపసా బ్రహ్మచర్యేణ శ్రద్ధయా సంవత్సరం పరీక్షితః.

౨. శతవర్ష ప్రజాపతౌ మఘవా బ్రహ్మచర్యమువాస. ఉపదేశసా హస్రియందీవిషయము విపులముగ చర్చింపఁబడియుండుటచేత ఇచట విస్తరించి వ్రాయలేదు.

౬-వ అధ్యాయము, ౨౩-వ మంత్రము.

అవ. దేవతయందును గురువునందును భక్తిగలవానికే గురువు బోధిం ధించినవిద్య స్వానుభవమును కలుగఁజేయునను విషయము ప్రతిపాదింపఁబడు చున్నది —

మూ॥ యస్య దేవే పరాభక్తి ర్యథా దేవే తథాగురౌ,
తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశన్తే మహాత్మనః
ప్రకాశంతే మహాత్మనః ౨౩

# ఉత్తరశాంతిపాఠము.

సహనావవతు, సహనౌ భునక్తు,
సహవీర్యం కరవావహై,
తేజస్వి నావధీతమస్తు మా విద్విషావహై

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

ఇతి శ్వేతాశ్వతరోపనిషది షష్ఠఃఅధ్యాయః.
శ్వేతాశ్వతరోపనిషచ్చ స్సమాప్తా.

పద. యస్య దేవే పరా భక్తిః యథా దేవే తథా గురౌ, తస్య ఏతే కథితాః హి అర్థాః ప్రకాశంతే మహాత్మనః. ప్రకాశంతే మహాత్మనః. ౨౩

శ్వేతాశ్వతరోపనిషది షష్ఠోఽధ్యాయ
స్సమాప్తః

టీక. యస్య = అధికారియగు ఏపురుషునకు, దేవే = స్వయంప్రకాశుఁడగు పరమాత్మయందు, పరా = శ్రేష్ఠమయిన, భక్తిః = భక్తి, యథా = ఏప్రకారమో, తథా = ఆప్రకారమే, గురౌ=గురువునందున్నూ భక్తికలిగి యుండవలయును. తస్యమహాత్మనః = అట్టిమహాత్మునకు, ఏతే=ఈ, కథితాః అర్థాః=ఈ ఉపనిషత్తునందు చెప్పఁబడినవిషయములు, ప్రకాశంతే = ప్రకాశించుచున్నవి. (స్వానుభవమునకు వచ్చుచున్నవి.) మహాత్మనః=అట్టిగురుభక్తి గలమహాత్మునకు, ప్రకాశంతే = ప్రకాశించుచున్నవి.

తా. విద్యాధికారియగు ఏపురుషునకు అఖండైకరసుఁడును సచ్చిదానందపరంజ్యోతి స్స్వరూపుఁడును అగు పరమేశ్వరునియందు అచాంచల్యములయిన భక్తిశ్రద్ధలెట్లుండునో అట్టిభక్తిశ్రద్ధలు అదేవిధముగా బ్రహ్మవిద్యోపదేష్టయగుగురువునందుకూడ ఉండవలయును. అట్టిశ్రద్ధాభక్తులు గురువునందు కూడ గలసాధకునకే ఈశ్వేతాశ్వతరోపనిషత్ప్రతిపాదితములగు పరమార్థ విషయములు స్వానుభవమునకు వచ్చును. "ప్రకాశంతే మహాత్మనః" అను వాక్యము రెండుపర్యాయములు చెప్పుట ముఖ్యశిష్యుఁడును తత్సాధనములును దుర్లభమనువిషయమును తెలుపుటకని ఎఱుంగునది. దీనివలన గ్రంథ సమాప్తియు సూచితమయినది.

## శ్వేతాశ్వతరోపనిషత్తునందు ఆఱవఅధ్యాయము సమాప్తము.



శ్లో. కనుపర్తికులోత్పన్న వేంకట్రామసుధీసుతః,
మార్కండేయో గుణినతః వేంకటేశ్వరచోదితః.

,, శ్రీమచ్ఛంకరభాష్యాది యథామతి సమీక్ష్యచ,
వ్యలేఖీ దాంధ్రభాషాయాం వివృతిం ప్రీయతాం శివః.

శ్రీశంకరభాష్యాదికము ననుసరించి శ్రీకనుపర్తి
మార్కండేయశర్మచేత వ్రాయఁబడిన
శ్వేతాశ్వతరోపనిషత్తుయొక్క ఆంధ్రటీకాతాత్పర్యములు
సమాప్తము



శ్రీగురుభ్యోనమః.

# శ్రీమద్విద్యారణ్యవిరచితే
# అనుభూతిప్రకాశే
## (శ్వేతాశ్వతరోపనిషద్వివరణరూపః)

## ద్వాదశోఽధ్యాయః

---

### శ్వేతాశ్వతరోపనిషత్-ప్రథమాధ్యాయస్య వివరణమ్

శ్లో. శ్వేతాశ్వతరనామా యో యజుశ్శాఖాప్రవర్తకః,
సోఽత్యాశ్రమిభ్యః ప్రోవాచ విద్యాం వ్యాచక్ష్మహే ఽత్ర తామ్. 1

యే వేదవాదిన స్తేతు మీమాంసంతే ముముక్షవః,
జగతః కారణం బ్రహ్మేత్యేవం వేదేషు ఘుష్యతే. 2

ఉత్పత్తిస్థితినాశా స్స్యు ర్యత స్తత్కారణం త్వితి,
సామాన్య మేవ విజ్ఞాతం విశేష స్తు న బుధ్యతే. 3

కస్మా ద్వస్తువిశేషా న్నో జన్మ కేన చ జీవనమ్,
లయః కస్మి న్వ్యవహృతౌ సుఖాదౌ కో నియచ్ఛతి?. 4

పితృభ్యా మన్నతో రేతా దపి జన్మాదయ స్త్రయః,
నియామకశ్చ రాజేతి వచనం బాలభాషితమ్. 5

పితృరాజాద్యశేషస్య జగత శ్చింత్యతే ఽధునా,
కారణం తచ్చ శాస్త్రైకగమ్యం శాస్త్రం తు నైకధా. 6

కాలః స్వభావో నియతి ర్యదృచ్ఛా భూతపంచకమ్,
ప్రధానం జీవ ఏతాని మతాన్యుక్తాని శాస్త్రిభిః. 7

ఋతుకాలే భవేద్గర్భో వర్షర్తౌ సస్యసంభవః,
ఉదాహ్రియత ఇత్యాది బహుధా కాలవాదినా. 8

స్వభావవాద్యగ్ని ముష్ణం జలం ద్రవ ముదాహరత్,
రూపజ్ఞానం చక్షుషైవేత్యాహు ర్నియతివాదినః. 9

ధనికత్వాదివ్యవస్థా యదృచ్ఛావాదినోచ్యతే,
భూతవాదీ దేహగతకారిన్యాదీనుదాహరత్. 10

ప్రధానవాదీ పురుషా న్సాత్త్వికాగీనుదాహరత్,
జీవవాదీ కర్మవశా జ్జన్మదేవాద్యుదాహరత్. 11

సర్వత్ర యుక్తే ర్దృష్టత్వా త్కిం తత్త్వమితి చింత్యతే,
సర్వేషా మనివార్యత్వా త్తత్సంఘో ఽస్త్వితిచే న్న తత్. 12

స్వతంత్రే చేతనే జీవే సతి కాలాద్యచేతనాః,
సమప్రధానభావేన కథం సంఘీభవంతి తే. 13

తర్హి జీవో హేతు రస్తు త న్న దుఃఖాదిదర్శనాత్,
స్వతంత్రః స్వాత్మనో దుఃఖం కుర్వ న్దృష్టో నహి క్వచిత్. 14

దోషా న్సర్వేషు పక్షేషు పశ్యంతో బహుధా తదా,
మాయాశక్తి మనిర్వాచ్యా మపశ్య న్ధ్యానయోగతః. 15

ద్విత్రికక్షాసు యుక్తీనాం సత్త్వేఽప్యేతే న సంతి తాః,
నజానామీత్యేవ మంతేపిపీదంతి హి వాదినః. 16

యదంతే శరణం సర్వవాదినా మవివాదతః,
తదజ్ఞాన మనిర్వాచ్యామాయేత్యాహు ర్విపశ్చితః. 17

అనిర్వాచ్యే ఽపి యుక్తించేదన్విచ్ఛతి సమూఢధీః,
నరూపం చక్షుషా ద్రష్టు మిచ్ఛత్యేవాతిమోహితః. 18

సర్వకార్యేషు శక్తత్వా న్మాయాఽఽక్షేపం న సోఽర్హతి,
దుర్ఘటస్యైవ ఘటనే స్వభావః సర్వసమ్మతః. 19

తథావిధాయాం మాయాయాం పరాత్మా ప్రతిబింబితః,
అవాంతరాణి వస్తూని కాలాదీన్యధితిష్ఠతి. 20

మాయావిశిష్ట మీశానం జగదాకారతాం గతమ్,
సంసారచక్ర మిత్యాహుః సంసారాఖ్యనదీతి చ. 21

పునఃపున ర్జాయమాన శ్చక్రవ త్పరివర్తతే,
అవిచ్ఛేదేన సంసారో నదీవ త్ప్రవహే త్సదా. 22

జీవోఽహంకారోపహిత శ్చక్రవ ద్భ్రామ్యతే సదా,
మాయోపహితఈశానో జన్మసు ప్రేరయే దముమ్. 23

ఉపాధిద్వయహీనంతు బ్రహ్మ వేదేషు బోధ్యతే,
ఇత్థం వేదరహస్యజ్ఞా భవేయు ర్బ్రహ్మతత్పరాః. 24

జగత్స్యా ద్వ్యక్తమవ్యక్తం సృష్టిసంహారయోః క్రమాత్,
బిభర్తి ద్వయ మీశాన శ్చిదాత్మాతు విముక్తిభాక్. 25

ఈశానీశా వజ్ఞతద్జ్ఞౌ భోక్తా భోజయితా చ తౌ,
తయోర్నిర్వాహిణీమాయా బ్రహ్మణ్యారోపితం త్రయమ్. 26

జగద్భ్రమం జీవభేదం వాసనా దేహధారణమ్,
చతుష్టయంనిరాకుర్యా దభిధానాదిభిః క్రమాత్. 27

అభితో బ్రహ్మరూపత్వధ్యానా ద్యాతి జగద్భ్రమః,
బ్రహ్మత్వే యోజితే స్వస్య జీవభావోఽపి గచ్ఛతి. 28

అద్వయే భావితే తత్త్వే వాసనా వినివర్తతే,
ఆరబ్ధా తే దేహహాని ర్మాయైవం క్షీయతేఽఖిలా. 29

బ్రహ్మజ్ఞానా త్పాశహానా క్షీణక్లేశో న జన్మభాక్,
పాశా శ్చతుర్విధా శ్శైవ శాస్త్రేషు ప్రతిపాదితాః. 30

మలో మాయా కర్మ తత్త్వతిరోధానం చతే మతాః,
మలో జ్ఞానక్రియాశక్త్యో శ్ఛాదకో దోష ఇష్యతే. 31

రాగాదిహేతు ర్మాయోక్తా కర్మపుణ్యం చ పాతకమ్,
మూఢై స్తత్త్వతిరోధానం సర్వై రప్యనుభూయతే. 32

క్లేశా న్నతంజలిః ప్రాహ తేష్వవిద్యాది రస్మితా,
ద్వితీయా ద్వేషరాగౌ చాభినివేశ స్తు పంచమః. 33

భోక్తా భోగ్యం ప్రేరకశ్చ త్రయం బ్రహ్మేతి తత్త్వధీః,
ఉపాయేన బ్రహ్మధీః స్యా దరణిస్థాగ్నిలాభవత్. 34

ఉపాయః ప్రణవేనాత్మధ్యానం తేనైష లభ్యతే,
తిలతైలాదయో యద్వ ల్లభ్యా స్తత్ర దుపాయతః. 35

సర్వవ్యాపిన మాత్మానం క్షీరే సర్పిరివార్పితమ్,
ఆత్మవిద్యాతపోభ్యాం త ముపలభ్య విముచ్యతే. 36



శ్వేతాశ్వతరోపనిషదః - ద్వితీయాధ్యాయస్యవివరణమ్

యదుక్తం ప్రణవధ్యానం స యోగ స్తత్ర యత్నవాన్,
మనో బ్రహ్మణి యుంజాన స్త త్సాక్షా త్కురుతే ధియా. 37

ఉరోఽంసమూర్ధస్థానేషు త్రిషు దేహం సమున్నతమ్,
అవస్థాప్యాసనం జిత్వా ప్రత్యాహారం సమాచరేత్. 38

హృద్యక్షాణాం నిరోధో యః ప్రత్యాహారః స ఉచ్యతే,
జయే త్ప్రాబల్య మక్షాణాం ప్రాణాయామేన ధైర్యవాన్. 30

ప్రాణాధీనవ్యాపృతీనా మక్షాణాం ప్రాణరోధనాత్,
నిరోధః స్యా త్తత శ్చిత్తం ధారయేతా ప్రమాదతః. 40

సమే శుచౌ శర్కరాదిమళకాదివివర్జితే,
మనోఽనుకూలే ఉవస్థాయ దేశే ధ్యానం సమాచరేత్. 41

నాడీరూపాణి నీహారధూమాన్యత్ర విభాంతి చేత్,
బ్రహ్మసన్నిధి మాస్తా ధీ రితి నిశ్చీయతాం తదా. 42

నిర్జరత్వ వితృష్ణత్వ శుభగంధాదిచే ద్భవేత్,
యోగసిద్ధిః ప్రవృత్తేతి జ్ఞాత్వా యోగే స్థిరో భవేత్. 43
మేఘచ్ఛన్నం చంద్రబింబం మేఘాపాయే ఽతినిర్మలమ్,
తథైవ బుద్ధిచాంచల్యశాంతా వాత్మా ప్రసీదతి. 44
స్వాత్మతత్త్వప్రసాదేన బ్రహ్మతత్త్వం ప్రసీదతి,
శాస్త్రా ద్బుద్ధం బ్రహ్మతత్త్వ మాత్మత్వేనానుభూయతామ్. 45
అజం ధ్రువం మాయికై స్తైః కార్యైః సర్వై ర్వివర్జితమ్,
జ్ఞాత్వా దేవం పరాత్మానం సర్వపాపై ర్విముచ్యతే. 46
ఏష దేవః సర్వదిక్షు వహ్న్యాదిష్వఖిలేషు చ,
వర్తతే తం విచింత్యాఽప్రణమే త్సర్వదైవతమ్. 47
తత్త్వయోగో సముద్దిష్టో వుత్తమస్యాధికారిణః,
అథసోపాధికం వస్తుమందం ప్రత్యభిధీయతే. 48



శ్వేతాశ్వతరోపనిషదః - తృతీయాధ్యాయస్య వివరణమ్

ఐంద్రజాలికవ న్మాయాజాలవా నేక ఈశ్వరః,
నియచ్ఛన్ శక్తిభి ర్లోకా న్సృజతే సంహరత్యపి. 49
ఏక ఏవేశ్వర స్తద్వత్ ద్వితీయో నైవ విద్యతే,
జనానాం ప్రత్యగాత్మా ఽసౌ జగత్సృష్ట్యాదికార్యకృత్. 50
స విరాడ్రూపతాం ప్రాప్య విశ్వతశ్చక్షురాదిమాన్,
సర్వేషాం చక్షురాద్యా యే తదీయా ఏవ తే ఽఖిలాః. 51
యో దేవానా మితి ప్రోక్తై స్త్రిభి ర్మంత్రై స్త మీశ్వరమ్,
ముముక్షుః ప్రార్థయే త్తైవ సదా బుద్ధివిశుద్ధయే 52
తతః శుద్ధమతి ర్దృష్ట్వా సర్వభూతేష్వవస్థితమ్,
అంతర్బహిశ్చ సంవ్యాప్తం జ్ఞాత్వా స్యా న్మృతివర్జితః. 53

శ్వేతాశ్వతరనామా ఽహం పురుషం వేద్మి తం ప్రభుమ్,
అన్యో ఽపి తం విదిత్వైవ మృత్యు మత్యేతి నాన్యథా. 54

యస్మా త్పరం నాపరం వా కించి దస్తి తదద్వయమ్,
వృక్షవ న్నిశ్చలం తేన పూర్ణం సర్వ మిదం జగత్. 55

ఏతద్విదు ర్మృత్యుహీనా స్తే స్యు ర్యేతు నతద్విదుః,
తే దుఃఖ మేవ గచ్ఛంతి నతత్సోపాధికేక్షణే. 56

దుర్లక్ష్యో నిరుపాధ్యాత్మా సూక్ష్మధీవర్జితై ర్నరైః,
సులక్ష్య ఏవ సోపాధి స్తస్మా దేవం స్మరే దముమ్. 57

సర్వాననశిరోగ్రీవః సర్వభూతగుహాశయః,
వశీ సర్వస్య లోకస్య స్థావరస్య చరస్య చ. 58

విశ్వాకారజనేః ప్రాక్చ సర్వవ్యవహృతిక్షమః,
అపాణిపాదో జవనో గృహీతా సర్వశక్తియుక్. 59

అణో రణీయా న్దుర్లక్ష్యో మహీయా న్మహతః స్ఫుటః,
ఇత్యాత్మానం శాస్త్రదృష్ట్యా పశ్యతో నాస్తిదుఃఖితా. 60

స్థూలదర్శీతు సాకారీ సార్వాత్మ్యే వాసితే సతి,
నిరాకారం తతోబోద్ధుం ప్రార్థయేతైశ్వరం వపుః. 61



శ్వేతాశ్వతరోపనిషదః-చతుర్థాధ్యాయస్యవివరణమ్

య ఏకో వర్ణ ఇత్యాది స్తవ న్మంత్రచతుష్టయమ్,
ప్రార్థ్యాథమాయాంజీవాచ బుద్ధసుప్తా విచారయేత్. 62

లోకే కాచి ద్రజా వర్ణత్రయోపేతా బహుప్రజాః,
సృజతే తా మజః కశ్చి త్సేవతేఽ న్య స్తు తాం త్యజేత్. 63

తే జాఽబన్నాత్మికా తద్వ న్మాయా వర్ణై స్త్రిభి ర్యుతా,
ఆసక్తో భజతే మాయాం విర క్తస్తు విముంచతి. 64

విరక్తః కర్త్రకర్తారా విచింత్యాత్మన్యస్య విగ్రహే,
చిచ్ఛాయావా నహంకారః కర్తా చిద్భాతి కేవలా. 65

పాదపే క్షుధితః పక్షీ ఫల మత్తీతరః పునః,
పశ్యన్నాస్తే తథా పిద్యా ద్భోక్తృతత్సాక్షిణావుభౌ. 66

చిచ్ఛాయాగతభోక్తృత్వం సాక్షిణ్యారోప్యతే భ్రమాత్,
అనీశ్వరోఽయం సాక్షీతి శోకీ భవతి మోహతః. 67

నిత్యతృప్తేశ్వరత్వం తత్సాక్షిత్వంచ తదిక్షతే,
యదా తదా వీతశోకో మహిమాన మవాప్నుయాత్. 68

ఋచో దేవాశ్చ శబ్దార్థా యస్మిన్నాత్మని కల్పితాః,
యస్తం న వేద తస్యర్చా కిం స్యా ద్యో వేత్త్యసౌ కృతీ. 69

ఛందాంసి యజ్ఞా నన్యచ్చ మాయావీ సృజతేఽఖిలమ్,
జీవాత్మనా ప్రవిశ్యాస్తే సన్నిరుద్ధో ఽపుష్యయమ్. 70

మాయాంతు ప్రకృతిం విద్యా న్మాయినం తు మహేశ్వరమ్,
తస్యావయవభూతైస్తు వ్యాప్తం సర్వ మిదం జగత్. 71

ఈశో యః స్వత ఏకస్సన్ జీవాకారై రనేకశః,
యోనింయోనిం వ్రజత్యేత మీశం జ్ఞాత్వా న సంసరేత్. 72

ప్రతిబంధస్య బాహుల్యా ద్యోదేవేత్యాది మంత్రతః,
పునః పున ర్భజేత్తేషాం ప్రతిబంధనివృత్తయే. 73

అదృష్టప్రతిబంధో యో నివర్త్య భజనేన తమ్,
దృష్టో యః ప్రతిబంధ స్తం విచారేణ జయే త్పునః. 74

సూక్ష్మేభ్యః పరమాణుభ్యోఽప్యతిసూక్ష్మో న లక్ష్యతే,
బహిర్ముఖైః స్వతస్సోఽయం విశ్వం వ్యాప్యావతిష్ఠతే. 75

జగతః పాలనే నాయ మస్తీత్యాదౌ విబుధ్యతామ్,
బ్రహ్మర్షయో దేవతా శ్చ యోగేనైతం విజానతే. 76

తీరేఖాకృతనిమిత్తం యత్సారం తద్ధీమతేక్ష్యతే,
యథా వృత్తినిరోధిన్యా సూక్ష్మం వస్తు ధియేక్ష్యతామ్. 77
దివా రాత్రి స్తమ శ్చాన్య ద్యస్మి న్నాస్తి న కించన,
నోర్ధ్వం న తిర్య క్త ద్వస్తు న దృష్టాంతోఽస్య విద్యతే. 78
దృగ్గోచరే తస్య రూపం నాస్త్యతః కోఽపి నేక్షతే,
అజాత ఇతి మంత్రాభ్యా మంతర్దృష్ట్యా భజేత తమ్. 79



## శ్వేతాశ్వతరోపనిషదః - పంచమాధ్యాయస్యవివరణమ్

పునశ్చైవం వివేక్తవ్యం విద్యావిద్యే నిజాత్మగే,
అవిద్యయా బధ్యతే ఽసౌ విద్యయా తు విముచ్యతే. 80
అవిద్యాకల్పితోపాధిభేదా దీశత్వజీవతే.
చైతన్యస్య భవేతాం యే కథ్యతే తే క్రమా దిహ. 81
హిరణ్యగర్భ ముత్పన్న మాదౌ జ్ఞానై ర్బిభర్తి యః,
ఏకైక మంతఃకరణం బహుధా వికరోత్యయమ్. 82
అధశ్చోర్ధ్వం దిశ స్సర్వా భ్రాజతే ఽసౌ ప్రకాశయన్,
భారం వహే ద్యథా ఽనడ్వా న్జగద్భారం వహే త్తథా. 83
యో భావాన్ క్షీరబీజాదీ న్దధివృక్షాదిరూపతః,
పరిణామం నయే త్సోఽయం గుణాం స్త్రీ న్వినియోజయేత్. 84
అవిద్యాకృత మీశత్వం తదిదం స్పష్ట మీరితమ్,
వేద గుహ్యోపనిషదా తస్య తత్త్వ ముదీరితమ్. 85
అవిద్యాకృతజీవత్వ మథ స్పష్ట ముదీర్యతే,
సత్త్వంరజ స్తమ శ్చేతి గుణై ర్జీవః సమన్వితః. 86
సఫలార్థం కర్మ కుర్యా ద్భుంక్తే తస్యైవ తత్ఫలమ్,

దక్షిణాదిగధోమార్గైః సంసరత్యేష కర్మభిః. 87

అంగుష్ఠమాత్రహృన్నిష్ఠః స్వప్రకాశః స సూర్యవత్,
అహంకారోపాధికః సన్ సంకల్పాన్కురుతే బహూన్. 88

బుద్ధివృత్త్యాత్మచైతన్యసంయోగా దేష చేతనః,
స సంకోచవికాసాభ్యాం తైస్తైర్దేహైః సమో భవేత్. 89

నైవ స్త్రీ న పుమా నేష నైవ చాయం నపుంసకః,
యద్య చ్ఛరీర మాదత్తే తేన తేన స కథ్యతే. 90

---

## శ్వేతాశ్వతరోపనిషదః - షష్ఠాధ్యాయస్యవివరణమ్.

అవిద్యాదీని జీవేశావుక్త్వా యత్తత్త్వ మేతయోః,
తద్విద్యాసిద్ధయే కాలస్వభావాదీన్విచారయేత్. 91

మూలకారణతై తేషాం నయుక్తా జనిమత్త్వతః,
దేవస్యమహిమా యోఽసౌ మాయాఖ్య స్తస్య యుజ్యతే. 92

తన్మహిమ్నాఽఽవృతం సర్వం కాలంచ కలయత్యసౌ,
భూతభవ్యాదిరూపేణ భిన్నోఽసౌ జాయతే తతః. 93

జలాగ్న్యాదిసముత్పత్తౌ స్వభావః సహ జాయతే,
యదృచ్ఛాపంచభూతాని ప్రధానం చేలిమాయికమ్. 94

మూలకారణతాఽస్త్యేవమాయాయా జన్యభావతః,
అవాంతరం కారణత్వం కాలాదీనాం భవత్విదమ్. 95

ఏకం ప్రధానం ద్వే పుణ్యపాపే సత్వాదికాస్త్రయః,
అష్టౌ ప్రకృతయో భూమిముఖ్యా స్తైర్జాయతే వపుః. 96

యో మాయావీ స సర్వేషా మాదిః కాలత్రయాత్పరః,
విశ్వరూపం స్వచిత్తస్థం త ముపాస్య ప్రసాదయేత్. 97

